# విశ్వనాథ నవలలు
# మనస్తత్వచిత్రణ

(ఏకవీర-జేబుదొంగలు-బద్దన్నసేనాని-తెఱచిరాజు)



**ప్రేమతత్వంపై పరిశోధనాత్మక సిద్ధాంత గ్రంథం**

ఉస్మానియా విశ్వవిద్యాలయం ఓరియంటల్ విభాగం నుండి

2001 సం॥లో డాక్టరేటు పట్టా పొందిన సిద్ధాంత వ్యాసం

డా॥ మాముదాల వెంకటేశ్వరరావు

# VISWANATHA NAVALALU MANASTHVA CHITRANA

(EEKAVEERA-JEBUDONGALU-BADDANNA SENANI-THERACHI RAJU)

First Edition 2003

Copies 1000

Price : Rs. 50/-



**ప్రాప్తిస్థానం.**
హరినిలయం, 8C, రవీంద్రనగర్ కాలనీ,
హబ్సీగూడా, హైదరాబాద్-500007
ఫోన్: 27151390

**పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ముద్రింపబడింది.**

ముద్రణ :

**సరస్వతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
నల్లకుంట, హైదరాబాద్-44.
ఫోన్: 27612180

మా అమ్మ జానకమ్మకు

# అంకితం

1

కన్న వారి నేను కనుల చూడనె లేదు
　　తోడ బుట్టు వారు తోడు లేగ
లోక మందు నేను ఏకాకి గాకుండ
　　జనని ఎత్తి పెంచె జానకమ్మ

2

తల్లి! తండ్రి! గురువు! తానుగా నిలిచింది
　　కంటిచూపులందు కరుణ నిలిపి
చేయు పనుల యందు చేపట్టె సహనమ్ము
　　జనని ఎత్తి పెంచె జానకమ్మ

3

కన్న వారికన్న మిన్నగా ననుజూసె
　　ప్రేమతోడ పెంచి పెద్ద జేసె
పాలతోడ నేర్పె పరమార్థ తత్వాన్ని
　　జనని చాలనేర్పె జానకమ్మ

4

తనకు తాను బ్రతుకు తగదురా లోకాన
　　పరుల కొరకునీవు పాటు పడుచు
శాంతి జీవనంబు సాగించు మనునీతి
　　జనని చెప్పె నాకు జానకమ్మ

5

ఉన్నవారి లోన నుండునా ఆపేక్ష

లేని వారి మనసు లేత గుండు

కష్టకాల మందు కనుపించు నీకది

అనుచు చెప్పె జానకమ్మ నాకు

6

బ్రతికి యున్న నాళ్ళు భారమంచు తలచి

కటువు తోడ మనసు కష్ట పెట్టి

ప్రాణమదియె పోగ పటము పూజింతురు

అనుచు చెప్పె జానకమ్మ నాకు

7

పట్టు చెలిమి తీరు మట్టి మాదిరినుండు

జలము కలియు నంత బిలము చేరు

గాలి చేత కలియ గగనంబు చేరురా

అనుచు చెప్పె జానకమ్మ నాకు

8

పెంచి పెద్ద జేసె ప్రేమయనగ జూపె

నిండు మనసు తోడ నీతిచెప్పె

శాశ్వతమగు కీర్తి చాలపొందిన యమ్మ

అంకిత మిదె జానకమ్మ నీకు





18-03-2003 న గౌరవనీయులైన భారత మాజీ ప్రధానమంత్రి

శ్రీ పి.వి. నరసింహ్మారావు గారితో కలిసినప్పటి దృశ్యం.



# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
## POTTI SREERAMULU TELUGU UNIVERSITY

**Prof. G.V. Subrahamanyam**
M.A. Ph.D
VICE-CHANCELLOR

Lalitha Kala Kshetram,
Public Gardens,
Hyderabad - 500 004. (AP.)


## విశ్వనాథ భారతికి వెలలేని కానుక

డాక్టర్ మాముదాల వేంకటేశ్వరరావుగారు నాకు చిరకాల మిత్రుడు. మంచి వివేచనగల విజ్ఞుడు. అందుకే విశ్వనాథ సత్యనారాయణగారి నవలల మీద పరిశోధన చేట్టాడు. అందులో నాలుగు నవలలను-దిగ్గజాల్లాంటివి-ఎన్నుకొన్నాడు. వాటిలో విశ్వనాథ ప్రయోగసిద్ధితో ప్రదర్శించిన మనస్తత్వచిత్రణను చేపట్టాడు. ఆ చిత్రణలోని తత్త్వాన్ని పట్టుకొని ఆవిష్కరించాడు. సంగ్రహంగా, సారవంతంగా ప్రతిపాద్య వస్తువును ప్రపంచించాడు. విషయపుష్టితో రూపొందిన గ్రంథమిది.

విశ్వనాథవారు పాశ్చాత్య మనస్తత్త్వ శాస్త్రజ్ఞుల సిద్ధాంతాలను కూలంకషంగా చదివారు. వాటికి భారతీయ మూలాలను,మూల్యాలను దర్శించి అభినవంగా కథాసూత్రంతో వ్యాఖ్యానించారు.ప్రపంచంలో వెలువడిన మనస్తత్వ సిద్ధాంతాలకూ,భారతీయమైన స్పర్శ సిద్ధాంతానికీ ఒక అతీంద్రియ సంబంధాన్ని చిత్రించిన నవలాకర్త విశ్వనాథ.ఆమార్గం అనితరసాధ్యం అన్నట్లు నవలలు వ్రాశారు. సమకాలీన రచయితలు వివిధ ప్రయోగాలు చేస్తూ పాశ్చాత్య సిద్ధాంతాలకు ప్రామాణికత్వాన్ని ప్రదర్శిస్తున్న రోజులలో వాటికి భారతీయ పార్శ్వాన్ని జోడించి చూపిన విశ్వనాథ "ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయిరెట్లు గొప్పది" అని నిరూపించగలిగారు. అతీంద్రియ స్పృహలేని ఆధునిక సిద్ధాంతాలకు ఆత్మతత్త్వాన్ని అలవరిచి భారతీయ దార్శనిక పరిపక్వతను కల్పించిన ప్రయోగాలు విశ్వనాథ నవలలు.

రాయప్రోలువారు అమలిన శృంగారతత్త్వాన్ని వ్యాఖ్యానించారు వారి కావ్యాలలో. విశ్వనాథ దానిలోని లోపాన్ని ఎత్తిచూపారు ఏకవీరలో. అయినా అందులో రాయప్రోలువారు వ్యాఖ్యానించలేని ఆధ్యాత్మికస్పృహను విశ్వనాథవారు వ్యాఖ్యానించారు.అది భారతీయులు దర్శించిన స్పర్శసిద్ధాంతంతో సంగుప్తమై ఉన్నదని నిరూపించారు.అలానే ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్ వంటి పాశ్చాత్య మనస్తత్వవేత్తల ప్రతిపాదనలతో కొరవడిన భారతీయ తత్త్వశక్తిని

పూరించి పాత్రల జీవితాలుగా విశ్వనాథవారు మలచారు. విశ్వనాథవారు చిత్రించిన నవలలోని మనస్తత్వ సిద్ధాంతాలను అన్వయించగలిగితే ప్రపంచ మనస్తత్వశాస్త్రస్పృహ ఒకటి పరిపక్వ పరిపూర్ణదశను పొందినట్లే అనవచ్చును. ఈ భావనతో డాక్టర్ మాముదాల వేంకటేశ్వరరావు గారు ఈ సిద్ధాంత వ్యాసం రచించారు.

ఈ సిద్ధాంత వ్యాసం వివేచన ప్రధానమైన విమర్శప్రధానం కలది. పరిశోధకునికి ప్రతిపాద్యాంశంమీద స్పష్టమైన అవగాహన ఉండటంచేత అధ్యాయవిభాగంలోను, వాటి నిర్వహణలోను విశ్లేషణ, వివరణ సరళ సుందరంగా సాగాయి. అనవసర విషయాల జోలికి పోకపోవటం, లక్ష్యశుద్ధితో రచన సాగించటం వేంకటేశ్వరరావుగారి విశిష్ట రచనాగుణాలు. మొదటినుండి చివరిదాకా ఒడుదొడుకులులేని సమతల ప్రవాహంలా సాగిన ఈ రచన విశ్వనాథ భారతికి వెలలేని కానుక.

జి.వి. సుబ్రహ్మణ్యం

డా॥ శివునూరి విశ్వనాథశర్మ
మొదటిడీన్.ఫ్యాకల్టీ ఆఫ్ ఓరియంటల్ లాంగ్వేజస్ (రిటైర్డ్)
ఉస్మానియా విశ్వవిద్యాలయం.హైద్రాబాద్.

# అభినందనాశీస్సులు

"విశ్వనాథ నవలలు-మనస్తత్త్వ చిత్రణ"అను అంశంపై సిద్ధాంత వ్యాసాన్ని రచించి పి.హెచ్.డి పట్టాన్ని పొందిన డా.మాముదాల వెంకటేశ్వరరావుగారు మా తెలంగాణాప్రాంతీయులే గాక 'అభ్యుదయప్రాచ్య సాయంకళాశాలలో సీనియర్ ఆంధ్రోపన్యాకులుగా నున్నందున నాకు సుపరిచితులు.కొంతమంది ఉన్నతాధికారుల సౌజన్యంతో ఉస్మానియా విశ్వవిద్యాలయాన 1995 లో చిరకాల ప్రయత్నంతో స్థాపింపబడిన ప్రాచ్యాభాషా ఫ్యాకల్టీకి నేను మొదటి డీనుగా నున్నపుడే శ్రీ వెంకటేశ్వరరావుగారికి పి.హెచ్.డి చేసుకొనే అవకాశం కల్పించబడింది.ఈ అవకాశాన్ని వారు నిరంతరకృషితో,పట్టుదలతో సద్వినియోగంచేసి తమపనిలో కృతకృత్యులౌట అభినంద నీయం.వారి గ్రంథాన్ని స్థాలీపులాక న్యాయంగా చూశాను.ఈ పి.హెచ్.డి సిద్ధాంతవ్యాసం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో "ప్రాచ్యభాషాఫ్యాకల్టీ వృక్షం" యొక్క ప్రథమ కుసుమం. ఆ ఫ్యాకల్టీని సాధించడంలో పడినశ్రమ ఈ విధంగా ఫలించడం ప్రాచ్యవిద్యాభి మానులందరికి గర్వకారణం.అత్యంత ముదావహంకూడా. "క్లేశః ఫలేనహి పునర్నవతాం విధత్తె"అంటాడు కాళిదాస మహాకవి తన కుమారసంభవ కావ్యమున.

శ్రీ వెంకటేశ్వరరావుగారు విద్యావినయ సంపన్నులేగాక గొప్పమేధావి.కృతజ్ఞతా గుణం కలవారు.వారు తమ సిద్ధాంతవ్యాసానికి 'జ్ఞానపీఠ అవార్డు గ్రహీత,సకలవిధ సాహిత్య ప్రక్రియా భిజ్ఞులునగు కవిసామ్రాట్టు,మహాకవి' అయిన విశ్వనాథవారి రచనలును ఎన్నుకున్నారు.అందులోన నేటిసమాజాన నెక్కువగా నవయువకులను ఆకర్షించు నాలుగునవలలను తీసుకొని 'ప్రేమతత్త్వం'పై పరిశోధన గావించారు.

ప్రేమతత్త్వం సామాన్యంగా అందరికి అంతుపట్టదు.అది వేదాంతతత్త్వంవలె నగమ్య గోచరమైంది.ప్రేమ ఎవరికి ఎలాకలుగుతుందో చెప్పలేము.అది ఎవరైనా నామీద ప్రేమపెట్టుకో అని కోరితే కలిగేది కాదు.ప్రేమ జన్మాంతరీయం."వ్యతిషజతి పదార్థానాంతరః కోపి హేతుః న ఖలు బహిరుపాధీన్ ప్రియ యస్సంశ్రయన్తే " అని అంటారు భవభూతి మహాకవి తన ఉత్తరరామ చరిత నాటకాన.ప్రేమ ఎంతటి అకార్యాలనైనా చేయిస్తుంది.అందుకే ప్రేమ గుడ్డిది,పిచ్చిది అన్నారు. చేతనాచేతన వస్తుపరిజ్ఞానం లేకుండా ప్రేమ పరకాష్ఠ చేస్తుంది.మోహాన్ని కలిగిస్తుంది.

ఇక మానవుల మనస్తత్త్వాలు భిన్నభిన్న రూపాల్లో కనిపిస్తవి.'మూర్తులెన్నో ప్రకృతులన్నీ" అని తెలుగులో సామెత.భారవి మహాకవి తన కిరాతార్జునీయంలో "విచిత్రరూపాః ఖలు చిత్త

వృత్తయః"అంటాడు. ప్రాక్పశ్చిమ మహాకవులెందరో మానవుల మనస్తత్వాలను,ప్రేమతత్వాన్ని వారివారి ధిషణా నైపుణ్యంతో వివరించారు.కాళిదాస మహాకవి తన శాకుంతల నాటకంలో " సర్వం తత్కిల మత్పరాయణ మహోకామీ స్వయం పశ్యతి"అని కాముకుని మనస్తత్వాన్ని తెలిపాడు.

శ్రీ వెంకటేశ్వరరావుగారు తమ పి.హెచ్.డి గ్రంథాన విశ్వనాథవారి నవలల ఆధారంగా మానవుల మనస్తత్వాలను,ప్రేమస్వరూపాన్ని బహుముఖంగా విశ్లేషించి,వివరించి కృతకృత్యులైనారు వారిని మనస్ఫూర్తిగా అభినందిస్తూ వారు మునుముందు ఇతోధిక గ్రంథరచనలను గావించి కీర్తిప్రతిష్ఠల నార్జించవలెనని అశీర్వదిస్తూ విరమిస్తున్నాను. మరియు గ్రంథం చిరస్థాయిగా నుండి అందరి మన్నలనందుకొనుగాక.

శ్లో॥ విశ్వనాథ నవలాగత చిత్త ప్రేమతత్త్వ విశదీకరణాగ్ర్యః ।
వెంకటేశ్వర సుధీర చితో2యం గ్రంథరాడ్జయతు సర్వజనేష్టః ॥

డా॥ శివునూరి విశ్వనాథశర్మ.

**ఆచార్య ఎం. కులశేఖరరావు**
తెలుగు శాఖాధ్యక్షులు(విశ్రాంత)
ఉస్మానియా విశ్వవిద్యాలయం.
హైద్రాబాద్.

# మైక్రో పరిశోధన

నూరు సంవత్సరాలు దాటిన తెలుగు నవలా రచన [illegible]ంగా విస్తరించింది. తెలుగు వచన ప్రక్రియల్లో,ఆధునిక కాలంలో ఇంత విస్తారంగా [illegible] మరొకటి లేదంటె అతిశయోక్తికాదు.చాలామంది పరిశోధకులు ఈ నూరేండ్లలో [illegible] వెలువడినాయని పరిగణన చేస్తూనే ఉన్నారు. ఇతమిత్థమని ఒకసంఖ్య తేల్చలేక పోతున్నారు [illegible] తెలుగునవల ఎంత విస్తృతిని చెందిందో ఊహించవచ్చు.

పరిశోధకులు చేసే ఇంకొకపని ఉన్నది.ఎన్ని విభాగాలలో ఈ నవలారచన వ్యాప్తి చెందింది అనే విషయం.చరిత్ర,ప్రణయం,సాంఘికవ్యవస్థ,రాజకీయాలు,మానవ సంబంధాలు, కౌటుంబిక వ్యవహారాలు మొదలైన విభాగాలలో నవలలు [illegible] పరిశోధకులు చెబుతున్నారు. దీనినిబట్టి మానవలోకంలోని అన్ని కోణాలను నవల [illegible] అందుచేత తెలుగునవల తెలుగువారి విస్తృత జీవితాన్ని సాంఘిక [illegible] సంవత్సరాలు వ్యక్తం చేస్తూనే ఉన్నది అనడం సముచితంగా ఉంటుంది. [illegible] సంవత్సరాలలో తెలుగునవలలో ఆధునికత బాగా లోతుగా ప్రవేశించింది. [illegible] చేతనేమి,మన రచయితల ఆధునిక ఆలోచనా విధానం చేతనేమి,శాస్త్ర[illegible]యి.వీటినే సైంటిఫిక్,ఫిక్షన్ లేదా శాస్త్రీయనవలలు అంటున్నారు.ఇవి [illegible] ఉన్నా మన పాఠకులలో వీటి ప్రాచుర్యం చాలా తక్కువ.ఇవి సైన్సు [illegible],సైన్సుమీద ఆసక్తి ఉన్నవారిని మాత్రమే ఆకర్షిస్తాయి.

ఇక రెండవ శాస్త్రవిషయం,మనోవైజ్ఞానికమైనది. [illegible] శాస్త్రమని కూడా అంటున్నారు.పాశ్చాత్యదేశాలలో ఫ్రాయిడ్,యూంగ్ అనే శాస్త్రవేత్తలు [illegible] ప్రవర్తనకు,మానవ సంబంధాలకు ఆలోచనా విధానాలకు ఒక శాస్త్రబద్ధమైన [illegible] చెప్పిన తర్వాత అధ్యయనంలో ఈ శాస్త్రాలకు ప్రాముఖ్యత వచ్చింది.లోకంలో [illegible] సంబంధంగానే ఉంటుందికదా ! పాశ్చాత్య రచయితలు మనస్తత్వ శాస్త్రాన్ని [illegible] అనేకానేక అపరాధనవలలు రచించినారు.మానవ మనస్సు పొరలలో [illegible] గురించి విశ్లేషణ వీటిలో ప్రముఖంగా కనిపిస్తుంది.పాశ్చాత్యులు [illegible]బట్టి వ్రాయక పోలేదు కాని వీటిసంఖ్య అల్పమే.

మనస్తత్వశాస్త్రం తెలుగు నవలా రచయితలను ఆధునికయుగంలో బాగానే ఆకర్షించింది నవలలో కూడా ఒక నిబద్ధత ఉండవలెనని,కథ శాస్త్రబద్ధంగా నడిపించవలెనని మన రచయితలు ఆలోచించడం ప్రారంభించారు.మానవుడు ప్రవర్తించినా,ఆలోచించినా ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం ఒక పరిధిలోనే ఉంటాడు.ఆ పరిధి ఆతని పరిసరాలు,ఆతని మేధాశక్తి మొదలగువాటినిబట్టి ఏర్పడుతుంది.ఇటువంటిస్థితిలో నవలలోని కథానిర్మాణం జరిగినపుడు ఆశామాషీగా గాక ఆయా పాత్రలు ఏవిధంగా ప్రవర్తిస్తాయి అనే విషయాన్ని చాలా శ్రద్ధగా వ్రాసిన రచయితలే మనోవైజ్ఞానిక నవలాకర్తలు.ఇటువంటి నవలలు వ్రాసిన వారిలో బుచ్చిబాబును చెప్పవలె.ఆయన 'చివరకు మిగిలేది' నవలలో అన్ని పాత్రలను ఆ రచయిత ఒక నిర్దిష్టపరిధిలోనే చిత్రించినాడు.

విశ్వనాథ సత్యనారాయణగారిని నవలారచయితలలో అగ్రగణ్యుడనే భావించవలసి ఉన్నది.ఎందుచేతనంటె వేయిపడగలు వంటి విస్తృత నవలలు వ్రాసినవారు మనకు చాలా తక్కువ.సంఖ్యలోకూడా ఆయన రచనలు అనల్పమే.ఇటువంటి మహారచయితను మనోవైజ్ఞానిక శాస్త్రం ఆకర్షించకుండా ఉంటుందా?అందుచేత అన్ని కాకపోయినా కొన్నింటిని ఈ మహానుభావుడు ఆ శాస్త్రాన్ని ఆధారంగా గ్రహించి,రచించి తెలుగు నవలాసాహిత్యంలో స్థిరమైన స్థానాన్ని సంపాదించుకున్నాడు.నవలకు ప్రయోజనం కేవలం భౌతికవిషయాలపై,సంస్కరణలపై,వాదాలపై, కేంద్రీకరించి చూడడమన్నదికాదు.వ్యక్తుల అంతరంగాలలో నైతిక,ధార్మిక,ఆధ్యాత్మిక,మానవతా విలువలను ప్రవేశపెట్టి అవసరమైతే సమాజానికి మార్గదర్శకత్వం చేయడం విశ్వనాథ మనస్తత్వ నవలల ప్రయోజనంగా పరిణమించింది.

విశ్వనాథ నవలల్లో ఏకవీర స్వరూపంలో చిన్నదైనా స్వభావంలో పెద్దది.'ప్రణయమే' మూలస్థంభంగా ఏర్పరచి ఈనవలను ఆయా పాత్రల మనస్తత్వాన్ని ఆధారంగా చేసుకొని కథను నడిపించినారు విశ్వనాథ.ఆ పాత్రలు ఎట్లా ప్రవర్తిస్తాయి?కథ ఎట్లా నడుస్తుంది?అక్కడ ఉండే శాస్త్రనిబద్ధత ఏమిటి?అనే విషయాన్ని ఈ గ్రంథంలో డా॥ మాముదాల వెంకటేశ్వరరావుగారు చాలా చక్కగా పరిశీలించి వ్రాసిఉన్నారు.ఇచ్చట రెండువిశేషాలు కన్పించాయి నాకు.ఒకటి సిద్ధాంతాన్నిగురించి క్షుణ్ణంగా చెప్పడం మొదటిది.ఆ సిద్ధాంతాన్ని రచయిత ఎట్లా స్వంతం చేసుకున్నాడు,తిరిగి నవలలోని పాత్రలకు ఏవిధంగా సమన్వయం చేసినాడు అనేది రెండవది. ఈ గ్రంథం చదువుతున్నపుడు సిద్ధాంతం దాని సమన్వయం రెండూ మన మనస్సును ఆవహించుకుంటాయి.

పరిశోధనలో రెండు పద్ధతులున్నాయి.మొదటిది సామూహికంగా రచనలను పరిశీలించి వాటిలోని బాగోగులను చర్చించి,నిర్ణయాలు చేయడం.దీనిని మ్యాక్రో (Macro) పరిశోధన అంటారు.పరిశోధనకు పరిధి విస్తారంగా ఉంటుంది.ఒక సమగ్రదృష్టిని వ్యక్తీకరించడం ఈ పరిశోధనలోని పరమార్థం.

ఇక రచనలోని కొన్ని విశేషాలను గ్రహించి సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలనచేసి ఇంకొక విషయం చేరనీయక దాన్ని మాత్రమే శాస్త్రబద్ధంగా విశ్లేషించి నిర్ణయాలను రూపొందించడం మైక్రో (Micro) పరిశోధన. ఇది రెండవ పద్ధతి.

డా॥ వెంకటేశ్వరరావుగారు విశ్వనాథవారి 'ఏకవీర,జేబుదొంగలు,బద్దన్నసేనాని, తెఱచిరాజు' అనే నాలుగు నవలలను గ్రహించి మైక్రోపద్ధతిలో విశ్లేషణ చేసినారు. ఈ పరిశోధన శాస్త్రబద్ధంగా జరిగింది. నవలల్లోని సూక్ష్మ విశేషాలను వెల్లడించి ఆయా పాత్రల స్వరూప స్వభావాలను ఆవిష్కరించడమే గాక మహారచయిత ఆలోచనా విధానాన్నికూడా అంచనా వేయడానికి ఈ పరిశోధనలో వెంకటేశ్వరరావుగారు ప్రయత్నించారు.

ఉదా ॥ జేబుదొంగలు నవలలో అవధాని స్వభావాన్ని గురించి చెబుతున్నపుడు కథ వ్రాయడంలో రచయిత ఎంత గాఢంగా ఇన్వాల్వ్ అయినాడు అనేమాట స్పష్టమైంది. అట్లాగే త్వగింద్రియస్పర్శ సిద్ధాంతాన్ని 'తెఱచిరాజు' నవలకు అన్వయించినపుడు సారథిని దీనికి ఆలంబనంగా చేసుకున్నపుడు,సిద్ధాంతానికి సమన్వయానికి చక్కని ఆవిష్కరణ జరిగింది. మిగిలిన నవలలోని విశేషాలు కూడా ఈ విధంగానే ఉన్నాయి.

విశ్వనాథవారు 20వ శతాబ్దిలో మహావ్యక్తిత్వం కలిగిన నవలారచయిత. ఆయన రచనా శక్తిని సాక్షాత్కరింప చేయడం సామాన్య విషయంకాదు. అయినా ఈ పరిశోధకుడు తాను గ్రహించిన నాలుగు నవలల్లో మహారచయితగా విశ్వనాథను వ్యక్తీకరించడానికి మంచి ప్రయత్నంచేసి కృతార్థుడైనాడని నేను భావిస్తున్నాను. ఈ పరిశోధనా గ్రంథానికి,ఈ పరిశోధకునికి తగిన పరిగణన లభించవలెనని నా ఆకాంక్ష.

ఆచార్య ఎం. కులశేఖరరావు

ఆచార్య ఎస్వీ రామారావు
డీన్, ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్స్ (రిటైర్డ్)
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

# ప్రేమతత్వ నిరూపణం

మనోవిజ్ఞానం 20వ శతాబ్దిలో ప్రత్యేకశాస్త్రంగా గుర్తింపు పొందింది. సిగ్మండ్ ఫ్రాయిడ్,ఆల్ఫ్రెడ్ ఆడ్లర్, కారల్ గస్టావ్ యూంగ్ మొదలగు మానసిక శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన మనస్తత్వ విశ్లేషణ సిద్ధాంతాలు ఈ కాలంలోనే వెలుగులోకి వచ్చాయి. ఈ సిద్ధాంతాల అవగాహనతో ప్రసిద్ధ రచయితలయిన బుచ్చిబాబు,గోపీచంద్ నవలా రచన చేయటంవల్ల తెలుగు సాహిత్యంలో మనస్తత్వ విశ్లేషణ విమర్శ పరివ్యాప్తమైంది.

అయితే-మానవప్రకృతికి మూలభూతమైన మనసును గురించి వివేచన ప్రాచీన భారతీయ సాహిత్యంలో,శాస్త్రీయ దృష్టితో కాకపోయినా హేతుబద్ధంగా గోచరిస్తుంది. దర్శనాలు, మీమాంసా శాస్త్రాలలో భగవద్గీతలో దీని ప్రస్తావన స్పష్టంగా ఉంది. బుద్ధి,చిత్తం,అహంకారం, మనస్సు,అనే పొరలతో కూడిన అంతఃకరణ చతుష్టయంలో దుర్వాసుని శాప ప్రభావం దుష్యంతుని లౌకికమైన మనస్సుకు మాత్రమే పరిమితమని కవికులగురువు కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలం లో అద్భుతంగా ప్రతిపాదించాడు.

ప్రాచీనాంధ్రకవులు కూడా మనస్తత్వ చిత్రణకు ప్రాధాన్యం ఈయకపోలేదు. పితృహీనులైన పాండుకుమారులు పెదనాన్న ఇంట్లో వినయాన్వితులై ఉండగా ఉద్ధతులైన కౌరవులు వారిపై పెత్తనాన్ని నెరపిన తీరును నన్నయ వ్యంగ్యంగా సూచించాడు.

తిక్కన విరాటపర్వంలోని కీచకపాత్ర మపస్తత్వాన్ని ఆలంబనం చేసుకొని విశ్వనాథ 'నర్తనశాల'నాటకాన్ని రచించాడు. ఊర్వశి గడుసరితనాన్ని నాచనసోమన ఉత్తర హరివంశంలోను, వరూధిని విలక్షణ స్వభావాన్ని అల్లసాని పెద్దన మనుచరిత్రలోను చూస్తాం. సుగాత్రీ శాలీనుల మానసిక శృంగారాన్ని పింగళిసూరన విలక్షణమైన రీతిలో వర్ణించాడు.

ఆధునిక యుగంలోకూడా మనోవిజ్ఞానశాస్త్రంతో పరిచయమున్నా లేకపోయినా పాత్రల మనస్తత్వ విశ్లేషణను చిత్రిస్తూ కావ్యాలు,నవలలూ వ్రాయబడ్డాయి. ఆ మార్గంలో విశ్వనాథవారిది అందెవేసినచేయి. ఆయన నవలలన్నీ కథ ప్రాధాన్యమైనవి కాకుండా పాత్రప్రధానమైనవి కావటంకూడా అందుకు కారణం కావచ్చు.

మనస్తత్వశాస్త్ర సిద్ధాంతాల ప్రాతిపదికపై విశ్వనాథ పాత్రల ప్రేమతత్వాన్ని విశ్లేషిస్తూ

మాముదాల వెంకటేశ్వరరావు సిద్ధాంత వ్యాసం రచించి డాక్టరేటు పట్టంపొందాడు. ఈ అంశాన్ని పరిశోధనకు స్వీకరించడానికి లోతైన చూపు, విశిష్టమైన వివేచనాశక్తి అవసరం. ఇవిరెండూ ఆయనకు ఉండడం చేతనే సాహసించి ఈ పనికి పూనుకున్నాడు. విశ్వనాథను కేవలం సంప్రదాయాభిమానిగా, తిరోగమనవాదిగా, ముద్రవేస్తున్న కాలంలో ఈ దురభిప్రాయాలను ఖండిస్తూ యధార్థదృష్టితో విశ్వనాధ సాహితీమూల్యాలను వ్యాఖ్యానించాడు ఈ రచయిత.

"విశ్వనాథ సాహిత్యప్రయోజనం భౌతికవిషయాలపై కేంద్రీకరించి నిలిచింది కాదు. వ్యక్తుల అంతరంగాలలోనున్న మలినాన్ని కడిగివేసి అందులో ఉన్నతమైన నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, మానవతా మూల్యాలను ప్రవేశపెట్టడమే ఆయన ఉద్దేశ్యం"అనడం సమంజసమే.

సిద్ధాంత వ్యాసంలోని తొలిప్రకరణంలో మనోవిజ్ఞానశాస్త్ర సిద్ధాంతాలను సరళ సుబోధకమైన రీతిలో వివరించారు రచయిత. ఫ్రాయిడ్ కామేచ్ఛాసిద్ధాంతం, ఆడ్లర్ ప్రయోజనతావాద సిద్ధాంతం, యూంగ్ జాతివాదసిద్ధాంతంలోని ముఖ్యాంశాలను స్పష్టంగా వివరించారు.

విశ్వనాథ నవలల్లోని ప్రేమతత్త్వాన్ని వ్యంజింపచేసే నాలుగు నవలలను ఎన్నుకొని వాటిలోని ప్రధానపాత్రల మనోవిశ్లేషణ గావించి 'ప్రేమతత్త్వనిరూపణం'లో రచయిత, సహృదయ రంజకంగా వాఖ్యానించడం అతి ప్రతిభాపూర్వకంగా సాగిందని చెప్పవచ్చు.

ఏకవీర నవలలోని చేతన-అచేతనల సంఘర్షణ, జేబుదొంగలు నవలలోని ప్రయోజనతా వాదం, బద్దన్నసేనానిలోని ఉదాత్తీకరణం, తెఅచిరాజు నవలలోని త్వగింద్రియస్పర్శ బంధం విపులంగా నాలుగు ప్రకరణాలలో విశదీకరించారు.

"ఆధునిక కాలంలో వస్తున్న మార్పులకు తలొగ్గిన వ్యక్తులలో నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, మానవతా మూల్యాలను, కోల్పోతున్న వైనాన్ని విశ్వనాథ సత్యనారాయణగారు దూరదృష్టితో గ్రహించినవారు. అందువల్ల తన సాహిత్యాన్నంతా మనోవైజ్ఞానిక శాస్త్రానుగుణంగా రూపొందించి, అందులో ప్రాచీనభావాలను, సంస్కృతిని, పునరుద్ధరించి ఋషితుల్యుడుగా వెలుగొందినవాడు." అటువంటి ప్రతిభామూర్తి నవలా సాహిత్యంలోని నాలుగు నవలల ఆంతర్యాన్ని గ్రహించి అందులోని ప్రేమతత్వాన్ని వెలికి చూపడంలో ఈ రచయిత ప్రయత్నం విజయవంతం అయిందని నేను భావిస్తున్నాను. అందుకు రచయితకు నా హార్దిక అభినందనలు.

ఎస్వీ రామారావు

డా॥ ఎస్.జి.రామానుజాచార్యులు
డీన్.ఫ్యాకల్టీ ఆఫ్ ఓరియంటల్ లాంగ్వేజస్ (రిటైర్డ్)
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

# మంచి పరిశోధన

"విశ్వనాథ నవలలు-మనస్తత్వ చిత్రణ"అను అంశంపై డా॥మాముదాల వెంకటేశ్వర రావుగారు పరిశోధించి పి,హెచ్,డి పట్టాకోసం ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి ఓరియంటల్ ఫ్యాకల్టీద్వారా సమర్పించిన సిద్ధాంత గ్రంథమిది.

1995-96 సంవత్సరంలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఓరియంటల్ ఫ్యాకల్టీ ప్రత్యేకంగా ఏర్పడిన తర్వాత వెలువడిన తెలుగులో మొట్టమొదటి సిద్ధాంతగ్రంథం కూడా డా॥ మాముదాల వెంకటేశ్వరరావుగారిదే కావడం,పి,హెచ్,డి పట్టా ప్రకటించడంలాంటి అధికారిక కార్యక్రమాలన్నీ 2001లో విశ్వవిద్యాలయంలోని ఓరియంటల్ ఫ్యాకల్టీకి డీన్‌గా ఉన్ననాచే నిర్వహింపబడడం,లాంటివి యాదృచ్ఛికాలే అయినా నాకు డా॥రావుగారికి ఆ భగవంతుడు కూర్చిన స్నేహబంధమే కారణమని గట్టిగా నమ్ముచున్నవాణ్ణి.

ఓరియంటల్ ఫ్యాకల్టీ తెలుగు విభాగంనుండి పి,హెచ్,డి కోసం విశ్వనాథ నవలలోని ప్రేమతత్వంపై విస్తృత పరిధిలో జరిగిన పరిశోధనాత్మకమైన మొదటి సిద్ధాంతవ్యాసం కూడా రావుగారిదే కావటం అదికూడా ఉత్తమ పరిశోధన విలువలను పాటించి కొనసాగింపబడిన రచన కావడం,ఆ సమయంలో ఫ్యాకల్టీ డీన్‌గా ఉన్ననాకు ఎంతో తృప్తినిచ్చిన అంశాలు.

ప్రణయం,శృంగారం లాంటి పదాలను ప్రేమకు పర్యాయపదాలుగా ఉపయోగించు కున్నారు మనవారు.శృంగారం అనగా శృంగారరసం.దీనిని ఆలంకారికులు రసరాట్టుగా పేర్కొన్నారు.సంభోగ శృంగారంకంటె విప్రలంభ శృంగారానికే పెద్దపీట వేశారు ఆధునిక కవులు. కవికుల గురువు తన మేఘదూత కావ్యాన్ని విప్రలంభ శృంగారంతో రచించి అమలిన శృంగార తత్వానికి పరాకాష్ఠగావించాడు.

భావకవితాంబుధి చంద్రుడు రాయప్రోలు ఖండకావ్య ప్రక్రియలో అమలిన శృంగార తత్వాన్ని,అమలిన ప్రేమతత్వాన్ని ప్రతిపాదించి, సమాజాన్నే వస్తువుగా గ్రహించి ప్రణయతత్వ ప్రాధాన్యాన్ని కాళిదాసుబాటలోనే నొక్కి వక్కాణించాడు.

నవయుగంలో కవిసామ్రాట్ట్ విశ్వనాథ సత్యనారాయణగారు కూడా అపూర్వ సాహిత్య ప్రయోగాలను గావించారు.ఆయన స్పృశించని ఆధునిక సాహిత్య ప్రక్రియ లేదంటే ఆశ్చర్యపడ

వలసినదేమీలేదు. ఒకవైపు రామాయణ కల్పవృక్షం రచనతో సంప్రదాయ రచన ఆయన సొత్తనుకుంటే,గిరికుమారుని ప్రేమగీతాల రచనలో భావకవిత్వం,ఏకవీర బద్దన్నసేనాని వంటి చారిత్రిక నవలల రచనలో చారిత్రిక కథనం,వేయిపడగలు మొదలుగాగల నవలలో సామాజిక వస్తువే గ్రహించినా ఆయా నవలల్లోని వస్తువైవిధ్యం చూపడం ఆయన ప్రతిభకు దర్పనం. ఆధునిక నవలా రచనలోను ఆయనే అగ్రగణ్యుడని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఏకవీర-జేబుదొంగలు-బద్దన్నసేనాని-తెఱచిరాజు అను విశ్వనాథవారి నాలుగు నవలలోగల మనస్తత్వ చిత్రణాన్ని ఆధారించుకొని తన పరిశోధానాంశంగా ఎన్నుకొనుటకు గల కారణాలను పరిశోధకుడు డా॥రావుగారిలా సమర్థించి చూపడం సమంజసమైనదే.

గతానుగతికమైన రచనలకంటె ఆలోచింపచేసే తత్వంగల రచనల అవసరం తెలుగు సారస్వతానికి ఎంతైనా ఉన్నందున డా॥వెంకటేశ్వరరావుగారి సిద్ధాంతం వ్యాసం,విశ్వనాథ హృదయాన్ని ఆవిష్కరింప చేయుటయేగాక ఆలోచనాత్మకంగా కొనసాగినందులకు వారికి నా హార్దిక అభినందనలు తెలియజేస్తున్నాను.

డా॥ ఎస్.జి.రామానుజాచార్యులు.

డా॥ బి.జయరాములు.రీడర్
అభ్యుధయ పాచ్య సాయం కళాశాల
జియాగూడ–హైద్రాబాద్.

# వ్యక్తిత్వ పరిమళం

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఓరియంటల్ ఫ్యాకల్టీ ఏర్పడిన తర్వాత ప్రాచ్య కళాశాల లలో చదివిన విద్యార్థులకు, ఆ కళాశాలలలో పనిచేసే అధ్యాపకులకు పరిశోధనావకాశాలు విరివిగా లభిస్తున్నాయి.డా॥ శివునూరి విశ్వనాథశర్మగారు డీన్‌గా, డా॥ ఎస్.జి.రామానుజాచార్యులు గారు బోర్డుఆఫ్ స్టడీస్ చైర్మన్‌గా, అస్మదాదులం రీసెర్చికమిటీ మరియు సెలక్షన్ కమిటీ సభ్యులుగా ఉండి మొట్టమొదటిసారిగా 1996-97 వ బ్యాచ్‌కు ఇంటర్వ్యూలు నిర్వహించి, పి.హెచ్.డి లో అడ్మిషన్లు ఇవ్వడం జరిగింది.నాటి ఇంటర్వ్యూలో సెలక్టయినవారిలో అభ్యుదయ ప్రాచ్యకళాశాల సీనియర్ తెలుగు లెర్చరర్,వైస్ ప్రిన్సిపాల్ అయిన శ్రీ మాముదాల వెంకటేశ్వరరావు గారొకరు.

శ్రీరావుగారు "విశ్వనాథ నవలలు–మనస్తత్వ చిత్రణ"అనే అంశంమీద పరిశోధన చేయడానికి ఓరియంటల్ ఫ్యాకల్టీలో అవకాశం లభించగానే,తన అనారోగ్యకారణాల వల్ల వేరేవారు పర్యవేక్షకులైతే వారివద్దకు తరచుగా వెళ్ళడం కష్టమనేభావంతో నన్నుపర్యవేక్షకునిగా ఉండమని కోరారు. సుమారు రెండుదశాబ్దాల కాలం అభ్యుదయ కళాశాలలో కలిసి పనిచేయడంవల్ల,ఆయన మనస్తత్వమేమిటో,దీక్షాదక్షతలు ఎలాంటివో నాకు తెలుసు కాబట్టి ఆయన పరిశోధనకు నేను పర్యవేక్షకునిగా ఉండడానికి అంగీకరించాను.రావుగారు అంతకుముందే ఈ విషయంలో కృషిచేసి ఉన్నందువల్ల నాకు ఆయన పరిశోధనను పర్యవేక్షించడం సులభమైంది.ఆయన ప్రచురిస్తున్నఈ పుస్తకాన్ని గురించి చాలామమంది పెద్దలచేత అభిప్రాయాలు వ్రాయిస్తున్నారు కాబట్టి వారు ఈ గ్రంథాన్ని గురించి కూలంకషంగా చర్చిస్తారు.అందువల్ల నేను ఆయన గ్రంథాన్ని గురించికాక ఆయన అధ్యయన విధానం,వ్యక్తిత్వం గురించి నాకు తెలిసిన కొన్ని విషయాలను వివరిస్తాను.

డాక్టర్ వెంకటేశ్వరరావుగారు విషయ పిపాసి.ఆయన ఏవిషయాన్ని చదివినా విస్తారంగా, లోతుగా చదువుతారు.అంతే అభినివేశంతో దాన్ని గురించి చర్చిస్తారు.ఈ పరిశోధన సాగిస్తున్న సమయంలో ఆయన,మనస్తత్వశాస్త్రానికి సంబంధించిన అనేక గ్రంథాలను చదివి ఆయా విషయాల గురించి సుమారు ఒక సంవత్సర కాలం నాకు వివరించి,నాతో చర్చించేవారు. అలాగే విశ్వనాథ నవలలు చదువుతున్నపుడు ఆయా నవలలోని పాత్రలు,వాటి మనస్తత్వం గురించి, ప్రేమతత్వం గురించి విపులంగాచర్చించేవారు.ఆయా విషయాలలో తనకు కలిగిన అభిప్రాయాలను చెప్పేవారు.

డాక్టర్ రావుగారికి ఒక కవికి,ఒక రచయితకు ఉండవలిసినంత భావావేశం ఉంది.ఒక విషయం అధ్యయనం చేసేటప్పుడు దానిలో పూర్తిగా లీనమై చదివేవారు.తర్వాత ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకొనేవారు.అది ఆయనలో కొంతకాలం ఒక నిశ్చితాభిప్రాయంగా నిలిచి ఉండేది.ఆ అభిప్రాయాన్ని సవరించడమో,మార్చడమో తత్కాలంలో ఎవరికీ సాధ్యమయ్యేదికాదు.పరిశోధన

ప్రారంభం కాకపూర్వం చాలాకాలం క్రితం ఎం.ఎన్.రాయ్ గ్రంథాలు చదివి రాడికల్ హ్యూమనిజం గురించి విపరీతంగా చర్చించేవారు.విశ్వనాథవారి గ్రంథాలు అధ్యయనం చేయడం ఆరంభించాక ఆయనలో ఆధ్యాత్మికత దృక్పథం నెలకొంది.విశ్వనాథవారు నైతిక,సాంస్కృతిక,ధార్మిక,ఆధ్యాత్మిక, మానవతా మూల్యాలను సమాజంలో నెలకొల్పడానికే తన ప్రతిభా వ్యుత్పత్తులను రచనా వ్యాసంగానికి ధారపోశారు.ఆయన ప్రభావంలో తలమున్కలైన రావుగారు 'అభినవ త్రిశతి'లాంటి సృజనాత్మక రచనలు చేశారు.అధ్యయనం చేసేవారు జ్ఞానాత్మక,భావావేశ,మాపసిక చలనాత్మక రంగాలలో పయనించి లక్ష్యసాధకులవుతారు.కొందరు జ్ఞానం పొందడంతో ఆగిపోతారు. కొందరు జ్ఞానంతోపాటు భావావేశాన్ని కూడా పొందుతారు.అంతటితో ఆగకుండా మానసిక చలనాత్మక రంగంలో ప్రవేశించి ఆచరణరూపంలో ఆ ధ్యేయమే కనిపించడం పరిపూర్ణలక్ష్య సాధనకు తార్కాణం. డా.రావుగారు అధ్యయనంచేసి జ్ఞానాన్ని పొందుతారు.భావావేశాన్ని పొందుతారు.ఆచరణశీలురవుతారు.ఆయన ఈ పరిశోధనా గ్రంథం,ఆయన చేసిన సృజనాత్మక రచనలు ఆయన జీవన విధానం దీనికి ప్రబలమైన తార్కాణాలు.

డా॥రావుగారి హృదయం తెల్లకాగితం వంటిది.అంతేకాదు ఆయనది ఆర్ద్రహృదయం. ఈ లోకంలోని మాయామాటలు,మతకరి చేష్టలు ఆయనకు తెలియవు.ఇలాంటి హృదయం కలవారు తీయగా మాట్లాడేవారిని ఆప్తులని,నిక్కచ్చిగా మాట్లాడేవారిని అహితులని భావించే అవకాశం ఉంది.అయినా అమాయకత్వం మనిషికి ఆభరణమే కాని అపనిందకాదు.

ఆయన నిత్య కృషీవలుడు.ఈ లోకంలో చాలామందికివలె ఆయన జీవితమంతా వడ్డించిన విస్తరికాదు.ఎన్నోకష్టాలను ఎదుర్కొని,ఢక్కామొక్కీలు తిని నేటిస్థాయికి ఎదిగిన మనిషి. అందుకే తన అనుభవసారాన్ని ఆప్తమిత్రులకు అప్పుడప్పుడూ పంచుతూ ఉంటారు.ఇప్పుడు ఆయన గ్రంథరచనకు ఉపక్రమించడంవల్ల ఆ అనుభవం గ్రంథస్థమై కొంతకాలం నిలబడి సమాజానికి ఉపయోగపడగలదని ఆశిస్తున్నాను.

ప్రతివ్యక్తిలో శక్తి ఉంటుంది.ఆ శక్తిపైకి రాకుండా పరిస్థితులు,వాటివల్ల ఏర్పడే నిరాశా నిస్పృహలు పనిచేస్తుంటాయి.కాని ఆ పరిస్థితులను,వాటివల్ల ఏర్పడే నిరాశా నిస్పృహలను స్థిరచిత్తంతో అధిగమించి ముందుకు వెళ్ళేవాడే సమర్థుడు.అలాంటి సమర్థత మిత్రులైన రావు గారిలో నాకు కనిపిస్తుంది.అలాంటి సమర్థత ఉందికాబట్టే ఓరియంటల్ ఫ్యాకల్టీ తెలుగు విభాగంలో సిద్ధాంతగ్రంథాన్ని సమర్పించి మొట్టమొదటి డాక్టరేటుపట్టా గ్రహీతగా నిలిచారు.

ఇలాంటి వ్యక్తిత్వ పరిమళంగల మిత్రుడు తన సిద్ధాంతగ్రంథాన్ని ప్రచురిస్తున్న ఈ శుభసందర్భంలో ఆయనను అభినందిస్తూ ఇకముందుకూడా ఎన్నోగ్రంథాలను వెలురించి సమాజ సేవ, సాహిత్యసేవ చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

తథాస్తు

**డా॥బి.జయరాములు.**

# అన్నయ్యల ఆశీస్సులు

జీవితంలో ఎదురయ్యే కష్టనష్టాలను,ఒడిదొడుకులను,ఎత్తుపల్లాలను,సమర్థవంతంగా ఎదుర్కొని తనకంటూ సంఘంలో ఒక స్థానం కల్పించుకోవాలనే తపన,తానాశించిన శిఖరాలను చేరాలనే కోరిక ప్రతి మనిషిలోను ఉంటుంది.కొంతమంది వీటిని తట్టుకోలేక వెనుతిరిగితే,కొంత మంది ధైర్యంతో ముందుకు ప్రయాణిస్తారు.అలా జీవితంలో తన ప్రయాణాన్ని సాగిస్తూ,తానా శించిన గమ్యాన్ని చేరిన వ్యక్తి మా తమ్ముడు చి॥ మాముదాల వెంకటేశ్వరరావు.పసితనంలోనే తలిదండ్రులకు దూరమై,ఆకాశంకన్న విశాలమైన హృదయాన్ని,భూదేవికన్నా ఎక్కువ ఓర్పుగల మా పెత్తల్లి జానకమ్మగారి పెంపకంలో పెరిగి పెద్దవాడైనాడు.జీవితంలోని తొలిమజిలీలలో కొన్ని అవాంతరాలు ఎదురైనా వాటిని ధైర్యంగా ఎదురుకొంటూ ఏదో సాధించాలనే పట్టుదలతో సాహిత్యరంగాన్ని ఎన్నుకున్నాడు.ఈ సాహితీ పయనంలో సాంఘిక,ఆర్థిక,సాంసారిక ఇబ్బందులు ఎన్నిఎదురైనా,జానకమ్మగారి అనునయ వాక్యాలతో,ఆశీస్సులతో,ఆత్మధైర్యంతో ముందుకు సాగి ఈ డాక్టరేటు పట్టాన్ని పొందాడు.జీవితంలో ఈ స్థాయికి చేరిన చి॥ మాముదాల వెంకటేశ్వరరావు కృషి అభినందనీయం.అతనికి మా శుభాకాంక్షలు,ఆశీస్సులు.ఈ సాహితీ రంగంలో ఇంకా పైకి ఎదిగి మంచి రచయితగా పేరుతెచ్చుకోవాలని మేము మనసారా ఆకాంక్షిస్తున్నాము.

తన డాక్టరేటు పట్టం కొరకు మా తమ్ముడు– 'జ్ఞానపీఠ అవార్డు గ్రహీత,కవి సామ్రాట్ట్, కీ॥శే॥ విశ్వనాథ సత్యనారాయణగారి నవలలను ఎన్నుకోవడం ఎంతో సాహసంతో కూడినపనే. విశ్వనాథవారిని గురించి,ఆయన ప్రతిభావంతమైన రచనలు గురించి,సాహితీ లోకంలో తెలియని వారుండరు.వారు రచించిన నవలలు సమకాలీన సాంఘిక,సామాజిక పరిస్థితులకు అద్దం పడతాయి.వారు సృష్టించిన సాహితీ సముద్రంలోనుండి మా తమ్ముడు నాలుగు నవలలను ఎన్నుకోవడం,ఆ నవలల్లోని 'ప్రేమతత్వాన్ని' ఆధునిక భావాలకు అనుగుణంగా,'స్పర్థతత్వాన్ని' ప్రాచీనభావాల ప్రశంసనీయ మార్గంగా, విశ్లేషించి చూపించడంలో కృతకృత్యుడైనాడనే చెప్పవచ్చు.

విశ్వనాథవారి సాహిత్యం ఒక ఖని.త్రవ్వుతూ వెళ్తే ఎన్నో మణులు,మాణిక్యాలు దొరుకక మానవు.ఈ సాహిత్యంపై ఇంకా ఎంతోమంది పరిశోధనచేసే అవసరం ఎంతో ఉంది.భవిష్యత్తులో ఇలాంటి పరిశోధనలు జరగడం,పరిశోధనా గ్రంథాలు వెలుగులోకి రావడం మనం చూస్తాం.

చి॥ మాముదాల వెంకటేశ్వరరావుచే ప్రచురింపబడిన "విశ్వనాథ నవలలు–మనస్తత్వ చిత్రణ" అనే ఈ సిద్ధాంత గ్రంథం భవిష్యత్తులో సాహితీ పరిశోధకులకు ఉపయుక్త గ్రంథంగా ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాం.మా తమ్ముడు ఇంకా ఎంతో తెలుగు సాహితీసేవ చేయాలని, ఈ రంగంలో ఇంకా పైపైకి ఎదగాలని భగవంతుని ప్రార్థిస్తూ, చి॥ మా తమ్ముడిని మనసారా ఆశీర్వదిస్తూ మా మనఃపూర్వక ఆశీస్సులను అందచేస్తున్నాము.

శ్రీ తిప్పరాజు రామకృష్ణారావు.
శ్రీ తిప్పరాజు కొండల్‌రావు

# కృతజ్ఞతా నివేదనం

విశ్వనాథవారి 'ఏకవీర' నవల నన్ను ఈ పరిశోధనా రంగంలోకి దింపింది. అందులోని ప్రేమతత్త్వం- ముఖ్యంగా విశ్వనాథవారు ప్రవేశపెట్టిన 'స్పర్శసిద్ధాంతం' నన్ను బాగా ఆకర్షించాయి. వీటిని పరిశోధనకు ఆధారంగా తీసుకొని విశ్వనాథవారి నవలా సాహిత్యాన్నంతా చదవటం జరిగింది. అందులో 'బద్దన్నసేనాని-తెఅచిరాజు-జేబుదొంగలు' అనే నవలలను ఎంపిక చేసుకొని, "విశ్వనాథ (నాలుగు) నవలలు-మనస్తత్త్వచిత్రణ" అనే పరిశోధనాంశంగా నిర్ణయించి, ఓరియంటల్ విభాగంలో అప్లైచేశాను. ఆ అంశాన్నిగుర్చి పరిశోధన చేయటానికి అనుమతినిచ్చిన ఓరియంటల్ భాషావిభాగం (ఉస్మానియా విశ్వవిద్యాలయం)లో డీన్‌గానున్న డా ॥ శివునూరి విశ్వనాథశర్మగారికి, ఓరియంటల్ బోర్డుఆఫ్ ఛైర్మన్ డా॥ఎస్.జి. రామానుజా చార్యులగారికి, మరియు బోర్డు మెంబర్లకు, పరిశోధనారంగంలో నాకు పర్యవేక్షకులుగానుండి తగిన విధంగా సలహాలిస్తూ నా పరిశోధనకు మార్గదర్శియై నన్ను ముందుకు నడిపిన రీడర్ డా. బి.జయరాములు గారికి, నా హృదయపూర్వక కృతాంజలులు.

గౌరవనీయులైన భారత మాజీ ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుగారు ఇటీవల హైద్రాబాద్ వచ్చిన (18-03-2003) సందర్భంలో వారిని కలిశాను. ఈ గ్రంథాన్ని వారిచేతి కివ్వగా గ్రహించి, సహృదయంతో నన్నాశీర్వదించారు. వారితో కలిసి ఛాయాచిత్రం తీసుకునే అవకాశం కూడా నాకు లభించింది. వారికి సర్వదా కృతజ్ఞుణ్ణి. ఆ మనీషికి శతసహస్ర నమోవాకాలు.

సుప్రసిద్ధ సాహిత్యాచార్యులు, నేటి అగ్రశ్రేణి విమర్శకులు, అఖిలాంధ్ర సాహిత్య లోకానికి చిరపరిచితులు, ప్రస్తుతం 'పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయానికి' ఉపాధ్యక్షులు (వైస్ చాన్సలర్) గా నున్నటువంటి ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు నాకు గురువర్యులు. నా సిద్ధాంతవ్యాసానికి వారి అమూల్య సందేశం కావాలని కోరగా శిష్యవాత్సల్యంతో నన్నాశీర్వదించి తమ అభిప్రాయాన్ని అందించి నన్ను కృతార్థుణ్ణి చేశారు. ఆచార్యులవారికి నా హృదయపూర్వక కృతాంజలులు.

సుప్రసిద్ధ సంస్కృత పండితులు, సేవానిరతులు 'ఖండవల్లివారి ఆంధ్ర ప్రాచ్య సాయం కళాశాలకు' బహుకాలంగా ప్రధానాచార్యులుగా ఉండి తమ సేవలనందించినవారు, బహువ్యయ ప్రయాసలతో ఉస్మానియా విశ్వవిద్యాలయ అధికారులతో బహుకాలం పోరాడి ప్రాచ్యకళాశాలలకు ప్రత్యేకగుర్తింపు కలుగునట్లుగా ఫ్యాకల్టీని ఏర్పాటుచేసినవారు, దానికి మొదటి డీన్‌గాఉండి ఎంతోమంది ఓరియంటల్ భాషా విద్యార్థులకు, పండితులకు పరిశోధనారంగాన్ని విస్తృతపరిచి అవకాశాన్ని కలిగించినవారు అయిన డా ॥ శివునూరి విశ్వనాథశర్మగారు నేను అడిగినవెంటనే

తమ ఆశీర్వచనాలతో పాటు అభిప్రాయాలను అందించినందులకు వారికి నా నమస్సుమాంజలులు

నాకు ఆర్ట్స్ కాలేజీలో గురువర్యులుగా ఉండినటువంటి ఆచార్య ఎం.కులశేఖరరావు గారు తమ అభిప్రాయాన్ని 'మైక్రో పరిశోధనగా' నిర్ణయించినందులకు వారికి,ఆచార్య ఎస్వీ రామారావుగారు నా పరిశోధనను 'ప్రేమతత్త్వ నిరూపణం'గా ఆమోదించి తమ అభిప్రాయాన్ని తెలిపినందుకు వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనాలు.

ఓరియంటల్ భాషా విభాగానికి(ఉస్మానియా విశ్వవిద్యాలయం) డీన్‌గా ఉండి ఈమధ్యనే విశ్రాంతి తీసుకొన్న డా ॥ ఎస్.జి. రామానుజాచార్యులుగారు నేను నా పుస్తకానికి తమ అమూల్య అభిప్రాయం కావాలని కోరిన వెంటనే 'మంచి పరిశోధనగా' నిర్ణయించి తమ సందేశాన్ని ఇచ్చినందులకు వారికి నా కృతజ్ఞతలు.

రీడర్ డా॥ బి.జయరాములుగారు నాకు పర్యవేక్షకులు.వారు సహృదయంతో వారు నా వ్యక్తిత్వాన్ని పరిమళ భరితంగా తెలుపుతూ ఇచ్చిన సందేశాన్ని నేను మరువరానట్టిది.వారికి నా కృతజ్ఞతలు

నాకు సహోదరులు లేకున్నా నా క్షేమాన్ని,ఆరోగ్యాన్ని,నా స్థితిగతులను ఎల్లప్పుడూ వీక్షించే నా అన్నయ్యలు మ॥రా॥శ్రీ తిప్పరాజు రామకృష్ణారావు గారు.కొండల్‌రావుగారలు తమతమ ఆశీస్సులతో సందేశాన్నిచ్చి నన్ను ఆశీర్వదించారు.వారికి నా హృదయపూర్వక పాదాభివందనాలు.

ఆత్మబంధువు,చిరస్మరణీయుడు,ప్రాణమిత్రుడు,ఆపత్కాలంలో ఆశ్రయమిచ్చినవాడు, కీ॥శే॥మాడభూషి రంగాచార్యులు,నా పరిశోధనకు ముఖ్యగ్రంథమైన 'తెరచిరాజు' నవల ఇచ్చి నన్ను ప్రోత్సహించి,నా పరిశోధనను ముందుకు నడిపించాడు.అతని మేలు నేను మరువరానిది

అనారోగ్యకారణాలవల్ల నేను పరిశోధనలో అప్పుడపుడు కుంటుపడగా తగిన ప్రోత్సాహమిచ్చి ముందుకు నడిపిన రీడర్ డా ॥ అట్లా వేంకటరామిరెడ్డిగారికి,నా చిత్తువ్రాత ప్రతికి శుద్ధవ్రాతప్రతిని వ్రాసియిచ్చిన డా॥ బి.నాగిరెడ్డిగారికి నా కృతజ్ఞతలు.

పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం ఈ గ్రంథప్రచురణకు ఆర్థికసహాయం చేయటంవల్ల తొందరలోనే ఈగ్రంథం ముద్రింపబడి వెలుగులోకి తేబడింది.ఆ విశ్వవిద్యాలయ కార్యనిర్వాహకవర్గానికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రించిన 'సరస్వతీ ఆర్ట్ ప్రింటర్స్' పి.వాసుగారికి,చక్కని గ్రాఫిక్స్ చేకూర్చిన పి.శ్రీధర్‌గారికి మరియు మురళిగారికి నా కృతజ్ఞతలు.

మామిడాల వెంకటేశ్వరరావు

# ప్రవేశిక

లోకంలో యువతీయువకుల మధ్య 'ప్రేమ' మొదటి చూపులోనే కలగటం,కేవలం వారిలోనున్న ఆకర్షణ వల్లనే అని అనుకోవటం సర్వసాధారణం.ఆ ఆకర్షణ క్రమంగా వారిని ఏకం చేస్తూ స్నేహితులుగా మారుస్తుందనీ,వారి మధ్య ఆ స్నేహం బలపడి ఒకరి అభిరుచులు మరొకరు తెలుసుకొని ప్రేమించుకుంటారనీ,ఆ ప్రేమను శాశ్వతంగా నిలుపుకోవటం కోసం పెండ్లి చేసుకోవాలని ఆరాటపడతారనీ,మనం సాధారణంగా భావించే విషయాలు.

ప్రేమకు ఒక పార్శ్వం స్వార్థం.రెండవ పార్శ్వం త్యాగం.ప్రేమించుకున్న జంట సాంఘిక పరిస్థితులవల్లనో,తల్లిదండ్రుల నిరాదరణవల్లనో,పెండ్లి చేసుకోనట్లయితే వారిపురూ ప్రాణ త్యాగం చేయటానికైనా సిద్ధపడతారు.నిజమైన ప్రేమికులు ఆత్మ త్యాగంద్వారా తమ ప్రేమను లోకానికి వెల్లడి చేస్తారు.ప్రేమకు గల బలాన్ని నిరూపిస్తారు.కొందరు త్యాగబుద్ధితో ఎదుటివారి క్షేమాన్ని కాంక్షిస్తూ తమలోని ప్రేమను ఆరాధనా భావంగా మార్చుకుంటారు.స్నేహ భావంతో తమలో 'అమలిన శృంగారతత్వాన్ని ' నింపుకుంటారు.

ఈవిధంగా కొనసాగే ప్రేమ సాధారణంగా లోకంలో సమకాలీనతను,సార్వ కాలీనతను పొంది,ఇటు సమాజంలోనూ,అటు సాహిత్యంలోనూ,వ్యక్తులమధ్య మానసిక సంఘర్షణకు మూలమై వారిని వారి ఆత్మీయులకు కూడా బాధాకరంగా పరిణమిస్తుందని చెప్పటంలో సందేహం లేదు.

స్త్రీ పురుషుల మధ్య ప్రేమ పుట్టటానికి గల ఆకర్షణ ఎటువంటిది?ఆ ఆకర్షణ ప్రేమకు ఎట్లా మూలమౌతుంది?ప్రేమ తత్వం ఎటువంటిది?మొదలైన ప్రశ్నలకు ఒక మాటలో సమాధానం చెప్పటంగానీ, వాటిని ఒక్క క్షణంలో నిరూపించటంగానీ, ఎవరికైనా కష్టసాధ్యమైన పనే.ప్రేమ కావ్యాలు వ్రాసినవారుగానీ,ప్రేమ కథలు చెప్పినవారుగానీ,'ప్రేమ' పిచ్చిది.'ప్రేమ గుడ్డిది'అనే భావనలోనే ఉండి తమ రచనలను చేశారేమో గాని,ఆ ప్రేమకు మూలమేమిటో చెప్పిన వారు మాత్రం కనిపించక పోవటం ఆశ్చర్యకరంగానే ఉంటుంది.

వైయక్తికమై, అంతరాత్మ నిర్దేశకమై, ఎల్లప్పుడూ మనసును కలచివేస్తూ ప్రేమికులను మానసిక సంఘర్షణకు లోనుగావించే ఈ 'ప్రేమ' విషయంలో "విశ్వనాథ"వారు వ్రాసిన "ఏకవీర" నవలే నా యీ పరిశోధనకు మూలమై నిలిచింది.విశ్వనాథ సత్యనారాయణగారి దృష్టిలో మెదలిన "ప్రేమ తత్వం" ఎటువంటిదో తెలుసుకోవాలనే జిజ్ఞాసతోనే వారి నవలా సాహిత్యాన్నంతా చదవటం జరిగింది.అందులో ముఖ్యంగా యువతీయువకుల మధ్యనేగాక ఎంతో వయో భేదమున్న స్త్రీ పురుషుల మధ్యకూడా ఈ ప్రేమ ఎట్లు మానసిక సంఘర్షణకు మూలమై నిలిచి

ఉంటుందో విశ్వనాథవారి "బద్దన్న సేనాని" తెఱచిరాజు" లనే నవలలు చదివాక తెలిసింది. ఆయా నవలల్లో విశ్వనాథవారు ప్రారంభించిన ప్రేమతత్వాన్ని త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతాన్ని,వారి భావాలను తెలుసుకోవాలనే అభిరుచితోనే ఈ పరిశోధనను ప్రారంభించాను.

ఆధునిక కాలంలో తెలుగు సాహిత్యంలో అపూర్వమైన సాహిత్య ప్రయోగాలు చేసి చూపిన అత్యంత ప్రతిభాశాలి కీ.శే. విశ్వనాథ సత్యనారాయణగారు. సమకాలీన,రాజకీయ,సామాజిక ఆర్ధిక,సాంస్కృతిక,రంగాలలోని మంచి,చెడులనే గాక వాటి పరిణామాల దృష్ట్యా, వ్యక్తులలోఏర్పడే, మానసిక సంక్షోభాన్ని, సంఘర్షణను, అపూర్వ రచనా నైపుణ్యంతో తమ నవలల్లో చిత్రించి మన ముందుంచారు. ముఖ్యంగా వారి నవలా సాహిత్యంలో "మనస్తత్వ చిత్రణ" మిగతా సాంఘిక విషయాలకన్నా అధిక ప్రాముఖ్యం పొంది ఉన్నదని చెప్పటంలో ఏమాత్రం సందేహంలేదు.

"ఆయన తన సాహిత్యం నిండా "అంతఃకరణ చతుష్టయం" అనబడే అంతరాత్మ పొరల్లో ఉన్న జీవ స్వభావాన్ని ఆశ్రయించుకొని ఉన్న మానవ సమస్యలకు రూపకల్పనచేసి,వీటి స్వరూప స్వభావములివ్వి, వీటికిది దోహదం,వీటికిది విరుగుడు, అని వ్యాఖ్యానించినాడు అని" కేతవరపు రామకోటిశాస్త్రిగారు తమ "విశ్వనాథ వైఖరి"అనే గ్రంథంలో చెప్పటం కూడా అక్షరాల సత్యమైన విషయమే.

విశ్వనాథవారు వ్యక్తులలో కనుమరుగవుచున్న నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, మానవతా మూల్యాల నెన్నింటినో పాదుకొల్పడమే లక్ష్యంగా భావించినట్లు, మానవ మపస్తత్వాన్ని బాగా పరిశీలించిన వాడు అయినందువల్లనే తన సాహిత్యంనిండా ఆ మూల్యాలనే పొందుపరిచి తన రచనలను ఆ విధంగా కొనసాగించినట్లు చెప్పవచ్చు.

విశ్వనాథ నవలా సాహిత్యం అతి విస్తృతమైంది. అందులోనుండి నా ఈ పరిశోధనకు అనుకూలమైన నాలుగు నవలలను ఎన్నుకున్నాను. అవి ఏకవీర-జేబుదొంగలు-బద్దన్న సేనాని-తెఱచిరాజు. ఈ నాలుగు నవలలను ఎన్నుకోవటానికి గల ప్రధాన కారణాలివి.

1. ఈ నాలుగు నవలలూ,పాత్ర(లు) ప్రధానమైన నవలలు. అనగా ఈ నవలల్లో పాత్రల మనస్తత్వ చిత్రణే ప్రధానమై ఉండటం.

2. ఈ నాలుగు నవలల్లోను ప్రేమతత్వం నిండి ఉండటం.

3. ఇందులో" ఏకవీర-బద్దన్న సేనాని" అనే రెండు నవలలు చారిత్రికమైనవి, అయినా వీటిలో చరిత్రగానీ,చారిత్రక వ్యక్తులుగానీ,ముఖ్యంగాకపోవటం. అట్లే "జేబుదొంగులు తెఱచిరాజు" అనే రెండు నవలలు సాంఘికాలైనా ఇందులో సాంఘిక విషయాలకు ప్రాధాన్యం లేకపోవటం.

4. ఈ నాలుగు నవలల్లో విశ్వనాథ భావించి ప్రవేశపెట్టిన "త్వగింద్రియ స్పర్శ లక్షణాన్ని" క్రమంగా ఏకవీరలో ప్రారంభించి మిగతా రెండు నవలల్లోకూడా దానికి ప్రాధాన్యం కలిగించి, 'తెఱచిరాజు' నవలలో ప్రయోగపూర్వకంగా విస్తృతపఱచి వ్యాఖ్యానించటం పరిశీలించవచ్చు.

అంతేగాక విశ్వనాథవారి దృష్టిలో మెదలిన ప్రేమతత్వం సరికొత్త తాత్విక భూమికతో ఈ నాలుగు నవలల్లో సమర్థించి చూపటం గమనించవచ్చు.

5. వీటితో పాటు ఈ నాలుగు నవలల్లో విశ్వనాథవారు ప్రేమలోని వైవిధ్యాలను చూపారు రాయప్రోలు సుబ్బారావుగారు ప్రతిపాదించిన "అమలిన శృంగార తత్వం' ఏకవీర నవలలోనూ, ఆడ్లర్ సిద్ధాంతీకరించిన "ప్రయోజనతావాదం" జేబుదొంగలు నవలలోనూ, చిత్రించిన విశ్వనాథ, బద్దన్న సేనాని,తెలచిరాజు నవలల్లో ఎంతో వయోభేదమున్న వారి మధ్యగల ప్రేమబంధాన్ని లోకాతీత సంబంధంగా నిరూపించి చూపటం అత్యంత శ్లాఘ నీయమైనట్టిది. అందుకే ప్రేమ వస్తువులోనే వైవిధ్యం చూపగలిగిన విశ్వనాథవారి ఈ నాలుగు నవలల్ని పరిశోధనకు ఎన్నుకోవటం జరిగింది.

"ప్రేమతత్వం" మనసుకు సంబంధించినది కావటంవల్ల ఈ పరిశోధన వ్యాసానికి "విశ్వనాథ నాలుగు నవలలు-మనస్తత్వ చిత్రణ" అనే పేరు పెట్టటం జరిగింది. ఈ నాలుగు నవలల్లోని ప్రధాన విషయాన్ని అనుసరించి ఈ సిద్ధాంత వ్యాసాన్ని ఆరు భాగాలుగా విభజించటం ముఖ్యమని తలచాను. ఆ ఆరుభాగాలు ఈవిధంగా ఉన్నాయి.

విషయం 'మనస్తత్వచిత్రణ' కు సంబంధించినది కాబట్టి మొదట 'మనస్తత్వం - ప్రవర్తన" అనే శీర్షికతో ప్రారంభించాను. ఇందులో మానవుని మనసును,మానసిక శక్తిని, మనోవిజ్ఞాన శాస్త్రంలో ముఖ్యంగా ఫ్రాయిడ్,ఆడ్లర్,యూంగ్ ల మనోవిశ్లేషణ సిద్ధాంతాలను, అస్తిత్వవాదాన్ని, ప్రవర్తన,ప్రవర్తన వాదాన్ని,సంక్షిప్తంగా వివరించాను. ప్రవర్తన లేదా మనస్తత్వం పై ప్రభావాలను, సర్దుబాటు పద్ధతులను, చెప్పటం జరిగింది. సాహిత్యంలో మనస్తత్వచిత్రణ ముఖ్యంగా నవలల్లో మనస్తత్వచిత్రణకు గల ప్రాధాన్యం, క్లిష్టతలేని మరియు క్లిష్టత కలిగిన పాత్రలను గూర్చి వివరంగా ఈ భాగంలో చర్చించటం జరిగింది. ఈ సిద్ధాంత వ్యాసానికి అవసరమైన 'మనసు' ప్రవృత్తిని గురించి ప్రాచ్య,పాశ్చాత్య భావాలను ఆధారం చేసుకొని మొదటి ప్రకరణంలో సంక్షిప్తంగా పరిచయపూర్వక భాగంగా తెలియజేయటం జరిగింది.

"విశ్వనాథ–నాలుగు నవలలు" అనే రెండవ భాగంలో విశ్వనాథ మనస్తత్వాన్ని, వైఖరిని, సంక్షిప్తంగా చెప్పటానికి ప్రయత్నం చేశాను. అట్లే విశ్వనాథ సాహిత్య ప్రయోజనం, నవలా సాహిత్యం పరిచయం గావిస్తూ, పరిశోధనకై ఎన్నుకున్న నాలుగు నవలల పరిచయంతో పాటు వాటి ప్రత్యేకతను కూడా ఈ ప్రకరణంలో వివరించాను.

'ఏకవీరను' తెలుగు మనోవైజ్ఞానిక నవలల్లో మొదటిదానిగా చెప్పుకోవచ్చు. ఇందులోని ముఖ్యమైన పాత్రల మనస్తత్వచిత్రణమే ఈ నవలకు ప్రాణం. ఈ నవలలోని పాత్రల మానసిక సంఘర్షణ "చేతనాచేతనలకు" సంబంధించినది. అందువల్ల "చేతన-అచేతనల సంఘర్షణకు రూపకల్పన ఏకవీర" అనే పేరుతో ఈ భాగాన్ని ప్రారంభించాను. ఇందులో పాత్రల మనస్తత్వ

చిత్రణతోపాటు అమలిన శృంగారతత్వాన్ని,త్వగింద్రియస్పర్శ సిద్ధాంతాన్ని, విపులంగా వివరించటానికి ప్రయత్నించాను.

ఫ్రాయిడ్‌కు భిన్నంగా ప్రయోజనతా వాదాన్ని ప్రవేశపెట్టినవాడు 'ఆడ్లర్'. వ్యక్తి ప్రవర్తనకు అచేతన మానసిక వ్యవస్థకంటె చేతనస్థితే ప్రధానమనీ,వ్యక్తి సంఘజీవి కావున సాంఘిక కారకాలే వ్యక్తి ప్రవర్తనకు మూలమౌతాయనీ, సిద్ధాంతాన్ని ప్రతి పాదించినవాడు ఆడ్లర్. ఈతని ప్రయోజనతా వాద సిద్ధాంతానికి ప్రతీకగా నిలిచిన నవల 'జేబుదొంగలు'. అందుకే ఈ శీర్షికకు "ప్రయోజనతా వాద సిద్ధాంత ప్రతిఫలనం జేబుదొంగలు" అనే పేరు పెట్టటం జరిగింది. ఇందులో ప్రయోజనతా వాదాన్ని,ముఖ్యపాత్రల మనస్తత్వ చిత్రణను చూపటమే గాక,ఫ్రాయిడ్ ఊహించిన మానసిక వ్యవస్థలగు "అచిత్తు-అహం-అధ్యహం" అనే వాటికి విశ్వనాథ రూపకల్పన చేసి "అప్పడు-అవధాని-విమల" అనే పాత్రలను సృష్టించి ఈ నవల వ్రాశాడా?అనే సందేహాన్ని కూడా తీర్చటానికి ప్రయత్నించాను.

ఉదాత్తీకరణ మనేది మానసిక సంఘర్షణకు లోనైన వ్యక్తులు పొందే సర్దుబాటు పద్ధతి. ఈ సర్దుబాటు పద్ధతులలో అన్నిటికంటె ముఖ్యమైనది,ఎంతో ప్రయోజనం కలది. మానసిక సంఘర్షణకు లోనైన ఒక యువకుడు ఉదాత్తీకరణం పొంది,తనదేశ విముక్తి కోసం పోరాటానికి సైన్యాన్ని సమీకరించటం లాంటి కార్య కలాపాలతో తన దేశభక్తిని వెల్లడించు కుంటాడు. కాని వైయక్తికమైన,ఆత్మగతమైన,ప్రేమకు బానిసై తనకంటె పెద్ద వయస్సుగల స్త్రీతో సంబంధం పెట్టుకొని పతనం గావటం "బద్దన్న సేనాని" లోని ఇతివృత్తం. అందువల్ల ఈ ప్రకరణాన్ని "ఉదాత్తీకరణ సదాశయాన్ని ఉన్నతంగా మలచుకున్న వీరుడు-బద్దన్న సేనాని" అనే పేరుతో ఈ భాగాన్ని ప్రారంభించాను. ఈ భాగంలో ఉదాత్తీకరణం, ముఖ్య పాత్రల మనస్తత్వ చిత్రణ, అందులోని ముఖ్య పాత్రలైన బద్దన్న,బాదమ్మకు గల సంబంధాన్ని విశ్వనాథ "లోకాతీత సంబంధంగా" చెప్పటం ముదలైన విషయాలను వివరించాను.

త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతానికి వ్యాఖ్యాన ప్రాయంగా నడిచిన నవల "తెఱచిరాజు". విశ్వనాథ తాను నమ్మిన భావించిన స్పర్శ సిద్ధాంతాన్ని ఈ నవలలో తార్కికంగా, తాత్వికంగా నిరూపించ ప్రయత్నించాడు. 'ఉత్తర రామ చరితంలో" ఒక ఘట్టం లోని స్పర్శ విధానాన్ని ఆధారం చేసుకొని విశ్వనాథ ఈ నవలను రూపొందించాడు. ప్రాచీన భావాలకు మూల రూపాలైన "ప్రజాపతి-శతరూప" లను సారథి-వాసంతి అనే ముఖ్య పాత్రలుగా ఈ నవలలో చిత్రించాడు. దీనిలో ఇటు భారతీయుల ఆలోచనలకు, అటు యూంగ్ తెలిపిన "అనిమా-అనిమస్" భావాలకు పొందిక కల్గించాడు. తాత్విక భూమికతో నిండిన ఈ నవలలో "త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతం" విపులంగా ఉంది. అందువల్ల ఈ శీర్షికను "త్వగింద్రియ స్పర్శచే తా వలచినబంధం-తెఱచిరాజు' అనే పేరుతో ప్రారంభించాను. ఇందులో ముఖ్య పాత్రల మనస్తత్వ చిత్రణతో పాటు త్వగింద్రియ

స్పర్శ సిద్ధాంతాన్ని,విశ్వనాథ చేసిన ప్రయోగాలను ఆయా పాత్రల్లో గల "ఎలెక్ట్రా కాంప్లెక్సు" భావాలను విపులంగా వివరించాను.

నాలుగు నవలల్లో "మనస్తత్వ చిత్రణే" ప్రధానాంశం కావటం వల్ల మిగతా సాంఘిక విషయాలను పాత్రలను అంతగా అవసరం లేని వాటిని పేర్కొన లేదు. ఈ నవలలు పాత్రప్రధాన మైనవి కనుక ఆయా నవలల్లోని ముఖ్య పాత్రలనే అనగా 'నాయికా నాయకులుగా గుర్తింపబడిన పాత్రల మనస్తత్వ చిత్రణే వివరించటం జరిగింది.చారిత్రిక, సాంఘికాది విషయాలు కేవలం ఆయా పాత్రల మనస్తత్వంపై ప్రభావాలను చూపటానికే పరిమితం అయ్యాయి. అందువల్ల ఈ పరిశోధన ఈ నాలుగు నవలల్లోని ముఖ్య పాత్రల మనస్తత్వ చిత్రణ, విశ్వనాథ దృష్టిలో మెదలలిన ప్రేమతత్వం, త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతం, అమలిన శృంగార తత్వం, వీటితో పాటు ఆధునిక మనో వైజ్ఞానికులైన ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్ ల సిద్ధాంతాలలోని ముఖ్య భావనలను ఆయా పాత్రల మానసిక స్థితి గతులలో పరిశోధనా పూర్వకంగా వివరించాను.

ఆధునిక కాలంలో వస్తున్న మార్పులకు తలొగ్గిన వ్యక్తులలో నైతిక,ధార్మిక, ఆధ్యాత్మిక, మానవతా మూల్యాలను కోల్పోతున్న వైనాన్ని విశ్వనాథ సత్యనారాయణగారు దూరదృష్టితో గ్రహించినవారు. అందువల్ల తన సాహిత్యాన్నంతా మనోవైజ్ఞానిక శాస్త్రాను గుణంగా రూపొందించి అందులో ప్రాచీన భావాలను, సంస్కృతిని, పునరుద్ధరించి ఋషితుల్యునిగా వెలుగొందినవారు. అంతటి ప్రజ్ఞాశాలి రచించిన నాలుగు నవలల్లోని ఆంతర్యాన్ని చూపటంలో కొంత సఫలమైనా నా కృషి సార్థకమైనట్లే.

ఇట్లు
డా॥ మాముదాల వెంకటేశ్వరరావు

# విషయసూచిక

పుట.సంఖ్య

**4.ప్రయోజనతావాదసిద్ధాంతప్రతిఫలనం-జేబుదొంగలు** (107-138)

ఓం

# 1. మనస్తత్వం-ప్రవర్తన

కృష్ణం వందే జగద్గురుమ్.

" ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనో2ను విధీయతే
తదస్య హరతి ప్రజ్ఞా వాయుర్నావ మివామ్భసి". [1.]

(ఇష్టానుసారం ప్రవర్తించే ఇంద్రియాలకు లొంగి పోయిన మనస్సు ఏవిధంగా జల ప్రవాహంలో చుక్కాని లేని నావ సుడిగాలిలో చిక్కి తోసుక పోతుందో,అట్లా మానవుని బుద్ధిని పాడుచేసి అపమార్గం పట్టిస్తుంది.)

## 1.1 ప్రకృతి-మానవుడు,

ప్రకృతికి నానా అర్థాలున్నాయి.స్వభావం,సహజం,మొదటిరూపు,ఉపాదాన కారణం, సత్వాదిగుణ సామాన్యావస్థ,ప్రత్యయం చేరకముందున్న పదస్వరూపం మొదలైనవి.[2]

"ప్రారంభః క్రియతే అనయేతి ప్రకృతి."[3] (దీనిచేత జగత్తు ప్రారంభం చేయబడుచున్నది.) "ప్రక్రియతే అనయా కార్యమితి"[3](దీనిచేత కార్యం చేయబడును.) మొదలగు వ్యుత్పత్త్యర్థాలున్నాయి.

స్థూలంగా దృశ్య మానమౌతున్న చరాచర జగత్తంతా ప్రకృతి.కాల గమనంలో ప్రకృతి అనేక మార్పులు పొందుతుంది ఆ మార్పులకు కారణం ఋతువు.ఋతువువల్ల చేతన ప్రకృతి సర్వాంగ సుందరంగా కనిపిస్తుంది.కనిపించని ఋతువు కనిపించే ప్రకృతికి ప్రాణం.ఋతువు లేనిది ప్రకృతి లేదు.ఈ ప్రకృతికి మూలమైన చైతన్యాన్ని దర్శించినవారు దార్శనికులు.భారతీయ దర్శనాలలో ప్రకృతిని దర్శించిన విధానం ఉంది.చైతన్య ప్రకృతిలో అనంతకోటి ప్రాణులున్నాయి. అందులో మానవుడున్నాడు.

మానవునికి రెండు విధాలైన ప్రకృతులున్నాయి.దృశ్యమానమౌతున్న బాహ్య ప్రకృతి ప్రవర్తన,అదే మొదటిది.దృశ్యమానం కాకుండా ఊహించి తెలుసుకో దగినది అంతః ప్రకృతి రెండవది,అదే మనస్తత్వం.మానవ మనస్తత్వం అతని ప్రవర్తనకు [illegible].

భౌతిక సంపదవల్ల కలిగే భోగలాలసత మానసిక శక్తిని తగ్గిస్తుందని భారతీయ [illegible]లు

---

1. భగవద్గీత- సాంఖ్య యోగం. శ్లోకం. 67.
2. శబ్దార్థ దీపిక [illegible]. 913.
3. ప్రబంధాలలో ప్రకృతి వర్ణనలు. పుట 9.

ఏనాడో గ్రహించారు. పురాణాలలో దేవ రాక్షసుల గాథలన్నీ ఈ విషయాన్నే చాటుతున్నాయి. మానవునిలో దైవాంశ,రాక్షసాంశ,అనే రెండంశలున్నవని గ్రహించిన ఋషులు'రాక్షసాంశ లోని ప్రవృత్తి' మానవునిలో పెంపొందకుండా నిరోధించటానికి,ఈ సృష్టిలో ఉన్నతమైన,ఉత్తమమైన జీవిగా,మనీషిగా,మహాత్ముడిగా, ఋషిగా,అవతార పురుషుడుగా,చివరకు దేవునిగా రూపొందే మార్గాలను సూచించారు.మానవుని మనస్తత్వాన్ని అర్థం చేసుకొని మానవునిలోని మానసిక శక్తిని గుర్తించి మానవుని ప్రవర్తన దివ్యంగా,ఆదర్శంగా ఉండాలని ఆశించి ఎన్నో కట్టుబాట్లను ఏర్పరచారు.ఈవిధంగా మానవుని ప్రవర్తన లోకంలో సక్రమ మార్గాన నడిపించటానికి ఉద్దేశించినవే మన వేదశాస్త్ర పురాణ ఇతిహాసాదులు.

ప్రకృతిలో మానవుడు మానవునిలో ప్రకృతి పంచ భూతాత్మకమై ఉండి చేతనత్వం కలిగింది కావటంవల్ల ప్రకృతికి మానవునికి గల సంబంధం అవినాభావంగా ఉంటుంది.అనాది నుండి ప్రకృతి ఆది మానవుని చైతన్య వంతునిగా చేసింది.అదే ప్రకృతి మానవుని ఈనాడు 'అవతారమూర్తి'గా,లేదా రాక్షసునిగా చేయటంలో కూడా ప్రాతినిధ్యం వహిస్తుంది.

## 1.2. మానవుని మనసు - మానసిక శక్తి.

భారతీయ తత్త్వాన్వేషణలో మనసు,ఆ మనసును నడిపించే అంతరాత్మ, ఆ అంతరాత్మ లోని చైతన్యం మూలాలైనాయి.ఆ చైతన్యమే విశ్వ వ్యాప్తమైన చైతన్యంగా గుర్తించారు. ఆ చైతన్యమే ఉపాధి గతంగా అనేక రూపాలు పొందుతున్నట్లు చెప్పారు.మానసిక శక్తికి మూలమైన ఆత్మ విషయంలో భారతీయుల ఆలోచనా విధానం దర్శనాలు,ఉపనిషత్తులు మొదలైన వాటిలో మనకు కనిపిస్తుంది.న్యాయ వైశేషిక దర్శనాల్లో ప్రకృతి విభాగాలుగా పేర్కొన బడిన " పృథివ్యాప స్తేజో వాయురాకాశః కాలోదిగాత్మ మనః ఇతి ద్రవ్యాణి " అనే తొమ్మిది ద్రవ్యాలలో మనసు ప్రస్తావింపబడింది.

సాంఖ్య, యోగ, దర్శనాలలో దేహధారియైన జీవునిలోని అంతరింద్రియమైన మనస్సు ఇంద్రియాలసంవేదనలను సమన్వయ పరిచి చిత్తానికి అందిస్తుందని ఆ చిత్తం మానసిక, దైహిక కార్య కలాపాలనన్నింటిని నిర్వహిస్తుందని చెప్పబడింది.పతంజలి యోగదర్శనంలో మానసిక శక్తి అద్భుతంగా వివరించబడి ఉంది.

ఉత్తర మీమాంసాదుల్లో పేర్కొనబడిన ' జాగ్రత్ స్వప్న సుషుప్త వ్యవస్థలు,ఆధునిక కాలంలో ఎన్నో విశ్లేషణల అనంతరం ఫ్రాయిడ్ ప్రతిపాదించిన మనోవిశ్లేషణ సిద్ధాంతంలోని భావనలను తలపింపజేస్తాయి.జాగ్రదవస్థలో జీవుడు ప్రాపంచిక విషయాలను మనో బుద్ధీంద్రియాల ద్వారా స్పష్టంగా గ్రహించి అనుభవిస్తాడు.ఇది ఫ్రాయిడ్ కనుగొనిన చేతనస్థితి.

4. భారతీయ దర్శనం పుట. 94.

స్వప్నావస్థలో సూక్ష్మ శరీరంలోని మనోబుద్ధులు స్వప్న ప్రపంచాన్ని జీవునికి కల్గింపజేస్తాయి. ఇందులో జాగ్రదవస్థలో అనుభవించిన అనుభవాలు కూడా చోటు చేసుకుంటాయి.ఫ్రాయిడ్ స్వప్నాలను విశ్లేషించి దీన్నే అచేతన స్థితిగా గుర్తించాడు.సుషుప్త వ్యవస్థలో అంతఃకరణం కూడా పనిచేయదు.కారణ శరీరంలో సుషుప్త వ్యవస్థలో జీవుడు విశ్రాంతి పొందుతాడు.నిజమైన ఆనందానుభూతిని అనుభవిస్తాడు.

భగవద్గీతలో అనేకచోట్ల మనస్సుయొక్క విశ్లేషణ ఉంది.దీనిలో ఆత్మ విచారణ వచ్చినప్పుడల్లా మానసిక వివరణ కనిపిస్తుంది. భారతీయులకు భగవద్గీత నిత్య పఠనీయ గ్రంథంగా ఉండటానికి గల కారణం చంచలమైన మనస్సును నిగ్రహించుకొమ్మని చెప్పటమే. ఇంద్రియాలను జయించాలన్నా ఈ దేహాన్ని అదుపులో ఉంచుకోవాలన్నా మానసిక శక్తి అనంతంగా పెరగాలి. అందుకే మనస్సును స్వాధీనంలో ఉంచుకోమని గీతోపదేశం. కాని మనస్సును స్వాధీనంలో ఉంచుకోవటం చాలా కష్టమైన పని.మనస్సు యొక్క చంచలత్వాన్ని గ్రహించిన అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మతో ఈ విధంగా అంటాడు.

"చంచలం హి మనః కృష్ణ ప్రమాది బలవదృఢమ్
తస్యా2హం నిగ్రహం మన్యేవా యోరివ సుదుష్కరం" (గీత. 6-34శ్లో)

(కృష్ణా ! మనస్సు చాలా చంచలం, బలవత్తరం. సంక్షోభకరం. అట్లాంటి మనస్సును నిగ్రహించడం వాయువును నిరోధించడం లాగా దుష్కరం గదా !)

ఆత్మ నిర్దేశం ప్రకారం మనస్సు, మనసు స్వాధీనంలో ఇంద్రియాలు, ఇంద్రియాలవల్ల దేహం, సక్రమమార్గాన ప్రవర్తించాలనే ఆలోచనా విధానం మనకు భగవద్గీతలో కనిపిస్తుంది.

## 1.3 మనోవిజ్ఞాన శాస్త్రం- పాశ్చాత్యుల సిద్ధాంతాలు.

మనోవిజ్ఞాన శాస్త్ర నిర్వచనం ఈ విధంగా ఉంటుంది. " మనోవిజ్ఞాన శాస్త్రమనగా మానవుల-జంతువుల ప్రవర్తనను గురించి తెలిపే శాస్త్రం."[5]

పాశ్చాత్య మనో వైజ్ఞానికులు 'మానవుని ప్రవర్తనను' తెలుసుకోవటానికి సాధారణంగా ప్రయోగశాలల్లో జంతువులమీద ప్రయోగాలు చేసి వాటి ప్రవర్తన ద్వారా గుర్తించిన లక్షణాలతో మానవుని ప్రవర్తనకు సమన్వయం చేసి చూస్తారు.ఆ ప్రవర్తనలో వెల్లడైన అంశాలతో మానవుని ప్రవర్తనకు కొన్ని నిర్దిష్టమైన అంశాలను ప్రకటిస్తారు.ఈ విధంగా ప్రవర్తన ఆధారంగా విస్తారంగా పెరిగిపోయిన శాస్త్రం 'మనోవిజ్ఞాన శాస్త్రం".ఇందులో అనేక భాగాలున్నా ముఖ్యంగా ఈ పరిశోధనకు తోడ్పడేవి, మనోవిశ్లేషణ సిద్ధాంతాలు.

మానసిక రోగుల చికిత్సా విధానంలో పరిశోధనల మూలంగా ఫ్రాయిడ్ మొదలైన

5. మనోవిజ్ఞాన పరిచయం. పుట. 2.

వారి విశ్లేషణ వల్ల అనేక మనోవిశ్లేషణ సిద్ధాంతాలు వెలుగులోకి వచ్చాయి.కాని సాహిత్య పరంగా ఎక్కువగా ప్రచారంలోకి వచ్చి రచనలో,విమర్శలో,విశ్లేషణలో,ఎక్కువగా ఉపయోగింప బడుచున్నవి మాత్రం ఫ్రాయిడ్,ఆడ్లర్,యూంగ్ ల మనోవిశ్లేషణ సిద్ధాంతాలే. వాటినే ఈ సిద్ధాంత వ్యాసంలో గ్రహించి వివరించటం జరిగింది.అవి

(అ) కామేచ్ఛా సిద్ధాంతం.

(ఆ) ప్రయోజనతా వాద సిద్ధాంతం.

(ఇ) జాతీయవాద సిద్ధాంతం.

(ఈ) అస్తిత్వ వాద సిద్ధాంతం.

## (అ) కామేచ్ఛా సిద్ధాంతం.

సిగ్మండ్ ఫ్రాయిడ్ (1856-1939), అనేక ప్రయోగాల అనంతరం తాను కనుగొన్న విషయాలను మొట్టమొదటిసారిగా 1900 సంవత్సరంలో ప్రచురించిన"The Interpretation of Dreams అనే" గ్రంథంలో వెలువరించాడు"[6] ఈ గ్రంథంలో ఆతడు కనుగొన్న మానసిక స్థితులు,పేర్కొన్న మనోవిశ్లేషణ మార్గాలు,చాలామందిని ఆకర్షించాయి.ఈ గ్రంథం గొప్ప సంచలనాన్ని కలిగించింది ఫ్రాయిడ్ భావనలన్నీ పూర్తిగా వ్యక్తియొక్క కామేచ్ఛకు వర్తించటంవల్ల దీనిని కొందరు "కామేచ్ఛా సిద్ధాంతంగా"గుర్తించారు.అంతేగాక వ్యక్తి ప్రవర్తనలో అచేతన ప్రక్రియలకు గల స్థానాన్ని గుర్తించి అవి పూర్తిగా లైంగిక సహజాతాలకు చెందినవని చెప్పటం,మూర్తిమత్వ వికాసంలో ముఖ్యంగా బాల్యంలోని శైశవ కాముకతను ప్రధానంగా చూపటం,మానవ జీవితంలో లైంగిక కారకాలకున్న ప్రమేయాన్ని ఎత్తి చూపటం,స్వప్న విశ్లేషణంలో,స్వేచ్ఛా సంసర్గంలో, స్వైరకల్పనలో కామేచ్ఛను గుర్తించటం, వ్యాకులతకు ఎక్కువగా లైంగికతనే కారణంగా పేర్కొనటం, మొదలైన విషయాలవల్ల కూడా ఇది "కామేచ్ఛా సిద్ధాంతంగా" వ్యవహరింపబడింది.

### 1. చేతనా చేతన స్థితులు.

ఫ్రాయిడ్ అనేక ప్రయోగాలవల్ల మొదట మనిషిలో నిగూడంగా ఉండి ప్రవర్తనకు మూలకారణమైన అచేతన మానసిక స్థితిని (Unconcious State) కనుగొన్నాడు. దీనిని చేతన మనస్సు( Conscious Mind ), ప్రాక్ చేతనమనస్సు (Pre Conscious Mind), అచేతన మనస్సు( Unconscious Mind) అని మూడు భాగాలుగా పేర్కొన్నాడు

వ్యక్తియొక్క ప్రవర్తనకు కేంద్రంగా నిలిచేవి అచేతన మానసిక ప్రక్రియలని ఫ్రాయిడ్ భావన.వ్యక్తి మనస్సు ఎల్లప్పుడూ పైవాటిలో ఏదో ఒక స్థితిలో ఉండటం సంభవిస్తుంది.అనగా వ్యక్తియొక్క మానసిక క్రియాకలాపాలు,ఆలోచనలు,ఉద్వేగాలు,ఉత్ప్రేరణలు,మొదలైనవి ఏవైనా

---

6.అపసామాన్య మనోవిజ్ఞాన శాస్త్రం పుట. 67.

కొన్ని చేతనస్థితిలోను,కొన్ని అచేతనస్థితిలోను,మరికొన్ని ప్రాక్‌చేతనస్థితిలోను ఉండవచ్చు. ఈ విధంగా మనస్సును మూడు పొరలుగా ఊహించి వాటిని ఈక్రింది విధంగా విరించాడు.

**చేతనస్థితి. Conscious State.**

ఇదే జాగ్రదవస్థ. వ్యక్తి మెలకువగా ఉండి తనమనస్సును దేనిమీద లగ్నంచేసి దానిని గమనిస్తాడో అది అతని చేతన మనస్సు.వ్యక్తి జాగ్రదవస్థలో ఏ విషయం మీదనైనా కొద్దిసేపు మనసు లగ్నంచేసి అనుభవాన్ని పొందుతాడు.ఆ విధంగా పొందిన అనుభవం వెంటనే ప్రాక్‌చేతనంలోకి వెళ్ళిపోతుంది.ప్రాక్ చేతనంలోని అనుభవం కొద్దిసేపుండి అచేతనం లోకి జారుకున్నా తలచుకున్నపుడు తిరిగి చేతనంలోకి రావచ్చు.ఈ విధంగా ప్రతివ్యక్తి శైశవ దశనుండి జాగ్రదవస్థలో గ్రహించిన అనుభవం,జ్ఞానం ప్రాక్ చేతనంలోకి వెంటనే అచేతనంలోకి వెళ్ళిపోతూ ఉంటుంది.ఈ ప్రక్రియ మెలకువగా ఉన్నంతసేపూ జరుగుతూనే ఉంటుంది.

**ప్రాక్ చేతన స్థితి. Pre conscious State.**

వ్యక్తి జాగ్రదవస్థలో గ్రహించిన అనుభవం,జ్ఞానం,మొదలైనవి ప్రాక్ చేతనంలో నిలువ ఉంటాయి.ఈ విధంగా వ్యక్తి తన జీవితంలో అనుభవించిన,చూచిన,విన్న,చదివిన విషయాలన్నీ ప్రాక్‌చేతనంలో నిలువ ఉండి సమయం వచ్చినపుడు వ్యక్తి ప్రయత్నంతో జ్ఞాపక శక్తిద్వారా చేతన స్థితిలోకి వస్తాయి.ఈ విధమైన జ్ఞాపకశక్తిని వ్యక్తి శైశవంనుండి అభివృద్ధి చేసుకుంటాడు. అనగా ప్రాక్‌చేతనాన్ని అభివృద్ధి చేసుకుంటూ అందులోని విషయాలను వెంటనే స్ఫురించేటట్లు అభ్యాసం చేస్తాడు.ఇటువంటి అభ్యాసం లేకపోతే చాలా విషయాలు ప్రాక్ చేతనంలోనుండి కాలం గడిచే కొద్దీ క్రమంగా అచేతన స్థితిలోకి జారుకుంటాయి.

**అచేతన స్థితి. Unconscious State.**

వ్యక్తి పుట్టుకతో వచ్చే ఆనువంశిక లక్షణాలు,పెరుగుదలలో అజ్ఞాతంగా ముద్రించుకపోయిన దుర్దమ భావాలు,విపరీతమైన భయాలు,వ్యాకులత కలిగించే లక్షణాలు,చేతనస్థితిలో నుండి దమనం చేయబడిన లైంగిక కోరికలు,అసభ్యమైన ఆలోచనలు,కాంక్షలు,ద్వేషాలు, మొదలైన వెన్నో అచేతన మనస్సులో ఉంటాయి. ఫ్రాయిడ్ ఈ అచేతన మనస్సుకు పెద్ద స్థానమిచ్చాడు.వ్యక్తి ప్రవర్తనకిదే మూలమన్నాడు.సహజాతాలు,ప్రేరణలు,ఉత్తేజాలు,లైంగిక కారకాలు,ఈ అచేతనంలోనే ఉంటాయి.ఒక వ్యక్తి తన అజ్ఞాతదశలో(శైశవం)పొందిన ఎడిపస్ కాంప్లెక్స్(Oedipus complex)అనగా బాలునికి తల్లిని పొందాలనే భావన, ఎలెక్ట్రా కాంప్లెక్స్ (Electra complex.) అనగా కూతురికి తండ్రిని పొందాలనే భావన అచేతన మనస్సులో ఉండి ఆ వ్యక్తి ప్రవర్తన మీద ప్రభావం చూపిస్తాయని ఫ్రాయిడ్ చెప్పిన విషయాలు శాస్త్రజ్ఞులను ఆశ్చర్యంలో ముంచాయి. కాని ఫ్రాయిడ్ భావనలు నిజమేనని ఫ్రెడిరిక్ క్రూస్ (Frederic Crews)అను నాతడు విశ్లేషించి చూపాడు.[7]

---

7. తెలుగు నవల మనోవిశ్లేషణ.పుట.28.

విపరీతమైన లైంగికేచ్ఛ,కామవాంఛ,అచేతన మనస్సునుండే వ్యక్తి పొందుతాడు. అచేతన మనస్సు లైంగిక సహజాతాలకు మూలం కావడమే ఇందుకు కారణం.అందువల్ల నిత్య జీవితంలో జాగ్రదవస్థలో ఆ వాంఛలను పైకి రానివ్వకుండా జాగ్రత పడుతూ రక్షణ తంత్రాల ద్వారా సంరక్షించుకుంటూ ఉదాత్తీకరణం పొందుతాడు. స్వప్నాలు,స్వైరకల్పనలు, అతనికి మామూల వుతాయి.ప్రతిభ గలవాడు రచనా వ్యాసంగం లేదా ఏదోఒక కళనాశ్రయించి తన అభిలాషలను తీర్చుకుంటాడు.కొందరు తమకు తాము రక్షణ తంత్రాలద్వారా కాపాడుకోలేక అచేతన మానసిక ప్రక్రియలను అదుపులో పెట్టలేక దమింపచేయబడిన కాంప్లెక్స్‌లు చేతనస్థితిలోకి రానివ్వకుండా తిరిగి దమింపచేస్తూ వాటి ప్రభావంవల్ల విపరీతమైన వ్యాకులతకు లోనై క్రమంగా మనోవ్యాధికి లేదా నాడీరుగ్మతకు గురి అవుతారు.ఈ విధంగా మానసిక రోగులు మారటానికి అచేతన మనస్సులోకి దమింపచేయబడిన అసభ్యకోరికలు,బలమైన లైంగిక కారకాలే కారణమని ఫ్రాయిడ్ తన సిద్ధాంతంలో వివరించాడు.

ఫ్రాయిడ్ మొదట ఈవిధంగా చేతనాచేతన స్థితులను గుర్తించి ఇవి పనిచేసే విధానాన్ని చెప్పటానికి వీటినే తిరిగి మానసిక ప్రక్రియలుగా ఊహించి,అచిత్తు(Id ) అహం (Ego)అధ్యహం (Super Ego)లనే పేర్లతో వ్యవహరించి వివరించాడు.

## 2. మానసిక ప్రక్రియలు.

**అచిత్తు.** (Id )-వ్యక్తిలోని అచేతన భాగమే అచిత్తుగా చెప్పబడింది.ఇది బలమైన మానసిక కార్య విభాగం.వ్యక్తి ఆహారంద్వారా పొందే శక్తి,సహజాతాల ద్వారా పుట్టే శక్తి,అంతా 'అచిత్తులో చేరి వ్యక్తి దైహిక,మానసిక కార్యకలాపాలకు మూలమౌతుంది.అందువల్ల అచిత్తే ఒక శక్తి సముద్రం.

సహజాతాలు ఎన్నో ఉన్నప్పటికి ఫ్రాయిడ్ ముఖ్యంగా రెండు వర్గాల సహజాతాలను గుర్తించాడు.అవి.1 సర్జక లేక జీవన సహజాతాలు(Life instincts). 2.మరణ సహజాతాలు( Deathinstincts ).వీటినే ఈరోస్ (Eros) థెనటోస్(Thanatos.)అంటారు.ఈ సహజాతాలన్నీ శారీరక జీవకణ సముదాయంనుండి ఉద్భవిస్తాయి.జీవన సహజాతాలు వ్యక్తి మనుగడకు ముఖ్యంగా ఆకలి,దాహం,లైంగికావసరాలు,మొదలైన వాటి విషయంలో వ్యక్తికి ప్రేరణ కలిగించి వాటిని పొందేటట్లు చేస్తాయి.వాటిని పొందకపోతే వ్యక్తి మరణిస్తాడు.కాబట్టి వాటిని అత్యవసరంగా పొందే ప్రయత్నం వ్యక్తి చేస్తాడు.ఈ జీవన సహజాతాలు మరి రెండు విధాలుగా మార్పు చెందుతాయి.1 అహం సహజాతాలు,2 లైంగిక సహజాతాలు.

1.అహం సహజాతాలు ఆకలి,దప్పులకు సంబంధించినవి.వాటి విషయంలో వ్యక్తికి ప్రేరణ కలిగించి వ్యక్తి ప్రాణరక్షణకు,మనుగడకు దోహదం చేస్తాయి.వ్యక్తి ఈ అహం సహజాతాల ప్రేరణవల్ల ఆకలిదప్పుల కవసరమైన గమ్య వస్తువులను పొంది ఆ సహజాతాలను తృప్తిపరుస్తాడు. ఈ గమ్య వస్తువులను పొందటంలో వాస్తవిక పరిస్థితులను అనుసరిస్తాడు.బాహ్య పరసరాల

ననుసరించి రాజీపడుతూ వీటిని తన తెలివి తేటలతో పొందే ప్రయత్నం చేస్తాడు.

2.లైంగిక సహజాతాలు కామేచ్ఛకు చెందినట్టివి.ఇవి జాతి సంరక్షణకు,సృష్టికార్యానికి, విపరీతమైన కోర్కెలకు,స్వార్థానికి,దుర్దమభావాలకు,మూలమై నిలుస్తాయి.వ్యక్తిలో తీవ్రమైన ప్రేరణలకు,ఉద్రేకాలకు,ఉత్తేజాలకు,మూలం ఈ లైంగిక సహజాతాలే.ఈ సహజాతాల తృప్తికి గమ్యవస్తువుతో ప్రమేయం లేకుండా వేరేదానిని ప్రతిష్ఠాపితం చేసుకోవచ్చు. అనగా ఒక వ్యక్తిలోని లైంగిక సహజాతాలు చాలా వరకు కళలద్వారా,కలలద్వారా,ఇతర వినోద కార్య కలాపాల వల్ల తృప్తి పడుతుంటాయి.

"అచిత్తు చాలా పాశవికమైంది.మొరటైంది,దీనికి మంచి,చెడు,నీతి,నియమం,లేవు. అవ్యవస్థీకృతమైంది.అహేతుకమైంది.ఒక క్రమం ఉండదు.తన సుఖం తప్ప దీనిక మరొకటి పట్టదు.తనసుఖం కోసం ఇది ఏమైనా చేస్తుంది.దీని ప్రవర్తనంతా 'స్వానురాగ' ప్రాతిపధిక మీద ఆధారపడి సాగుతుంది.అంటే తనను తాను ప్రేమించు కోవటం తప్ప ఇతరుల ఉనికిని గుర్తించటం కాని వారిని ప్రేమించటం కాని జరుగదు"[8]

అచిత్తు వ్యక్తియొక్క సుఖాన్ని,ఆనందాన్ని,కోరుతూ సహజాతాలను తృప్తి పరచటానికి ప్రేరణలను కలిగిస్తూ వ్యక్తిని ఎల్లప్పుడూ టెన్షనుకు గురిచేస్తుంది.ఈ టెన్షన్(తన్యత-ఉద్రేకం) తగ్గించు కోవటానికి వ్యక్తిఎన్నో ప్రయత్నాలు చేస్తాడు.ఈ ప్రయత్నాలే అతన్ని స్వార్థపరునిగా మారుస్తాయి.వ్యక్తిలో అమితమైన స్వార్థం రూపొందటానికి కారణం ఈ అచిత్తే. కామ,క్రోధ,లోభ మోహ.మద,మాత్సార్యాదులు,దీనినుండే ఉద్భవిస్తాయి.వీటివల్లనే వ్యక్తి ఎల్లపుడూ అచిత్తులో మునిగి ఉంటాడు.అచిత్తులోని ప్రేరణలు ఎక్కువైతే వాటిని తీర్చుకోలేని వ్యక్తి వ్యాకులతకు లోనై క్రమంగా వ్యాధిగ్రస్తుడౌతాడు.

**అహం(Ego)**- అచిత్తులో నుండి పరిణమిస్తుంది అహం.అచిత్తు కోర్కెల నిలయమే కాని వాటిని స్వయంగా తనంత తాను సాధించుకొని తీర్చుకునేది కాదు.తనకోర్కెలు తీర్చేది, తీర్చగలిగేది అహం మాత్రమే. ఈ అహం అచిత్తులోని ఒక మానసిక కార్యనిర్వాహక భాగం.అచిత్తు కోర్కెలను అనుకూలమైనవాటిని వాస్తవిక పరిస్థితుల ననుసరించి అహం తీరుస్తుంది.వ్యక్తిలో పుట్టేఅహం సహజాతాలను,లైంగిక సహజాతాలను,కార్యరూపం దాల్చేటట్లు చేయటానికి సర్వేంద్రియాలకు కావలిసిన శక్తిని అచిత్తే అందిస్తుంది.అనగా అహానికి కావాలిసిన ఏ శక్తియైనా (మానసిక,శారీరక) అచిత్తు వల్ల అందుతుంది.అహం అనునది వ్యక్తి యొక్క ప్రవర్తనను సూచించేది అందువల్ల వ్యక్తియొక్క ప్రవర్తన సాంఘిక పరిస్థితులలో ఒక విధంగా,ఏకాంతంలో మరో విధంగా, ఉంటుంది.అనగా ఈ అహం వ్యక్తియొక్క సాంఘిక ప్రవర్తనలో అచిత్తులోని ఉద్రేకాలను అణిచి, సర్దుబాటు తనాన్ని కలిగించి,వ్యక్తిని పరిసరాలకు తగినట్లుగా ప్రవర్తింపచేస్తుంది.ఏకాంతంగా

---

8.మనసు మర్మం పుట.45.

ఉన్నపుడు అహం జోక్యం లేనందువల్ల వ్యక్తి అచిత్తులోని మానసికమైన ఉద్వేగాలు,ఉద్రేకాలు ఎక్కువగా కలిగి తద్వారా ఊహలు,ఆలోచనలు,స్వైర కల్పనలు,ఎక్కువగా చోటుచేసుకుంటాయి. అచిత్తు వాంఛలను బాహ్యాపరిస్థితులలో తీర్చటానికి, అవసరమైన జ్ఞానాన్ని,ఉపాయాన్ని, నీతి,నియమాన్ని,'అచిత్తు' లో రూపొందింపబడిన 'అధ్యహం' నుండి పొందుతుంది. అనగా వ్యక్తిలో అధ్యహం అనేది జ్ఞానంగా రూపొందే మానసిక విభాగం. అధ్యహం,అచిత్తుల, మధ్య వాటి కార్య కలపాలను,వాటి ప్రేరణలతో పరిసరాల ననుసరించి నెరవేర్చేది అహం. వ్యక్తిని లోకంలోని మంచి, చెడుల,మధ్య ప్రవర్తింప చేయటం, అహం యొక్కపని.

**అధ్యహం.(Super Ego)**–మానవుడు శైశవదశనుండి పెరుగుతూ క్రమంగా పొందే జ్ఞానమంతా సంస్కార రూపంగా మనసులో నిలుపుకున్న బాగాన్ని 'అధ్యహం' అనవచ్చు. ఒక విధంగా ఇది వ్యక్తి పెరిగిన వాతావరణంలోనుండి రూపొందింపబడేది. తిరిగిన పరిసరాలు, సాంఘిక పరిస్థితులనుండి సేకరించబడింది. వ్యక్తి పొందిన విద్యతో,జ్ఞానంగా నిలువ చేయబడింది. ఇది వ్యక్తికి కుటుంబంలో,సంఘంలో,దేశంలో,నడుచుకునే విధానాలను, తెలియ చేస్తూ సాంఘిక కట్టుబాట్లకు,ఆచార వ్యవహారాలకు,సంస్కృతి సంప్రదాయాలకు,నిలయమై ఉంటుంది. వ్యక్తి లోకంనుండి పొందే జ్ఞానమేగాక,ఇందులో పూర్వజన్మనుండి,లేదా అనువంశికత ద్వారా సంక్రమించే భావాలకు,లక్షణాలకు,ప్రాధాన్యం వహిస్తుంది. కాని ఫ్రాయిడ్ దీనినంతగా ఆమోదించక వ్యక్తి నేర్చుకున్న దానికి ప్రాధాన్యమిచ్చాడు.

అచిత్తు కోర్కెలను అధ్యహం పరశీలించి అవి తగునో,తగవో,నిర్ణయించి అనుకూలమైన వాటిని తీర్చటానికి అహంను ఆదేశిస్తుంది. ప్రతికూలమైన వాటిని నిరాకరిస్తుంది ఈ నిరాకరించటం అనేది అధ్యహం యొక్క శక్తి,సామార్థ్యాలమీద ఆధారపడి ఉంటుంది. ఒక వ్యక్తియొక్క కామేచ్ఛ బలంగా ఉండి అచిత్తు ప్రేరణతో ఉన్మత్తుడై,సంస్కారహీనుడై ఉన్నా లేక అధ్యహం బలహీనమైన పక్షంలో,ఆ వ్యక్తి ఏ అనుచిత కార్యమైనా చేయవచ్చు. ఇతరులను బలాత్కరింపవచ్చు. విద్రోహ చర్యలకు పాల్పడవచ్చు,ఉగ్రవాదిగా,దొంగగా,హంతకునిగా,మారవచ్చు,మారణాయుధాల నుపయోగించి తీవ్రవాదిగా మారవచ్చు. అవనీతిపరుడు కావచ్చు. అందువల్ల వ్యక్తిలో 'అధ్యహం' ప్రాముఖ్యం ఎంతోఉంది. ఇది వ్యక్తిలో సంస్కారాన్ని కలిగింప చేస్తుంది. కాబట్టి వ్యక్తి పుట్టిపెరిగిన వాతావరణం,నేర్చుకున్న విద్య,సంస్కృతి,మొదలైనవే వీటికి మూలమౌతాయి. విభిన్న సంస్కృతుల మధ్య పెరిగిన వ్యక్తుల ప్రవర్తనలలో మార్పులు కలగటానికి గల కారణం ఆయావ్యక్తులలో రూపొందింపబడిన సంస్కారవిశేషమే.

ఈ అధ్యహాన్ని ఫ్రాయిడ్ తిరిగి రెండు విధాలుగా చూపించాడు. అంతరాత్మ, ఆదర్శాహం వ్యక్తి యొక్క నైతికవిలువలకు,కట్టుబాట్లకు,సంస్కారానికి,ఆధారం అంతరాత్మ కాగా, వ్యక్తియొక్క ఆదర్శవంతమైన జీవితానికి మార్గం చూపించేది ఆదర్శాహం. అనగా వ్యక్తి నైతికంగానూ,

ఆదర్శంగానూ,ఉండటానికి 'అధ్యహం' ఎల్లపుడూ పనిచేస్తూ ఉంటుంది.

## 3. మూర్తిమత్వ నిర్మాణం.

ప్రతి వ్యక్తియొక్క మూర్తిమత్వం(Personality)బాల్యంలోనే రూపొంది,అదే విస్తరించి, వ్యక్తి ప్రవర్తనలో జోక్యం చేసుకుంటుందని,అందువల్ల ప్రతి వ్యక్తి బాల్యావస్థ చాలా ముఖ్యమైందని ఫ్రాయిడ్ భావించాడు.

"ఫ్రాయిడ్ మతంలో మూర్తిమత్వ నిర్మాణ వికాసానికి రెండు పునాదులున్నాయి. 1. చిన్ననాటి అనుభవాలు,అతడు పెద్దయిన తర్వాత అవి అతని మీదెంతో ప్రభావాన్ని చూపుతాయి. 2.పుట్టేటప్పుడు శిశువులో కొంతమోతాదులో కామేచ్ఛాశక్తి(లిబిడో) ఉంటుంది. ఈ లిబిడోశక్తి శైశవంనుండి యవ్వనం చేరేలోపల వ్యక్తియొక్క నాలుగు ముఖ్యమైన మనోలైంగిక దశలగుండా క్రమంగా ఆయా కేంద్రాలద్వారా అభివ్యక్తమౌతూ వికసిస్తుంది.వ్యక్తి పెరిగే కొలది ఒక్కొక్క దశలో శరీరంలో ఒక్కొక్క కేద్రం కామోద్దీపన కేంద్రంగా ప్రాముఖ్యం వహిస్తుంది."[9]

మూర్తిమత్వ నిర్మాణం,మూర్తిమత్వ వికాసంతోనే రూపొందుతుందనే భావనతోనే ఫ్రాయిడ్ బాల్యావస్థలోని దశలకు ప్రాముఖ్యమిచ్చాడు.

"వ్యక్తి శారీరకంగా పెరిగినట్లే మానసికంగా పెరుగుతాడు. ఈ పెరుగుదల శైశవం, బాల్యం,కౌమారం,యవ్వనం,దశలగుండా జరుగుతుంది.ఒకసారి ఈ నిచ్చెనమెట్లలో ఏదో మెట్టు వద్ద పెరుగుదల ఆగిపోయి తరువాత మెట్టును చేరలేక పోవచ్చు.అప్పుడా వ్యక్తి ఆ మెట్టువద్ద 'గిటకబారి' పోయాడంటారు.ఇదే మాదిరిగా పెరుగుదల ఆగిపోయి,ఎవరైనా మానసికంగా 'గిటకబారి'పోతే 'స్థిరీభవనం"(Fixation) చెందాడంటారు.స్థిరీభవనం పొందిన వ్యక్తి సంకట పరిస్థితులు ఎదురైనపుడు పాతవిధానాలను అంటే ఏ మెట్టుదగ్గర పాతుకు పోయాడో ఆ దశయందున్న విధానాలను ఉపయోగిస్తాడు."[10]

వ్యక్తి పెరుగుదలలో స్థిరీభవనం పొదకుండా ఉంటే ఆ వ్యక్తియొక్క మూర్తిమత్వ వికాసం సహజంగాఉండి ప్రవర్తనను సహజరీతిలో ఉంచుతుంది. ఆ విధంగా కాక శైశవంనుండి యవ్వనం దాకా వివిధ దశలలో ఏ దశలోనైనా స్థిరీభవనం పొందితే ఆ వ్యక్తిలో కొన్ని విచిత్రమైన అలవాట్లు చోటుచేసుకుంటాయి. ఈస్థిరీభవనం ఎక్కువగా శైశవదశలో జరుగుతుంది.కాబట్టి వ్యక్తికి తెలియ కుండానే ఇటువంటివి జరిగి పెరిగి పెద్ద కాగానే తర్వాత ఎప్పుడో ఒకప్పుడు ఆతని ప్రవర్తనలో బయటపడుతుంటాయి.అందువల్ల ప్రతివ్యక్తికి భిన్నమైన ప్రవర్తనలను కలుగచేసే ఈ లిబిడోశక్తి అజ్ఞాత దశలోనే ఆయా వ్యక్తులలో స్థిరీభవనం పొంది విచిత్రమైన ప్రవర్తనలకు మూల మౌతుంది

## 4 ప్రవర్తన గతిశీలత.

ప్రవర్తనను ప్రభావితంచేసే కారణలేవి?ప్రవర్తన ఏ విధంగానైనా ఎందుకు మార్పు

9. మనసు మర్మం పుట. 45. 10..మనసు మర్మం. పుట. 85.

చెందుతుంది?మొదలైన వాటికి ఫ్రాయిడ్, శక్తియొక్క గతిశీలత ప్రాధాన్యాన్ని చూపాడు.వ్యక్తిలో ఉండే అచిత్తు,అహం,అధ్యహం అనే మూడు మానసిక వ్యవస్థలు పనిచేయటానికి శక్తి అవసరం. ఫ్రాయిడ్ దృష్టిలో మానవుడొక పెద్ద శక్తివ్యవస్థ.మానవునిలో జీవరసాయన సంబంధ ప్రక్రియలవల్ల శక్తి జనిస్తుంది.ఈ శక్తి నశించదు.రూపాంతరం చెందుతుంది.శారీరక ధర్మాలను నెరవేర్చే శక్తి, మానసిక కార్యాలైన ఆలోచన మొదలైన వాటిని నెరవేర్చే శక్తి ఈ రెండు శక్తులుభిన్నమైనవి కావు ఏ పనిచేయటానికైనా కావలిసింది శక్తి.ఒకేశక్తి రెండింటికి ఆధారమౌతుంది మనం తినే ఆహారం వల్ల శక్తి విడుదల అవుతుంది.ఈ శక్తి దైహిక కార్యకలాపాలకు వినియోగ మౌతుంది.ఈ దైహికశక్తే ఆలోచించేటపుడు,జ్ఞాపకం చేసుకునేటపుడు,ఇంకా వివిధ రకాలైన మానసిక క్రియా కలాపాలకు మానసిక శక్తిగా మారుతుంది.

"మానసిక శక్తి శారీరకశక్తిగానూ,శారీరకశక్తి మానసికశక్తిగానూ,రూపాంతరం చెందవచ్చు.శక్తిని ప్రోగుచేసుకోవచ్చు,దాచుకోవచ్చు,విసర్జించవచ్చు,వృధాచేయవచ్చు,కాని నాశనం మాత్రంచేయలేము.మనోవిశ్లేషణ సిద్ధాంతంలో ఇది చాలా ముఖ్యమైన భావన.అచిత్తు మానసిక శక్తికి,శారీరకశక్తికి మధ్య వంతెనవంటిది.అంటె అచిత్తులోనే మానసిక ప్రక్రియలకు కావాల్సిన శక్తిఅంతా గర్భితమై ఉంటుంది."[11]

సహజాతాలవల్ల కూడా శక్తి పుడుతుంది."శరీరంలోనున్న ఉత్తేజానికి మానసికమైన ప్రతిరూపమే సహజాతం"[12].సహజాతాలు శారీరక ప్రక్రియలకు మానసిక సహవర్తులు. మానసికమైన దానిని 'అభిలాష లేక కోరిక'అంటే,శారీరకమైన దానికి 'అవసరం అనవచ్చు.ఆకలి శారీరక అవసరమైతే తినాలనే 'అభిలాష' మానసికమైనది.సహజాతాలు శారీరక జీవకణ సముదాయం నుండి ఉద్భవిస్తాయి.ఇది అవసరదశ.ఈ అవసరాలు తీరటానికి తగిన మానసిక అభిలాషలుగా మార్పు చెందుతాయి.ఈ అభిలాషలే ప్రవర్తనను తగు విధంగా ప్రేరేపించి సహజాతం తృప్తి పడేటట్లు చేస్తాయి.ప్రతి సహజాతానికి కొంతశక్తి ఉంటుంది.సహజాతాలన్నీ కలిస్తే మానసిక శక్తి సర్వస్వం ఏర్పడుతుంది.అచిత్తు ఈ శక్తికి స్థానం.

మానవుని ప్రవర్తనకు మూలకారణం అచిత్తు,అహం,అధ్యహం అనే మానసిక ప్రక్రియలే అయినా వాటిలో పుట్టిన సహజాతాల ప్రేరణశక్తి మూలమై నిలుస్తుంది.అహం సహజాతాలు కేవలం దైహిక కార్యాలకు,నియతమై ఉండి మానవుని కనీసావసరాలకు నిబద్ధుని గావించి ప్రవర్తంప చేస్తాయి.కాని లైంగిక సహజాతాలు మాత్రం మానసిక ప్రక్రియలకు మూలమై నిలుస్తాయి.ఆకలిదప్పులకు సంబంధించిన అహం సహజాతాలు అవి లభించగానే తృప్తిపడి ఊరుకుంటాయి.కాని లైంగిక సహజాతాలు,గమ్య వస్తువు తొందరగా వ్యక్తికి లభించక పోవటంవల్ల, అవి మానసికంగా వ్యక్తికి ఉద్రిక్తలను కలిగించి,వ్యక్తి విచిత్రంగా ప్రవర్తించటానికి పూనుకుంటాయి.

11,12, అపసామాన్య మనోవిజ్ఞాన శాస్త్రం పుట. 73.

ఫ్రాయిడ్ లైంగిక సహజాతాలకు అమిత ప్రాధాన్యమిచ్చాడు. ఇవి జాతి సంరక్షణకు మూలమన్నాడు. సంస్కృతికి,నాగరికతకు,కళలకు,సృజనత్వానికి,విజ్ఞాన, వినోద,వికాస, శాస్త్రాలకు,ఈ లైంగిక సహజాతాలే కారణమన్నాడు.లైంగిక సహజాతాలను ఉదాత్తీకరణం చేయటం ద్వారా మానవుడు వీటన్నింటిని సాధించ గలిగాడని వివరిస్తాడు..

ప్రవర్తనంతా శక్తి గతిశీలత మీద అధారపడి ఉంటుంది.ఈ శక్తి మానవునిలో సహజాతాల వల్ల,జీవరసాయన క్రియలవల్ల జనిస్తుంది.అమితంగా పుట్టే ఈ శక్తి దైహిక కార్యాలకు కొంత వినియోగం కాగా మిగతాదంతా అచిత్తులో పోగుపడి ఉంటుంది.అట్లా పోగుపడిన శక్తి లైంగిక సమజాతాలకు మూలమై నిలుస్తుంది.మానవుడు దైహికమైన అవసరాలకన్నా అధికంగా లైంగిక సహజాతాలవల్లే ప్రేరణలెక్కువగా పొందుతాడు.వాటిని ఉదాత్తీకరణం గావించు కొని ఎన్నో విధాలుగా మలచుకొని సంఘంలో విశిష్టవ్యక్తిగా రూపొందె ప్రయత్నం చేస్తాడు.ఈ ప్రయత్నం ఆదర్శంగా,నిస్వార్ధంగా, ఉండవచ్చు,లేదా స్వార్ధంగా ఉండవచ్చు.ఈ విధంగా వ్యక్తి ప్రవర్తన శక్తి గతిశీలత మీద ఆధారపడి ఉంటుంది.

## 5. సర్దుబాటు పద్ధతులు.

సామాన్యంగా వ్యక్తులు సంఘంలో ప్రవర్తించేటపుడు సర్దుబాటు తనాన్ని పాటిస్తారు. కాని కొన్ని అసాధారణ పరిస్థితులలో కొందరు సర్దుబాటుతనాన్ని పొందలేక పోవచ్చు. వ్యాకులతకు,భయానికి,లొంగవచ్చు. అట్ట పరిస్థితులలో సర్దుబాటు పొందలేని వ్యక్తులు క్రమంగా నాడీ రుగ్మతలకు పాల్పడవచ్చు.అటువంటి పరిస్థితులు రాకముందే సాధారణంగా వ్యక్తులందరూ ఆయా వ్యక్తులకు పనికివచ్చే సర్దుబాటు పద్ధతులను అలవాటు చేసుకుంటారు. ఆ సర్దుబాటు పద్ధతులను ముఖ్యంగా నాలుగు విభాగాలుగా చేయవచ్చు.అవి 1 తాదాత్మ్యీకరణం. 2 వ్యత్యయీకరణం 3 ఉదాత్తీకరణం. 4.రక్షణయంత్రాలు.

## 1. తాదాత్మ్యీకరణం.Identification

ఇందులో అనుకరించటం,తనను తాను గొప్పగా చిత్రించు కోవటం,లేదా తనగుణాలే లేక అభిరుచులే కలిగిన వ్యక్తులతో స్నేహం చేయటం,సాంఘీకరణం పొందటం,అనగా సామాజిక కట్టుబాట్లకు లొంగటం,మొదలైన వాటితో తాదాత్మ్యం చెంది తన వ్యాకులతను, భయాన్ని పోగొట్టుకుంటాడు.మూర్తిమత్వ నిర్మాణంలో ఈ తాదాత్మ్యీకరణం బాల్యావస్థలో ఏర్పడుతుంది. బాలికలు తల్లివలె పనిచేయటం,బాలుడు తండ్రివలె నడుచుకోవటంతో మొదలౌతుంది.తదుపరి స్నేహితుల ప్రవర్తనల వల్ల మరికొన్ని అనుకరణలు,అలవాట్లు, నేర్చుకొని వాటితో తన అభిలాషలను తీర్చుకుంటాడు.

## 2.వ్యత్యయీకరణం లేక విస్థాపిత దౌర్జన్యము.Displaced aggression

సహజాతానికి మూలంగా లక్ష్యం,వస్తువు,తీవ్రత,అనే అక్షణాలున్నాయి. వీటిలో

వస్తువులను తప్ప దేనిని మార్చలేము. శరీరంలో టెన్షన్(తీవ్రత) పెరిగినపుడు దాన్ని తగ్గించటానికి సరైన వస్తువును అందిస్తాం. ఆ వస్తువు లభించకపోతే దానికి బదులుగా మరో వస్తువును అందించి టెన్షన్‌ను తగ్గిస్తాం. ఈ విధంగా ఒక వస్తువు పైకి పంపిన మానసిక శక్తి మరోవస్తువు పైకి మరల్చటమే 'వ్యత్యయీకరణం.' 'అత్తమీది కోపం దుత్తమీద చూపినట్లు.' 'ఆఫీసర్ మీది కోపం భార్యమీద చూపినట్లు.' 'భార్యమీది కోపం పిల్లలమీద చూపినట్లు'. వ్యక్తిలోని టెన్షన్ అసలు వాటిమీద గాక తనకనుకూలమైన తనకు లోబడిన వాటిమీదకు మరల్చి తనలోని తీవ్రతను తీర్చుకోవటమే వ్యత్యయీకరణం. సాధారణంగా వ్యక్తులు సహనాన్ని కోల్పోయినపుడు, తీవ్రంగా ప్రేరణలకు గురి అయినవారు తమ వ్యాకులతను పోగొట్టుకోవటానికి ఈ పద్ధతులను పాటిస్తారు. దీనినే విస్థాపిత దౌర్జన్యమంటారు.

## 3. ఉదాత్తీకరణం. Sublimation

అన్నిటికంటె ఉన్నతమైన, ఉత్తమమైన, మార్గం ఉదత్తీకరణం. సహజాతాలవల్ల ముఖ్యంగా లైంగిక సహజాతాలవల్ల పుట్టే కామేచ్ఛాశక్తిని అసలు వస్తువులపై గాక ప్రత్యామ్నాయంగా మరో ఉదాత్తమైన వస్తువుపై లేక మార్గం వైపు మరల్చటమే ఉదాత్తీకరణం. నిజ జీవితంలో యదార్థ లైంగిక తృప్తి పొందలేనివారు, కళలకు, సంగీతానికి, కాల్పనిక సృష్టికార్యాలకు, లలిత కళలకు మొ॥ ఉన్నత మార్గాలవేపు మనసును మళ్ళించి తమలోని తీవ్రతను, ఉద్రిక్తతను, తగ్గించు కుంటారు. అచిత్తులో పుట్టే ప్రాక్తన (ఆదిమ భావాలు) వాంఛలను ఈ విధంగా దారి మళ్ళించి రచనా మార్గంలో, కళామార్గంలో, సామాజిక సేవా మార్గంలో, ఉదాత్తీకరించి తమ మానసిక శక్తిని ఉన్నత మార్గాలలో ప్రసరింప చేయకపోతే నాగరికతే లేదన్నాడు ఫ్రాయిడ్. ఈనాటి విజ్ఞాన విశేషాలకు, కళలకు, సంస్కృతికి, శాస్త్రాభివృద్ధికి, సాహిత్యానికి, సంగీతానికి, ఈ ఉదాత్తీకరణమే మూలమన్నాడు ఫ్రాయిడ్ ,(చూడు. మనసు-మర్మం. పుట 71)

## 4. రక్షణ తంత్రాలు. defence mechanism.

లైంగిక సహజాతాలు పుట్టించే ఉద్రిక్తలను అణచుకోవటానికి వ్యక్తి ఎన్నో ప్రయత్నాలు చేస్తాడు. ఇందులో దమనం, ప్రక్షేపణం, యుక్తీకరణం, స్వైరకల్పన, ప్రతీపగమనం, మొదలగునవి కూడా సహాయపడతాయి.

వాస్తవంగా బాహ్యపరిస్థితులలో తీరని ఎన్నో కోరికలు మనసును కలిచి వేస్తుంటాయి. అట్టి కోరికలను, అసభ్యమైనవాటిని, 'అచేతనంలోకి నెట్టివేయటం' దమనం అంటారు. ఈ దమన ప్రక్రియను వ్యక్తి ఎల్లపుడూ అనగా జాగ్రదవస్థలో పాటిస్తునే ఉంటాడు. ఏకాంతలో, నిదురలో, దమన ప్రక్రియద్వారా దమింపబడిన కోర్కెలు పైకి వచ్చే ప్రయత్నం చేస్తాయి. అవే కలల రూపంలో వ్యక్తికి దర్శనమిస్తాయి. అందువల్లనే ఫ్రాయిడ్ కలలను దమిత వాంఛా పూరితాలన్నాడు. (ఎంతో

టెన్షనుకు గురిఅయిన వ్యక్తి కూడా ఈ కలలద్వారా సహజమైన సర్దుబాటు తనాన్ని పొందగలుగు తున్నాడు).

వ్యక్తులలో కొందరు తమ లోపాలను,తప్పులను,ఉద్దేశాలను,ఎదుటివారికి అంటగట్టి వారిలో చిత్రించి చూపిస్తారు.దీనిని ప్రక్షేపణం అంటారు.'అందని ద్రాక్షపండ్లు పుల్లన' 'తాను ఉత్తీర్ణుడు కాకపోతే మాస్టారుదే తప్పు' మొ॥వాటి విధంగా వ్యక్తి తాను పొందలేని దానిని ఏదో విధంగా యుక్తితో సమాధానం పరచుకోవటం 'యుక్తీకరణం' అనబడుతుంది.పగటి కలలద్వారా, ఊహలద్వారా,తీయని ఆలోచనలద్వారా,తీపి గుర్తులద్వారా,కాలక్షేపం చేస్తూ వ్యాకులతను మరిచిపోయి సర్దుబాటు తనాన్ని తెచ్చుకోవటం 'స్వైరకల్పన'అనబడుతుంది.తన మీదికి,తన సమస్యలమీదికి, మనస్సును మరల్చుకొని ఊహల్లో తేలిపోవటం,"ప్రతీపగమనం" అంటారు.అనగా వెనుకకు వెళ్ళిపోవటం.సాదారణంగా కొందరు తీవ్రపరిస్థితులు ఎదురైనపుడు తమకు తెలియ కుండానే 'శైశవదశకు' చేరుకుంటారు.గట్టిగా ఏడ్వడం,చిన్ని పిల్లాడిలా కొట్టుకోవటం,గోళ్ళు కొరకటం,వేలు చీకటం,మొ॥నవి చేస్తుంటారు.అంతేగాక మనో వైజ్ఞానికులు మరో విషయం కూడా చెప్తారు.ప్రతి వ్యక్తి రహస్యంగా తనకు తెలియకుండానే శైశవదశకు చేరుకోవాలని ,ముఖ్యంగా గర్భస్థదశ అంటే స్వర్గం అని భావించి వ్యక్తులు చాలావరకు ప్రతీపగమనంద్వారా బాల్యావస్థకు చేరుకోవాలని ప్రయత్నిస్తుంటారు.

"ఏది ఏమైనప్పటికి 20వ శతాబ్ది ప్రారంభ దశలోనే నవలా సాహిత్యాన్ని కొత్తమలుపు తిప్పి విమర్శకు నూతన మార్గాన్ని చూపిన ఖ్యాతి మనోవిశ్లేషణకు,మనో విశ్లేషణ సిద్ధాంతాలకు, మనోవిశ్లేషణ సిద్ధాంత ప్రతిపాదకుడు సిగ్మండు ఫ్రాయిడ్‌కు దక్కింది.'[13] అని విద్యేశ్వరిగారు పేర్కొన్నారు.ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం కొందరికి ఆమోదయోగ్యం కాకపోయినా అది సాహిత్య,కళారంగాలలో, మానసిక చికిత్సా విధానంలో అతి ప్రాచుర్యం పొందిందని చెప్పవచ్చు.

## (ఆ) ప్రయోజనతా వాద సిద్ధాంతం.

డా॥ ఆల్‌ఫ్రెడ్ ఆడ్లర్,క్రీ.శ. 1902-1908 వరకు ఫ్రాయిడ్‌తో కలిసి మానసిక రోగులకు చికిత్స చేస్తూ మనోవిశ్లేషణపై అనేక ప్రయోగాలు నిర్వహించాడు. కొంతకాలం వియన్నా మనోవిశ్లేషణ సంస్థకు అధ్యక్షుడుగా పనిచేసాడు.ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం ఈతనికి బాగా నచ్చింది.కాని ఫ్రాయిడ్ ఉద్దేశించిన 'శైశవకాముకతను ' 'ఎడిపస్, ఎలెక్ట్రా,కాంప్లెక్సులను నిరాకరించాడు.అంతేగాక నరాల బలహీనతలకు సెక్సువాంఛ ముఖ్య కారణమనే ఫ్రాయిడ్ ప్రధాన సూత్రాన్ని ఆడ్లర్ వ్యతిరేకించాడు.సెక్సువాంఛ అనేది రెండవ స్థానం మాత్రమే వహిస్తుందని, మనిషి జీవితంలో సంఘర్షణ ఏర్పడటానికి అనుల్లంఘనీయము, బలవత్తరము, అయిన అంతః

13. తెలుగు నవల మనోవిశ్లేషణ.పుట. 24.

ప్రేరణలే కారణమని ఆడ్లర్ భావించాడు. ఆడ్లర్‌కూడా వ్యక్తియొక్క బాల్యావస్థకే ప్రాముఖ్యమిచ్చాడు. కాని బాల్యంనుండి పెరుగుతున్న బిడ్డలో ఏర్పడే 'న్యూనతా భావాలే' ఆ బిడ్డ పెరుగుదలకు, ఆధిక్యతార్జనకు,ఉపయోగపడతాయన్నాడు. తాపత్రయంతో బిడ్డ ఎదుగుతుంది కాబట్టి న్యూనతా, ఆధిక్యతలతో ఒక ప్రయోజనాన్ని ఆశించి పెరుగుదలతో ఆరంభమైన శైశవ జీవితమే ముఖ్యమైనదని,ప్రతి వ్యక్తి జీవితంలో 'ప్రయోజనం' ఆశించే ఆతని ప్రవర్తన కూడా అట్లే కొనసాగుతుందని చెప్పటంవల్ల దీనికి "ప్రయోజనతా వాద సిద్ధాంతం"అనే పేరు వచ్చింది.

"ప్రయోజనతా వాదము,ఆడ్లర్,రోజర్ సిద్ధాంతాలలోను,అస్థిత్వ సిద్ధాంతాలలోను, ప్రయోజనానికే ప్రముఖస్థానమున్నది. ఇతర సిద్ధాంతాలలో దీనిని గురించిన ఆమోదం కాని నిరాదరణ కాని కనిపించదు."[14]

ఫ్రాయిడ్‌తో వేరుపడ్డ ఆడ్లర్ 1911లో తనదైన "వైయక్తికమనోవిజ్ఞానశాస్త్రం" అనే గ్రంథాన్ని వెలువరించాడు. ఇందులో ఆడ్లరు వెలిబుచ్చిన అభిప్రాయాలు చాలా వరకు 'ప్రయోజనం' ఆశించి ఉండటంవల్ల ఇది "ప్రయోజనతావాద సిద్ధాంతంగా"వ్యవహరింపబడింది.

ఆడ్లరు తన సిద్ధాంతాన్ని ముఖ్యంగా ఈ క్రింది అంశాలపై కేంద్రికరించి చెప్పాడు.

1) మానవుడు సహజంగా సంఘజీవి. సాంఘికాభిరుచి అనేది వ్యక్తికి జన్మతః లభించే లక్షణం. మానవుని జీవితంలో లైంగిక కారకాలకన్న సాంఘిక కారకాలకే ప్రాధాన్యముంటుంది.

2) అనువంశికత,పరిసరాలు,ఈ రెండేగాక సృజనాత్మక ఆత్మ కూడా మానవుని జీవితాన్ని ప్రవర్తనను,ప్రభావితం చేస్తుంది.

3) మానవుని మూర్తిమత్వం అద్వితీయమైనది. ఏ ఇద్దరి వ్యక్తుల మూర్మిమత్వాలు ఒకే విధంగా ఉండవు.

4) అచేతన మానసిక ప్రక్రియలకంటె వ్యక్తి ప్రవర్తలో చేతన మానసిక ప్రక్రియలే పాల్గొంటాయి.

## 1. ప్రయోజనత.

ప్రయోజనాన్ని బట్టి వ్యక్తి ప్రవర్తన ఉంటుందని ఆడ్లర్ సిద్ధాంతం. సహజాతాలుగాని, ప్రచోదనలుగాని,కామేచ్ఛాశక్తిగాని,వ్యక్తి ప్రవర్తనను అర్థవంతం చేయవు. వ్యక్తి ఏ ప్రయోజనమాశించి ఆ విదంగా ప్రవర్తిస్తున్నాడనేది ప్రవర్తనకు మూలమౌతుంది. స్వార్థమైనా,నిస్వార్థమైనా, వ్యక్తి ప్రవర్తన వెనుక తప్పకుండా ఏదో ప్రయోజనముంటుంది. ఈ విధంగా వ్యక్తులు లోకంలో ఏదో ప్రయోజనాన్ని ఆశించి ఆదర్శంగా,స్వార్థంగా,సేవాభావంగా,సంఘంలో ప్రవర్తిస్తారని, ఆడ్లర్ భావించి ఈ సిద్ధాంతాన్ని వెలువరించాడు.

---

14. అపసామాన్య మనోవిజ్ఞాన శాస్త్రం. పుట. 142.

## 2 ఆధిక్యతా భావాలు.

ఆధిక్యమనగా వ్యక్తి సాధించే పరిపూర్ణత.వ్యక్తి ఏ ప్రయోజనాన్ని ఆశించి ఒకపనిని చేపడతాడో,ఆ పనిని పూర్తిచేసే వరకు అనగా ఆ పనిలో పరిపూర్ణత సాధించేవరకు ప్రయత్నం సాగిస్తాడు.శైశవంనుండి శిశువు నేర్చుకునే విధానమంతా ఈ విధంగానే ప్రయత్నించటంతో, ప్రారంభమౌతుంది.బోర్లపడటం,కూర్చుండటం,నిలబడటం,నడవటం,పట్టుకోవటం,పరుగెత్తటం, మొదలైన శారీరక ప్రక్రియలన్నీ శిశువు పరిపూర్ణత సాధించటం కోసం చేసేటటువంటివే.శిశువు చేసే ఇటువంటి ప్రయత్నాలే జీవితంలో వ్యక్తులకు అనువర్తిస్తాయి.దీనివల్లనే ప్రతివ్యక్తి ప్రవర్తన వెనుక,ప్రయోజనం దానిని పొందాలనే తాపత్రయం వ్యక్తమౌతూఉంటుంది.

## 3. న్యూనతా భావాలు.

'న్యూనతా భావాలు వ్యక్తిలో కలగటం' సహజమని అడ్లర్ భావించాడు.ఈ న్యూనతా భావం శారీరకమైన,మానసికమైనా,దాన్ని జయించటానికి గాని లేదా పరిహారంగా మలచు కోవటానికి గాని వ్యక్తిచేసే ప్రయత్నంలోనే అతని ప్రవర్తన నిబద్ధమై ఉంటుంది.శైశవం నుండి పొందే అనుభవాలు,అనుభవాలవల్ల నేర్చుకున్న పాఠాలు,గ్రహించిన జ్ఞానం,మొదలైన వెన్నో వ్యక్తిలో గూడుకట్టుకొని ఎప్పటికప్పుడు ఏదో ఒక న్యూనతాభావాన్ని కలిగింపచేస్తూ,ఉండటంవల్ల ఆ భావాన్ని అధిగమించటానికి చేసే ప్రయత్నమే వ్యక్తి ప్రవర్తనగా రూపుదిద్దుకుంటుంది.

అంగవైకల్యం పొందినవారు మరో అంగాన్ని సాదనంగాచేసుకొని తాము తలపెట్టిన కార్యాన్ని పట్టుదలతో శ్రమించి పరిపూర్ణత సాధిస్తారు.ఉదా॥చేతులు లేనివారు కాళ్ళతో వ్రాసే ప్రయత్నం చేస్తారు.'మానసిక వైకల్యం'అనగా మానసికంగా న్యూనతాభావాలు పొందిన వ్యక్తులు సాధారణంగా తమ మనస్సును మరోవేపు మళ్ళించి వినోద,విలాస,కార్యకలాపాల,ద్వారా ఆనందాన్ని పొందుతారు.మరికొంతమంది కళలపట్ల ఆసక్తి కనబరుస్తారు.కొంతమంది క్రీడల నాశ్రయిస్తారు. ఇంకొందరు రచయితలుగా,కొందరు సాంఘిక సేవాపరులుగా,ఇట్లా ఎవరికి తోచిన విధంగావారు,వారికి నచ్చిన వాటిపై మనసును మళ్ళించి జీవితాలను కొనసాగిస్తారు.

మానసిక న్యూనతాభావాలే అధికమైనపుడు వ్యక్తులలో వ్యాకులత,భయం, కలుగుతాయి. భయభ్రాంతుడైన వ్యక్తి సర్దుబాటుతనాన్ని పొందలేక,వ్యాకులతకు తట్టుకోలేక క్రమంగా న్యూనతా దుర్దమభావాలకు లోనై మానసిక రోగిగా మారుతాడు.వీటినే అడ్లరు న్యూనతా దుర్దమభావం ( Inferiority Complex.),ఆధిక్యతా దుర్దమభావం(Superiority Complex.)అని వ్యవహరించాడు.ఇవే వ్యక్తిలో సామాన్యంగా ఉండి సంఘంలో అతని ప్రవర్తనకు మూలకారణం కాగా మరో సందర్భంలో అనగా వ్యక్తిలోని బలహీనత ఈ భావాలనే ఉద్భృతంగావించి వ్యక్తికి అపసామాన్య ప్రవర్తనను కలుగచేస్తాయి.

'ఈ న్యూనతా,ఆదిక్యతా భావాలు, వ్యక్తి ఏపరిస్థితులలో నైనా నిరాశా,నిస్పృహలకు,

లోనైనపుడు అధికమై అతడిలో అలజడిని కలిగిస్తాయి.వ్యాకులతకు లోనుచేస్తాయి.అవే క్రమంగా అతడిలో దుర్దమభావాలుగా రూపొందుతాయి.వాటికి తట్టుకోలేని మనిషి ఒంటరి వాడగుచు క్రమంగా నాడీరుగ్మతకు,మానసికవ్యాధికి,గురవుతాడు.మనిషిలో కలిగే ఆధిక్యతాభావం, న్యూనతా భావం, మనోవిశ్లేషణకు ముఖ్యసూత్రాలని,ఆడ్లర్ సిద్ధాంతంలోని ప్రధానమైన విషయాలు.వీటినే ఆతడు Masculine Drive,Feminine Drive.అని వ్యవహరించాడు.ఫ్రాయిడ్ చూపిన ఎడిపస్, ఎలెక్ట్రా కాంప్లెక్స్‌లను కాదని ఆడ్లరు వీటిని రూపొందించాడు."[15]

## 4. సాంఘికాభిరుచి.

సంఘజీవియైన వ్యక్తిలో సాంఘికాభిరుచి ఉండటం సహజం.సంఘంలో తనకొక స్థానమున్నదనీ,బాధ్యతలున్నాయనీ,వ్యక్తి గ్రహిస్తాడు.కుటుంబమర్యాదలు,ఆచారవ్యవహారాలు, గౌరవ మర్యాదలు,మొదలైనవాటిని రక్షించుకుంటూ,వాటి రక్షణే తన ప్రయోజనమనీ,భావిస్తూ, సంఘంలో గౌరవజీవనాన్ని అభిలషిస్తూ ప్రవర్తిస్తాడు.ఆవిధంగా భావించిన వ్యక్తి ప్రవర్తన లోకాన్ననుసరించి ఆదర్శంగా ఉంటుంది.వ్యక్తి జీవితం వైయక్తికమైనదే అయినా తన కోరికలకు, నమ్మకాలకు,అనుగుణంగా లోకం లేదా సంఘం మారదు కాబట్టి ప్రతివ్యక్తి తనలోతాను సర్దుబాటు తనాన్ని తెచ్చుకొని సమయానుకూలమైన ప్రవర్తనను కలిగి ఉంటాడు.

ఏకాంత జీవితం కన్నా సాంఘిక జీవితమే,అనగా నలుగురితో కలిసి బ్రతకటమే తనకు భద్రత కల్గిస్తుందనే నమ్మకంతో నలుగురితో పాటు జీవించటానికి ప్రయత్నిస్తాడు.దీనివల్ల అతనిలో సాంఘికాబిరుచి పెరుగుతుంది.ఈ సాంఘికాభిరుచివల్ల వ్యక్తి కుటుంబ వ్యవహారాల లోనే గాక ఇతరములైన సాంఘిక కార్యక్రమాల పట్ల ఆకర్షితుడవుతాడు.ఇతరులకు సహాయ పడటం,సానుభూతిని,అనురాగాన్ని,స్నేహాన్ని,పెంచుకోవటం,వాటిని తాను పొందే ప్రయత్నం చేయటం,నలుగురితో సుఖదుఃఖాలను పంచుకోవటం,మొదలైన పనులలో లీనం అవుతాడు.ఈ విధంగా వ్యక్తిలోని సాంఘికాభిరుచి అనేక కార్యక్రమాలకు మూలమై ఆ వ్యక్తి జీవితం సంఘంలో సాఫీగా సాగునట్లు చేస్తుంది.

## 5. జీవనశైలి.

ప్రతివ్యక్తి బాల్యంనుండి నేర్చుకున్న అలవాట్లు,విద్య,సంస్కారం,సంస్కృతి,ఒక విధమైన జీవితానికి అలవాటు పడేటట్లు చేస్తాయి.అదే ఆతని జీవనశైలిగా మారుతుంది.ఆడ్లర్ బాల్యా నుభవాలకు,విద్యకు,శిక్షణకు,సంస్కృతికి,సామాజిక కట్టుబాట్లకు,ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. వ్యక్తియొక్క మూర్తిమత్వం కూడా బాల్యావస్థలోనే రూపుదిద్దుకుంటుందని,బాల్యంలో ఏర్పడ్డ న్యూనతాభావాలు ఆ సమయంలో తీరకపోయినచో వాటినే తన జీవనశైలిలో పొందు పర్చుకొని వ్యక్తిగా సముచిత స్థానం పొందగానే వాటిని తీర్చుకునే ప్రయత్నం చేస్తాడనీ, బాల్యంలోని కోర్కెలే

15. తెలుగు నవల మనోవిశ్లేషణ.పుట.30.

వ్యక్తి జీవనశైలిలో చోటుచేసుకుంటాయనీ,ఆడ్లరు జీవనశైలి గురించి వివరిస్తాడు. ఈ జీవనశైలికూడా ప్రతివ్యక్తికి భిన్నంగా ఉంటుంది. సమాజంలో ఆ వ్యక్తికి ప్రత్యేక స్థానాన్ని లేదా గుర్తింపును ఈ జీవనశైలి కలిగిస్తుంది. అందువల్లనే సమాజంలో విశిష్ట వ్యక్తుల జీవితం క్రమబద్ధంగా ఉండటం, సగటుమనిషి జీవితం మామూలుగా ఉండటం చూస్తుంటాం.

## 6. సృజనాత్మక ఆత్మ.

ఆడ్లర్ సృజనాత్మక ఆత్మ అనే దానిని కొత్తగా పరిచయం చేసాడు. ఒక వ్యక్తి తనకు తాను రూపొందించుకున్నదని దీన్ని గురించి చెప్పవచ్చు. తన నిర్ణయాలతో,నమ్మకాలతో, వైఖరులతో,విశ్వాసాలతో,ఏర్పరచుకున్న అంతరాత్మ సృజనాత్మక ఆత్మ. ఇది ప్రయోజనాన్ని బట్టి ఉంటుంది. వ్యక్తియొక్క జీవితానికి అర్థాన్ని కల్పిస్తుంది.

ఈవిధంగా ఆడ్లర్ 'ప్రయోజనతా వాదసిద్ధాంతాన్ని' పూర్తిగా వ్యక్తియొక్క సాంఘిక జీవనాన్ని ఆధారం చేసుకొని చెప్పటమేగాక కొత్తగా 'న్యూనతాభావాలు,ఆధిక్యతాభావాలు' అనే దుర్దమభావాలను ప్రవేశపెట్టి నాడీరుగ్మతకు,మానసిక వ్యాధులకు-ఇవే మూలకారణం అవుతాయని అభిప్రాయపడ్డాడు. వ్యక్తిలో 'తానాశించిన ప్రయోజనాన్ని,పరిపూర్ణతను, పొందలేనపుడు,వ్యాకులత కలుగుతుందని,అది తీవ్రంగా మారినపుడు వ్యక్తి నిరాశకులోనై రుగ్మతకు పాలవుతాడని, శారీరకమైన లేదా మానసికమైన తీవ్రమైన సంఘటనలే వ్యక్తియొక్క మూర్తిమత్వంపై దెబ్బతీస్తాయని,ఆడ్లరు విశదీకరించాడు. ఫ్రాయిడ్ చెప్పిన లైంగిక కారకాలు, ప్రధానం కావని అవికొంతవరకే బాధ్యత వహిస్తాయని,ఈతని నమ్మకం. మనిషి తాను ఉన్నతుడై అందరికన్నా అగ్రస్థానంలో ప్రత్యేకంగా ఉండాలనే కాంక్ష అన్నింటికన్న మిన్నయని,ఆ కాంక్షను తీర్చుకోవటానికే ఆతడు ప్రయత్నిస్తాడని,ఆడ్లరు వాదం. అది ఫలించనపుడే వ్యక్తిలో సంఘర్షణ మొదలౌతుంది. లోపభూయిష్టమైన జీవనశైలి ఏర్పరచుకున్నవాళ్ళు,నాడీరుగ్మత వ్యాధిగ్రస్థులు, అవుతారని ఆడ్లరు సిద్ధాంతంలోని భావనలు.

"ఆడ్లరు చేతన ప్రక్రియలకు అమిత ప్రాధాన్యం ఇచ్చాడు. మానవునికి అర్థంకాని విషయాలు అచేతన ప్రక్రియలుగాను,అర్థమైన విషయాలు చేతన ప్రక్రియలుగాను మారతాయి. చేతన ప్రక్రియలకే ప్రవర్తనమీద అధిక ప్రభావం ఉంటుంది."[16.]

## (ఇ) జాతివాద సిద్ధాంతం.

కారల్ గస్టావ్ యూంగ్ అనే వ్యక్తి స్విట్జర్లాండుకు చెందిన మనస్తత్వ శాస్త్రవేత్త. ఆడ్లరు కన్నా ఎక్కువ కాలం ఫ్రాయిడ్‌తో కలిసి పనిచేసాడు. ఫ్రాయిడ్,ఆడ్లరు,సిద్ధాంతాలను కొంతవరకు అంగీకరించాడు. కాని ఫ్రాయిడ్ 'కామేచ్ఛాసిద్ధాంతంకానీ,ఆడ్లర్ 'చేతన ప్రక్రియలకు' ప్రాదాన్యం

16. అపసామాన్య మనోవిజ్ఞాన శాస్త్రం. పుట 97.

యివ్వటం కానీ,యూంగ్‌కు నచ్చలేదు. అడ్లర్ ఫ్రాయిడ్‌నుండి విడిపోయిన తర్వాత కొద్దికాలానికే ఈయన కూడా విడిపోయాడు. ఈయన ఫ్రాయిడ్ వలెనె వ్యక్తి ప్రవర్తనకు 'అచేతనమానసిక ప్రక్రియలే' కారణాలని తనదైన 'విశ్లేషణాత్మక మనోవిజ్ఞాన శాస్త్రంలో' ప్రకటించాడు. ఇందులో ఎక్కువగా యూంగ్ జాతిపరమైన కారకాలకే ప్రాధాన్యం ఇవ్వటంవల్ల ఇది'జాతివాద సిద్ధాంతంగా' వ్యవహరింపబడింది. 'జాతి' అనునది వ్యక్తి మూర్తిమత్వంలో ఒక ప్రధానమైన భాగాన్ని ఆక్రమించు కుంటుంది. 'జాతిని'వారసత్వంగా వ్యక్తిలో ప్రవేశపెట్టటం ఈతని ప్రత్యేకత.

యూంగ్ చాలా దేశాలు తిరిగాడు. భారతదేశం పర్యటించి ఇక్కడున్న దర్శనాలను, పురాణాలను,చదివాడు. సంస్కృతిని అర్థంచేసుకున్నాడు. విశాలమైన దృక్పథంతోమానవుని ప్రవర్తనను పరిశీలించాడు. ఆ విధంగా చేసిన పరిశీలనలో వ్యక్తి మూర్తిమత్వంలో జాతి ఒకభాగాన్ని ఆక్రమించు కుంటుందని తెలుసుకున్నాడు. తద్వారా వ్యక్తియొక్క 'చేతన,అచేతన మానసిక ప్రక్రియల విశ్లేషించి తానుకనుగొనిన విషయాలను తనదైన 'విశ్లేషణాత్మక మనోవిజ్ఞానశాస్త్రంలో' వివరించాడు

ఈతని 'జాతివాద సిద్ధాంతంలో'ముఖ్యంగా ఈక్రింది విషయాలకు ప్రాధాన్యం ఉంది.

1) వైయక్తిక అచేతనం. 2).సామూహిక లేక సముష్టి అచేతనం. 3) మూలరూపాలు. 4) పర్సోనా. 5) అనిమా,అనిమస్. 6) వైఖరులు. 7) ప్రకార్యాలు. 8) ఆత్మ.

యూంగ్ వీటినే మూర్తిమత్వ నిర్మాణంలోని కొన్ని ముఖ్యవ్యవస్థలుగా భావించి ఇవి నిరంతరం ప్రతిచర్య జరుపుకుంటాయని చూపాడు.

## 1) వైయక్తిక అచేతనం. Individual unconciousness.

ఫ్రాయిడ్ చెప్పిన 'అచేతనాన్నే' ఈతడు రెండు భాగాలు చేసాడు. అవి వైయక్తిక, సామూహిక లేక సమష్టి అచేతనాలు. వైయక్తిక అచేతనం వ్యక్తిగతమైనది. అనగా ఫ్రాయిడ్ చూపినట్టిదే. ఇందులో కేవలం వ్యక్తి ఉద్దేశ్యపూర్వకంగా దమింపచేసుకున్న అభిలాషలు,అభిమతాలు, అసభ్యకరమైన ఆలోచనలు,విచిత్రభావాలు,నిలువ ఉంటాయి. ఇట్లా కేంద్రమై నిలిచినది ఎల్లపుడూ అహానికి అంటిపెట్టుకొని ఉంటుంది. అనగా ఇది వ్యక్తిగతమైన కోరికలకు, స్వార్థానికి, ప్రాధాన్యం కలిగిస్తుంది. అంతేగాక వ్యక్తిలో అమితంగా ఆశలు పెరిగిపోవటం దీనివల్లనే. వ్యక్తి ప్రవర్తనలో స్వార్థంచోటు చేసుకుంటే ఆప్రవర్తనకు ఆతని వైయక్తిక అచేతన మానసికప్రక్రియలే కారణాలు.

## 2) సామూహిక లేక సమష్టి అచేతనం. Collective unconciousness.

యూంగ్, వ్యక్తి అచేతనంలో సమష్టి అచేతనం అనే భాగాన్ని గుర్తించి వేరుపరచి చెప్పటం విశేషంగా చెప్పుకోవచ్చు. దీనిని కొందరు అంగీకరించారు,కొందరికిది అమోదయోగ్యం కాలేదు. ఇది వివాదాస్పదంగా ఉండిపోయినా,దీన్ని వ్యక్తి మూర్తిమత్వంలో శక్తివంతమైన వ్యవస్థగా యూంగ్ భావించి చెప్పటం,వ్యక్తి జాతి వారసుడని గ్రహించటం,అందరికి నచ్చిన విషయాలైనవి.

మానవుడు అజ్ఞానదశనుండి( ప్రాక్తన మానవుని జీవితకాలం) పొందిన వివిధ దశల లోని అనుభవాలు,స్మృతులు,నమ్మకాలు,భయాలు,ఉద్వేగాలు,మొదలైనవెన్నో వ్యక్తికి జాతి పరంగా వారసత్వంగా,అనువంశికంగా,సంక్రమించి సమష్టి అచేతనంలో జాతి కారకాలుగా నిలిచి పోతాయని యూంగ్ చెప్పాడు.అందువల్ల ప్రపంచంలోని మానవులంతా కష్టసుఖాలలో, భయభ్రాంతులలో ఒకే విధమైన అనుభూతిని పొందుతారనీ,దీనివల్లనే అందరూ ఒక జాతిగా, సంఘంగా, సమాజంగా,ఏర్పడి తమ జాతివారసత్వాన్ని నిలుపుకుంటూ సామూహిక జీవితాన్ని గడుపుతారనీ,వివరిస్తాడు. ఈ సమష్టి అచేతనంలోని ప్రేరణలే వ్యక్తి సాంఘిక జీవనానికి తోడ్పడతాయి. ప్రవర్తనను క్రమబద్ధీకరిస్తాయి.ప్రతి వ్యక్తి సంఘంలో ప్రవర్తించే విధానాన్ని ఈ సమష్టి అచేతన ప్రక్రియలే రూపొందిస్తాయి

ప్రతి వ్యక్తి తాను చేసే అనేక కర్మకాండలు,ఈ జాతిపరమైన కారకాలతో విచక్షణా రహితంగా తనకు తెలియకుండానే చేసుకపోతుంటాడు. ఈ విధంగానే అనేక విధలైన భయాలు, మూఢనమ్మకాలు,ఆచారాలు,కట్టుబాట్లు,సంప్రదాయాలు,భక్తి,ఆధ్యాత్మికచింతన,ప్రార్థన,కర్మకాండ వ్రతాలు,పూజలు,మొదలైనవన్నీ అర్థంగాకున్నా,తెలియకున్నా,పరంపరాగతంగా వస్తున్నవనీ, అవి ఆచారబద్ధమనీ,ఆదరించి ఆచరిస్తాడు.

ఈవిధంగా వ్యక్తి కుటుంబంలో,సంఘంలో,దేశంలో,ప్రవర్తించే సమయాలలో,జాతి వారసత్వంగా రూపొందిన ఈ సమష్టి అచేతనం సమయానుకూలంగా వ్యక్తికి సర్దుబాటు తనాన్ని, అనుగుణ్యతను,చేకూర్చి ప్రవర్తింప చేస్తుంది. అందువల్ల ఒక జాతి మానవుడు ఆ జాతి సంస్కృతికి వారసుడై వాటిని ఆచరిస్తూ,తరువాతి సంతానానికి తన వారసత్వాన్ని అందిస్తుంటాడు. ఆ విధంగా పరంపరాగతంగా వచ్చిన జాతివారసత్వమే అచేతనంలో ఘనీభవించి నిలువగా ఉండిపోతుంది. వ్యక్తిలో సంస్కారానికి ఇదే మూలమై నిలుస్తుంది.వ్యక్తి జీవితకాలంలో పొందిన జ్ఞానంకన్నా అనాదినుండి వస్తున్న ఈ జాతిపొందిన అనుభూతులే సంక్రమించి వ్యక్తి మనుగడకు తోడ్పడతాయి. ఈ సమష్టి అచేతనంలో జాతికి సంబంధించిన ప్రేరణలు రూపొందటానిక తోడ్పడే 'మూలరూపాలు' కూడా ఉంటాయి.

## 3) మూలరూపాలు Archetypes.

సమష్టి అచేతనంలో నిలువ ఉండేవి మూలరూపాలు. ఇవే వ్యక్తికి అనేక ప్రేరణలు కలిగిస్తాయి. జాతివారసత్వంగా లభించిన అనాది భావనలే ఈ మూలరూపాలు. వ్యక్తియొక్క విచిత్రమైన,అనాలోచితమైన,భావనే మూలరూపంగా మారటంవల్ల అనేక భావాలచే అనేక మూల రూపాలేర్పడ్డాయి. మాతృభావన దేవతగా,పితృభావన దేవుడుగా,గురుభావన ఆచార్యుడుగా, సన్యాసిభావన ఋషిగా,ఇట్లే స్వర్గం,నరకం,దేవతలు,రాక్షసులు,మొదలైన వాటివిధంగానే మంచికి పుణ్యమనీ,చెడుకు పాపమనీ,మానసిక భయాలకు భూతప్రేత పిశాచాలనీ,కర్మసిద్ధాంత భావనతో

పూర్వజన్మ పరజన్యలుగా,ఆధ్యాత్మిక భావన భక్తిగా ,జననం,మరణం,మొదలైనవన్నీ మూలరూపాలై వ్యక్తిలో పాదుచేసుకొని ఆ వ్యక్తి ప్రవర్తనకు మూలమై నిలుస్తాయి.ఈ మూలరూపాల భావనలు ప్రపంచంలోని మానవులందరిలోను జాతిపరంగా వెల్లడౌతూనే ఉన్నాయి.కాబట్టి మానవుడు వీటిని వదిలి బతకలేడు.శాంతియుత సహజీవనానికి,సాంఘిక ప్రవర్తనకు,క్రమబద్ధ జీవితానికి, మానవునికి ఇవి ప్రాచీనకాలంనుండి మూలకారణాలైనాయి.

## 4) పర్సోనా Persona

యూంగ్ భావనలో 'పర్సోనా' అనునది వ్యక్తి ఇతరులకు పైకికనబడే రీతి.ఇది పై రూపంమాత్రమే.అనగా సాంఘిక కట్టుబాట్లకు,మూలరూపాల అవసరాలకు అనుగుణంగా వ్యక్తియొక్క పర్సోనా ఏర్పడుతుంది.వ్యక్తి అంతర్గతంగా ఎట్లా ఉన్నా పైకి మాత్రం చాలవరకు నటిస్తున్నట్లు కనబడతాడు.ఈ నటన ఆతని ఆత్మనిర్దేశం కావచ్చు,లేదా సాంఘికాభిరుచివల్ల ఏర్పడవచ్చు.ప్రతి వ్యక్తి ఏకాంతంలో ఉన్నపుడు తన మనసులో పొందే భావాలకు,ఆలోచనలకు, ప్రేరణలకు,ఉద్రిక్తలకు,లోబడి నడుచుకోవటంవేరు.సామూహికంగా ఉన్నపుడు వాటినన్నింటిని కప్పిపుచ్చుకొని పైకి మరోరకంగా నడుచుకోవటంవేరు.పైకి నడుచుకునే విధానమే పర్సోనా. సన్నిహితులు కాని వారంతా వ్యక్తియొక్క పర్సోనా మాత్రమే చూసి అర్థం చేసుకుంటారు.

## 5) అనిమా, అనిమస్ . Anima-Animus.

ప్రతివ్యక్తిలో స్త్రీ పురుష అంశాలుంటాయనీ,ఆడ్లరు,యూంగులు భావించి చెప్పటం 'జీవశాస్త్రపరంగా' సత్యమైనదే. "పరిణామ ప్రక్రియలో ద్విజాతి లైంగిక జీవులనుండి క్రమంగా స్త్రీపురుష లింగభేదమున్న జీవులేర్పడ్డాయి.ఆ విధంగా సంక్రమించిన విధానంవల్ల వ్యక్తులలో కూడా స్త్రీలలో పురుషలక్షణాలు,పురుషుల్లో స్త్రీలక్షణాలు ఉండటం సంభవిస్తుందనీ,జీవశాస్త్రం చెబుతుంది."[17] అదీగాక జన్యువులు కూడా తల్లినుండి కొన్ని,తండ్రినుండి కొన్ని సంక్రమించి అండంలో చేరుతాయనీ జన్యుశాస్త్రం చెబుతుంది.ఆడ్లర్ న్యూనతాభావానికి స్త్రీలక్షణాన్ని, ఆధిక్యతాభావానికి పురుషలక్షణాన్ని,చూపించాడు.యూంగ్ వీటినే మూలరూపాలుగా గ్రహించి ఇవి ప్రతివ్యక్తిలో ఉంటాయనీ చెప్పాడు.ఈభావన ప్రాచీన మత్స్య పురాణంలోని ఓ కథకు వర్తిస్తుంది.

"సృష్ట్యాదిలో ప్రజాపతి,శతరూప అనే స్త్రీని సృష్టించి ఆమెనే వివాహమాడాడట.పూర్వ గాథాలహరిలో శతరూప బ్రహ్మమానసంనుండి సగం స్త్రీ రూపంగానూ,సగం పరుషరూపం గానూ పుట్టిన శక్తి "[18]అని చెప్పబడిఉంది.ఇవే భావనలు అనాదినుండి మూలరూపాలుగా రూపొందాయి.వీటినే యూంగ్ స్త్రీ లక్షణాలను 'అనిమా'అనీ,పురుషలక్షణాలను 'అనిమస్'అనీ పేర్కొనటం జరిగింది.ఇవి ప్రతివ్యక్తిలో అంతర్గతంగా ఉండటంవల్లనే స్త్రీపురుషులు పరస్పరం

---

17. అపసామాన్య మనోవిజ్ఞాన శాస్త్రం.పుట.101. 18. పూర్వగాథాలహరి. పుట.444.

ఆకర్షించుకుంటారనీ,ఈ లక్షణాలవల్లనే తమతమ స్త్రీపురుషులను భాగస్వాములుగా ఎన్నుకుంటారు ఈ లక్షణాలెక్కువగా విపర్యంగా ఉన్న వ్యక్తులలో భిన్నమైన ప్రవర్తన కూడా ఉంటుందనీ వివరిస్తాడు

## 6) వైఖరులు. Attitudes.

వైఖరి అనేది ప్రవర్తనకు సంబంధించినది.వ్యక్తి ప్రవర్తన ఒక వైఖరిని సూచిస్తుంది. వ్యక్తులలో కనిపించే వైఖరులను పరిశీలించి యూంగ్ ప్రధానమైన మూడింటిని వివరించి చెప్పాడు. అవి 1.బహిర్వర్తనుడు. 2.అంతర్వర్తనుడు. 3.ఉభయవర్తనుడు.

**1 బహిర్వర్తనడు. Extrovert.**-ఈతడెక్కువగా తన క్రియాకలాపాలను సామూహికంగా నెరవేర్చుకునేవాడు. ఈతనికి సామూహిక జీవనమే ఇష్టమైనది.నలుగురితో కలిసి సుఖదుఃఖాలను పంచుకోవటం,తనవైన అభిలాషలను,నిర్ణయాలను,తెలిపి ఎదుటివారివికూడా తెలుసుకోవటం, ముఖ్యంగా నలుగురి కోసం పాటుపడటం,ఈతని ముఖ్యలక్షణాలు.నాయకులు,నటులు, సంఘ సంస్కర్తలు,దేశభక్తులు,ఉపన్యాసకులు,వివిధ కళావిన్యాసకులు,మతబోధకులు,మొదలైనవారు.

**2. అంతర్వర్తనుడు. Introvert.** -ఈతడెక్కువగా ఏకాంతాన్ని కోరుకుంటాడు.తన మానసిక ప్రపంచంలోనే ఎక్కువ కాలాన్ని వినియోగిస్తాడు.తనలోతానే కొత్తలోకాన్ని సృష్టించుకొని, ఊహించుకొని, ఆనందిస్తాడు.నలుగురితో కలిసిపోయే గుణం ఈతనిలో తక్కువగా ఉంటుంది. కళాకారులు, రచయితలు,కవులు,శాస్త్రజ్ఞులు,మేధావులు,వేదాంతులు,యతులు,పండితులు.మొ॥

**3. ఉభయవర్తనుడు. Ambivert.** -యూంగ్ పై రెండు రకాలైన ప్రవర్తనా వైఖరులను చూపి,చాలామంది పై రెండు లక్షణాలు కలిగే ప్రవర్తిస్తారనీ,ప్రత్యేక వ్యక్తిత్వం గలవారే పై ద్వివిధాలైన వైఖరులతో వర్తిస్తారనీ,సగటు వ్యక్తులదరూ ఉభయవర్తనులనీ,చెప్పాడు.కనుక వీరి ప్రవర్తన ప్రత్యేకంగా ఉండక మామూలుగా ఉంటుందని చెప్పవచ్చు.

## 7) ప్రకార్యాలు. Fumctions

యూంగ్ నాలుగు మౌలికమైన ప్రకార్యాలను పేర్కొన్నాడు.ఇందులో పురుషలక్షణాలకు సంబంధించిన,చింతనం,సంవేధన అనుని రెండు,అనుభూతి,అంతర్బుద్ధి,అనేవి స్త్రీలక్షణాలకు చెందినవి రెండు.-చింతనం వివేచనాత్మక ప్రక్రియ.-సంవేధన ఆ విషయానికి సంబంధించిన వాస్తవ పరిస్థితులను తెలుసుకోవటం,కనుక్కోవటం.-అనుభూతి అనేది వ్యక్తికి ఆ విషయం పట్ల లేదా వస్తువు పట్ల లేదా సంఘటన పట్ల గల ఆసక్తితో కూడిన వ్యక్తిగతమైన అభిలాష. -అంతర్బుద్ధి అచేతన ప్రక్రియలను తెలుసుకోవటంలో పనిచేస్తుంది.

## 8) ఆత్మ. Self.

మూర్తిమత్వానికి ఆత్మ కేంద్రం.యూంగ్ భావనలో 'ఆత్య'అనేది బాల్యదశలో కాకుండా మధ్యదశలోనో,చివరలోనో,ఏర్పడుతుందనీ,మూలరూపాలవల్ల,వైఖరులవల్ల,విశ్వాసాలవల్ల

'వ్యక్తిలో' ఇది రూపుకడ్తుందని భావించాడు. ఇదికూడా మూలరూపమే. ఆధ్యాత్మిక దృష్టి, ఆత్మకు సన్నిహితంగా ఉంటుంది. చేతన అచేతన స్థితులకు మధ్యగా ఉండి అనుభూతితో విషయాలను అనుభవిస్తుంది. విషయాలపట్ల అభిరుచిని కలుగచేస్తుంది.

ఈ విధంగా యూంగ్ తన విశ్లేషాణాత్మక మనోవిజ్ఞాన శాస్త్రంలో నూతన భావాలను చూపి 'లిబిడో' అనే మానసిక శక్తిని గుర్తించి అది అన్నికార్యాలకు ఉపయోగ పడుతుందని చెప్పాడు. యూంగ్ మానవశాస్త్రం, పురాణాలు, సంస్కృతి, చరిత్ర, మొదలైన వాటిపై చేసిన పరిశోధనలు పలువురి ప్రశంసలను పొందాయి. ఫ్రాయిడ్, ఆడ్లర్‌ల కన్నా యూంగ్ వ్యక్తి ప్రవర్తనను అన్ని కోణాలనుండి పరిశీలించి చెప్పాడు.

## (ఈ) అస్తిత్వవాద సిద్ధాంతం. Existential Theory.

ఈప్రకృతిలో మానవునికిగల అస్తిత్వాన్ని గురించి అతని స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను గురించి సాగిన ఆలోచనలోనుండి పుట్టినదే అస్తిత్వవాద సిద్ధాంతం. పాశ్చాత్య దేశాలలోని కొందరు తత్వ వేత్తలు, శాస్త్రజ్ఞులు, వెలిబుచ్చిన అభిప్రాయాలతో, ఆలోచనలతో, క్రోడికరింపబడినదే అస్తిత్వవాదం.

జీన్‌పాల్ సార్త్రే, ఫ్రోమ్, మాస్లో, ఆల్‌పోర్టు, రోజర్సు, మొదలైన మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞుల అభిప్రాయాలతో అస్తిత్వవాదం మొదలైంది. ఇది ఆనాటి సాంఘిక కారణాలవల్ల పుట్టుకొచ్చింది. అస్తిత్వవాదాన్ని ప్రచారంలోకి తెచ్చినవారిలో కీర్కుగార్డు, యాస్పర్స్, హైడెగ్గర్, నీచే, కాము, ప్రముఖులు. ఇందులో ఆస్తికులు, నాస్తికులు ఉన్నారు.

"సాహిత్యంలో నిరీశ్వరవాద అస్తిత్వాన్ని సృష్టించింది, వ్యాఖ్యానించింది సుస్థిరం చేసింది జీన్‌పాల్ సార్త్రే.'[19]

ప్రతివ్యక్తి స్వేచ్ఛాజీవి. స్వయంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోగలడు. సాధారణంగా అతని జీవితం అతని నిర్ణయాలమీద ఆదారపడి ఉంటుంది. పరిస్థితులు, అనుకోని సంఘటనలు అదృష్ట దురదృష్టాలు, కర్మ మొదలైనవి జీవితాన్ని మార్చవచ్చుననేది నిజంకాదు. ఏవిషయాన్నైనా నిర్ణయించుకునేది మానవుడే. కాబట్టి పరిస్థితుల ననుసరించి నడుచుకునే స్వేచ్ఛ ఆతనికి ఉంటుంది. ప్రతివ్యక్తి స్వేచ్ఛవల్ల ధైర్యాన్ని, ఉత్సాహాన్ని, సామర్థ్యాన్ని పొందుతాడు. పాతదారిలోనుండి కొత్త దారిలోకి ప్రవేశించటానికి ప్రయత్నిస్తాడు. తన జీవితాన్ని తానే తీర్చిదిద్దుకోవటానికి కొత్త మార్గాలను వెదుకుతాడు. ఆ మార్గాలలో తన సామర్థ్యాన్ని ఉపయోగించి జీవితపు విలువలను సాధిస్తాడు.

జీవితానికి అర్థం ఏర్పడవలెనంటె కొన్ని విలువలను గ్రహించి పెంపొందించుకోవాలి. ఈ విలువలను వ్యక్తి తన అనుభవాలను బట్టి, ఆలోచనలను బట్టి నిర్ణయించుకుంటాడు. కాని అస్తిత్వవాదులు మాత్రం సాధారణంగా ఇతరులకుపయోగపడే నిర్మాణాత్మకమైన విలువలనే గ్రహించటానికి అవకాశముందని వాదిస్తారు.

---

19, నవతా విమర్శ పుట. 84.

జీన్‌పాల్‌సార్త్రే సత్తాను(అస్తిత్వాన్ని) మూడు రకాలుగా పేర్కొన్నాడు.[20]

అవి. 1Being for it self.2.Being in it self.3.Being for Others,

1)Being for it self.అనగా తనకొరకు తాను జీవించటం.ఇది స్వార్థపూరితమైన జీవితలక్ష్యం. 2)Being in it self..అనేది తనలోతాను జీవించటం.దీనివల్ల మానవుడు సామాజికంగా సాధించగలిగింది ఏమీ ఉండదు.సమాజానికి ఎటువంటి లాభనష్టాలుండవు. 3).Being for Others,అనగా ఇతరులకోసం జీవించటం.ఇందులోనే వ్యక్తి జీవితపు విలువలు నిర్ధారితమౌతాయి.

అస్తిత్వవాద సిద్ధాంతంలో మరోముఖ్యమైన భావన ఆబంధం (Obligation). అనగా జీవితానికి అర్థం తనకు కావాల్సింది సంపాదించుకోవటం కాక తాను ఇతరులకు మేలు చేయకలిగినపుడే తన జీవితానికి ఒక అర్థముంటుందని గ్రహించటం.అప్పుడే ఆ జీవితానికి సార్థక్యం.తనకున్న స్వేచ్ఛ ఇతరులకుండాలని తానాశించటం,ఇతరుల స్వేచ్ఛను తాను కూడా అర్థం చేసుకోవటం,ఎదుటివాని జీవితపు విలువలను కూడా తానామోదించటం,మొదలైన విషయాలపట్ల వ్యక్తి శ్రద్ధవహించాలి.

"ఇతరుల కోసం తాను'కాని 'తన కోసం ఇతరులు కాదు' అని తెలుసుకున్నపుడే వ్యక్తి సంఘంలో శాంతియుతంగా జీవిస్తాడు.ఈ సిద్ధాంతంలో సంపూర్ణ మానవతావాదం, మానవునిపట్ల విశ్వాసాన్ని,గౌరవాన్ని,కలిగించే విధానాలెన్ని ఉన్నా ఇది వ్యక్తిగతమైన ఆలోచనలకే పరిమితమై ఉండటంవల్ల ఆ వ్యక్తి ఉన్నతాదర్శాలు,కలిగినవాడైతేనే సత్ఫలితాలు ఇవ్వటానికి అవకాశం ఉంది.

"వ్యక్తికి స్వయం నిర్ణయాధికారం ఎంతగొప్పదో,అంత జటిలమైనది.ఆతడు తీసుకునే నిర్ణయాల ప్రభావం సంఘంమీద కూడా ఉంటుంది.పూర్ణవ్యక్తిత్వంగల మానవునికి తప్ప స్వయం నిర్ణయాధికారం కలుగదు.ఎందుకంటె తాను స్వయంగా నిర్ణయించుకోవటానికి స్వతంత్రించటంతో పాటు ఇతరుల స్వతంత్ర స్వయం నిర్ణయాధికారాన్నికూడా గౌరవించ గలగాలి.ఈనాడు సార్త్ర్ ప్రతిపాదించిన అస్తిత్వవాదానికి సాహిత్యంలోనే ప్రాచుర్యం ఎక్కువ."[21]

## 1.4. ప్రవర్తన. Behaviour.

మనస్తత్వం అంతఃకరణానికి సంబంధించింది కాగా ప్రవర్తన జ్ఞానేంద్రియ,కర్మేంద్రియాలచే కూడిన కార్యకలాపాలకు చెందినట్టిది.మనస్తత్వం అదృష్టం(చూడబడనిది),ప్రవర్తన దృష్టం (చూడబడేది).ఒక వ్యక్తియొక్క మనస్తత్వాన్ని తెలుసుకోవాలనగా ఆతని ప్రవర్తనను అన్ని కోణాల నుండి పరిశీలించాల్సి ఉంటుంది.

పాశ్చాత్యులకు,భారతీయులకు, సాంఘికపరమైన వ్యక్తి ప్రవర్తన విషయంలో

---

20,21. నవలా విమర్శ.పుట.84.

భేదముంది.పాశ్యాత్యులకు సంఘం వేరు.మతంవేరు.కాని భారతీయులకు ఇవన్నీ పరస్పర సంబంధంతో ముడివేసుకొని ఉన్నవే.మతం సంఘపరం,సంఘం మత నిబంధనానుగుణంగా సాగుతుంది.అందువల్లనే భారతీయులు(ఋషులు) సంఘంలో వ్యక్తి మనుగడ సుస్థిరంగా,శాంతి యుతంగా,జరగటానికి ఎన్నోమార్గాలు చూపారు.ధర్మార్థకామమోక్షాలు,మానవజీవిత ధ్యేయాన్ని లక్ష్యాన్ని,నిర్దేశిస్తాయన్నారు.'అర్థకామాలు' ధర్మబద్ధమైతే' మోక్షం సుగమమౌతుందన్నారు. సుఖశాంతులతో కూడిన క్రమబద్ధమైన ధార్మిక జీవనం సాగటంకోసం బ్రహ్మచర్య,గృహస్థ, వానప్రస్థ,సన్యాసాలనే నాలుగు ఆశ్రమాల ధర్మాలతో,వయస్సును అనుసరించి,వివిధదశల్లో మానవుడు చేయవలసిన విద్యుక్త కర్మలు నిర్దేశించారు.వీటిద్వారా వ్యక్తి క్రమంగా విద్యార్జన, కుటుంబ జీవనం,బాధ్యతా విమోచనం,సర్వసంగ పరిత్యాగంతో మోక్షగామియై జీవనం సాగించాలని మన ప్రాచీనుల అభిమతం.దాదాపు ఇటువంటి భావాన్నే మహాకవి కాళిదాసు ఈవిధంగా "రఘువంశంలో" చెప్పాడు.

"శైశవే2భ్యస్త విద్యానాం,యౌవనే విషయైషిణాం.
వార్ధకే ముని వృత్తీనాం,యోగానాంతే తనుత్యజాం'

కొందరు మాత్రం ధర్మాన్ని మోక్షాన్ని అంగీకరించక 'అర్థకామాలకే' విలువనిచ్చారు. అర్థానికి ప్రాధాన్యమిచ్చిన కౌటిల్యుడు.

"సమస్తమైన ధర్మసాధనకు మూలం అర్థం.అట్లాగే సమస్తమైన కామసాధనకు కూడా అర్థమే మూలం.కనుక "క్షణశః కణ శశ్చైవ విద్యామర్థంచ సాధయేత్" విశ్రాంతి ఎరుగని తేనెటీగలా మానవుడు నిరంతరం అర్థాన్ని సేకరించాలి.అదే మానవుని ధ్యేయం."అని అర్థశాస్త్రంలో పేర్కొన్నాడు"[22].

కామశాస్త్రకారులు "నరోవై శిశ్నోదర పరాయణః" అని మానవుని నిర్వచించారు. అంగవేదనతోడను,ఉదరపోషణతోడను,మానవుడు ఎప్పుడూ తృప్తిపడుతూ ఉంటాడు.కనుక ఆ రెంటినీ చనిపోయేవరకు మానవుడు సాధిస్తూనే ఉంటాడు.'[23] అని మానవనైజాన్నితెల్పారు.

పైన తెల్పిన ఉదంతాలు సత్యప్రమాణాలన్నట్లుగా,ఆధునిక కాలంలో మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులగు ఫ్రాయిడ్,ఆడ్లర్ కనుగొన్న 'మానవుని మానసిక చేతనాచేతన ప్రక్రియలల్లో ఫ్రాయిడ్‌కు వ్యక్తి 'కామేచ్ఛాజీవిగానూ,' ఆడ్లరుకు 'అర్థజీవి'గానూ కనిపించటంలో చిత్రమేమీ లేదనిపించును. వీరిద్దరూ 'అర్థకామాలకే'వ్యక్తిని నిబద్ధుని చేసినట్లు వాటికే ప్రాధాన్యమిచ్చినట్లు కనిపిస్తుంది.ఈ విధంగా వీరు చెప్పటానికి గల కారణం మానవుని మనస్సును విశ్లేషించగా వీరికి ముఖ్యంగా బయల్పడిన విషయాలలో 'మానవునిలో సహజాతాలవల్ల పుట్టిన ప్రేరణలచే రూపొందిన 'ఆకలి కామం'ల ఉద్రిక్తతల,మానసిక అలజడులు నిలువవుండి ఉండటమే. ఈ అలజడులను క్రమబద్ధీక

---

22,23, భారతీయ తత్వశాస్త్రం పుటలు. 12,13,

రించటానికే,మానవుని జీవితం శాంతియుతంగా కొనసాగటానికే, భారతీయఋషులు ధర్మం,మోక్ష మనే వాటిచే వీటిని బంధించివేశారు.అప్పుడవి "ధర్మార్ధకామమోక్షాలైనవి".

## 1.5 ప్రవర్తనవాదం.

మనోవిజ్ఞానశాస్త్రంలో,మనోవిశ్లేషణ సిద్ధాంతాలు,ప్రవర్తనా సిద్దాంతాలు,చోటుచేసు కుంటాయి.ప్రవ్తరన సిద్ధాంతాలలో కూడా అనేకాలైన ప్రవర్తన శాస్త్రాలుచేరి ఉండటంవల్ల 'ప్రవర్తన వాదం'విశాలంగా,విస్తృతంగాపెరిగిపోయింది.వీటిలోసైక్రియాట్రి,మానవశాస్త్రం,సమాజశాస్త్రం, అర్ధశాస్త్రం,రాజనీతిశాస్త్రం,చరిత్ర,మొదలైనవి చేరి యున్నందువల్ల,ప్రవర్తనవాదాన్ని నిర్వచించటానికి గాని,కొన్ని విషయాలల్లో సమన్వయం చేయటంగాని,అసాధ్యమైన విషయంగా కనిపిస్తుంది.

ప్రవర్తనవాదాన్ని మొదట జె.బి.వాట్సన్ ప్రతిపాదించాడు."[24].జంతువులమీద జరిపిన ప్రయోగాల్లో వెలువడిన ఫలితాలతో రూపొందింపబడిన 'ప్రవర్తనవిధానమే'ఇందులో ఎక్కువగా గ్రహింపబడుతుంది.దీనిని 'అభ్యసన సిద్ధాంతం'అనికూడా అంటారు.ప్రవర్తనవాదం మూర్తిమత్వం లో అభ్యసనానికి అధిక ప్రాధాన్యమిస్తుంది.

వాట్సన్ ఉపయోగించిన 'నిబంధన'(Conditioning)పద్ధతుల ఆధారంగా అనేకమంది చేసిన పరిశోధనలవల్ల ఎన్నో కొత్తవిషయాలు తెలిసాయి.ఈ ప్రవర్తనవాద సిద్ధాంతం ప్రకారం మానవుని ప్రవర్తన కొంతవరకైనా అది సామాన్యమైనా,అపసామాన్యమైనా,అభ్యాసం మీద ఆధారపడి ఉంటుందని గ్రహించారు.వీరి సిద్ధాంతాలను ఉద్దీపన(Stimulant), ప్రతిస్పందన (Response) సిద్ధాంతాలని కూడా అంటారు..

ప్రవర్తనలమీద ఉత్సుకతల ప్రాముఖ్యం కూడా ఉంటుంది.వ్యక్తి ప్రతిచర్య జరపటానికి ప్రేరేపించే శక్తి ఉన్న ఏ ఉద్దీపన అయినా 'ఉత్సుకత'(Drive) అంటారు.ఏ ఉద్దీపన అయినా కొంత తీవ్రమైనపుడు ఉత్సుకతగా మారుతుంది.అంతర్గతమైన కొన్ని ఉద్దీపనలు తీవ్రరూపం దాల్చినపుడు ప్రవర్తనను ప్రేరేపించ గలుగుతాయి.వ్యక్తి వికాసంలో పరిసరాల ప్రభావంవల్ల కొన్ని ఉత్సుకతలు ఏర్పడతాయి.అవి ప్రాథమిక ఉత్సుకతలు(Primerydrives),గౌణ ఉత్సుకతలు (Secondary drives) అని రెండు రకాలు.ఆకలి,దాహం,నిద్ర,మైథునం,మొ॥నవి ప్రాథమిక ఉత్సుకతలు. సాంఘికసమ్మతి,హోదా,అధికారం,సిగ్గు,వ్యాకులత,మొ॥నవి గౌణ ఉత్సుకతలు. సాధారణ పరిస్థితులలో గౌణ ఉత్సుకతలే ప్రవర్తనను అర్థవంతం చేస్తాయి.[25]

మూర్తిమత్వంలో అలవాటుకు(Habit) ప్రధానస్థానముంది.మానవుని మూర్తి మత్వాన్ని అంటే ఆతిని ప్రత్యేక లక్షణాన్ని ఈ సిద్ధాంతం ప్రకారం తెలిపే భావన అలవాటు. ఉద్దీపన, ప్రతిస్పందనల మధ్య ఏర్పడే లంకెనే అలవాటు అంటారు.మూర్తిమత్వంలో ఎన్నో అలవాట్లు

24,25. అపసామాన్య మనోవిజ్ఞాన శాస్త్రం.పుట.126.

ఒక ప్రత్యేకపద్ధతిలో కలిసి ఉంటాయి. అంతేగాక నేటి అలవాట్లే రేపటి నూతన అభ్యసనంవల్ల మార్పుచెంది కొత్తఅలవాట్లు ఏర్పడవచ్చు. అలవాట్లు వ్యక్తి ప్రవర్తనకు మూలమై నిలుస్తాయి.[26.] ఈ విధంగా ప్రవర్తనవాదులు అభ్యసనానికి, అలవాట్లకు, ఉత్సుకతలకు ప్రాధాన్యమిచ్చి వ్యక్తి ప్రవర్తనను నిర్ణయిస్తారు.

## 1.6 ప్రవర్తన-అనుగుణ్యత.

మానవుని ప్రవర్తన వ్యక్తిగత పరిస్థితులలో ఒక రకంగానూ, సాంఘికస్థితిలో మరో రకంగానూ ఉంటుంది. లెబాన్, మెకడోల్, ఆల్పోర్టు, మొ॥సాంఘిక మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు పై రెండురకాల ప్రవర్తనలు భిన్నమైనవని సిద్ధాంతీకరించారు.

వ్యక్తి ప్రవర్తనలో అనుగుణ్యత ఎక్కువగా చోటుచేసుకుంటుంది. ఈ అనుగుణ్యత అనేది ప్రతి వ్యక్తికి పుట్టకతోనూ వస్తుంది. బాల్యంలో కుటుంబములో తల్లదండ్రుల అదుపాజ్ఞలతో వృద్ధిచేసుకుంటాడు. వికాస దశల్లో పరిస్థితులననుసరించి సర్దుబాటుతనాన్ని నేర్చుకుంటాడు. వ్యక్తిలో బాల్యంనుండే అనుగుణ్యత లేక సర్దుబాటుతనం ఈవిధంగా వృద్ధి పొందుతుంది. ఈఅనుగుణ్యతను పలువురు పలురకాలుగా నిర్వచించారు. కొన్ని ఈక్రింది విధంగా ఉన్నాయి.

పి.ఎమ్. సైమండ్స్ –" Adjustment can be simply defined as satisfactory relation of on organism to its environment [27,] అని నిర్వచించాడు.

వ్యక్తి పరిసరాలతో సంతృప్తికరమైన సంబంధాన్ని కలిగి ఉండటం'అనుగుణ్యత' ప్రధాన లక్షణం. పరిససరాలనునవి ముఖ్యంగా మూడు రకాలు. 1 భౌతికం, 2 సాంఘికం, 3. మానసికం. భౌతిక సరిసరాలు, జీవనానికి సంబంధించిన విషయాలు. సాంఘిక పరిసరాలు సంఘంలో, కుటుంబంలో, నడుచుకునే విధానానికి సంబంధించినవి. మానసికమైనవి, వ్యక్తిగతమైవి. అలవాట్లు, వైఖరులు, ఉత్సుకతలు, చూపేవి. వీటితో సత్సంబంధం కలగి ప్రవర్తించటమే అనుగుణ్యతను పాటించటం.

జేమ్స్ కోల్మెన్, అపసామాన్య ప్రవర్తనకు దారితీసే లక్షణాలను తెలుపుతూ, అనుగుణ్యతను గూర్చి ఈక్రింది విధంగా చెప్పాడు.

" Life is a continuous process of adjusting in which we strive to meet our need maintain harmonious relations with our environment. When an individual deals with his problems effectively, he issaid to be well adjusted to be adopting successfully to both the inner and outer demands being made upon him. Conversly, when his problems are more serious

---

26. అపసామాన్య మనోవిజ్ఞా శాస్త్రం పుటలు. 126,127. 27. సర్దుబాటు-అనుగుణ్యత. పుట. 3,

symptoms,he is reffred to Maladjustment.[28.]

పై నిర్వచనంలో ప్రధానమైన రెండు విషయాలను గమనించవచ్చు. 1) జీవితం అనేది నిరంతరం సర్దుబాటు ప్రక్రియ. పరిసరాల్లో అనుక్షణం ఈ ఆనుగుణ్యత సాగుతూనే ఉంటుంది. 2) వ్యక్తి తన సమస్యలను సమర్ధవంతంగా పరిష్కరించుకున్నపుడు ఆతడు మంచి సర్దుబాటు కలవాడని భావించవచ్చు. కాని సర్దుబాటుతనం లోపించినపుడు వ్యక్తులలో వ్యాకులత, న్యూనతాభావాలు, న్యూరోటిక్‌లక్షణాలు, పొడసూపుతాయి. దీన్నే 'అవగుణ్యత' అని అంటారు. దీనివల్ల వ్యక్తికి అపసామాన్య ప్రవర్తన అలవడుతుంది. కాని కొందరి విషయంలో ఇది వర్తించదు కొందరు ఆనుగుణ్యతను పాటించకుండానే తాము ఎదుర్కొన్న పరిస్థితులను పరిశీలించి నివారణోపాయాలను కనుగొని గొప్పవారుగా ప్రసిద్ధులయ్యారు. శాస్త్రజ్ఞులు, మేధావులు, కళాకారులు, నాయకులు, సంఘసంస్కర్తలు, మొ॥వారు సర్దుబాటుతనాన్ని పొందక పోవటంవల్లనే వారికెదురైన సమస్యల పరిష్కారంలో వారికీ అవకాశం లభించినట్లు భావించవచ్చు.

అబ్రహం మాస్కో అను శాస్త్రవేత్త ఆనుగుణ్యతను ఈవిధంగా చెప్పాడు.

Adjustment is a passive rather than active process,its ideal is attained in the cow,or in the slave or anyone else who canbe happy without individuality even eg.the well adjustted lunatic or prisoner.[29]

పై నిర్వచనంలో ఆనుగుణ్యత ఎల్లపుడూ వ్యక్తి జీవనానికి వాంఛనీయం కాదన్న భావన వెల్లడవుతుంది. వ్యక్తిని బానిసగా, పశువుగా, మార్చే ఆనుగుణ్యతవల్ల సమాజంలో అవాంఛనీయ పరిస్థితులెదురవుతాయని సమాజాన్ని సంస్కరించే అవకాశం కొందరు కోల్పోతారని అందువల్ల అవగుణ్యత కూడా కొందరికి మేలే చేస్తుందని తన "Motivation and Personality" అనే గ్రంథంలో వ్యక్తం చేస్తాడు.

వ్యక్తి ఆనుగుణ్యతను కలిగి ఉండటం మంచిదా? చెడ్డదా? అని విచారించినపుడు కొందరికి మంచిని చేకూరిస్తే, మరికొందరికి ఇది లేకుండానే మంచి జరుగుతుంది. సామాన్య మానవునియొక్క 'శాంతియుత జీవనానికి' ఆనుగుణ్యత శ్రేయస్కరమే. కాని ప్రతిభావంతులు, మాత్రం అన్ని వేళలా ఆనుగుణ్యతను పాటించరు. ఏదో సందర్భంలో వారు సమాజానికి ఎదురుతిరుగుతారు. తమ వ్యక్తిగత అభిప్రాయాలతో ముందుకు నడుస్తూ, సమాజంలోని కొన్ని విలువలను మార్చాలనీ, లేక ప్రవేశపెట్టాలనీ, ప్రయత్నిస్తారు. కొత్తఅన్వేషణలు ప్రారంభిస్తారు. శాస్త్ర పురోగమనానికి తోడ్పడుతారు. సాంఘిక సంస్కరణలు చేపడ్తారు. ఆచార వ్యవహారాలను సడలిస్తారు. ప్రజలకు నాయకత్వం వహిస్తారు. సర్దుబాటు తనం లోపంచిన కొందరు మాత్రం విచ్ఛిన్నకర శక్తులుగా తయారవడమో, మానసిక రోగులుగా మారడమో జరుగుతుంది.

---

28,29. సర్దుబాటు–ఆనుగుణ్యత. పుటలు. 3,8,10.

## 1.7 మనస్తత్వం లేక ప్రవర్తనమీద ప్రభావాలు.

వ్యక్తియొక్క మనస్తత్వం అంతర్గతమైతే, ప్రవర్తన బాహ్యమైనది. వ్యక్తిలోకంలో ప్రదర్శించే హావభావాలు,చేసేక్రియా కలాపాలు,ప్రవర్తన కిందికి వస్తాయి.ప్రవర్తన మనస్తత్వం మీద ఆధారపడి ఉంటుంది. ఈ ప్రకరణంలో మనస్తత్వం మీద ప్రభావాలు ప్రవర్తనకెట్లు అనుకూలమైనవో, ప్రతికూలమైనవో గమనించవచ్చు.

మానవుడు సంఘజీవి. జన్మంచినపుడే తల్లిదండ్రులతో కూడుకున్న పరివారం అనే సంఘంతో జీవనం మొదలౌతుంది. పరిసరాలలో పెరుగుతాడు. విద్య నభ్యసిస్తాడు. కుటుంబమే మొదటి సంఘంగా,పరిసరాలే సామాజిక జీవన సదుపాయాలుగా వ్యక్తికి పరిచయమౌతాయి. ఈ విధంగా వ్యక్తియొక్క మానసిక వికాసం పుట్టినప్పటినుండి వ్యక్తిత్వం వచ్చువరకు కుటుంబం,విద్య పరిసరాలు,మొదలైనవాటిచే పొందిన ప్రభావాలచే రూపుదిద్దకుంటుంది. వ్యక్తియొక్క మూర్తిమత్వం, అతని అజ్ఞానదశలో,బాల్యదశలో,ఏర్పడుతుందనే భావనతోనే మనోవైజ్ఞానికులు, ప్రవర్తనావాదులు, వ్యక్తియొక్క బాల్యావస్థకు,విద్యకు,అభ్యసనానికి,పరిసరాలకు,కుటుంబములోని సంస్కృతికి,ఎక్కువ ప్రాధాన్యమిచ్చారు. కుటుంబములోని సంస్కృతే వ్యక్తులకు సంక్రమించటం, ఆ సంస్కృతి కలగిన సంఘంలో ఆతడెక్కువగా సర్దుబాటుతనాన్ని కలగిఉండటం,జరుగుతుంది. వ్యక్తి వికాసానికి 'సంస్కృతి ప్రధానమై నిలుస్తుందని చాలమంది శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అందువల్ల వ్యక్తియొక్క మనస్తత్వంపై మొట్టమొదట ప్రభావం చూపేది సంస్కృతే.

**1. సంస్కృతి.:-** వ్యక్తుల మూర్తిమత్వం కేవలం వారి శారీరక,మానసిక,ప్రవృత్తుల మీదనే కాకుండా,వారు నివసించే సమాజ సంస్కృతుల మీద కూడా ఆధారపడి ఉంటుందని చెప్పవచ్చు.'తీగకు పందిరి ఆధారమైనట్లు,' వ్యక్తిత్వ వికాసానికి సంస్కృతి ఆధారంగా నిలుస్తుంది వివిధ సమాజాలలో ఉండే సంస్కృతి,ఆయా సమాజాలలో ఉండే వ్యక్తులకు వంశ పారంపర్యంగా అభించటంవల్ల వారి సాంఘికాచరణలో,అలవాట్లలో,విలువల్లో,వైఖరుల్లో,కళ సాహిత్యం మొదలైన ఎన్నోఆంతరంగిక ప్రవర్తనల్లో ప్రతబింబిస్తుంది. సూక్ష్మంగా చెప్పాలంటె ఈఆంతరంగిక ప్రవర్తనలను వ్యవస్తీకరించే లక్షణపరంపరనే సంస్కృతి అని నిర్వచించవచ్చు .వైఖరులు, విలువలు, ఆచారాలు, ఒక తరంనుండి మరోతరం మధ్య వంతెనలవలె పనిచేస్తాయి. కాబట్టి మనిషి తన సాంఘిక జీవితాన్ని శూన్యంనుంచి ప్రారంభించవలసిన పనిలేదు. చాలావరకు ఆతడు వ్యవహరించే విధానాలు,సంస్కృతి ద్వారా అతనికి సంక్రమిస్తాయి.[30] వ్యక్తుల మూర్తిమత్వ వికాసంమీద సంస్కృతి ప్రభావం ఎంత గాడంగా పడుతుందో మార్గరెట్ మీడ్ రచించిన "Sex andTemper in Three Prinitive Soccities"రూత్ బన్‌డిక్ట్ వ్రాసిన "Patterns of Culture.అనే గ్రంథాలద్వారా తెలుస్తుంది.

30. సాంఘిక మనో విజ్ఞానశాస్త్రం. పుట 40.

సంస్కృతి తర్వాత వ్యక్తులయొక్క మనస్తత్వంపై ప్రభావం చూపేవి 2.ఆనువంశికత, 3.కుటుంబం. 4.విద్య. 5.సంఘం. 6.సమాజం.

**2.ఆనువంశికత:-** ఆనువంశికత వ్యక్తి లక్షణాలను నిర్దేశించటంలో ప్రధానపాత్ర వహిస్తుంది.వంశ పారంపర్యంగా వచ్చే శారీరక,మానసిక గుణాలు,లక్షణాలు,జాతివారసత్వం, మూలరూపాలలోని స్త్రీ పురుష లక్షణాలు,మొ॥నవి ఇందులో చోటుచేసుకుంటాయి.శక్తిస్థాయి భేదాలు,ప్రతిభా పాటవాలు,తెలివితేటలు,రూపురేఖలు,ఆనువంశికంగా వ్యక్తికి సంక్రమిస్తాయి. అంతేగాక ఆనువంశికంగా కొన్ని వ్యాధులు,అలవాట్లు,వైఖరులు,కూడా రావచ్చు,అందువల్లనే ప్రాచీనులు వివాహవిషయంలో సంబంధాలు చూసేటపుడు చాలా జాగ్రతపడేవారు.వంశాన్ని కుటుంబాన్ని ఆచారవ్యవహారాలను,దృష్టిలో ఉంచుకునేవారు.“ఆనువంశికతమీద వాదోపవాదాలు తీవ్రంగానే ఉన్నాయి.ఆనువంశికతకు అమితంగా ప్రాధాన్యం ఇచ్చేవారూ ఉన్నారు.దానిని పూర్తిగా కాదనే వారూ ఉన్నారు.ఈనాడు ప్రవర్తన అనేది ఆనువంశికత, అభ్యసనాల,పరస్పర ప్రతిచర్యలవల్ల ఏర్పడుతుందని గుర్తించారు.”[31]

**3.కుటుంబం :-** వ్యక్తి పోషణ పుట్టినప్పటినుండి వ్యక్తిత్వం ఏర్పడేవరకు కుటుంబం లోనే జరుగుతుంది.కుటుంబంలోని సంస్కృతి,సంప్రదాయం,వ్యక్తుల మనస్తత్వాలలో చోటు చేసుకుంటుంది.కుటుంబంలో తల్లదండ్రుల అనురాగం,ప్రేమ,వాత్సల్యం,మఖ్యంగా తల్లి పెంపకం బిడ్డలపైన ఎక్కువగా ప్రభావం చూపుతుంది.

ఫ్రాయిడ్ శైశవదశకెంతో ప్రాముఖ్యమిచ్చాడు.బిడ్డకు మొదటిదైన సంఘం కుటుంబమే కాబట్టి వ్యక్తికి సాంఘింక ప్రవర్తన కుటుంబంలోని శిక్షణద్వారా లభిస్తుంది.అనగా బిడ్డ కుటుంబం ద్వారా క్రమంగా సాంఘీకరణం పొందుతాడు.అందుకే వ్యక్తి వికాసానికి పాఠశాల లోని శిక్షణ కంటె కూడా ఇంట్లో తల్లదండ్రుల వల్ల పొందేశిక్షణ ఎంతో ప్రధానమైనది.అట్లు కాక లోపభూయిష్టమైన తల్లదండ్రుల పెంపకంవల్ల,సాంఘీకరణం చక్కగా పొందలేని సందర్భాల వల్ల వ్యక్తులలో సర్దుబాటుతనం లోపించి ఎన్నో విపరీతాలకు దారితీయవచ్చు.

**4.విద్య: -**ప్రాచీన భారతీయ సంస్కృతిలో విద్య రెండు రకాలుగా బోధింపబడేది.ఆ విధానం పాశ్చాత్యుల పాలనవరకు కొనసాగుతూ వచ్చింది.వాటిలో 1వృత్తివిద్య.2 జ్ఞానవిద్య. వృత్తివిద్య సామాన్యంగా పల్లెల్లో,గ్రామాల్లో,ఆయా వ్యక్తుల వృత్తుల్లో ఉన్నవారు తమ పిల్లలకు అదే వృత్తిని వంశపారంపర్యంగా బోధించేవారు.ఆ పిల్లలు కూడా ఆయా వృత్తుల్లో నైపుణ్యం సంపాదించి ఆ వృత్తులనే జీవనోపాధికి ఆధారంగా గ్రహించి జీవించేవారు.ఆర్థికంగా, సామాజికంగా, ఆయా వృత్తులవారు సంఘంలో గౌరవమర్యాదలతో తమ ఆచారవ్యవహారాలను

31. అపసామాన్య మనోవిజ్ఞాన శాస్త్రం. పుట.18.

సంరక్షించుకుంటూ జీవించేవారు.వృత్తివిద్యలేగాక గ్రామాల్లో,పల్లెటూళ్ళలో అనేక వినోద కార్యక్రమాలలో 'జ్ఞానబోధ' కలిగించే కళారంగాలుండేవి.పురాణప్రవచనాలు,నాటకాలు, హరికథలు,బుర్రకథలు,ఉత్సవాలలో జరిపే సాంస్కృతిక కార్యక్రమాలు,మొదలైనవి అనాగరిక నిరక్షరాస్యులైన పల్లె ప్రజలకు నీతిబోధ,జ్ఞానబోధ,కలిగించేవి.వారిలో ధార్మిక,నైతిక,ఆధ్యాత్మిక, సాంస్కృతికాది విలువలను నిలిపి ఉంచేవి.ఉన్నతవర్గాలకు చెందిన,ధనవంతుల,పిల్లలు గురుకులాల్లోఆచార్యులవద్ద దర్శనాలు,శాస్త్రాలు,తమ అభిమాన విద్యలను,వంశపారంపర్య విద్యలను, సాహిత్యాన్ని శ్రద్ధాపూర్వకంగా అభ్యసించేవారు.

ఈవిధమైన విద్య ఆనాటి జనుల శాంతియుత సహ జీవనానికి తోడ్పడేది.ఆనాటి విద్యాప్రభవం ఎక్కువగా సాంస్కృతిక మూల్యాలను,వృత్తివిద్యలను,కాపాడటంవరకే పరిమితమై ఉండేది.అందుల్ల ఆనాటి ప్రజలపై అప్పటి విద్యాప్రభావం మానసికంగా వారిలో అవగుణ్యతను కలిగించక పోయేది. ఈనాటి విద్యావిధానం మాత్రం అందుకు భిన్నంగా ఉంది.'అర్ధమే పరమార్ధం' అనే భావన వ్యక్తులలో స్థిరమైనందువల్ల వారిలో,వారి పిల్లల్లో అనుగుణ్యతకంటె, అవగుణ్యతనే ఎక్కువగా కలిగించే అవకాశమున్న విద్యావిధానం నేడు కొనసాగుతూ ఉందని చెప్పవచ్చు.

**5 సంఘం:-** ప్రతి వ్యక్తి కుటుంబంనుండే సాంఘీకరణం పొందుతాడు."సాంఘీకరణ మనగా పిల్లలు సంఘానికి ఉపయోగపడే వ్యక్తులుగా శిక్షణ ఇవ్వటంలో అవలంభించే పోషణ పద్ధతులను,పెంపకపు విధానాలను,సాంఘీకరణ మంటారు."[32]

ఈ నిర్వచనం నేడు పనికిరాదు.ప్రాచీన సంఘం వర్ణవ్యవస్థతో కూడి ఉండేది.వ్యక్తులు ఆయా వృత్తులపై ఆధారపడి జీవించేవారు.ఎవరి వృత్తి వారికి ఉండటంవల్ల ఆయా వత్తులవారు ఆయా వర్ణస్తులు 'శాంతియుత సహజీవనానికి' అలవాటు పడిపోయేవారు.ఆయా వర్ణస్తులు వారివారి వృత్తుల ననుసరించి తమ కుటుంబములోని పిల్లలకు వంశ పారంపర్యంగా వస్తున్న వర్ణ ధర్మాలను,వృత్తి ధర్మాలను,నేర్పేవారు,శిక్షణ ఇచ్చేవారు.వారిని ఆయా వృత్తులలో ప్రవీణులను చేసేవారు.ఆనాటి రాజులు,చక్రవర్తులు,వర్ణవ్యవస్థను,వృత్తులను కాపాడటంలోనే నియతులై ఉండేవారు.గ్రామాల్లో అధికారులు ఉన్నతవర్గాల వారు వీటిని సంరక్షించటంలోనే నిమగ్నులై ఉండేవారు.ఈనాడు వర్ణవ్యస్థలు,వృత్తివిద్యలు,కూలిపోయి,విద్యారంగంలో వ్యాపారాత్మక ధోరణులు ప్రబలటం,అవలింబించటం వల్ల వ్యక్తుల మధ్య వ్యత్యాసాలు,తరతమ భేదాలు పెరిగి వారిలో మానసిక ఉద్రేకాలు పెరగటానికి మూలమై నిలిచాయి.వ్యక్తుల్లో స్వార్థం పెరగటం, సంఘంలో నీతినియమాలు,అంతరించటంవల్ల సంఘంలోని వ్యక్తులలో ప్రశాంతత కరువై మానసిక ఆంధోళనలకు కూడా ఈనాటి సాంఘిక ప్రభావం అధికంగానే ఉందని చెప్పవచ్చు.

---

32. సాంఘిక మనోవిజ్ఞాన శాస్త్రం. పుట.27

**6) సమాజం :-** దేశమంతటికి సంబంధించినది సమాజం.సమాజంలోని భిన్న వ్యక్తుల మధ్య నిలిచేది.సంస్కృతి.ఆ సంస్కృతి అనేది ఒక జాతిని సంరక్షిస్తూ ఆ జాతికి సంబంధించిన సమాజాన్ని ముందుకు నడిపిస్తుంది.సంస్కృతే సమాజాన్ని నిలబెడుతుంది.ఆయా సంస్కృతులు గల వ్యక్తులు ఆయా సమాజాల్లో శాంతియుతజీవితాన్ని గడపగలుగుతారు.

సంస్కృతి ప్రభావం వ్యక్తులపై ఏ విధంగా ఉంటుందో ముందే తెలుసుకున్నాం. భారతీయ సంస్కృతి 'ధర్మార్థకామమోక్షాలనే' పురుషార్థాలకు,అశ్రమధర్మాలకు,నియతమై ఉండేది.సంస్కృతి సమాజంలోని వ్యక్తుల్లో నైతిక,ధార్మిక,ఆధ్యాత్మిక,సాంస్కృతిక,మూల్యాలను ప్రవేశపెడ్తూ నీతి,న్యాయబద్ధమైన మార్గాన నడిచే విధానాన్ని చూపుతూ శాంతియుత సహజీవనానికి సహకరిస్తూ సమాజంలోని వ్యక్తులందరినీ,ఆచార వ్యవహార నియమ నిబంధనల్లో బంధిస్తూ ఉండటం నేటివరకూ పరంపరాగతంగా వస్తున్నదే.

కాని నేడు కాలం మారింది.పాశ్చాత్య నాగరికతా వ్యామోహంవల్ల ప్రాచీన సంస్కృతి శిథిలం కాసాగింది.పాశ్చాత్య భాషాజ్ఞానం,అనుకరణలు,వ్యక్తుల మనస్తత్వాలలో విచిత్రమైన మార్పులు తెస్తున్నాయి.సాహిత్యం,కళలు మన సంస్కృతినుండి దూరమవుతున్నాయి.సమాజంలోని వ్యక్తుల మనస్తత్వాలు,స్థిరత్వంలేని ఆచరణల వైపు మొగ్గుతున్నాయి. ఈ విధమైన మార్పులవల్ల క్రమంగా వ్యక్తి సమాజంనుండి,సంఘంనుండి,కుటుంబమునుండి,దూరమౌతూ వ్యక్తిగత ప్రపంచానికే అంకితమౌతూ,స్వార్థాన్ని నింపుకుంటూ,ముందుకు సాగుతున్నాడు.ఈ విధంగా సమాజంలోని వ్యక్తుల మనస్తత్వాలపై,సంస్కృతి,విద్య,కుటుంబం,సంఘం,సమాజం,బలమైన ప్రభావం చూపుతూ ముద్రలు వేయసాగాయి.

## 1.8 సాహిత్యంలో మనస్తత్వ చిత్రణ.

### 1. సమాజం-సాహిత్యం.

సమాజానికి,సాహిత్యానికి అవినాభావ సంబంధముంది.ఒక విధంగా చెప్పాలంటె, సామాజిక మనస్తత్వ చిత్రణే సాహిత్యం.వ్యక్తుల సమూహమే సమాజం.సామాజిక జీవనం వ్యక్తి సంరక్షణకు,భద్రతకు,మూలమై నిలుస్తుంది.అందువల్ల వ్యక్తి సమాజాన్ని అశ్రయిస్తాడు.వ్యక్తినుండి సమాజం,సమాజంనుండి వ్యక్తి విడిపోకుండా ముడివేసి పెట్టేది సంస్కృతి.సంస్కృతి జాతి వారసత్వం.ఈ సంస్కృతిని ప్రతిబింబింప చేసేది సాహిత్యం.

సమాజంలో వ్యక్తి,వ్యవస్థ,ప్రధానమైన అంశాలు.సమాజంలోని వ్యక్తియే సాహిత్యంలోని పాత్రగా చిత్రీకరింపబడతాడు.జాతి వారసత్వాన్ని నిలబెట్టే సంస్కృతి స్వరూపమే సామాజికవ్యవస్థ. అందువల్ల సాహిత్యంలో వ్యక్తిని పాత్రగా మలచి జాతివారసత్వాన్ని(వ్యవస్థ) ప్రయోజనంగా చూపడం జరుగుతుంది.

ప్రాచీనసాహిత్యంలో వ్యక్తులే నాయక,నాయిక పాత్రలుగా చిత్రింపబడ్డారు. ధర్మార్ధకామ, మోక్షాలనే పురుషార్థాలను,ఆశ్రమధర్మాలను,వర్ణవ్యవస్థను,మతాన్ని,సామాజిక ప్రయోజనాభి ముఖంగా మలచి సాహిత్యసృష్టి జరిగింది. వైయక్తిక మనస్తత్వంలో కూడా సమష్టి లేదా సామూహిక మనస్తత్వం రూపొందేటట్లు సాహిత్యం వెలసింది.

ప్రాచీనసాహిత్యం యొక్క ప్రయోజనంకూడా సాంఘికమే. వ్యక్తి సంఘంలో ఒక భాగమే తప్ప సంఘాతీతుడుగా భావింపబడలేదు. అందువల్ల ప్రాచీనసాహిత్యమంతా వ్యక్తిలో సామూహిక మనస్తత్వాన్ని రూపు కట్టించేవిధంగా నడిచింది. ఆ సామూహిక మనస్తత్వంలో వ్యక్తికి చేకూర్చాల్సిన నైతిక,ధార్మిక,ఆధ్యాత్మిక,సాంస్కృతిక,మానవతా మూల్యాలకై ప్రాచీన సాహిత్యమంతటా కృషి జరిగింది. ఈ కృషి వల్లనే ప్రాచీన సాహిత్యంలోని పాత్రలుకూడా వైయక్తిక మనస్తత్వం కలిగినవిగా చిత్రింపబడకుండా వ్యవస్థా ధర్మానికై పాటుపడే పాత్రలుగా చిత్రింపబడటం కనిపిస్తుంది.

ఆధునిక కాలంలో సాహిత్య ప్రయోజనం మారింది. సామాజిక కారణాలవల్ల సాహిత్యం కూడా ఎన్నో వాదాలకు గురైంది. సాహిత్యంలో ఎన్నో నూతన ప్రక్రియలు ఆవిర్భవించాయి. ప్రస్తుత కాలంలో సాహిత్యం 'కాల్పనికవాదం,హేతువాదం,గాంధీవాదం,మార్క్స్వాదం,అస్తిత్వవాదం,స్త్రీ వాదం,దళితవాదం,మొదలైన వాదాల ప్రయోగాలతో వెలువడుతున్నది. సాహిత్యప్రక్రియల్లో అన్నింటికన్నా బహుళ ప్రచారంలో నున్నది నవల. ఈనవల అన్ని వాదాలకు'భూమిక'యై నిలిచింది.

## 2. నవలల్లో మనస్తత్వ చిత్రణ.

ఈనాడు తెలుగులో అధిక ప్రచారం పొందిన సాహిత్య ప్రక్రియ నవల. ఒకనాడు సామాజిక చిత్రణే ధ్యేయంగా రూపుదిద్దుకున్న నవల,ఈనాడు ఎన్నో సమస్యలకు, విషయాలకు, వాదాలకు,సంఘటనలకు,వేదికయై నిలిచింది.

"1945 తర్వాత మనస్తత్వ ప్రాధాన్యం తెలుగునవలల్లో పెరుగసాగింది. ఈ పరిణామం లో భాగంగా కథావస్తువుకు ప్రాముఖ్యం పెరగడం,కథ వెనక్కు తగ్గడం జరిగాయి. 1950 ప్రాంతంలో మానసిక జీవితానికి అంతవరకే ఇస్తున్న ప్రాముఖ్యం తగ్గి భౌతిక జీవితాన్ని వర్ణించడం ఎక్కువైంది."[33]

తెలుగు నవలల్లో మనస్తత్వచిత్రణ 20 శతాబ్ది అర్ధభాగంనుండే ప్రారంభమైంది. ఫ్రాయిడ్, ఆడ్లర్,యూంగ్ సిద్ధాంతాల ప్రభావాలవల్ల ఆనాటి కాల్పనిక సాహిత్యంలోని నవలలు ఎక్కువగా మనస్తత్వచిత్రణకు ప్రాముఖ్యం ఇచ్చాయి. ఇటువంటి పరిణామం రావటానికి గల కారణాలను 'వల్లంపాటి వెంకటసుబ్బయ్యగారు' ఈ క్రిందివిధంగా పేర్కొన్నారు.

"మొదటనవల సామాజిక చిత్రణ ప్రధానోద్దేశంగా ప్రారంభమయింది. తొలి నవలల్లో

---

33, నవలా శిల్పం పుటలు. 26.

భౌతిక,సామాజిక,చిత్రణ.పాత్రల భౌతిక ప్రవర్తన మాత్రమే కనిపించేది.అంటే పాత్రలు ఎలా ప్రవర్తిస్తున్నాయో మాత్రమే రచయితలు చిత్రించటానికి ప్రయత్నించేవారు.కొంతకాలం తర్వాత ఒక పాత్ర ఎలా ప్రవర్తిస్తుందో చెప్పాలన్న కోరిక నవలా రచయితల్లో ప్రారంభమైంది.అంతేగాకుండా పాత్రమనస్సులోని సంఘర్షణలను చిత్రించటం కూడా క్రమక్రమంగా వాడుకలోకి వచ్చింది. దీన్నే విమర్శకులు మనస్తత్వచిత్రణ అన్నారు"[34]

మనస్తత్వచిత్రణ,నవలల్లో రెండు విధాలుగా జరుగుతంది.మొదటిరకం,కథా వస్తువు సామాజికమైనదైనా,చారిత్రికమైనదైనా,పౌరాణికమైనదైనా,ఆ వస్తువు నుసరించి పాత్రచిత్రణ జరుగుతుంది.అనగా రచయిత దృక్పథం సామాజిక వస్తువుయొక్క ప్రయోజనాన్ని కాంక్షించి ఉండటంవల్ల ఆ వస్తువు యొక్క కథాకథనాన్ని అనుసరించి అనుకూలంగా,లేక ప్రతికూలంగా, పాత్రలను చిత్రిస్తూ భౌతిక ప్రవర్తనను మాత్రం చూపించటం జరుగుతుంది.అనగా ఇందులో పాత్రల భౌతిక మనస్తత్వచిత్రణే జరుగుతుంది కాని ఆంతరంగిక,మానసిక,సంఘర్షణల చిత్రణ ఉండదు.ఇంతవరకు వచ్చిన నవలల్లోని పాత్రచిత్రణలో ఈవిధమైన రచనావిధానం కనబడుతుంది.

రెండవరకం,సామాజిక వస్తువుకన్నా,సమాజంలో నలిగిపోతున్న వ్యక్తియొక్క బాహ్యా పరిస్థితులు,ఆంతరంగిక ప్రభావంచూపి మానసిక సంఘర్షణలకు గురికాగా ఆ వ్యక్తి ప్రవర్తించే విధానాన్ని చూపుతూ వ్రాయబడిన నవలలు మనస్తత్వచిత్రణ కలిగినట్టివి.

మనస్తత్వ చిత్రణ నవలలను గూర్చి డా॥ పి. సంజీవమ్మగారు చెప్పిన విషయం ఈ సందర్భంలో గమనించదగింది. "'పాత్రల మనస్తత్వ చిత్రణ నవలకు ప్రాణం వంటిదన్న విషయం తెలిసిందే. సామాజిక సమస్యలకు ప్రాధాన్యం ఇవ్వబడి ఆ సమస్యల ఆధారంగా పాత్రల మనస్తత్వాన్ని అవసరమైన మేరకు చిత్రించటం జరుగుతుంది మామూలు నవలల్లో. మనస్తత్వ చిత్రణే అత్యంత ప్రాధాన్యం ఇచ్చి రచింపబడిన నవలలు ఉన్నాయి."[35].

ఈ విధంగా కథావస్తువే 'మనస్తత్వ చిత్రణ'గా మారిన సందర్భంలో నవల రెండు విధాలుగా మారుతుంది. అనగా కథా వస్తువును బట్టి నవలను ప్రధానంగా ద్వివిధంగా భావించవచ్చు. 1) వ్యక్తి లేక పాత్ర ప్రధానమైన నవల. 2) వస్తు ప్రధానమైన నవల. వస్తు ప్రధానమైన నవలలను సాంఘిక, రాజకీయ, చారిత్రిక, సామాజిక, తాత్విక, మొదలైన విధాలుగా విభజించి చూడవచ్చు.ఇటువంటి నవలల్లోని పాత్రలు ఆయా వస్తువులకు తగినట్లుగా చిత్రింపబడతాయి.

"వ్యక్తి అంతరంగంమీద సామాజిక ప్రభావం, వ్యక్తి సమస్యలకు,సామాజిక సమస్యలకు, ఘర్షణ ఫలితంగా సున్నిత మనస్కులైన వ్యక్తుల యొక్క అసాధారణ లేక అప సామాన్య ప్రవర్తనకు ఎలా దారితీయగలదన్న విషయం, లేదా దృఢమనస్కతతో వ్యక్తి సమాజాన్ని ఎలా ఎదుర్కోగలడు?

---

34, నవలా శిల్పం పుటలు. 26.    35, తెలుగు నవలల్లో సాంఘిక చైతన్యం.111,

లేదా సమాధానపడగలడు? అన్న విషయం మొదలైనవెన్నో చిత్రించటం సాధ్యమౌతుంది ఈ మనోవైజ్ఞానిక నవలల్లో."[36].

## 3) వ్యక్తి లేదా పాత్ర ప్రధానమైన నవల

మానవుడు సంఘజీవి. మానవునికి వైయక్తిక జీవితమున్నది.సాంఘిక జీవితమున్నది. ప్రతి మానవుడు ఎల్లప్పుడూ రెండు విధాలుగా బ్రతుకుతున్నాడు. వైయక్తిక జీవితం ఆంతరంగిక మైనది. సాంఘిక జీవితం బాహ్యమైనది. వ్యక్తి అంతరంగ ప్రభావం,బాహ్య పరిసరాల ప్రభావం ఉండటం వల్ల ప్రేరణలకు వ్యక్తి గురౌవుతూనే ఉంటాడు. వ్యక్తిలో ఏదో ఒక విధమైన బలహీనత ఉంటుంది, ఈ బలహీనత అనేక కారణాలవల్ల ఏర్పడవచ్చు. లేదా పుట్టుకతోనే రావచ్చు బలహీనతవల్ల వ్యక్తి అంతరంగానికో సంఘానికో అణిగి సర్దుబాటు తనాన్ని అలవర్చుకుంటాడు. బలహీనతవల్ల ఎక్కువగా ఏర్పడేది ఆనుగుణ్యత లేదా సర్దుబాటుతనం.

కొందరు వ్యక్తులు సాంఘిక జీవితానికన్నా ఆంతరంగిక జీవితానికే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. వాళ్ళే అంతర్వర్తనులు.కొందరు సాంఘిక పరిస్థితుల కొదిగి జీవిస్తారు. ఆంతరంగిక ప్రేరణలకు ప్రాధాన్యమిచ్చేవారు సాంఘిక పరిస్థితులను ఎదుర్కోవలసి ఉంటుంది. అందువల్ల వీరిపై ఆంతరంగిక ప్రేరణలు, సాంఘిక పరిస్థితుల ప్రభావాలు ఎక్కువగా ఒత్తిడి కలిగిస్తాయి. ఈ ఒత్తిడిని ప్రతిభావంతులు సమయస్ఫూర్తితో ఎదుర్కొని సమస్యలను పరిష్కరించు కుంటారు. బలహీనులు తట్టుకోలేక 'వ్యాకులతకు' ఆత్మ న్యూనతాభావానికి లోనై సర్దుబాటు తనాన్ని పొందలేక తమలో తాము సమాధానం పడలేక చివరకు జీవితాలను నాశనం చేసుకుంటారు.

ఈ విధమైనచిత్రణ, పాత్ర ప్రధానమైన నవలల్లో కనబడుతుంది. "నవలా సాహిత్యంలో వ్యక్తిని(పాత్రను) చిత్రించటమంటే అతడు సామాజిక భావ జాలాలకు ఎలా ప్రతిస్పందిస్తున్నాడో, ఏ సామాజిక భావాలను ఆమోదిస్తున్నాడో, ఏ సామాజిక భావాలను తిరస్కరిస్తున్నాడో, చిత్రించటం మాత్రమే"[37] అన్నారు వేంకట సుబ్బయ్యగారు.

ఆంగ్ల సాహిత్యం ప్రబావం వల్లనే తెలుగులో కూడా మనస్తత్వ చిత్రణ నవలలు ప్రారంభమై పాత్రచిత్రణ ప్రాధాన్యం పెరిగింది.ముఖ్యంగా సిగ్మండ్ ఫ్రాయిడ్,అడ్లర్,యూంగ్‌ల మనో విశ్లేషణాత్మక సిద్ధాంతాలు ప్రపంచమంతటా వ్యాపించినందువల్ల ఆ మనోవిశ్లేషణతో సాహిత్యాన్ని పరిశీలించటం, రచించటం మొదలైంది. తర్వాత ఇది తెలుగు నవలా సాహిత్యంలో కూడా ప్రవేశించి ఆధునిక విమర్శకులకు అందుబాటులో నిలిచింది.

మనస్తత్వచిత్రణగల నవల ప్రారంభమయ్యాక సమాజంనుండి వ్యక్తి చాలావరకూ

---

36. తెలుగు నవలల్లో సాంఘిక చైతన్యం. 112. 37, నవలా శిల్పం. పుట. 102,103.

దూరమౌతున్నట్లు చిత్రించటం జరిగింది.దీనికి కారణం ఫ్రాయిడ్ సిద్ధాంతాలు. వ్యక్తికి అతని ప్రేరణలకు మూల భూతమైన కామేచ్ఛకు సంబంధించిన అంశాలు,మరియు అతని సిద్ధాంతాలు ఎక్కువగా సాహిత్యంలో గ్రహింపబడటంవల్ల ఈ విధంగా జరుగుతున్నట్లు చెప్పవచ్చు.

"ఫ్రాయిడ్ సిద్ధాంతాలు వ్యక్తిని దాదాపుగా సంఘంనుంచి విడదీశాయి.వ్యక్తిమనస్తత్వం రూపొందటంలో సమాజం పాత్రను దారుణంగా నిరాదరించాయి."[38]

ఈ విమర్శవల్ల తేలిందేమంటే వ్యక్తిగత ప్రధాన నవలల్లో వ్యక్తి సంఘంనుండి దూరం చేయబడి, లేదా సాంఘిక కట్టుబాట్ల కన్నా, వ్యక్తిగత అభిప్రాయాలకు, కాంక్షలకు, ప్రేరణలకు, ప్రాధాన్యం ఇవ్వబడినట్లు చూపడం జరుగుతుందనీ, సాంఘిక ప్రేరణలు కాదనీ, వ్యక్తి అంతరంగానికి లొంగి స్వార్ధాభిలాషియై ప్రవర్తిస్తాడనీ, కొన్నిసార్లు ఆ వ్యక్తి ప్రవర్తన సాంఘికావసరాలకు అనుగుణంగా ఉంటే, మరికొన్ని సార్లు ఆతని ప్రవర్తన భిన్నంగా ఉండి వ్యక్తిగత ప్రేరణలతో నిండి ఉంటుందనీ తెలుస్తున్నది.

వ్యక్తిగత ప్రధాన నవలలను వ్రాయటంలోను, వ్యక్తిగత అభిప్రాయాలకు విలువ ఇచ్చి చూపటంలోను,తెలుగు నవలా సాహిత్యంలో మొట్టమొదట ఎన్నదగినవాడు గుడిపాటి వేంకటచలం.ఆయన నవలలన్నీ స్త్రీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను చిత్రించేవే. ఒక వ్యక్తి జీవితాన్ని ఆధారం చేసుకొని అంతరంగ చిత్రణ చేసిన నవల గోపీచంద్ రాసిన 'అసమర్థుని జీవయాత్ర'. తర్వాతది బుచ్చిబాబు 'చివరకు మిగిలేది.' ఈ విధంగానే ఆ తర్వాతకూడా కొన్ని నవలలు వచ్చాయి, వస్తున్నాయి.

## 4) పాత్రచిత్రణ.

నవల వ్యక్తిగతం, వస్తుగతం, అని రెండు విధాలుగా మారినట్లే, నవలల్లోని పాత్ర చిత్రణకూడా రెండు విధాలుగా చేయబడుతుంది. ఈ రెండు రకాల పాత్రలను రచయితే చిత్రించినా ఒక పాత్రను ఒక విధంగాను, మరో పాత్రను మరో విధంగాను చిత్రించటంలో ఆ రచయిత అభిప్రాయాలు, విశ్వాసాలు, ఆదర్శాలు, మొదలైన వెన్నో దీనికి కారణాలవుతాయి. వాస్తవికతకు దగ్గరగా నున్న పాత్రలో 'మానసిక సంచలనం' ఎక్కువగాను, ఆదర్శవంతంగా ఉన్న పాత్రలో 'అనుగుణ్యతను' అధికంగాను చూపటం, రచయిత ఉద్దేశ్యపూర్వకంగా చేసిన చిత్రణగా తోచక తప్పదు. ఈ విధమైన పాత్రచిత్రణలో మనకు రచయిత చిత్రించిన విధానం ద్వారా,ఆ నవలయొక్క ముగింపు ద్వారా ఆ రచయిత ఏ ప్రయోజనాన్ని కాక్షించి రచన చేశాడో ఆ ప్రయోజనాన్ని అతని అభిప్రాయాన్ని మనం గ్రహించవచ్చు. ఆదర్శంగా ఉన్న పాత్రలో సాంఘిక కట్టుబాట్లకు, ఎక్కువగా లొంగి అనుగుణ్యతను పాటించి చూపటంలో వ్యక్తి సాంఘికమైన కట్టుబాట్లను ఆదరించాలనే సందేశం ఒకవైపు, వాస్తవికతకు దగ్గరగా ఉన్న పాత్రలో 'మానసిక సంచలనం ద్వారా ఆ పాత్ర

38, నవలా శిల్పం. పుట.102,103.

తన మనస్తత్వానికి లొంగిపోయి, స్వార్థాభిలాషియై ప్రవర్తించిన విధానంతో ఆ పాత్ర సంఘంనుండి విడిపోయి వ్యక్తి ధర్మానికి ప్రాధాన్యమిచ్చినట్లు చూపటం జరుగుతుంది. ఈ విధమైన పాత్ర చిత్రణలో వాస్తవికతకు దగ్గరగా నున్న పాత్ర జీవమున్న పాత్రలాగా, ఆదర్శంగా ఉన్న పాత్ర జీవంలేని పాత్రలా కనిపిస్తాయి.

"ఇ.ఎం.ఫార్‌స్టర్ పాత్రలను 1.Flats.2.Rounds.అని విభజించాడు. వీటినే క్లిష్టతలేని పాత్రలు(Flat Characters),క్లిష్టతగల పాత్రలు(Round Characters) అంటారు."[39].

"ఒక భావాన్నో గుణాన్నో ఆధారం చేసుకొని రూపొందింపబడిన పాత్రల్ని క్లిష్టత లేని పాత్రలు అనవచ్చు. ఇలాంటి పాత్రలు మొదటిసారిగా పాఠకునికి పరిచయమైనట్టివి, చివరి వరకూ ఒకే పద్ధతిలో ఒకే మనస్తత్వంతో కొనసాగుతాయి. పాత్రల మనస్తత్వంలో ఎలాంటి సంఘర్షణలుండవు......క్లిష్టతగల పాత్రలు అన్ని గుణాల్లోను క్లిష్టతలేని పాత్రలకు వ్యతిరేకమైనవి. వాటిలో భిన్న వ్యక్తిత్వాలుంటాయి. అందుచేత అంతః సంఘర్షణ ఉంటుంది. పరిస్థితుల ప్రభావం చేత అవి మార్పుచెందుతాయి....ఒక్క మాటలో చెప్పాలంటే సహజమైన పాత్రకు క్లిష్టత ఉంటుంది. క్లిష్టతలేని పాత్రలు రచయితచేత సూక్ష్మీకరించబడతాయి." [40].

ఈ పాత్రల విభాగం కేవలం మనస్తత్వాన్ని ఆధారం చేసుకొని చేసినట్టిదే. మానవునిలోని మూల మనస్తత్వంలోని ప్రేరణలను ఆధారం చేసుకొని చూసినట్లయితే ఇది వాస్తవికమైన విషయమనీ చెప్పక తప్పదు. క్లిష్టత కలిగిన పాత్రలు మానసిక సంఘర్షణకు లోనవుతాయి. దీనికి కారణం ఆయా పాత్రల్లో ఉండే బలహీనతలు. క్లిష్టతలేని పాత్రలు మానసిక సంఘర్షణకు లోనుకావు. కారణమేమనగా ఆయా పాత్రల్లో బలహీనత కనిపించదు. ఇందులో బలహీనత స్థానంలో ప్రయోజనం చోటుచేసుకుంటుంది. బలహీనత కారణంగా ఒక పాత్ర నలిగిపోయినట్లుగా మరోపాత్ర అకుంఠిత దీక్షతో ప్రయోజనాభిముఖంగా సాగినట్లుగా రచయిత చిత్రిస్తాడు. ప్రయోజనతా వాదాన్ని ప్రవేశపెట్టిన వాడు అడ్లర్. లోకంలో కొందరు ప్రయోజనాన్ని ఆపేక్షించి కూడా కొన్నింటిని త్యాగంచేస్తూ అంతరంగానికి లొంగక ఆదర్శంగా నిలుస్తారనీ వారే సాంఘిక మైన మార్పులు తెస్తారనీ చరిత్ర చెబుతోంది. సమాజంలో బలహీనతతో నలిగే వ్యక్తులను, అకుంఠిత దీక్షతో తాము అనుకున్న ఫలితాన్ని పొందేవరకూ ప్రయత్నించే ప్రతిభావంతులను మనం చూస్తుంటాం. లోకంలోని వ్యక్తుల స్వభావాన్ని ఆధారించుకునే మన సాహిత్యంలో ఈ రెండు రకాల పాత్రలు చిత్రింపబడి ఉండటం కనిపిస్తుంది.

సాంఘిక ప్రయోజనమే ముఖ్యోద్దేశ్యంగా భావించి రచింపబడిన ప్రాచీన సాహిత్యంలోని పాత్రలు క్లిషతలేని పాత్రలుగా రూపొందించబడ్డాయి. దీనికి కారణం మనం మరోవిధంగా కూడా గుర్తించవచ్చు. మానసిక శాస్త్రవేత్త సి.జె.యూంగ్ ప్రతి వ్యక్తిలో రెండు విధాలైన అచేతనాన్ని

39,40 నవలా శిల్పం. పుట 28,29

గుర్తించాడు. 1 వైయక్తిక అచేతనం. 2 సామూహిక అచేతనం. దీన్నే మనం వైయక్తిక మనస్తత్వం, సామూహిక మనస్తత్వంగా భావించుకోవచ్చు. మొదటిది వ్యక్తి పరమైనదై స్వార్థానికి మూలంకాగా రెండవది ఆదర్శంగా జాతివారసత్వాన్ని కలుపుకొని సాంఘిక ప్రయోజనాభి ముఖంగా సాగేది. ఆడ్లర్ స్వార్థానికి,కామానికి కాకుండా ప్రయోజనానికి ప్రాముఖ్యమిచ్చాడు. మానవుడు సంఘజీవి. కాబట్టి సాంఘికాభిరుచి అతనిలో ఉంటుందని చెప్పి ఆ రకమైన అభిరుచి కలిగినవారు సంఘశ్రేయస్సు దృష్ట్యా తన జీవితాలను మలచుకొని ప్రయత్నిస్తారనీ, అట్టి వ్యక్తులకు వారి జీవనశైలే ప్రాధాన్యం వహిస్తుందనీ చెప్పాడు.

ఫ్రాయిడ్ వ్యక్తిని సంఘంనుండి దూరంచేసి కేవలం స్వార్థాభిలాషిగా చూపించగా ఆడ్లర్ వ్యక్తిని సంఘంలోని ఒక వ్యక్తిగానే భావించి సాంఘిక మానవునిగా చూపిస్తాడు. యూంగ్ వీరిద్దరి దృష్టిలోని వ్యక్తిని గుర్తించి ఈతడు వ్యక్తిని సంస్కృతి పరంగా ఊహించి జాతి వారసత్వాన్ని ప్రవేశపెట్టి ఆయా జాతుల వారసత్వ ప్రతినిధిగా చూపిస్తాడు.

ఈ విధంగా ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్ ల మనోవిశ్లేషణ సిద్ధాంతాల ప్రాతిపదికతో వ్యక్తి వైయక్తికంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా వారసుడుగా ప్రాచీనకాలంనుండి లోకంలో వర్తిస్తున్నాడనీ చెప్పవచ్చు. అందువల్ల ప్రాచీన సాహిత్యంలో ఆడ్లర్, యూంగ్‌ల భావాలకు అనుగుణమైన పాత్రచిత్రణే మనకు కనిపిస్తుంది. ఆ సాహిత్యమంతా వ్యక్తిలో రూపుకట్టిన సామూహిక మనస్తత్వాన్ని మేలుకొల్పే ప్రయత్నంగా నడిచింది. ఈ విధమైన సామూహిక మనస్తత్వంలో వ్యక్తికి చేకూర్చవలసిన నైతిక,ధార్మిక,ఆధ్యాత్మిక,సాంస్కృతిక,మానవతా మూల్యాలున్నందువల్ల ఆ విలువలను కాపాడడానికి సాహిత్యమంతా సాంఘిక ప్రయోజనాభి ముఖంగా నడిచింది.అందువల్ల ప్రాచీనసాహిత్యంలోనిపాత్రలు కూడా వైయక్తిక మనస్తత్వంతో చిత్రింపబడకుండా సామూహిక మనస్తత్వంతో చిత్రింపబడినట్లు అవి క్లిష్టతలేని పాత్రలుగా కనిపిస్తాయి.

## 5) క్లిష్టత కలిగిన పాత్రలు.

క్లిష్టత కలిగిన పాత్రలు మానసిక ఘర్షణకు లోనౌతాయనీ, దీనికి కారణం ఆయా పాత్రల్లో ఉండే బలహీనతనీ, ఆ బలహీనతవల్ల ఆయా పాత్రల్లో అంతర్‌ఘర్షణ అధికంగా చూపించటం జరుగుతుందనీ లోగా చెప్పుకున్నాం.

ఈనాటి మనోవిశ్లేషణాత్మక నవలల్లో క్లిష్టత కలిగిన పాత్రలను చిత్రించటానికి గల కారణాలను పరిశీలిద్దాం.

సిగ్మండ్ ఫ్రాయిడ్ వ్యక్తిని కామేచ్ఛా జీవిగా రూపొందించి అన్నింటికి మూలకారణం వ్యక్తిలో బలంగా కలిగే ప్రేరణలకు మూలమైనది కామమనే భావనతోనే తన సిద్ధాంతాన్ని ప్రకటించాడు. వ్యక్తి వ్యక్తిత్వంపై ఎక్కువగా ప్రభావంచూపేవి లైంగిక కారకాలని వివరించాడు.

---

39,40 నవలా శిల్పం. పుట 28,29

ఈ లైంగిక కారకాలే వ్యక్తిని స్వార్థాభిలాషిగా, బలహీనునిగా చేయటానికి కారణమన్నాడు. కామమే వ్యాకులతకు, మానసిక సంఘర్షణలకు మూలమన్నాడు. వ్యక్తి పుట్టుకతో ప్రారంభమయ్యే కామం అనేక రూపాల్లో వ్యక్తిగత ప్రేరణలకు మూలమౌతుంది. కామం వివిధ రూపాల్లో వ్యక్తమయ్యే టప్పుడు అది కామంగా కాక కామనగా,ఇచ్ఛగా,కోరికగా మారుతుంది.

కామం యొక్క ప్రధానలక్షణం స్త్రీగతమైన ప్రేమ. అనుబంధ లక్షణాలు, ధనం, అధికారం,కీర్తి మొదలైనవి. ఈ కామజనితమైన ప్రేరణలతోనే వ్యక్తి వైయక్తికంగా, సాంఘికంగా, విశిష్టవ్యక్తిగా జీవించ గలుగుతున్నాడు. వైయక్తిక మనస్తత్వ చిత్రణగల నవలల్లోని క్లిష్టత కలిగిన పాత్రల్లో విభిన్న ముఖాలుగా రూపొందిన ఈ కామం యొక్క విలక్షణత్వాన్ని రచయితలు ఒక్కో పాత్రలో ఒక్కో విధంగా చిత్రించి మనకు సాక్షాత్కరింప చేస్తారు. అందువల్ల క్లిష్టత కలిగిన పాత్రచిత్రణ కామేచ్ఛా ప్రభావంగా నడుస్తుంది.ఈ కామేచ్ఛయే ప్రయోజనంగా మారి వ్యక్తిగత మైనపుడు స్వార్థాభిలాషిగానూ,సాంఘిక పరమైనపుడు పరార్థభావంతో,మానవతా దృక్పథంతో, నిస్వార్థాభిలాషతోనూ కనిపిస్తుంది. క్లిష్టత కలిగిన పాత్రలో ఎక్కువగా చూపించబడేది బలహీనతవల్ల పుట్టిన మానసిక సంఘర్షణ.

వ్యక్తి పుట్టుకతో మానసికంగా రూపొందింపబడేది కామంతో పాటు భయం.భయం అనేది మరణసహజాతానికి చెందినది.ఫ్రాయిడ్, సహజాతాలను రెండు విధాలుగా చూపించాడు. అవి జీవన సహజాతాలు,మరణ సహజాతాలు. జీవన సహజాతాలు వ్యక్తి మనుగడకు తోడ్పడగా, మరణ సహజాతాలు మరణానికి దారితీస్తాయని చెప్తాడు. దీనికి కారణం ప్రతి సహజాతం స్థిరత్వానికి లాగడంవల్ల అనగా ప్రతి సహజాతం పుట్టుకకు ముందుస్థితికి రావడానికి ప్రయత్నించడంవల్ల ఇది మరణ సహజాతంగా మారుతుంది.

పుట్టుకతో వచ్చే ఈ భయమే భీతిగా,బలహీనతగా,వ్యక్తిలో రూపొందుతుంది.మానసిక రోగులు అనేక విధాలైన భీతులతో ప్రవర్తిస్తుంటారు. వ్యక్తిలో మానసిక సంఘర్షణ ఎక్కువై వ్యాకులతకు లోనై నలిగిపోయి చివరకు భౌతిక,మానసిక ఒత్తడులకు తట్టుకోలేక వివశత్వం పొందినపుడు భయం భీతిగా మారి విచిత్రమైన రూపాల్లో వ్యక్తమౌతుంది.

వ్యక్తిలో పుట్టుకతో వచ్చిన భయం మరణాన్ని అంటిపెట్టుకున్నది కాబట్టి వ్యక్తిలో 'అభద్రతాభావాన్ని' కలిగింపచేస్తూ భయాన్ని భీతిగా,బలహీనతగా రూపొందించి వ్యక్తిలోని సామర్థ్యాన్ని,ధైర్యాన్ని, తగ్గిస్తూ క్రమంగా అసమర్థునిగా తయారు చేస్తుంది.ఈ బలహీనత శారీరకమైనదైనా,మానసికమైనదైనా, వ్యక్తిలో అసమర్థతకు మూలమై వ్యాకులతకు గురిచేస్తుంది.

వ్యక్తిలో రూపొందింపడే ఈ విధమైన వైయక్తిక మనస్తత్వంలోని కామం,భయం, అనే ద్వివిధమైన ప్రవృత్తులను ఆధారం చేసుకొని రచయిత పాత్రచిత్రణ గావిస్తాడు.క్లిష్టతలేని పాత్రలకు ఈ బలహీనతనే గుణం అంటదు కాబట్టి ఆ పాత్ర అసమర్థతకు లోనుకాదు.ప్రతి చర్యను

సమర్ధతతో ఎదుర్కొంటుంది.అందువల్ల వాస్తవిక పరిస్థితులలో కొన్ని సందర్భాలలో ఆ పాత్ర అస్వాభావికంగా జీవంలేని పాత్రగా కనిపించవచ్చు.కాని సమాజంలో ఎటువంటి పరిస్థితులనైనా ఎదుర్కొనే మనుష్యులు తాము తలపెట్టిన కార్యాలను సాధించే వ్యక్తులు, త్యాగాలకు ఆశయాలకు సేవాభావాలకు అంకితమైన దృఢమనస్కులు ఉంటారు.అటువంటి వ్యక్తిత్వం కలిగిన పాత్రలే ప్రాచీన సాహిత్యంలో కనపడతాయి.మన బలహీనతల ననుసరించి మన మానసికస్థితి గతులననుసరించి మన అనుభవ రాహిత్యంవల్ల అటువంటి పాత్రలు క్లిష్టతలేని పాత్రలుగా జీవంలేని పాత్రలుగా తోస్తాయి.

లోకంలోని వ్యక్తులలోని స్వార్ధం, అధికకామేచ్ఛ,మొదలగు ప్రవృత్తుల ఆధారంగా రచయితలు క్లిష్టత కలిగిన పాత్రలను సృష్టిస్తారు. ఇట్టి పాత్రలు సాంఘిక కట్టుబాట్లకు, ధార్మిక జీవనానికి కట్టుబడలేక స్వతంత్రంగా ఎదగలేక లోకధర్మాన్ని లేదా వ్యక్తిధర్మాన్ని నిర్ణయించుకోలేక తీవ్రమైన మానసిక అలజడికి గురై విచిత్రమైన స్వభావాలతో ప్రవర్తించినట్లు చిత్రించబడటం మనస్తత్వ చిత్రణ నవలల్లో జరుగుతుంది.అందువల్ల ఈ నవలల్లోని పాత్ర,పాత్రలోని మనసు,ఆ మనసులో ముద్రించుకున్న భయం,కామం,వ్యాకులత,క్లిష్టత కలిగిన పాత్రల్లో అధికంగా కనిపిస్తుంది.



# 2. విశ్వనాథ-నాలుగు నవలలు

## 2.1 విశ్వనాథ మనస్తత్వం.

ఒక వ్యక్తియొక్క మూర్తిమత్వం(Personality) బాల్యంలోనే రూపుకడుతుందని మనో వైజ్ఞానిక శాస్త్రజ్ఞులందరూ అంగీకరించారు. అంతేగాక ఆనువంశికతను,బాల్యాన్ని విద్యను చాలా మంది ప్రధానంగా భావించారు. ఆనువంశికతను ప్రవర్తనావాదులంతగా అంగీకరించక పోయినా మనోవిశ్లేషణ సిద్ధాంత వాదులందరూ దాని ప్రాధాన్యాన్ని గుర్తించారు. జన్యుశాస్త్ర ప్రకారంగా వారసత్వ లక్షణాలు తప్పకుండా ఉంటాయని కూడా ప్రయోగపూర్వకంగా నిరూపించారు.

విశ్వనాథవారి మనస్తత్వాన్ని,వ్యక్తిత్వాన్ని,తెలుసుకోవాలన్నా వారి ఆనువంశికతను బాల్యాన్ని విద్యను తప్పక తెలుసుకోవలసి ఉంది. విశ్వనాథలో ఆనువంశికత ప్రభావం చాలా ఉన్నట్లు వారి రచనలను బట్టి ఊహించవచ్చు. వ్యక్తియొక్క ఆనువంశికతలో ప్రధానంగా చోటుచేసుకునేది జాతి వారసత్వమంటాడు యూంగ్. విశ్వనాథలో వారసత్వంగా అభించిన లక్షణాలు, ముఖ్యంగా జాతివారసత్వం ఆయనలో బలంగా నాటుకపోయి సంస్కృతి, సంప్రదాయాలవైపు ఆయన మనస్తత్వాన్ని మళ్ళించాయి. పురాణాలను పుక్కిటబట్టిన ఆయన మనసంతా ప్రాచీన సాహిత్య జీవన సరళితో పెనవేసుకున్న ధార్మిక జీవనంపై మరలింది. ఆయనే ఒకచోట "మతమును, సంఘమును, మనోహరముగా చెప్పునదియే వాఙ్మయము" [1] అని అన్నాడు.

విశ్వనాథ నందమూరు గ్రామంలో పార్వతీదేవి శోభనాద్రులకు మన్మథనామ సంవత్సర భాద్రపద షష్ఠీ మంగళవారం 1895 సెప్టెంబర్ 10 నాడు జన్మించాడు. వీరిది సంప్రదాయ కుటుంబం. తండ్రి శోభనాద్రిగారు ప్రతిభావంతుడు. గొప్ప వ్యవహార జ్ఞానంగలవాడు. శివ భక్తుడు. అందరకీ ఉపకారం చేసేవాడు. 1902లో ఆయన కాశినుండి శివలింగాన్ని తెచ్చి నందమూరులో ప్రతిష్టించి శివాలయ నిర్మాత అయ్యాడు. ఈ విశ్వేశ్వరుడే విశ్వనాథవారి కులస్వామి. విశ్వనాథ తండ్రి గొప్పదాత. ఆయన తనదగ్గర ఉన్నదంతా అడిగినవారికి లేదనకుండా దానం చేసేవాడు. ఆయనకు ఆ గ్రామంలో ఎంతో పలుకుబడి ఉండేది. పూర్వీకులనుండి లభించిన అధికారం కూడా ఉండేది.

"వారి పూర్వులు ఆ ఊరును నెలకొల్పారనీ,ఒకనాడా ఊరి ఆస్తి అంతా వీరిదేననీ వీరే ఎందరినో తెచ్చి వారికి పొలాల నిచ్చి నిల్పారనీ,అందువల్ల ఆ గ్రామంపై గ్రామ ప్రజలపై అధికారం చలాయించడంలో అర్థం ఉందనీ,అదే అహంకారంగా మారి ఆనువంశికంగా తనలో చేరిందనీ,విశ్వనాథవారు చెప్పుకున్నారు." [2] ఇదే విషయాన్ని 'అంతరాత్మ' అనే తన మొదటి నవలలో

---

1. వేయిపడగలు,సమకాలీనత-సార్వకాలీనత. పీఠక 2. ఆత్మకథ. పుట. 34.

విశ్వనాథ తన బాల్యాన్ని 'సుగుణభూషణరావు' (పాత్ర) బాల్యంలో చెప్పాడు. నవలోని సుగుణ భూషణరావు విశ్వనాథయే.

విశ్వనాథవారి బాల్యం ఇంట్లనే గడిచింది. వారి నాయనగారే వారికి ప్రథమగురువులు. రామాయణ,భారత,భాగవతాదులు తండ్రి చెప్పగా వినేవాడు. విశ్వనాథకే కాదు ఆ గ్రామానికే వారి తండ్రి జ్ఞానప్రదాత. ఆయన ప్రతిరోజు సాయంత్రం ఆ ఊళ్ళో పురాణం చెప్పేవాడు. ఆ పురాణంవిన్న ఊరిలోని ప్రజలతో పాటు విశ్వనాథకు కూడా ఆ మహాకావ్యాలు కరతలామలక మైనాయి. విశ్వనాథవారు చిన్నతనం నుండే సూక్ష్మగ్రాహి. కనుక వెంటనే అర్థం చేసుకునేవాడు. అయిదేండ్ల ప్రాయంలోనే గుణింతం,సుమతీశతకం,కృష్ణశతకం,నరసింహ్మశతకం,ఆంధ్రనామ సంగ్రహం,పెద్దబాలశిక్ష,మొదలైనవన్నీ కంఠతా పట్టేశాడు. ఆనాటికే పాఠశాలలో ఇంగ్లీషు విద్యా బోధన ఉండేది. విశ్వనాథ తండ్రి పెద్ద ఆస్థిపరుడు కావడంవల్ల తమ పిల్లలు వ్యవసాయం చేసుకొని బ్రతుకుతారనే ధీమాతో విశ్వనాథకు పన్నెండేండ్లు వచ్చేవరకు ఇంగ్లీషు విద్యగురించి ఆలోచించలేదు. అందువల్ల పట్టణాలలో ఉన్న ఇంగ్లీషు చదువులు గాక పల్లెటూరి చదువే విశ్వనాథ వారి బాల్యవిద్య అయ్యింది. ఎన్నో విషయాలున్న పెద్ద బాలశిక్ష చదివిన విశ్వనాథకు ఎంతో చదువు చదివి నట్లయింది. పెద్ద పుస్తకాలైన కవిత్రయం వారి మహాభారతం,పోతన భాగవతం, భాస్కర రామాయణం,మొదలైన వాటిని విశ్వనాథ చిన్ననాటనే అర్థం చేసుకున్నారు.

విశ్వనాథవారు తన ఆత్మకథలో "నా ఆంధ్రభాషా పాండిత్యమునకు ప్రధాన గురువు మా తండ్రి,నా కుటుంబం,మాఊరు,ఆనాటి బిచ్చగాండ్రు,మా పాలేళ్ళు,(ఆత్మకథ.పుట36) అని చెప్పుకున్నారు. ఏడేండ్ల వరకు ఆయన పెద్ద పండితుడయ్యాడు. ఎనిమిదవ ఏట ఉపనయనం, పదకొండవ ఏట వివాహం జరిగింది. "పదకొండు సంవత్సరాల వరకు విశ్వనాథ విద్యాభ్యాసం వీధిబడులగు,నందమూరు,పెదపాడు,ఇందుపల్లి,వెలినూతలలో తెలుగు చదువు కొనసాగింది[3].

పన్నెండవ ఏట ఫస్టుఫారం,చదవటానికి విశ్వనాథ బందరు వెళ్ళాడు. బందరు చేరే నాటికి విశ్వనాథవారికి,భారత భాగవతాదులతోను,మనుచరిత్రాది ప్రబంధాలతోను గాఢ పరిచయం ఉండటంచేత పద్యరచన కూడా చేసేవాడు. ఆస్థి తరగడంవల్ల శోభనాద్రిగారు విశ్వనాథకు ఇంగ్లీషు విద్య చెప్పించాలనే ఉద్దేశ్యంతో బందరులో చేర్పించారు. విశ్వనాథ బందరు లో ఫస్టుఫారంనుండి బి.ఏ.వరకు చదివారు. బందరులో ఉన్నపుడే ఆయనకు గురువైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారితో పరిచయం,శిష్యత్వం,లభించాయి. అక్కడే అనేక సాహితీ సమావేశాల్లో పాల్గొనేవాడు. కవితా సాధన చేసేవాడు.

"ఆనాడు బందరులో తెలుగు కవితా సరస్వతి నాట్యమాడింది. అవధాన వినోదాలు గుంటూరు సీమ యువకులలోని కవితాశక్తిని వెలికితెచ్చి వెలార్చిన రోజులు. 1909 నుండి –

3. విశ్వనాథ వాఙ్మయ సూచిక. పుట. 5.

1915 వరకు విశ్వనాథ కవితాభ్యాసం నిరంతరంగా సాగుతూ వచ్చింది.చదివి ఏదో పెద్దఉద్యోగి కాగలడన్న ఆశగల తండ్రిగారు ఈ కవితా రచనకు వ్యతిరేకించారు. 1920 నుండి విశ్వనాథ సాహిత్యకృషి ఉద్దీప్తమైంది.ఆయనపేరు బందరుదాటి పరిసరాలుదాటి క్రమక్రమంగా తెలుగు దేశాన వ్యాపించటం ప్రారంభమైంది.ఆరోజులలో ఆయన 'ఆంధ్రపౌరుషం,ఆంధ్రప్రశస్తి గిరికుమారుని ప్రేమగీతాలు,కిన్నెరసానిపాటలు,కోకిలమ్మపెండ్లి,నర్తనశాల,మొదలైనవి వ్రాశాడు."[4]

"బందరులో ఆయనను ప్రభావితుని చేసిన మరొక మహావ్యక్తి శ్రీ కానుకొలను త్రివిక్రమ రామారావు.(వీరు సన్యసించి కుర్తాలం సిద్దేశ్వరీ పీఠాధిపతులు శ్రీ విమలానంద భారతీస్వామి అయినారు.) భారతీయ విజ్ఞానంమీద,సంస్కారంమీద,ఆయనకు గల గాఢమైన ప్రత్యయం, సతార్కికమైన ఆలోచనారీతి,విశ్వనాథ వ్యక్తిత్వాన్ని నాటి భావకవులందరి కంటెను విలక్షణమైన దానిగా తీర్చిదిద్దినది.ఈ ప్రభావాలనుండి విడువడి విశ్వనాథ వ్యక్తిత్వం కవితాశైలీ స్వయం వ్యక్తమగుట ప్రారంభించినది."[5]

సమకాలికులైన వారితో సాహిత్యంలోని అనుకూల,ప్రతికూల,విమర్శలకు ఎదురొడ్డి నిలిచే పరిస్థితికూడా అప్పుడే విశ్వనాథకేర్పడింది.దీక్షతో తనకున్న సంస్కృతాంధ్ర సాహిత్య పాండిత్యానికి తోడుగా ఆంగ్లసాహిత్యాన్ని అధ్యయనం చేసి దాని లోలోతుల్లోని రహస్యాలను అవగాహన చేసుకున్నారు.

"పాతదినములు పోవుచు కొత్తదినములు వచ్చుచున్న సంధివేళ పుట్టి పెరిగిన వాడాయన.ఆయన ప్రతిదినము రాత్రులందు భోజనము చేసి తలవైపున ప్రక్కవద్ద దీపంపెట్టి చదువుటకారంభించును.ఆ చదువుట తెల్లవారి కోడికూయు వరకు అట్లే చదువును.ఈరీతిగా ఆయన ఇంగ్లీషు నవలలు,కావ్యములు,చదివెను.తెలుగువాని కన్న అవి బాగున్నవని తలచెను'[6]

ఆనాటికాలంలో ఉదృతంగా,ఉవ్వెత్తుగా,ఎగిసి వచ్చిన ఉద్యమాల నన్నింటిని విశ్వనాథ పరిశీలించాడు. జాతీయోద్యమం,సాంఘిక సంస్కరణోద్యమం,సత్యాగ్రహోద్యమం,మొదలైన ఉద్యమాలు అతని మనస్సును కలిచివేసాయి.ముఖ్యంగా ఆనాటి పాశ్యాత్య నాగరికతా ప్రభావం భాషాప్రభావం,వ్యక్తులలో ఏవిధంగా గూడు కట్టుకుందో గ్రహించాడు.క్రమంగా జాతిఅంతా నిస్సత్తువగా,నిర్వీర్యంగా,దిగజారి పోతున్నట్లు భావించాడు.పరంపరా గతంగా వస్తున్న అమూల్యమైన, అద్వితీయమైన,మన సంస్కృతి,సంప్రదాయం,ఏ విధంగా పరభాషా వ్యామోహం లో అడుగంటి పోతున్నదో గ్రహించాడు.ఆ సమయంలోనే నిద్రాణమైయున్న జాతి వారసత్వం ఆయనలో మేల్కొంది.ఆయన ఈవిధంగా అనేవాడట.

"రాను రాను నా కవితలో ఒక్కొక్క మెట్టులో ఒక్కొక్క విలక్షణత కనిపిస్తూ వచ్చింది.నా గుండెలోనుండి వస్తున్న మాటల్లో ఒకమార్పు వినూత్నంగా నాకు తోచింది.అప్పుడు నాకు

---

4,5, విశ్వనాథ వాఙ్మయ సూచిక. పుట.7 6. విశ్వనాథ శారద.(ప్రథమభాగం)పుట.24

తెల్సింది.నా శైలి ఒకటి ఉన్నది.అది సకల పూర్వాంధ్రుల కోవలోనిదే కాని వానికంటె అది చాలా విలక్షణమైనది.ఇది ఇంకొకని శైలితో లగించదు.కొన్ని వేలపద్యాలు వ్రాసి నాకు నచ్చక చింపి పారవేసాను.బహుశా అచ్చులో పడినన్ని చింపివేశానేమో.నాకొక పరినిష్ఠితమైన శైలి ఏర్పడిన తర్వాత నాకు అంత మాత్రపు కవితలపై మోజుపోయింది.ఒక మహాకావ్యం వ్రాయాలి. అది నా జీవితానికి చరితార్థత.ఆ ప్రతిజ్ఞ భగవంతుడు చెల్లించినాడు."[7]

పై వివరణవల్ల విశ్వనాథ వ్యక్తిత్వంలోని విలక్షణమైన రచనారీతికి గల కారణాలు స్పష్టమౌతున్నాయి.విశ్వనాథ పూర్వాంధ్ర కవుల కోవలోనే తననుతాను నిర్మించుకున్నాడు.అట్లే వ్రాయడానికి ప్రయత్నించాడు.సమకాలీన పరిస్థితులలో ఆయన జీవిస్తున్నా,పాశ్చాత్య భాషా సంపర్కం ఆయనకున్నా,ఆయన సహచరులు సమకాలీన పరిస్థితులచే ప్రేరితులై ఉద్యమాల ప్రభావాలకు లోనై రచనలు చేస్తున్నా,విశ్వనాథవారు మాత్రం చలించకుండా తన 'రామాయణ కల్పవృక్షాన్ని' సంప్రదాయ పద్ధతిలో రచించారు.మిగతా తన సాహిత్యాన్నంతా తాను నమ్మిన సిద్ధాంతాలతో,నమ్మకాలతో,భావాలతో,నింపి తన రచనలు సాగించాడు.

విశ్వనాథవారు స్వయంగా ఇలా అన్నారు."మొదట నేను ఏమి వ్రాస్తానో నేను తెలుసుకొని వ్రాస్తాను కనుక.నేను వ్రాసేదానిలో అనంత విషయాలు చొప్పించి వ్రాస్తాను కనుక.అనాది నుంచి ఈ దేశంలో ఒకటి జ్ఞానం అనిపించుకుంటూ వస్తున్నది.ఆ జ్ఞానం నా పాఠకులకు కల్పించి నేను సఫలుణ్ణయి వాళ్ళను జ్ఞానవంతులను చేస్తున్నాను అనే భావం నాకున్నది కనుక. ఈ భావం ఉన్నవాళ్ళు చాలామంది ఉన్నారని నాకు తెలుసును కనుక.పూర్వ సాహిత్యం ఒకటి ఉన్నది.నేను పోతే నాతోపోయే వాళ్ళు నన్నయ,తిక్కన,ఎఱ్ఱన,నాచన సోమన, పోతన, శ్రీనాథుడు, పెద్దన,తెనాలి రామకృష్ణుడు,మొదలైనవారు."[8]

విశ్వనాథవారు ఆధునిక కాలంలో పుట్టి,ఆధునిక పరిసరాలలో పెరిగి,ఆధునిక వాతావరణంలో తిరిగి,ఆధునిక విద్యలు అభ్యసించినా,వాటి ప్రభావం ఆయనమీద ఏమాత్రం పడకపోగా, వాటివల్ల ఆయన విరక్తి చెంది ఆ ప్రభావాలు తనపై వేస్తున్న ముద్రలకు చలించిపోయి వాటిని తట్టుకునే శక్తిని అలవర్చుకున్నాడు.తనలాగే తన ఆంధ్రప్రజలు ఇటు తమ సంస్కృతిని సంప్రదాయాన్ని వదులుకోలేక,అటు ఆధునిక ప్రభావాలకులోనై వర్తించలేక మథనపడుతున్న తరుణంలో విశ్వనాథ సత్యనారాయణగారు గతవైభవ స్మరణంతో ధార్మిక, నైతిక,సాంస్కృతిక, ఆధ్యాత్మిక,మూల్యాలను పాదుకొల్ప నిశ్చయించి నన్నయాదుల సంప్రదాయ మార్గంలో తన రచనలను సాగించడానికి పూనుకున్నాడు.

సమాజంలో కొందరు వ్యక్తులు తమ వైయక్తికమైన ప్రయోజనాలకు,స్వార్థాభిలాషలకు, అధికమైన ప్రాముఖ్యం ఇస్తారు.మరికొందరు సామాజిక దృక్పథంతో కుటుంబం,సంఘం,

7. విశ్వనాథ శారద. (ప్రథమభాగం).పుట.25. 8. మహతి. నేను-నా సాహిత్య రచనలు.పుట.4.

సమాజం, ఆదర్శం,దృష్టిలో ఉంచుకొని వర్తిస్తారు. పుట్టినప్పటినుండి ఈ రెండు రకాలైన (వైయక్తిక,సామూహిక) మనస్తత్వాలు మనిషిలో ఉన్నా వికాసదశలో వ్యక్తిపొందే శిక్షణ,విద్య, అభ్యాసం,అలవాట్లు,పరిసరాలు,సంస్కృతి,సంప్రదాయం, మొదలైన వాటి ప్రభావం వ్యక్తిని ఒక రకమైన మనస్తత్వానికి లోబడేటట్లు చేస్తాయి.వైయక్తిక మనస్తత్వం గలవాడు తనకోసమే తాను బ్రతుతాడు.వ్యక్తిగత అభిప్రాయాలకు,అభిలాషలకు,వైఖరులకు,అలవాట్లకు,ప్రాధాన్యం ఇస్తాడు. సామూహిక మనస్తత్వం గలవారిలో నిస్వార్ధత,మానవత,సాటివారి పట్ల సానుభూతి ప్రధానంగా కనిపిస్తాయి.ఈ విధమైన లక్షణం సమాజంలోని వ్యక్తులలోనే కాకుండా వారి సాహిత్యంలో కూడా మనం చూడవచ్చు.విశ్వనాథవారి మనస్తత్వం జాతి వారసత్వంతో ముడి వేసుకున్నది కాబట్టి వారి రచనలన్నీ జాతిని నిలబెట్టేవే.

## 2.2.విశ్వనాథ వైఖరి.

"ఆయన మహా పండితుడే, గొప్ప అధ్యాపకుడే, మహాపురుషుడే, కాని ఆయన చాలా గర్వి.అహంకారి, కోపిష్టి,తొందరపాటు మనిషి,తిడ్తాడు మొహాన ఉమ్మేస్తాడు, ఏ క్షణాన ఎలా ఉంటాడో తెలియదు. ఆయనతో వేగటం చాలా కష్టం.అంతంత మాత్రంగా ఆయన దగ్గర చేరనీయడు.మనిషి చాలా భయంకరుడు....."[9] ఇలా కొందరు ప్రబుద్దులు మా నాన్నగారిని భయపెట్టగా మా నాన్నగారప్పుడు 'దూరపు కొండలు నునుపు అంటారు. శ్రీవిశ్వనాథవారి విషయంలో అలాకాదు. ఆయన దూరానికి గర్విగా,అహంకారిగా,కోపిష్టిగా,కనుపించవచ్చు. సమక్షంలో,సన్నిధిలో ఆయన అమృతప్రాయుడు.దూరంనుండి కాదు దగ్గరినుండే అలాంటి వారిని అర్థం చేసుకోవాలి.అని నన్ను కాలేజిలో చేరడానికి పంపించారు."[10]

పేరాల భరతశర్మగారు 'విశ్వనాథలో నేను' అనే వ్యాసంలోపై విధంగా చెబుతారు.

వైఖరి అనే పదానికి మనోవిజ్ఞాన శాస్త్రంలో వివరణ ఈ క్రింది విధంగా చెప్పబడింది. "వ్యక్తులపట్ల, వస్తువులపట్ల,సన్నివేశాలపట్ల,అనుకూలంగాని ప్రతికూలంగాని వ్యవహరించటానికి ఉండే సంసిద్దతను వైఖరి అనవచ్చు.వైఖరి ముఖ్యంగా అనుకూల లేదా ప్రతికూల ప్రతిచర్యను చూపటానికుండే సంసిద్ధతను సూచిస్తుంది."[11.]

విశ్వనాథ వైఖరి అనగా ఇతరులు ఆయనను విమర్శించిన విధానం కావచ్చు,వారు అనుకూలురైనా, ప్రతికూలురైనా,విశ్వనాథవారు తమకర్థమైన రీతిలో తమతమ అభిప్రాయాలను వెల్లడించి ఉండవచ్చు. విశ్వనాథపై ఆయన రచనలపై తమ అభిప్రాయాలను వెలువరించినవారు ముఖ్యంగా రెండు రకాలుగా ఉన్నారు.మొదటివారు విశ్వనాథవారికి అతి సన్నిహితులు.రెండవ రకంవారు విశ్వనాథవారి గ్రంథాలను పైపైన చదివి అర్థం చేసుకున్నవారు.అందుకే ఆయన

---

9,10, విశ్వనాథ శారద.(ప్రథమభాగం). పుట.5  11. సాంఘిక మనోవిజ్ఞాన శాస్త్రం. పుట.114.

ఎన్నోసార్లు ఈ విధంగా అనేవాడట.

"...నా నవలల్లో చూడు నెలకు సరిపడ రాత్రులన్నింటి స్వరూపం తెలుస్తుంది.నా రామాయణం నా సకలోహవైభవసనాథమని వట్టి గప్పాలు చెప్పుకోలేదు నాయినా.వాడికి మనస్సనేదే ఉంటే చదవట మనేదే తెలుస్తే నా రామాయణం చదివినవారు లోకాన్ని నేను ఎంత నిశితంగా అనుశీలించానో తెలుసుకుంటాడు. కాలంలోని ప్రతి లిప్తను నేను చూచాను. దేశంలోని ప్రతి అంగుళం నేను కొలిచాను. ఇలా ఉపన్యాసాలలో చెప్తే వీడికి అహంకారం అనుకుంటారు. కాదు నాయనా! నా గ్రంథాలు చదవండి. నేను ఏమి చెప్పానో చూడండి అంటాను. నా పుస్తకాలు చదవకుండా విమర్శించేవారే నాకు ఎక్కువైనారు.నేనేం చేసేది."[12].

ప్రతికూల విమర్శలవల్ల విశ్వనాథవారు ఎంతగా మథనపడ్డారో,తనను సరిగా అర్థం చేసుకోలేదనీ,తన రచనలను సునిశితంగా పరిశీలించి చదువకుండానే విమర్శచేస్తున్నారనీ, బాధపడుతూ అన్న మాటలుగా తోస్తాయి.

ఆయనను బాగా అర్థం చేసుకున్నవారు ఈవిధంగా అంటుంటారు."ఆయన బ్రాహ్మీ మయ మూర్తియట, సర్వాంధ్ర జగత్తునకు సాక్షాత్తుగా కవిసామ్రాట్టని బిరుదు వహించినారట, ఆర్షధర్మానికి ఆవగింజంతయైన పొచ్చెము రానియ్యరట,తమ సిద్ధాంతమునందు మహోగాఢ దీక్షాతత్పరత గలవారట,వర్ణవ్యవస్థ సమాజం అటులనే ఉండవలెనని సిద్ధాంతం గలవారట, అదియు గాక సంస్కృతాంధ్రాంగ్ల భాషావారాశిలో గాహనం బొనరించి ప్రథములుగా పరిగణింప బడినారట,అదియుంగాక కమ్మని కవిత్వమునకు ఆయన గుండె చెమ్మగిల్లునట."[13].

విశ్వనాథ 'రామాయణ కల్పవృక్షం' చదివినవారిలో కొందరికి ఆయన కనిపించేతీరు ఈవిధంగా ఉంటుంది."...ఆ మాటకు వస్తే కల్పవృక్షంలో రాముడిలో ఆయన కన్పిస్తారు. విశ్వామిత్రుడు ఆయను అనిపిస్తుంది.దశరథుడు,జనకుడు,వారి ఉదాత్తత వారి చమత్కారాలు, చూడండి.వారిలో ఆయన లక్షణాలు లేవూ? బాలకాండలో చూడండి,....ఆయనయొక్క ఒక్కొక్క గ్రంథంలోని ఒక్కొక్క ఉత్తమోత్తమ పాత్ర ఆయనే..."[14].

ఈ విధంగా ఆంధ్రసాహితీలోకంలో విశ్వనాథవారి స్థానం అత్యున్నతమైనదని చెప్పవచ్చు.వ్యక్తులలో ద్వివిధమైన వైఖరులుంటాయని ఈ వైఖరులవల్లనే ఆయా వ్యక్తులు ఆ విధంగా ప్రవర్తిస్తారని యూంగ్ చెప్పాడు.వారే అంతర్వర్తనులు,బహిర్వర్తనులని రెండు రకాలు. అంతర్వర్తనులు ఎక్కువగా తమ మానసిక క్రియాకలాపాలన్నీ అంతరంగం వైపు మళ్ళించుకొని తమ అంతరంగ ప్రపంచంలోనే విహరిస్తారు.తమలో తాము తవ్వుకుంటూ గతవైభవాన్ని తలచుకుంటూ (స్మృతులను,జ్ఞాపకాలను) ఆనందిస్తారు.

విశ్వనాథవారు అంతర్వర్తనులని చెప్పవచ్చు.వారు గతవైభవాన్ని తన రచనల్లో

12,14.విశ్వనాథశారద.ప్రథమభాగం.పుట.21,34, 13,విశ్వనాథ జయంతి సంచిక.పుట 81.

చూపించారనీ,సంస్కృతిని సంప్రదాయాన్ని జాతివారసత్వాన్ని తమ సాహిత్యంలో నిలబెట్టటానికి ప్రయత్నించారనీ చెప్పవచ్చు.కొందరికిది నచ్చక సంప్రదాయవాది,పునరుద్ధరణవాది,ఛాందసుడు, ఆయన ప్రాచీన భారతదేశం లాంటివాడు అనీ....విశ్వనాథవారిది పాత యూనివర్సిటీ,ఆయన ప్రాచీనఋషి అనీ ఆయన మనోవాక్కాయ కర్మలన్నీ పూర్వకాల వైభవంతో నిండి నిబిడీకృతమై ఉన్నాయనీ.." [15].ఈ విధంగా ఆయనను పాతకాలంనాటి మనిషనీ విమర్శించినా, విశ్వనాథ వారు మాత్రం అందరూ ముందుకు పరుగెత్తుతుంటే కాస్తవెనక్కు చూస్తూ పరుగెత్తండయ్యా అంటూ హెచ్చరించినవాడు.నిజంగా ఆయన రచనలన్నీ చదివి పరిశీలించితేగాని అర్థంగాని వ్యక్తి.ఆయన వ్యంగ్యంగా చెప్పిన ఎన్నో విషయాలు అర్థవంతంగా ఉండి ముందుచూపును కలిగిస్తాయనీ చెప్పటంలో సందేహంలేదు. ఆయన రచనలన్నీ ధార్మిక,నైతిక,సాంస్కృతిక, ఆధ్యాత్మిక,మానవతా మూల్యాల కోసం నిలిచినట్టివే.

## 2.3 విశ్వనాథ సాహిత్య ప్రయోజనం.

విశ్వనాథ రచనలన్నీ ఒక మహా ప్రయోజనాన్ని ఆధారించుకొని వెలువడినట్టివి.ఆ ప్రయోజనం కేవలం పూర్వవైభవాన్ని చాటడమో,పునరుద్ధరణ వాదాన్ని బలపర్చడమో, ప్రాచీన వ్యవస్థలాగే ఆధునిక సమాజంకూడా ఉండాలనీ ఆశించటమో కాదు.ప్రయోజనమనేది కేవలం భౌతిక విషయాలపై,సంస్కరణలపై,ఉద్యమాలపై,వాదాలపై,కేంద్రీకరించి చూడటమన్నది కాదు.ఆ ప్రయోజనం కాలానుగుణంగా ఆనాటికి అది కొత్తదైనా కాలం గడిచినకొద్దీ ఆ ప్రయోజనానికి అర్థం లేకుండా పోవచ్చు.విశ్వనాథ సాహిత్య ప్రయోజనం పైన అనుకున్నట్లుగా భౌతిక విషయాలపై కేంద్రీకరించి నిలిచినది కాదు.వ్యక్తుల అంతరంగాలలో ఉన్న మలినాన్ని కడిగివేసి అందులో ఉన్నతమైన నైతిక,ధార్మిక,ఆధ్యాత్మిక,మానవతా మూల్యాలను ప్రవేశపెట్టడమే. ఈ ప్రయత్నంలో విశ్వనాథ తన జీవితాన్ని ధారపోశాడు.సర్వశక్తులు వినియోగించాడు.అపారమైన సాహిత్యాన్ని సృష్టించాడు.పండితులకు,భాషావేత్తలకు,అనుకూలమైన భాషా నైపుణ్యంతో రచనలు సాగించాడు. వ్యక్తిగతమైన అభిప్రాయాలతో,కోరికలతో,మూఢనమ్మకాలతో,వ్రాసినట్టివి కావు. సమాజాన్ని దృష్టిలో ఉంచుకొని సమాజంలోని వ్యక్తుల మనస్తత్వాలను గుర్తెరిగి అర్థం చేసుకొని తన రచనలను కొనసాగించాడు.

"నేను మానవ ప్రవృత్తిని ఆమూలాగ్రంగా పరిశీలించి తెలుసుకొని స్టడీచేసి వ్రాశాను" [16]. అన్న మాటల్లోని సత్యాన్ని మనం ఏ చిన్న రచనలోనైనా చూడవచ్చు.

సాహిత్యానికి విశ్వనాథవారు ఇచ్చిన నిర్వచనం ఇట్లా ఉంటుంది."సాహిత్యమనగా నేమి? సహితానాం భావః సాహిత్యం. సహితములైన వానియొక్క భావము సాహిత్యము.

---

15. విశ్వనాథ శారద ప్రథమభాగం.పుట 55. 16.వేయిపడగలు-సమకాలీనత-సార్వకాలీనత. పుట.126

సహితమనగా కూడుకొనియున్న అనే అర్థం లోకమునందు చెప్పుచున్నారు. కాని హితమైన దానితో కూడుకొని యున్నదని అర్థము. హితమనగా నేమి? 'హితం మనోహారి చ దుర్లభం వచః' అని భారవి వ్రాసినాడు. హితము, మనోహారియు, నైన వాక్కు దుర్లభము. ఏమాట మనోహరముగా నుండునో మనస్సునకు తాత్కాలికమైన ఒక పొంగును తెచ్చునో అట్టిదియు, హితమైనదియు నైన మాట దుర్లభము. హితమనగా నేమి? హితమనగా పథ్యము. అనగా తత్కాలమందు అనిష్టముగా నుండి అనంత కాలమునందు మేలును సమకూర్చునది. వైద్యుడు పథ్యము చెప్పును. అది తినుట కష్టము. కాని తిన్నచో వ్యాధి కుదురును. మొత్తము మీద సాహిత్యమనగా తత్కాలము నందు హితముగా నుండదు. అనంతకాలము నందు హితముగా నుండును. తరువాత మేలును కూర్చును. తరువాత ననగా నెప్పుడు? దానితో నీవు పరిచయము వృద్ధి చేసుకొని దానిలోని సౌందర్యమును ఆస్వాదించుటకు అలవాటుపడి ఆ సౌందర్యమును అనుభవించుచు నానందము పొందగలిగినంత జీవ లక్షణము పెంపొందించుకొని అందులో చెప్పబడ్డ మహావిషయములే యదార్థములని తెలుసుకున్న తర్వాత నది సాహిత్యమగును."[17].

పై వివరణలో సాహిత్యానికి గల సంబంధాన్ని వ్యక్తిలోని జీవలక్షణంతో ముడిపెట్టడం, అత్యున్నంతంగా విప్పి చెప్పటమే. జీవలక్షణం సంస్కార బద్ధమైనచో సాహిత్యానికి గల ప్రయోజనాన్ని అర్థాన్ని గ్రహించ గలుగుతుంది.

జీవలక్షణం వ్యక్తియొక్క మనస్తత్వానికి సంబంధించింది. వ్యక్తుల మనస్తత్వాలను దృష్టిలో ఉంచుకొని వారిలోని జీవలక్షణాన్ని మేల్కొల్పడమే ధ్యేయంగా పెట్టుకొని విశ్వనాథ తన రచనలను కొనసాగించాడని చెప్పవచ్చు.

సాహిత్యంలోని హితానికిగల రెండర్థాలను వివరించి అవి పాఠకులకెట్లా ఉపయోగిస్తాయో విశ్వనాథ వివరించాడు. ఈ విధమైన హితాన్ని కలిగిన సాహిత్యం ఆయనది. అందువల్ల ఆయన సాహిత్యం కొందరికి పథ్యంగా పరిణమించింది. మరికొందరికి ఆయన సాహిత్యం రుచించలేదు. తాత్కాలికమైన ఉద్రేకాన్ని ఉత్సాహాన్ని వారికి కలిగించక పోవటమే అందుకు కారణం కావచ్చు. పైగా విశ్వనాథను పునరుద్ధరణవాదిఅనీ, సంప్రదాయాభిమానిఅనీ, తిరోగమనవాది అనీ, గతవైభవ స్మృతుల్లో కలలుగనే వ్యక్తి అనీ, పలువిధాలుగా విమర్శించ టానికి పూనుకున్నారు. అలాంటివారు ఆయన సాహిత్యంతో మనస్ఫూర్తిగా సన్నిహితాన్ని పొందలేక పోయారు.

"విశ్వనాథ సత్యనారాయణగారు రాజకీయ నాయకుడుకాదు. సంస్కరణోద్యమ కర్తకాదు. ఆయన సత్యాగ్రహం చేయలేదు. జైళ్ళకు వెళ్ళలేదు. నినాదాలతో, విధానాలతో, జనాన్ని సమీకరించే తరహాకు చెందిన రంగంలో క్రియాశీల కార్యకర్త కాదు. కాని రాజకీయాది రంగాల్లో మహామహులైన నాయకులు సాగించినంత పటిష్టంగా సత్యనారాయణగారు జాతీయతా భావనా

---

17. విశ్వనాథ శారద. జయంతి సంచిక. పుట. 47

ప్రసారాన్ని సాగించారు. పాశ్చాత్య సంస్కృతి సామ్రాజ్యవాద క్రూరత్వాన్ని ఎదిరించే స్ఫూర్తిని కలగించారు. ఆయన సాహిత్యమంతా ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం."[18]

విశ్వనాథ సాహిత్యాన్ని చదివి అర్థం చేసుకున్నవారు ఈ విధంగా శ్లాఘించారు.

"సాహిత్యం స్ఫూర్తిని,ప్రేరణను,కలిగిస్తుండు బలమైన సంకల్పశక్తిని ఇస్తుంది.కాని వాచ్యంగా నినాదాలివ్వదు.నినాదాల ప్రచార రంగంవేరు.సాహిత్యం ఆలోచనా రంగం.అనుభూతి రంగం.'[19]

విశ్ననాథ సాహిత్యమంతా ఆలోచనలతో కూడుకున్నదై అనుభూతి ప్రధానమై జాతీయతా భావ దృష్టిని మానవుని మనస్తత్వంలో ధర్మానురక్తిని కలిగించునట్టిది. విశ్వనాథ సాహిత్యం వ్యక్తియొక్క భౌతిక అసమానతల విషయం వివరించి ఆ అసమానతల తొలగించే ఉపాయాన్ని చూపునట్టిది కాదు. భౌతిక అసమానతలకు మూలకారణం వ్యక్తుల మనస్తత్వాలలో ఉండే అధార్మిక చింతన,స్వార్థాభిలాష,వ్యక్తిగత ప్రయోజనాపేక్ష,మొదలైనవెన్నో కారణాలు. వాటి నన్నింటిని వ్యతిరేకిస్తూ వ్యక్తిలో పేరుకు పోయిన స్వార్థాన్ని తొలగింపజేస్తూ తనకోసం కాదు నలుగురికోసం బ్రతుకుమని దారిచూపే సాహిత్యం విశ్వనాథది.

"సంఘంలో గాని మతంలో గాని మరొకదానిలో గాని మీరెన్ని మార్పులైనా తేవచ్చు ఇంద్రియనిగ్రహం,మనోనిగ్రహాల ద్వారా భక్తియో జ్ఞానమో కలుగుటకు వీలుండెనేని. మీరు తెచ్చిన మార్పు శిరోగ్రాహ్యము."[20]

విశ్వనాథవారు మారుతున్న సమాజంలో మనిషిలోని మనస్తత్వం అర్థకామాల అన్వేషణలో ఉద్యమాల సిద్ధాంతాలలో ఎలా రూపుదిద్దుకుంటుందో గ్రహించాడు. వ్యక్తి నానాటికి స్వార్థపరుడై సాంఘిక జీవనంలోనుండి తప్పుకొని స్వేచ్ఛా,స్వాతంత్ర్యాల నినాదాలతో కుటుంబాన్ని సంఘాన్ని మతాన్ని విచ్ఛేదించే ప్రయత్నలోకి దిగుతున్నట్లు గమనించాడు. ఆయన లోని జీవుడు ఆరాటపడ్డాడు. ఒకవైపు రామాయణ కల్పవృక్షాన్ని వ్రాస్తూనే ఎన్నో ఇతర రచనలను గావించాడు. ఆ రచనలనన్నింటియందు భౌతికవిషయాలుగాక మానసిక పరివర్తన కలిగించే మార్గాలెన్నో చూపాడు.

విశ్వనాథ సాహిత్యం యొక్క ప్రయోజనాన్ని అన్ని విధాల తెల్పినవాడు. ఒక్క వేయి పడగలు మహాభారతంవలె సాంఘిక జీవనం మొత్తం చిత్రీకరిస్తుంది. ఒక ఏకవీర నవల వ్యక్తియొక్క మానసిక సంచలనాన్నంతా వ్యక్తపరుస్తుంది. ప్రతి నవల,ప్రతి రచన,ఒక ఆదర్శాన్ని, ఒక సందేశాన్ని,ఒక సంస్కృతిని,ఒక సంప్రదాయాన్ని,ఆధారం చేసుకొని పుడుతుంది. వ్యక్తిని, కుటుంబాన్ని సంఘాన్ని సమాజాన్ని సంస్కృతిని ధర్మార్థకామమోక్షాలను నిలపాలనే ఆశయంతో అకుంఠిత దీక్షతో వ్రాయబడిన విశ్వనాథ సాహిత్యమంతా ప్రయోజనాపేక్షతో కూడినట్టిదే.

"......విశ్వనాథ అభ్యుదయ విరోధి కాదు. అభ్యుదయ సౌధానికి కూడా పునాదులు

---

18,19,20. వేయిపడగలు,సమకాలీనత–సార్వకాలీనత. పీఠిక

ఉండాలనీ,అవి మన నేలమీదనే కట్టాలనీ,అనేవాడు.బురుజులు కట్టే యత్నం అభ్యుదయ వాదులు చేస్తుంటే పునాదులు కదులుతే పుట్టగతులుండవనీ విశ్వనాథ ప్రబోధించాడు.అందువల్ల అభ్యుదయ భవనానికి గోడలెంత ముఖ్యమో పునాదులంతే ముఖ్యం.”[21] అన్నటువంటి ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి మాటలవల్ల విశ్వనాథ సాహిత్య ప్రయోజనం ఏమిటో మనకు స్పష్టమౌతుంది.‘పునాదులు’ అనేమాట సుబ్రహ్మణ్యంగారు వ్యక్తుల మనస్తత్వాలను దృష్టిలో ఉంచుకొని చెప్పిన మాటలే అని చెప్పవచ్చు.ఉద్రేకాన్ని రెచ్చగొట్టేతనాన్ని,విప్లవభావాన్ని ఉరకలెత్తించే వేగాన్ని కలిగించే అభ్యుదయవాదుల పోకడలకు విశ్వనాథ ఓ విధంగా అడ్డుకట్ట వేసి ఆలోచించి అడుగువేయమనీ ప్రబోధించిన వాడయ్యాడు.ఆధునిక కాలంలోని సాహిత్యమంతా స్వేచ్ఛను, తిరుగుబాటు తనాన్ని,వ్యక్తిలో స్వార్థాభిలాషను,కలిగించే విధంగా మారుతున్నదశలో విశ్వనాథ నలుగురు ఏమనుకున్నా నాకేమీ అనే నిశ్చయంతో తన సాహిత్యమంతా ఒక ప్రయోజనాపేక్షతోనే సృజించాడు.

ఆ ప్రయోజనం సనాతనమైనది,శాశ్వతమైనది,యుగధర్మమైనది,విశ్వస్థితికి మూల మైనది,అని భావించి దాన్నే వ్యక్త పరిచాడు.వ్యక్తి ఈ పమాజంలో ఏకాకి గాడని సమాజం కోసం వ్యక్తిగాని వ్యక్తి కోసం సమాజం కాదని తెల్పినవాడు.భౌతిక అసమానతలను ఎన్ని విధాలుగా తొలగించినా సమానస్థితిని అందరికి కలిగించినా సృష్టిలోని భేదంవల్ల వ్యక్తులలో గూడుకట్టుకున్న మానసిక స్థితిగతులవల్ల వ్యక్తులందరూ సమానత్వం పొందలేరని ఈ సమానత్వం భౌతికంగా గాక ఆంతరంగికంగా మానసికంగా చేయవలసి ఉంటుందని గ్రహించాడు.అందుచే ఆయన రచనలన్నింటిలో మానసిక జగత్తులోని అంతస్సూత్రమైన ధార్మిక జీవనానికి ప్రాధాన్యం కనిపిస్తుంది. ఈ విశ్వమానవులందరిని కట్టి ఉంచేది ఒక్క దర్మమేనని ఆ ధర్మమే వ్యక్తులలో మానవతను,ఆధ్యాత్మికతను,నెలకొల్పుతుందని,నమ్మి ఈ విధమైన రచనలను సాగించాడు..

## 2.4. విశ్వనాథ నవలా సాహిత్యం.

విశ్వనాథ సాహిత్యంలో కవిత్వం తర్వాత పై చేయిగా నిలిచింది నవలా సాహిత్యం. దానికి కారణం,కవిత్వం అందరికి అందుబాటులో నుండకపోవటం,నవల సామాజిక జనంలోకి చొచ్చుకపోయి సామాన్య పాఠకుని సహితం అలరించటం,తన నమ్మకాలు,విశ్వాసాలు,భావాలు; సామాన్య పాఠకునికి కూడా తెలియజేయాలనే ఉద్దేశంతోనే విశ్వనాథ నవలా సాహిత్యాన్ని ఎక్కువగా సృష్టించాడు.“ ఎన్నో నవలలు కావ్యాలు కథలూ వ్రాసిన మన ఆస్థానకవి శ్రీవిశ్వనాథ రచనలో అగ్రగణ్యుడు.ఆయన స్వాతంత్ర్యానంతరం నవలలకు పెద్ద కార్ఖానాయే స్థాపించినాడు.ఆయన గ్రంథానుభవం,లోకానుభవం,విస్తారమైనది.ఇంగ్లీషులో ఎన్ని నవలలు చదువుతారో అన్ని ఇంగ్లీషు సినిమాలు చూస్తారని వినికిడి.దృశ్యానుభవమూ,గ్రంథానుభవమూ,స్వానుభవమూ,ముప్పేటగా

21.విశ్వనాథ వారద.–రామాయణ కల్పవృక్షం.వ్యాసం. పుట.275.

నవలా పరిశ్రమనే అద్వితీయంగా సాగిస్తున్నారు.[22]

విశ్వనాథవారికి తెలుగు సాహిత్యమన్న ఎంత అభిమానమో అదే విధంగా ఆంగ్ల సాహిత్యం పైనకూడా అభిమానమెక్కువేననీ పైమాటలవల్ల తెలుస్తున్నది.ఆ కాలంలో ఆంగ్ల ప్రభావంవల్ల తెలుగు సాహిత్యంలో వస్తున్న మార్పులను,తెలుగు రచయితలు అనుకరిస్తున్న ధోరణులను,ఆయన బాగా గమనించే ఉంటారు.ముఖ్యంగా నవల అనే సాహిత్య ప్రక్రియ మొదట సామాజిక విషయాలకే పరిమితమై సంస్కరణాభిలాషతో రచయితలు వివిధ విషయాలను సంవదించుకొని నవలలు వ్రాసినా కాలానుగుణంగా కవిత్వంలో వచ్చిన 'కాల్పనికత' ప్రభావం నవలల్లో కూడా కనిపించసాగింది.అంతేగాక సాహిత్యంలోని మిగతా ప్రక్రియలకన్నా నవలకున్న వైశాల్యం,ప్రయోజనం,పరిధి,వ్యాపకత్వం,ఎక్కువ కావటంవల్ల ఆనాటి ప్రముఖ రచయితలు అందరూ నవలను చేపట్టి తమ అభిప్రయాలను,ఆశయాలను,వెల్లడించారు.

"నవల సమగ్రమైన సాహిత్య ప్రక్రియగా,అంటే వ్యక్తియొక్క అన్నివిధాల అభిప్రాయాలను, విభిన్నకోణాలనుంచి,అభివ్యక్తీకరించగల ఏకైక సాహిత్యపరంగా క్రమక్రమంగా రూపుదిద్దుకున్నది. అతి విస్తృతమైన భావసంచయాన్ని సంఘటనలను పాత్రలను వెలువరించటం ద్వారా నవలలో ఎంతో వైవిధ్యాన్ని సాధించవచ్చు."[23]

నవలకున్న ప్రాధాన్యాన్ని,వైశాల్యాన్ని,గమనించిన విశ్వనాథ నవలా ప్రక్రియను చేపట్టి తాను చెప్పదలచుకున్న విషయాల నన్నింటిని చెప్పటానికి వేధికగా చేసుకున్నాడు.వైయక్తిక, సామాజిక,చారిత్రిక,సంబంధమైన అనేకాంశాలను సమన్వయించుకొని దాదాపు అరవై నవలలు వ్రాశాడు.ఇవన్నీ వివిధ విషయాలతో ఉన్నా మన సంస్కృతిని ఎత్తి చూపేవే.

విశ్వనాథవారి మొదటి నవల' అంతరాత్మ'1921 లో వ్రాయబడినది.ఇదే నవల అదే సంవత్సరం 'శారద' అనే పత్రికలో ధారావాహికంగా వెలువడింది.[24]అంతరాత్మతో ప్రారంభించిన నవలాసాహిత్యాన్ని విశ్వనాథవారు చేపట్టి ఆంధ్రప్రజల అంతరాత్మలను మేల్కొల్పాలనే ఉద్దేశ్యంతో వ్యక్తిధర్మాన్ని,సామాజిక వ్యవస్థా ధర్మాన్ని ఆధారం చేసుకొని సుమారు అరువై నవలలను వ్రాశాడు.

1921నుండి సాహిత్యంలో,జనంలో,కాలంలో,వస్తున్న మార్పులను విశ్వనాథ సునిశితంగా పరిశీలించాడు.వ్యక్తులలో క్రమంగా నైతిక,ధార్మిక,ఆధ్యాత్మిక,సాంస్కృతిక,మూల్యాలు నశిస్తున్నాయని గ్రహించాడు.వ్యక్తులలో స్వేచ్ఛా మనస్తత్వమేర్పడి వైయక్తిక అభిలాషలతో నిర్ణయాలు తీసుకుంటూ సాంఘిక వ్యవస్థలనుండి దూరమౌతున్నారని విశ్వనాథ తెలుసుకున్నాడు.ఎన్నో ఆంగ్ల గ్రంథాలు చదివిన ఆయన ఆనాటికే సాహిత్యరంగంలో ప్రవేశించిన "ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్ 'ల సిద్ధాంతాలు చదివి ఉండవచ్చు.తెలుగులో వాటి ప్రభావం పొడసూపకముందే ఆ

22, మహతి. తెలుగు నవల. -వ్యాసం.నోరినరసింహశాస్త్రి.పుట 83 23. తెలుగు నవలా వికాసం. పుట.7

24. అంతరాత్మ' నవలకు గురించి( ముందుమాటలో) ఒక్కమాట

సిద్ధాంతాలను ఆకళింపు చేసుకున్న విశ్వనాథ వ్యక్తులలో గూడుకట్టుకున్న 'వైయక్తిక మనస్తత్వం' స్వార్థపూరితంగానూ,క్రమంగా ద్వేషపూరితంగానూ, మారుతున్న వైనం గమనించాడు. రెచ్చగొట్టె విధానాన్ని,ఉద్రేక స్వభావం,కామేచ్ఛ,మొదలైన మనస్తత్వాలు సాంఘికపరంగా అలజడికి మూలకారణాలవుతాయనే సత్యాన్ని తెలుసుకొని తన నవలా వ్యాసంగాన్ని విస్తృతం గావించాడు.

కేతవరపు రామకోటిశాస్త్రిగారు "......విశ్వనాథ తన సాహిత్యమంతా అంతఃకరణ చతుష్టయం అనబడే అంతరాత్మ పొరల్లో ఉన్న జీవ స్వభావాన్ని ఆశ్రయించుకొని ఉన్న మానవ సమస్యలకు రూపకల్పన చేసి వీటి స్వరూప స్వభావాలివ్వి,వీటికిది దోహదం, వీటికిది విరుగుడు,అని వ్యాఖ్యానించినాడు.చలంగారు కూడా రూపకల్పన వరకు విశ్వనాథలాగే చేశాడు. అభ్యంతర ప్రేరణలకు మనిషి కొట్టుకొని పోకుండా ధర్మాధర్మ విచక్షణ మనిషిని నిలబెట్టుట సామాజికమైన సుష్టువ్యవస్థకు అవసరమని విశ్వనాథ సహేతుకంగా ప్రబోధించాడు.వ్యక్తి సమాజానికి లోబడియుండుట వ్యక్తికి క్షేమమన్న శాస్త్రీయదృక్పథాన్ని అవలంభించి విశ్వనాథ రచనలు చేశాడు.అదే శాశ్వతమైన సత్యపథము.ఇష్టము వైయక్తికము.ధర్మము సమష్టి. సమష్టి యైన వ్యవస్థాధర్మమును నిలబెట్టుటకు వ్యక్తి త్యాగము చేయవలయు నన్నది విశ్వనాథ సాహిత్య సందేశం.ఈ సందేశము ఆయన తన సాహిత్యంనిండా సృష్టించిన ఆశ్చర్యకరములైన పాత్రల ద్వారా వినిపించాడు.భారతజాతీయ సంస్కృతి సంప్రదాయ విజ్ఞానాలమీద హేతువాదబలంతో ఆయా పాత్రలను అంత అద్భుతావహంగా ఆయన తీర్చిదిద్దినాడు.....రాళ్లపల్లి కృష్ణశర్మగారు అన్నట్లు 'వారి రచనలన్నీ లోకానికి సందేశాలే.'అని అన్నారు."[25].

పై వివరణలో 'అంతఃకరణ చతుష్టయం' వైయక్తిక ధర్మం' అను మాటలలో మనస్తత్వానికి సంబంధించిన విషయాలున్నవి.వ్యక్తులలో సంస్కారమన్నది సంస్కృతిపై ఆధారపడి ఉంటుందని మనోవైజ్ఞానికులందరూ గుర్తించి చెప్పినవారే.మన సంస్కృతి,మనజాతి మన సంప్రదాయం,తరతరాలనుండి వంశపారంపర్యంగా వ్యక్తికి లభిస్తూ సామాజిక జీవనంలో వ్యక్తికి సమున్నత స్థానాన్ని కలిగింపజేస్తుంది.వ్యక్తిని ఉన్నతునిగా మనిషిని మనీషిగా చేస్తుంది. స్వార్థపరుణ్ణి సేవాపరణ్ణిగా,అభిలాషిని ఆదర్శవంతునిగా, క్రమంగా ఒక్కొక్క మెట్టే అధిగమింప చేసి అవతార పురుషునిగా తీర్చిదిద్దుతుంది.అటువంటి సంస్కృతిని పాశ్చాత్య నాగరికతా వ్యామోహంతో స్వేచ్ఛా స్వాతంత్ర్యాల నినాదందతో సాహిత్యాల విప్లవాల వెల్లువలో వదులుకొని మనిషి సాంఘిక వ్యవస్థకు దూరమై ఏకాంతానికి దగ్గరవుతున్నట్లుగా విశ్వనాథ గమనించారు.

20వ శతాబ్దపు 3వ దశకంలో గుడిపాటి వేంకటాచలంగారు తన కలంబలంతో వివాహ వ్యవస్థమీద,సాంఘికమైన కట్టుబాట్లమీద దెబ్బతీసే విపరీత ధోరణిలో స్వేచ్ఛాప్రణయమే నిజమైన ప్రేమగా చిత్రిస్తూ సమాజంలో ఒక దుమారం లేవదీశారు.ఇటువంటి భావాలకు

---

25. విశ్వనాథ వైఖరి.పుట 15

బద్ధవిరోధి విశ్వనాథ. "ఎక్కడ కుటుంబ వ్యవస్థ చక్కగా ఉంటుందో అక్కడ సమాజంకూడా చక్కగా ఉంటుంది. ఎక్కడ కుటుంబవ్యవస్థ విచ్ఛిన్నం చేయబడి స్త్రీ పురుషులు తమతమ ఆధిక్యతను ప్రదర్శించటానికి పూనుకుంటారో అక్కడ సమాజంలో కూడా సంఘర్షణ మొదలౌతుంది."[26] అని విశ్వసించిన వాడు విశ్వనాథ. అందుకే వివాహ వ్యవస్థలోని ఉదాత్తతను చాటుతూ సంప్రదాయాన్ని నిలిపే ప్రయత్నంలో ఏకవీర,చెలియలికట్ట, మొదలైన నవలలు విశ్వనాథవారు రచించారు.

ఈ విధంగా చలం సాహిత్యం విశ్వనాథను తట్టిలేపింది. నవలా రచనకు పురికొల్పింది. ఏకవీర నవలనుండి ఆయన శరంపరంపరగా సాంఘిక,రాజకీయ,చారిత్రిక,నవలలు వ్రాయటం ప్రారంభించారు. వారి అన్ని నవలలో ఉత్కృష్టమైనది,ఉన్నతోన్నతమైనది పాత్ర ప్రధానమైనది 'ఏకవీర'నవలకాగా సాంఘిక రాజకీయ ధార్మిక సమస్యలతో ముడివేసుకొని అతి విస్తృత పరిధిలో నడిచిన నవల 'వేయిపడగలు'.

వ్యక్తులలో జాతీయతా భావాన్ని నెలకొల్పటం,జాతి వారసత్వాన్ని నిలబెట్టటం, సంప్రదాయంలోని పురుషార్థాల ప్రాముఖ్యాన్ని నొక్కిచెప్పటం,ప్రాచీన సాహిత్యం యొక్క ప్రయోజనాన్ని ఎత్తిచూపటం,విశ్వనాథ నవలలయొక్క దృక్పథంగా పేర్కొనవచ్చు.

## 2.5 పరిశోధనకు ఎన్నుకున్న నాలుగు నవలలు.

విశ్వనాథ అపూర్వ ప్రతిభా,వ్యుత్పత్తి,అభ్యాసాలు,గలవాడు. దైవదత్తమైన రచనా నిర్మాణ కౌశలం అతని చేతిలో ఉంది. కావ్య నిర్మాణంలో గానీ,కథాకథనంలో గానీ,ఆతనికతడే సాటి. తాను నమ్మిన విశ్వాసాలను,అభిప్రాయాలను,తన రచనలయందు ప్రతిఫలింప చేశాడు. తన అపూర్వ శిల్పకళానైపుణీ సంయోజనంతో పాఠకులను మరిపింపచేసే శక్తి ఆయనలో ఉంది.

విశ్వనాథవారి నవలా సాహిత్యాన్నంతా చదివినప్పుడు నా పరిశోధనకు తగిన నవలల్ని ఎన్నుకోవటంలో నేను చాలా ఇబ్బందే పడ్డాను. ఆయన రచనలన్నీ చారిత్రికాలైనా, సాంఘికాలైనా, పౌరాణికాలైనా,అందులోని విషయ ప్రాధాన్యం కంటె మనకు ముఖ్యంగా గోచరించేవి ఆయన విశ్వాసాలు,భావాలు,నమ్మకాలతో కూడిన విజ్ఞాన విశేషాలు. ముఖ్యంగా ఆయన వెల్లడించిన ప్రాచ్య పాశ్చాత్య మనోవైజ్ఞానిక శాస్త్ర విషయాలేగాక తాత్విక పరమైన ఎన్నోభావాలు కూడా ఆయన నవలా సాహిత్యంలో చేరి ఉండటమే.

మానవుని మూల మనస్తత్వంలోని జాతి వారసత్వాన్ని మేల్కొల్పటమే విశ్వనాథవారి ధ్యేయం. సంప్రదాయం పట్ల వారికి అమితమైన విశ్వాసం. నవలా విమర్శకుడైన శ్రీ వల్లంపాటి వేంకటసుబ్బయ్యగారు.. "ఎలాంటి విశ్వాసాలు లేని నవలా రచయిత కంటె ఏదో ఒక విశ్వాసం ఉన్న నవలా రచయిత జీవితాన్ని మరింత లోతుగా చూడగలడనీ,జీవితం ఎలా ఉంది అని

26. వేయిపడగలు,సమకాలీనత–సార్వకాలీనత. కీటక

మాత్రమే గాక అలా ఎందుకుందో కూడా చెప్పగలడనీ,మనం గుర్తుంచుకోవటం మంచిది. దేనిమీద విశ్వాసం లేకపోవటం వ్యాపార దృష్టికి సంకేతం కూడా."[27] అని అభిప్రాయపడ్డారు. సంప్రదాయం పట్ల విశ్వనాథ వారికి గల విశ్వాసమే వారు జీవితపు లోతుల్ని చూసేటట్లు చేసిందని చెప్పవచ్చు.

ఏ రచననైనా మనం రెండు విధాలుగా పరిశీలించవచ్చు.రచనలో ఉన్న విషయాన్ని ఆధారంగా ఆ రచన ఆ విషయానికి సంబంధించినదిగా నిర్ణయించటం ఒక పద్దతి.నవలలో సాంఘిక విషయాలుంటే సాంఘిక నవలలనీ,చారిత్రిక వస్తువుంటే చారిత్రి నవలలనీ,నవలలోని వస్తువును బట్టి నిర్ణయంచటం జరుగుతుంది.

ఇక రెండో పద్దతి. రచయిత దృష్టిలో మెదిలిన అంశాన్ని బట్టి పరశీలించటం.ఈ అంశమే నవలా వస్తువు కావచ్చు.అటువంటి సమయంలో ఆ నవల చారిత్రికమైనదైనా,సాంఘిక మైనదైనా,అందులోని వస్తువు రచయిత దృష్టిపరంగా వ్యక్తీకరింప బడుతుంది.కాబట్టి ఆ నవలకు లేదా ఆ రచనకు అదే వస్తువు ముఖ్యమౌతుంది.

లోకంలో అనేక వేల సంఘటనలు జరుగుతూ ఉంటాయి.అవి వ్యక్తులలో అనేక భావాలను ప్రేరేపిస్తాయి.ఈ విధంగా విశ్వనాథలో కలిగిన అనేక భావాలకు రూపకల్పనలే ఈ నవలలు.'భావాలనేవి ఏ వ్యక్తికి స్వంతం కావు.అనగా భావాలనేవి ఏదో ఒక మూలవస్తువు నుండి పుట్టుకొచ్చేవే.ఆ మూల వస్తువు మతం,సంఘం,ఏదైనా కావచ్చు.అందువల్ల వ్యక్తిలో రూపొందే భావాలు కూడా చాలా వరకు ఉమ్మడి అనగా సామూహికంగానే అందరికి చెందినవై ఉంటాయని చెప్పవచ్చు.

"మన దేశంలో మతం,కులం కూడా మానవుడి వైయక్తిక సామాజిక జీవితాన్ని ప్రభావితం చేస్తాయి.అంతేగాక వ్యక్తి తనది అని భావించే భావాలు పూర్తిగా వ్యక్తిగతమైనవి కావు.భావాలు సాధారణంగా సమాజం యొక్క ఉమ్మడి సంపద.'[28]

ఈ విధంగా రచయిత మనస్సులో ఉన్న భావాన్ని,సంఘర్షణను,జీవితం ప్రేరేపించగా ఎన్నుకోబడిన కథా వస్తువు రచయిత దృష్టితో ఆవిష్కృతమౌతుంది.ఈ కథావస్తువు తాత్వికమైనది కావచ్చు,అప్పుడది తాత్విక నవలగా రూపొందుతుంది.విశ్వనాథవారి భావుకత,తాత్వికత,అనేక కథావస్తువులకు మూలమై నిలిచి మనకనేక నవలలను అందించినది.

"ఒక్కొక్క సారి రచయిత విశ్వసించే తత్వశాస్త్రాలు,(ఆధ్యాత్మికవాదం,మార్క్సిజం, అస్తిత్వవాదం,మనస్తత్వశాస్త్రం,మొ॥)కూడా కథావస్తువులు పుట్టటానికి కారణం కావచ్చు. సాధారణంగా ఇవి రచయిత చూసే దృష్టికోణాలుగా ఉపయోగపడతాయి.కానీ అప్పుడపుడు వీటిలోంచి సరాసరి కథావస్తువులు పుట్టటం కూడా జరుగుతుంది.ఆధ్యాత్మిక వాదంలోంచి

---

27,28. నవలా శిల్పం.పుట.17.18.

ఏకవీర,వేయిపడగలు....'[29].అని వల్లంపాటి వేంకటసుబ్బయ్యగారు చెప్పిన మాటలు విశ్వనాథ నవలల్లోని వస్తు వైవిధ్యానికి గల తాత్విక భూమికను వివరించేవిగా ఉన్నాయి.

వ్యక్తి ప్రాధాన్యం నవలలు కూడా రెండు రకాలుగా ఉంటాయి.వ్యక్తిని సమాజంలో భాగంగా గుర్తించి ఆ వ్యక్తిని సామాజిక స్పందనలు,భావాలు,ప్రభావాలు,ఎట్లా స్పందింప చేస్తున్నాయో ఆ ప్రభావాలకు ఆ వ్యక్తి ఏ విధంగా అనుగుణ్యతను లేదా అవగుణ్యతను పొందుచున్నాడో,చిత్రించటం ఒక పద్ధతి.అట్లా కాకుండా వ్యక్తిని సమాజంనుండి దూరంచేసి కేవలం ఆ వ్యక్తియొక్క మానసిక చిత్రణే కథా వస్తువుగా ఎంపిక చేసుకొని ఆ వ్యక్తిలో పుట్టే అనేక భావాల సంఘర్షణలో ఆ వ్యక్తి స్పందంచిన విధానాన్ని చూపటం రెండవ పద్ధతి. ఇక్కడ వ్యక్తి అనగా పాత్రగానే భావించుకోవాలి.ఈ పరిశీలన ద్వారా నేను వారి నవలాసాహిత్యం లో నుండి నా పరిశోధనలోని ముఖ్యవిషయమైన 'ప్రేమతత్వం-త్వగింద్రియ స్పర్శలక్షణం' స్పష్టంగా చిత్రింపబడిన నవలలనే ఎన్నుకున్నాను.

ఈ పరిశోధనా వ్యాసంలో వ్యక్తి లేదా పాత్ర ప్రాధాన్యం కలిగిన విశ్వనాథవారి 'ఏకవీర,జేబుదొంగలు,బద్దన్న సేనాని,తెఱచిరాజు'అనే నాలుగు నవలలను పరశీలించటం జరిగింది.కేవలం వైయక్తిక మానసిక చిత్రణే ప్రధానంగా కలవి ఏకవీర,తెఱచిరాజు నవలలు. సామాజిక ప్రభావాలకులొంగి జీవితాన్ని దానికి అనుకూలంగా మలచుకున్న పాత్ర చిత్రణగల నవల జేబుదొంగలు.సామాజిక బంధాలలో ఇమడలేక జీవితాన్ని బలచేసుకున్న యువకుని గాథగా చిత్రితమైన నవల బద్దన్నసేనాని. ఇందులో ఏకవీర,బద్దన్నసేనాని చారిత్రిక నేపథ్యంలో వ్రాయబడిన నవలలు కాగా జేబుదొంగలు.తెరచిరాజు సాంఘికనవలలు.

## 2.6 విశ్వనాథ నాలుగు నవలల ప్రత్యేకత.

విశ్వనాథగారు అరువై నవలలు వ్రాసినట్లు వారి వాఙ్మయసూచిక నుండి తెలియుచున్నది. అందులో పురాణగ్రంథమాల నవలలు 12,నేపాళ రాజవంశావళి కథలు 6.కాశ్మీరవంశావలి కథలు 6,ఇతర చారిత్రిక నవలలు 12,మిగతా 22 సాంఘిక నవలలు.ఈ సాంఘిక నవలల వస్తువుల్లో కూడా ఎంతో వైవిధ్యముంది.

సాంఘిక నవలల్లో హాస్యవ్యంగ్యాత్మకమైనవి కొన్ని,భావాత్మకములైనవి కొన్ని(బాణావతి, పునర్జన్మ మొ॥) వారి అభిప్రాయాలకు,విశ్వాసాలకు,నమ్మకాలకు,ప్రాధాన్యమిచ్చునవి కొన్ని, 'స్వర్గానికి నిచ్చెనలు,) ధర్మచక్రం మొ॥నవలలు మతం,ధర్మం,మొ॥విషయాలకు సంబంధించినవి. మ్రోయుతుమ్మెద,తెఱచిరాజు,వంటి నవలలువ్యక్తి ప్రాధాన్యం కలిగినవి.సాంఘిక విషయాల నాధారం చేసుకొని వ్రాయబడిన నవలలు చెలియలికట్ట,నీలపెండ్లి,మొ॥నవి.

---

29.. నవలా శిల్పం.పుట.19

ఈ వ్యాసానికి పరిమితమైన నాలుగు నవలలు,ఏకవీర–జేబుదొంగలు–బద్దన్నసేనాని–తెఅచిరాజు అనుకున్నాం.వీటి ప్రత్యేకత ఏమిటో పరిశీలిద్దాం.

## 1) ఏకవీర.–

ఇది విశ్వనాథవారి రెండవ నవల.ఈ నవల వ్రాయటానికి వారికి మూడు,నాలుగు సంవత్సరాలు పట్టింది.ఇందులో కథావస్తువు పూర్తిగా మానసిక చిత్రణకు సంబంధించినది. ఇందులోని నాలుగు పాత్రలలోని వ్యక్తచేతనం,అవ్యక్తచేతనంల మానసిక సంఘర్షణను విశ్వనాథ వారు అతి ప్రతిభావంతంగా చిత్రించారు.అంతేగాక విశ్వనాథవారు భావించిన ప్రేమతత్త్వం, త్వగింద్రియ స్పర్శలక్షణం,ఇందులో ప్రవేశపెట్టి ఈ ఒక్క ఏకవీర నవలలోనే గాక మిగతా మూడు నవలల్లో కూడా చిత్రించారు.ఈనవలల ముగింపులో విశ్వనాథ తన ఉద్దేశాన్ని స్పష్టంగా తెలిపాడు.ఈ నవలలోని చారిత్రక నేపథ్యం అందులోని పాత్రల మానసిక సంఘర్షణకు మరింత బలాన్ని కలుగచేసింది.అందువల్లనే ఇది చారిత్రిక నవలయినా మనస్తత్వచిత్రణ నవలయింది.

## 2) జేబుదొంగలు.

ఆల్‌ఫ్రెడ్ ఆడ్లర్ ప్రతిపాదించిన 'ప్రయోజనతా సిద్ధాంతం' ఆధారం చేసుకొని విశ్వనాథ ఈ సాంఘికనవలను వ్రాసినట్లు తోచకమానదు.ఇందులో అవధాని చిన్నపుడు జేబుదొంగ. ప్రయోజనం ఆశించి ఆతడు ఇంగ్లాండు వెళ్ళి ఐ.సి.యస్ చదివి కలెక్టరుగా,మెజిస్ట్రేటుగా,ఉన్నత పదవులందుకుంటాడు.ఆతని మానసిక చిత్రణలో ఫ్రాయిడ్ పేర్కొన్న ఇగోలు,విశ్వనాథ ప్రవేశపెట్టిన ప్రేమతత్త్వం,స్పర్శలక్షణం,మొదలైనవికూడా కనిపిస్తాయి.సాంఘిక వాతావరణంలో వ్యక్తి ప్రయోజనోన్ముఖంగా ఉన్నతాదర్శాలు నిర్మించుకొని అధిగమించటం ఇందులో విశేషం.ఈ విధంగా ఈ నవలకూడా పాత్రప్రధానమైన మనస్తత్వచిత్రణ నవలయింది.

## 3) బద్దన్న సేనాని.

ఇది చారిత్రిక నేపథ్యంలో వ్రాయబడిన నవల.ఇందులో కొన్ని చారిత్రికాంశాలు ప్రాధాన్యం వహించినా ఎంతో వయోభేదమున్న బద్దన్న బాదమ్మల ప్రణయజీవితం,వారి మానసిక సంఘర్షణ అంతకంటె ప్రాదాన్యం వహించాయి.విశ్వనాథవారు ప్రతిపాదించిన ప్రేమతత్వం వయోభేదాన్ని కూడా అధిగమించింది. ఈ ప్రేమ లింగాతీతమైనట్టిదని,దైవసంకల్పం వల్ల ఏర్పడినదని విశ్వనాథ నిరూపిస్తాడు.స్పర్శానుభూతి బద్దన్నలో కలిగించి బాదమ్మనాతని భాగస్వామి గా నిర్ణయంచటం విశేషంగా చెప్పుకోవచ్చు.వీరి ప్రణయం లోకవిరుద్ధమైనది.అందుకే చివరలో బద్దన్న బాదమ్మలిరువురు మరణిస్తారు.ఈవిధంగా ఈనవల మనస్తత్వచిత్రణ నవలయింది.

## 4) తెఅచిరాజు.

విశ్వనాథవారు తా నెరిగిన వ్యక్తి కళాకారుడూ,నటుడూ,అయిన 'ముంజులూరి కృష్ణారావు

గారి నటనా కౌశలాన్ని ఆధారంచేసుకొని ఈ నవల వ్రాసినట్లు మహతిలో ప్రచురింపబడిన "నేను నా సాహిత్యరచనలు"అనే వ్యాసంలో చెప్పుకున్నారు.త్వగింద్రియ స్పర్శసిద్ధాంతాన్ని పూర్తిగా వివరించటానికే ఈ నవల వ్రాసినట్లు మనకు తెలుస్తుంది.వయోభేదాన్ని,ప్రేమతత్వాన్ని, స్పర్శలక్షణాన్ని,ప్రధానపాత్రల మానసిక సంఘర్షణను విశ్వనాథ అతి ప్రతభావంతంగా చిత్రించి చూపాడు.ఇది సాంఘిక నవలయినా దీనిలో సాంఘికప్రయోజనం ఏమాత్రం చూపబడలేదు. ప్రధానపాత్రలతో పాటు ఇతర పాత్రలెన్ని ఉన్నా వాటిప్రాధాన్యం చాలా తక్కువ.అందువల్ల ఇది కూడా పాత్రప్రధానమైన నవలగా రూపొంది మనస్తత్వచిత్రణకు మూలమైంది.

ఈవిధంగా పాత్రల ప్రధానమైన ఈ నాలుగు నవలలు,మనస్తత్వచిత్రణ,ప్రేమతత్వం, స్పర్శలక్షణం,అనే మూడింటిచే నేర్పడిన సూత్రంతో పెనవేసుకున్నట్లు కనిపిస్తాయి.అందుకే ఈ నాలుగు నవలలను నా పరిశోధనకుగాను గ్రహించటం జరిగింది.



# 3. చేతనాచేతనల సంఘర్షణకు రూపకల్పన ఏకవీర.

## 3.1 చేతన-అచేతనల సంఘర్షణ

మానవుని చేతన,అచేతన మానసిక ప్రక్రియలకు మూలం కామం.ప్రకృతిలో సృష్టికి మూలం కామం.ఉపనిషత్తులలో కామమే సృష్టికి మూలమని చెప్పబడింది.

"ఆత్మానా ఇదమగ్ర ఆసీత్ తద్దైక్షత
సో2కామయత ఏకో2హం బహుస్యాం ప్రణమేయః"[1]

"ఆత్మ సంకల్పమే మిధునంగా రూపొందింది.సృష్టి యంతయు దీని పరిణామమే. అధర్వవేదమున కూడా మొదట కాముడే ఉద్భవించెనని కలదు.మహాభారతంలో కామస్తుతి కలదు.బ్రహ్మ,ఈశ్వరుడు,మొదలైన దేవతల కన్నా కామమే ఆదిశక్తి అనికూడా ఈ స్తుతుల్లో ఉంది.ఈ విధంగా కామప్రసక్తి మనకు వివిధ గ్రంథాలలో కనిపిస్తుంది.'[1]

ఫ్రాయిడ్ వ్యక్తిని కామేచ్ఛాజీవిగా వర్ణించాడు.కామమే సృష్టికార్యానికి మూలం.మానవుని శారీరకమైన కామం భోగానికి,మానసికమైన కామం వివిధ రసాలకు,భావాలకు,మూలమౌతుంది. శరీరగతమైన కామమే వ్యక్తిలో మానసికంగా కామనగా రూపొందుతుంది.కామన అనగా కోరిక. మనిషి మనసు కామేచ్ఛాశక్తివల్ల వివిధ భావాలకు నిలయమౌతుంది.సత్వ,రజోస్తమో గుణాలకుగానీ, కామక్రోధాది అరిషడ్వార్గాలకుగానీ,వివిధ రకాలైన భయాలకు,భ్రాంతులకుగానీ,వివిధ రసాలకు గానీ,ఈ కామమే మూలం.

ఫ్రాయిడ్ మానసిక రోగుల చికిత్సావిధానంలోని పరిశీలనలో మొదట కనుగొన్నది 'అచేతన మానసికస్థితి'.దీని నాధారం చేసుకొని ఆయన మానవుని మనసును చేతన,అచేతన స్థాయిలుగా గుర్తించి పేర్కొన్నాడు.మానవునిలోని సంఘర్షణలకు మూలం చేతనాచేతనల మానసిక ప్రక్రియలే అన్నాడు. ఈ చేతనాన్ని 'అహం'గానూ,'అచేతనాన్ని'అచిత్తు గానూ,పేర్కొని వ్యక్తి ప్రవర్తనకు ఇవే కారణాలన్నాడు.

చేతన స్థితి అహం కావటంవల్ల ఇది జాగ్రదవస్థకు,బాహ్యస్థితికి,ప్రవర్తనకు,ఆధార మౌతుంది.వ్యక్తి చేతనస్థితిలో అనగా జాగ్రదవస్థలో నున్నపుడు తన ప్రవర్తనను బాహ్యస్థితికి అనుకూలంగా మలచుకుంటాడు.ఆ మలచుకోవటంలో ఆతడు ఎన్నో విధాల సర్దుబాటుతనాన్ని పొందుతాడు.బాహ్యపరిస్థితుల కనుగుణంగా రాజీపడుతుంటాడు.తన కిష్టమున్నా లేకున్నా తన ప్రవర్తన సక్రమంగా ఉండాలని యత్నిస్తాడు.సామూహికంగా జన జీవనంలో కలిసి ప్రయాణం

1. ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు-ప్రయోగములు. పుట.287

చేయాలని,జీవితాన్ని గడపాలని,అభిలషిస్తాడు.సహజంగా వ్యక్తి ఎన్ని కోరికలు గలవాడైనా ఆ కోరికలు తీరేవి కావని తెలిసినపుడు తన ప్రవర్తనలో లోపం రాకుండా,తీరని కోరికలు కలచి వేస్తున్నా,వాటిని అణచుకుంటూ రాజీపడుతూ,సంఘంలో మర్యాదపూర్వకంగా నడుచుకోవటానికి ప్రయత్నిస్తాడు.

ఈ విధంగా చేతనస్థితి మానవుని ప్రవర్తనను,సరిదిద్దటానికి సక్రమంగా ఉంచటానికి మూలంకాగా,అచేతనస్థితి వ్యక్తిలోని మానసిక కార్యాలకు వ్యక్తి ప్రవర్తనకు,అర్థం కల్పించటంలో సహాయపడుతుంది.ఫ్రాయిడ్ వ్యక్తి ప్రవర్తనకు ఈ అచేతన మానసిక కార్యాలే మూలమన్నాడు.

ప్రకృతిలో ప్రతిజీవి స్వేచ్ఛగా,స్వతంత్రంగా బ్రతకాలని ప్రయత్నిస్తుంది.ఒకనాటి వనచరుడైన మానవుడు స్వేచ్ఛగా బ్రతికాడు.క్రమంగా తనకుతానే అనేక కట్టుబాట్లు ఏర్పరచుకొని లోకాన్ని,సంఘాన్ని,నిర్మించుకున్నాడు.ఆ బంధాలలో తననుతాను సంస్కరించుకునే ప్రయత్నంలో ఇరుక్కు పోయాడు.తత్ఫలితంగా జీవలక్షణమైన స్వేచ్ఛను కోల్పోయి సంస్కృతితో శారీరకంగా, మానసికంగా బంధింపబడ్డాడు.

కట్టుబాట్లు,నియమనిబంధనలు,సంఘం,లోకం,వ్యక్తిపై బలంగా ఎన్ని ఒత్తిడులు కలిగించినా వ్యక్తిలోని జీవలక్షణం స్వేచ్ఛనుకోరి,సంఘాన్ని,లోకాన్ని,ఎదిరిస్తూ కట్టుబాట్లను తెంచుకోవాలని చూస్తుంది.వ్యక్తిలో స్వేచ్ఛను స్వార్థాన్ని అంటిపెట్టుకున్న వైయక్తికమైన,మానసిక అచేతన అనగా అచిత్తు ప్రతిక్షణం వ్యక్తిని స్వతంత్రంగా నడిపించాలనే ప్రయత్నంతో ప్రేరణలను కలిగిస్తూ ఉంటుంది.వ్యక్తి సంఘంలోని కట్టుబాట్లకు,సాంఘిక పరిస్థితులకు,చేతనస్థితిలో రాజీపడలేక సంఘర్షణలకు లోనుగావటం,సర్దుబాటు తనాన్ని పొందలేక వ్యాకులతకు గురికావటం,జరుగుతుంది.అధికమైన వ్యాకులత వ్యక్తిని పిచ్చివానిగా చేస్తుంది.వ్యక్తిలో విపరీతమైన వ్యాకులతకు చేతన-అచేతన మానసిక స్థితుల సంఘర్షణే మూలకారణం.

చేతనస్థితి బాహ్యపరిస్థితులకు,లోకధర్మానికి,వ్యక్తిని కట్టి పడేస్తుంది.అచేతనస్థితి-అంతర్గత చోదనలకు,వ్యక్తి ధర్మానికి,ఆత్మనిర్దేశానికి పురికొల్పుతుంది.వ్యక్తి ఏది ప్రధానమో తెలుసుకోలేక అటులోకధర్మానికి,ఇటువ్యక్తి ధర్మానికి ప్రాతినిధ్యం వహించలేక మానసిక ఘర్షణకు లోనుగావటం, తటస్థంగా అచేతనుడై కుమిలిపోవటం,బలహీన మనస్తత్వంతో తనను తానే చంపుకోవటం,లేదా వాస్తవిక పరిస్థితులకు తలొగ్గి సర్దుబాటును పొంది,జీవితాన్ని కొనసాగించటం జరుగుతుంది.

విశ్వనాథ ఈ నవలలో ఆత్మగతమైన ప్రేమకు,లోకదర్మమైన పెండ్లికి,దాంపత్య ధర్మానికి ప్రాధాన్యమిచ్చి పాత్రలలో ఈ రెండింటిని ప్రవేశపెట్టి,ఆ పాత్రలు ప్రేమా?పెండ్లా?ఏది తమకు ముఖ్యమో నిర్ణయించుకోలేక మానసికంగా కుమిలిపోవటం,చివరకు తానుద్దేశించిన ప్రకారం నవలను ముగించటం,ఇందులో చూస్తాం.చేతనస్థితిలో పెండ్లి,అచేతనస్థితిలో ప్రేమ,ఈరెండింటి ఘర్షణే ఇందులో ప్రధానమైనది.

★

## 3.2 ఏకవీర నవల రచనాకాలం, కారణాలు. (1925-30)

అది భావ కవిత్వోద్యమ కాలం. నూనూగు మీసాల నూత్న యవ్వనారంభవేళ ప్రతి యువకవి భావగీతాలు పాడుకున్నవేళ. స్వేచ్ఛాప్రణయం,ప్రేమ,కమనీయ గీతాలలో కరుణ, శృంగార రససమ్మేళనంలో కదిలి వచ్చినవేళ. రాయప్రోలు సుబ్బారావుగారు కవిత్వానికి,శృంగార రసానికి కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదిస్తున్న రోజులవి. వారి 'మాధురీదర్శనం,రమ్యాలోకం, సాహిత్య శృంగార రస సిద్ధాంతాలకు మూలమై నిలువగా,కష్టకమల,స్నేహలత,స్వప్నకుమారం, తృణకంకణం,మొదలైన ఖండకావ్యాలు లక్ష్యంగా నిలిచిన కాలమది. విశ్వనాథవారి 'గిరి కుమారుని ప్రేమగీతాలు' పాశ్చాత్య సాహిత్య ప్రభావం ఏ మాత్రంలేని ప్రేమసిద్ధాంతంతో 'కులపాలికా ప్రణయాన్ని' అపూర్వంగా చిత్రించిన రోజులవి.

విశ్వనాథవారు,నాయని సుబ్బారావుగారు 'గిరికుమారుని ప్రేమగీతాలలోను' 'సౌభద్రుని ప్రణయాత్రలోను' కులపాలికా శృంగారాన్ని దివ్యస్థాయికి తీసుకొని పోయి దంపతులకు ప్రకృతి పురుషుల భావాన్ని సమన్వయించే కొత్త ప్రేమ సిద్ధాంతాన్ని,ఆరాధనా భావాన్ని,అర్థనారీశ్వర తత్వాన్ని,తమతమ కావ్యాలలో అద్భుతంగా చిత్రించిన కాలమది.

ఆ రోజులలో గుడిపాటి వేంకటచలం కాల్పనిక కవితా ప్రభావంతో,స్వచ్ఛంద ప్రణయ భావజాలంతో పురుషులచే అణగద్రొక్కబడిన స్త్రీ జాతికి ప్రాతినిధ్యం వహించి,స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో కూడిన ప్రేమతత్వాన్ని తన నవలల్లో చిత్రించసాగాడు. చలం రచనలు విశృంఖలమైన సెక్సు జీవితానికి సీమితమై ప్రేమంటే స్వేచ్ఛగా తన ఇష్టం వచ్చిన రీతిలో తాను ఇష్టపడిన వారితో జీవితాన్ని గడపడమే అనే ధ్యేయంతో రచంప బడటంవల్ల ఆ నాటి సమాజంలో ఆ రచనలు గొప్ప విప్లవమే తెచ్చాయి.

చలం నవలల్లో ముఖ్యంగా సంప్రదాయ వ్యవస్థకు చెందిన వైవాహిక ధర్మం పూర్తిగా తిరస్కరింపబడింది. దాని స్థానంలో స్వేచ్ఛాప్రణయాన్ని చిత్రించటం జరిగింది. ప్రేమకు, పెండ్లికి ఆలోచనలలో,ఆచరణలలో,వ్యక్తులలో కలిగిస్తున్న విచిత్రమైన భావాలకు,విపరీత ధోరణులకు, విశ్వనాథ కదిలిపోయాడు. వాటినే కథా వస్తువుగా గ్రహించి ఉదాత్తమైన ఏకవీర నవలను వ్రాశాడు.

ఏకవీర నవల పరిమాణంలో చిన్నదైనా అదొక వచనకావ్యంగా అపురూపంగా రచింపబడింది. విశ్వనాథ 1925-30 మధ్యకాలంలో స్వయంగా ఈ నవలను వ్రాశాడు. తదుపరి ఎన్నో నవలలు వ్రాసినా వ్రాయించినా ఏ నవలలకు ఇంతకాలాన్ని తీసుకోలేదు.[2] దీనివల్ల ఈ నవల నిర్మాణంలో జరిగిన ఆలస్యానికి కారణం ఊహించవచ్చు. ఈ నవలలోని పాత్రల మానసిక చిత్రణ చేసేటప్పుడు వ్యక్తియొక్క మనస్తత్వాన్ని నిర్ణయించటంలో విశ్వనాథవారికి చాలా సమస్యలు ఎదురయ్యాయని కాలాన్ని బట్టి వాటిని పరిష్కరించుకొని చెప్పటంలో ఈ ఆలస్యం జరిగి

2. ఏకవీర నవల పుట 1.

ఉంటుందని ఈ నవల చదివిన వారికి అర్థంగాక పోదు. ఈ నవలయొక్క శైలీ నిర్మాణం లోనూ,పాత్రచిత్రణలోనూ,కథానిర్వహణలోనూ,శిల్పనైపుణ్యంలోనూ,విశ్వనాథ చూపిన అసమాన రచనానైపుణ్యం మరే రచనలోను కనుపించదంటే అతిశయోక్తిగాదు. ఈ నవలలో మానసిక సంఘర్షణను అతినిపుణంగా పాత్రలలో ప్రవేశపెట్టి ప్రతిఫలింప చేయటం విశ్వనాథ ప్రతిభకు తార్కాణం.

## 3.3. ఏకవీర నవలలోని కథావస్తువు.

ఈ నవలలోని పాత్రలు,సంఘటనలు,చారిత్రిక వాతావరణంలో సాగినా,చరిత్రకంతగా ప్రాధాన్యం లేదు. "మధుర రాజదానిగా దక్షిణదేశాన్ని పాలించిన తెలుగు నాయకుల చరిత్ర క్రీ.శ. 1924 సం॥లో వెలుగులోనికి వచ్చింది. మద్రాసు విశ్వవిద్యాలయ చరిత్రవిభాగం మధుర నాయకుల చరిత్రను ప్రచురించింది. 'రాబర్టు డీ నొబిలీ 'జగద్గురు తత్వబోధకస్వామి' అనే పేరున హిందూ సన్యాసి వేషంతో క్రైస్తవ మతాన్ని భారతీయులందు ప్రచారం చేయటానికి పూనుకొని పనిచేసిన చారిత్రిక సత్యాన్ని కథాకాలానికి అనువై ఉన్నందున ఒక మహా ప్రయోజనం అభిలషించి విశ్వనాథ ఈ నవలలో ప్రవేశపెట్టాడు. సరిగ్గా ముద్దువీరప్ప నాయకుల వారి కాలంలోనే ఈ నోబిలీ ఐరోపాదేశపు స్వాములవారు మధురలో ప్రసిద్ధులుగా ఉన్నారు."[3]

మధుర నేలిన ముద్దు కృష్ణప్ప నాయకుడు,ముద్దు వీరప్పనాయకుడు,రాబర్టు నోబిలీ, వీరు మాత్రమే చారిత్రిక వ్యక్తులు. మిగిలిన పాత్రలన్నీ విశ్వనాథ కల్పించినవే. విశ్వనాథ ఈ నవలను చారిత్రికంగా మలచటంలో రెండు ప్రయోజనాలను ఆశించినట్లు మనం గమనించవచ్చు. మొదటిది చారిత్రిక నేపథ్యం ఈ నవలలోని పాత్రల 'మానసిక చిత్తవికారాలకు' దృఢత్వాన్ని, బలాన్ని,చేకూర్చి పెట్టటమే గాక సంప్రదాయ వ్యవస్థలోని దాంపత్యధర్మానికి అనువైన వాతావరణాన్ని కలిగింప చేయటమే. రెండవది ఈ నవల చారిత్రిక కథాకథనంతో సుందర 'వచనకావ్యం'లా సాగింది. అపూర్వ శిల్పనైపుణ్యంతో,ఆ కాలంనాటి సాంఘికవిషయాలు,వర్ణనలు,కళ్ళకు కట్టినట్లు చిత్రింప బడటం చూస్తాం. గతవైభవాన్ని చాటి చెప్పటం,ఆ కాలం నాటి వ్యక్తుల వ్యక్తిత్వాన్ని అద్భుతంగా చిత్రించి చూపటం,తద్వారా ఆనాటి సాంఘిక వ్యవస్థ,వ్యక్తిధర్మాలు,సంస్కృతి,సంప్రదాయాలు, మరొక్కసారి గుర్తుకు తెప్పించటం,విశ్వనాథ రచనలో మనకు కనిపించే విషయాలు. ఈ విధంగా ఇది చారిత్రిక నవల అయ్యింది.

కొందరు దీనిని మనస్తత్వచిత్రణ నవల అన్నారు.[4] మరికొందరు ఇందులో 'అమలిన శృంగారతత్వముందన్నారు'[5]. మరికొందరు ఇందులో స్పర్శ సిద్ధాంతముందన్నారు.[6]

ఈ విధంగా మనస్తత్వాన్ని,అమలిన శృంగారతత్వాన్ని,స్పర్శసిద్దాంతాన్ని,లోకధర్మాన్ని

---

3. విశ్వనాథ వైఖరి. పుటలు. 206,207.
4. తెలుగు నవలా వికాసం. పుట. 283..
5. నవలా విమర్శ పుట. 51.
6. మహతి. నేను–నా సాహిత్య రచనలు. పుట. 13.

ఆధారం చేసుకొని తెలుగు నవలా సాహిత్యంలో వెలసిన మొట్టమొదటి నవల "ఏకవీర". ఈ నవలలో పాత్రల మనస్తత్వమే ప్రముఖంగా చిత్రీకరింపబడింది. కాబట్టి పాత్రల మనస్తత్వ చిత్రణలో ఆయా సందర్భాలలో అమలిన శృంగారతత్వాన్ని, త్వగింద్రియ లక్షణాన్ని వివరించటం జరిగింది

## 3.4 ఏకవీర నవలలోని కథా సారాంశం.

మధురనేలే ముద్దు కృష్ణప్పనాయకునికి ప్రధానమంత్రి ఉదయన్‌సేతుపతి. ఇతడు సేతువుల రక్షించుటకేర్పడిన అధికారి. ఉదయన్‌సేతుపతి కుమారుడు కుట్టాన్‌సేతుపతి. కుట్టాన్ తన తండ్రి తర్వాత అతని స్థానాన్ని పొందటానికి తగిన శిక్షణ మధురలో పొందుతున్నాడు. యవ్వనారంభదశలో జనించిన కామేచ్ఛవల్ల కుట్టాన్ మీనాక్షి అనే పేదపిల్లను ప్రేమించాడు. కుట్టాన్ శ్రీమంతుడు, మీనాక్షిని పెళ్ళిచేసుకునే స్తోమత తనకున్నా తండ్రిని ఎదిరించలేక, మీనాక్షి తల్లిదండ్రులకు తన ప్రేమసంగతి చెప్పక, చేసిన ఆలస్యంవల్ల తండ్రి కుదిర్చిన ఏకవీరను వివాహం చేసుకున్నాడు. చేసుకున్నాడన్న మాటేగానీ ఆమెతో కాపురం చేయలేక పోయాడు. ఏకవీర ప్రతిక్షణం భర్త అనురాగం కోసం పరితపించి పోయింది. కుట్టాన్ మీనాక్షిమీది ప్రేమను వదులుకోలేక, ఏకవీరను ఏలుకోలేక సతమతమయ్యాడు. ప్రేమించిన ప్రేయసిని తలచుకుంటూ తండ్రిమీది కోపంతో తండ్రి కుదిర్చిన ఏకవీరను దూరంచేసుకుంటూ కుమిలి పోయాడు.

కుట్టాన్ ప్రాణస్నేహితుడు వీరభూపతి. కుట్టాన్ ప్రేమ విషయాన్ని, పెళ్ళి సంగతి విన్న వీరభూపతి కుట్టానుకు హితోపదేశం చేస్తాడు. దాంపత్యధర్మం విధి అంటాడు. ఆమెతో కాపురం చేయమంటాడు. ప్రేమించిన ప్రేయసిని మరిచిపోయి ఆ ప్రేమనే ఏకవీర మీద చూపించమని ప్రాధేయపడ్డాడు.

వీరభూపతిది రాజవల్లీపురం. బీదవాడు. కార్యాంతరంగా అంబా సముద్రం వెళ్ళాడు. అక్కడ ఏకవీరను చూశాడు. మొదటి చూపులోనే ఆమె అందానికి ముగ్ధుడై ఆమెను ప్రేమించాడు. ప్రతిరోజు ఆమెను చూస్తూ తాను వచ్చిన పనిని మరిచిపోయాడు. ఏకవీర వీరభూపతిని చూసింది. చూపులు కలిశాయి. అతణ్ణే మనసారా ప్రేమించసాగింది. ఆమె ఒక ఉత్తరం వ్రాసి పూలచెండులో కట్టి వీరభూపతికి అందించింది. ఆ ఉత్తరం చదువుకొని ఆమె తనను ప్రేమిస్తు న్నట్లు తెలుసుకున్నా తల్లిదండ్రుల ఆజ్ఞకు బద్ధుడై ఆమెను మరిచిపోవాల్సిన పరిస్థితి వీరభూపతికి ఏర్పడుతుంది. ఆ విధంగా వీరభూపతి ఏకవీరను ప్రేమించి విఫలుడయ్యాడు.

ఏకవీర శ్రీమంతులపిల్ల. వీరభూపతి బీదవాడు. తల్లిదండ్రుల ప్రోద్బలంవల్ల తనప్రేమ సఫలం కాదని గ్రహించి మీనాక్షిని చేసుకున్నాడు. వీరభూపతి మీనాక్షితో దాంపత్య సుఖాన్ని పొందాలనుకుంటాడు. కాని మీనాక్షి దానికి దూరంగా ఉంటుంది. తనకిష్టం లేదంటుంది.

వీరభూపతి, కుట్టాన్ మానసిక స్థితిని, ఆతడు తన భార్యతో దాంపత్యధర్మాన్ని నెరవేర్చ లేకపోవటం, గమనించి తన హృదయంలో రగలి పోతున్న వ్యథను కుట్టానుకు చెప్పి అతన్ని

మరోవిధంగా శాంతింప చేయాలని నిశ్చయించుకొని తన కథనంతా కుట్టానుతో చెప్పేస్తాడు. మాటల సందర్భంలో కుట్టాన్ తాను ప్రేమించిన మీనాక్షియే తన స్నేహితుని భార్యగా తెలుసుకుంటాడు. అది తెలిసిన మరుక్షణం అతనిలో కలిగిన అలజడి క్రమంగా శాంతించి చిత్త సంస్కారాన్ని కల్గింపచేస్తుంది. ప్రేమ స్థానంలో ఆరాధనా భావం చోటు చేసుకుంటుంది. వెంటనే కుట్టాన్ మీనాక్షికి చీర,పసుపు కుంకుమలతో కట్నం పెట్టి 'సోదరీ' అంటూ అనురాగంతో పలుకరిస్తాడు. మీనాక్షి కుట్టాన్ ప్రవర్తన గమనించి తన ప్రేమను దివ్యంగా మార్చుకొని కుట్టానును సోదరునిగా భావిస్తుంది. కుట్టాన్ ప్రేమోదంతాన్ని ఇది వరకే తెలిసియున్న వీరభూపతికి ఈ విషయం తెలుయగానే తన భార్య తన ప్రాణస్నేహితుని ప్రియురాలు అనే భావానికి తట్టుకోలేక విరాగిగా మారిపోతాడు. ఆ రోజునుండి మీనాక్షి భర్తకు చేరువ కావాలని ప్రయత్నిస్తుండగా, వీరభూపతి ఆమెకు దూరమవుతూ తప్పించుక తిరుగుతాడు.

మీనాక్షి వీరభూపతుల సంగతి ఏకవీరకు చెప్పి ఆమెను ఆనంద పర్చాలనుకుంటాడు కుట్టాన్. కాని కారణాంతరాలవల్ల కుట్టాన్ ఏకవీరును కలుసుకోకుండానే మధురనుండి రామనాథపురం వెళ్ళవలసి వస్తుంది. ఆ సమయంలో ఏకవీరకు మీనాక్షి స్నేహితురాలవుతుంది.

కల్యాణోత్సవాల సందర్భంగా ఏకవీర మీనాక్షి ఇంటికి వస్తుంది. ఆ ఇంట్లో వీరభూపతి తైలవర్ణం చిత్రం చూసి ఆశ్చర్యరంగా నిలబడి పోతుంది. అదే సమయంలో వచ్చిన వీరభూపతి తాను లోగడ ప్రేమించిన ప్రేయసి తనింట్లో ఉండటంచూసి తనను తాను మరిచి పోతాడు. ఆనందంలో బాహ్యాస్మృతి కోల్పోయిన వానివలె ఆలోచనలేని స్థితిలో ఆమెను గట్టిగా కౌగలించుకుంటాడు. ఏకవీర చలించిపోతుంది. ఆ కౌగిలిస్పర్శలో ఆమె దివ్యానుభూతిని పొందుతుంది. వెంటనే స్పృహలోకి వచ్చి నిజం తెలుసుకొని పిచ్చిదానిగా మారుతుంది. ఆమె అచట నిలువలేక కల్యాణమంటపం చేరి అక్కడ నోబిలీ అనే క్రైస్తవ మతప్రచారకుణ్ణి వాదంలో ఓడించి ఇంటికి వెళ్తుంది.

రామనాథపురంనుండి కుట్టాను మధురకు తిరిగి వస్తాడు. ఏకవీరను కలుసుకోవాలనే తపన అతనిలో అధికమౌతుంది. ఏకవీరను సమీపించగా ఆమె దూరంగా పారిపోతుంది. ఏకవీర ప్రవర్తన కుట్టానుకు అర్థంకాదు. పారిపోతున్న ఏకవీరను కుట్టాను వెంబడిస్తాడు. ఆమె అతనికి అందకుండా పారిపోతూ చివరకు వేగై నదీతీరానికి చేరుతుంది. దారిలో కుట్టానుకు సన్యాసిగా మారిన వీరభూపతి కనిపిస్తాడు. వీరభూపతి ఆ విధంగా మారినందుకు కుట్టాను ఎంతో బాధపడ్డాడు. ఏకవీరను చేరిన కుట్టాను ఆమె వారిస్తున్నా వినకుండా బలవంతంగా ఆమెను కౌగలించుకుంటాడు. అతని కౌగలింతలో చిక్కుకుపోయిన ఏకవీర విజాతీయ స్పర్శాను భూతిని పొంది ప్రాణాలు వదులుతుంది. ఆమె చల్లబడిన శరీరం వేగై నదీ జలాల్లో పడిపోతుంది.

★

## 3.5 ఏకవీర నవలలోని ప్రేమతత్వం.

ఏకవీర నవల నాలుగు స్థంబాల ప్రేమ మంటపం.ఆ నాలుగు స్థంబాలు నాలుగు పాత్రలు.విశ్వనాథ ఆ పాత్రలను(స్థంబాలను) ప్రేమను నింపి కట్టాడు.ఆ పాత్రలు ప్రేమలో బలంగా బిగిసి కలువలేక తపించిపోయాయి.కలవాలనే ప్రయత్నంలో ఆ ప్రేమ మంటపం కూలిపోయింది.

ప్రేమకు ఒక పార్శ్వం స్వార్థం,రెండవ పార్శ్వం త్యాగం.ప్రేమించిన వ్యక్తిలో మానసిక సంఘర్షణ ఈ రెండింటి మధ్యనే.స్వార్థం వైయక్తికమైన అభిలాషతో కూడిన స్వీయ ప్రయోజనానికి ఆధారం.త్యాగం ఎదుటివారి ప్రయోజనాన్ని కోరేది.తనది అనుకున్న దానిని వదిలి పెట్టే నిస్వార్థబుద్ధి త్యాగానికి ఆధారం.

ప్రేమ వ్యక్తిలో కలిగే మానసిక వికారం.'వికారో మానసో భావః' అన్నారు ఆలంకారికులు.వ్యక్తిలో పుట్టే దృఢమైన భావం ప్రేమ..ఆ భావం స్వార్థంగా(తనకే కావాలనే కాంక్షతో) వైయక్తిక మనస్తత్వంలో రూపుదాలుస్తుంది.ప్రేమించిన వ్యక్తి తన ప్రేమ కోసం సర్వాస్వాన్ని వదులుకోవడానికి సిద్ధపడ్తాడు.చివరకు ప్రాణాలకు తెగిస్తాడు.ప్రేమలో అంత బలం ఉంది ప్రాణంతీసే శక్తి ఉంది.

వ్యక్తులలో ప్రేమ ఎట్లా పుడుతుంది?అది క్రమంగా ఆయా వ్యక్తులలో దృఢంగా ఎట్లా నిలుస్తుంది? ప్రాణాలు తీసేవరకు బలంగా ఎందుకు మారుతుంది? అనే ప్రశ్నలకు సూటిగా సమాధానాలు చెప్పటం ఎవరికైనా కష్టమే.అయినా యువతీ యువకుల పరస్పర ఆకర్షణ పరిచయం,స్నేహం,ఒకరి అభిరుచులు ఒకరు తెలుసుకోవటం,ఇష్టపడటం,క్రమంగా ఒకరినొకరు ప్రేమించు కోవటం,తామిద్దరు జీవిత భాగస్వాములుగా కావాలని కోరుకోవటం, ఒకరుని విడిచి ఉండలేక పోవటం,మొదలైన లక్షణాలతో కూడుకున్నదే ప్రేమ అనీ,అది యవ్వనారంభదశలో యువతీ యువకుల్లో వారి సన్నిహిత్వంవల్ల కలిగే మాపసికమైన భావన అనీ,చెప్పవచ్చు.

ప్రేమకు మూలం కామం.శారీరకమైన అభిలాషతో కూడింది కామం.శారీరకమైన కామం మానసికమైనపుడు 'కామన'గా,(ప్రేమగా' మారుతుంది.శారీరక వాంఛ నశించిన సందర్భంలో లేదా శారీరక స్పర్శ లభించని వేళలో అది ఆరాధనగా మారుతుంది.లోకంలో వ్యక్తులలో పుట్టే ఆరాధనా భావాలన్నీ,ఏ మాత్రం శారీరక,మానసిక వాంఛా రహితాలైన ప్రేమ భావనలేయని చెప్పవచ్చు.

యవ్వనారంభవేళల్లో యువతీయువకులు,పరస్పరం ఆకర్షణకు లోనై ప్రేమలో పడటానికి గల కారణం కేవలం వారి అందచందాలేనా?లేక మరేదైనా ఆకర్షణ వారిలో ఉంటుందా?అనేవి ఆలోచించాల్సి విషయాలు.కేవలం అందమే యువతీయువకుల మధ్య ఆకర్షణకు మూలమని చెప్పటం కూడా సరియైన విషయమనిపించుకోదు.ఎందుకంటె

లోకాతీతమైన అందం వారిలో లేకపోయినా,ఒక్కొక్కసారి వారు అంతర్గత ఆకర్షణకు లోనౌతుంటారు. మొదటి చూపులోనే యువతీయువకులు,పరస్పర ఆర్షణకులోనై ఏర్పడిన స్నేహంతో కొందరు ఏకంకావాలని,కోరుకుంటారు. మరకొందరు పరిచయమైన తర్వాత వారి అభిరుచులను బట్టి ప్రేమించుకుంటారు. పెళ్ళి చేసుకొని స్థిరపడాలని చూస్తారు. ఈ ప్రేమ కేవలం వారివారి వైయక్తికమైన,ఆత్యనిష్టమైన, ప్రేరణలతో రూపుకడ్తుంది. ఈ ప్రేమ కులమతాలు, సాంఘికమైన కట్టుబాట్లు,మొదలైన పట్టింపులు లేనిది. ఇట్టి ప్రేమ ఆత్మగతమై స్వార్థంతో కూడుకున్నది కావటంవల్ల లోకధర్మానికి వ్యతిరేకంగా ఉంటుంది.

ఆత్మగతమైన ఈ ప్రేమ యువతీయువకుల్ని ఏకం చేయాలని ప్రయత్నిస్తుండగా,లోకం యువతీయువకుల్ని ఏకం చేయటానికి 'పెండ్లి' అనే సాంఘిక వ్యవస్థతో ముడిపెట్టాలని చూస్తుంది. ప్రేమ ఆత్మధర్మానికి చెందినది కాగా వివాహం లోకధర్మానికి చెందినది. పెండ్లి అనేది యవతీయువకులను ఏకం చేయటానికే ఉద్దేశింపబడినా,ముక్కూ మొహం తెలియని వారికి,ఒకిరి అహిరుచులు ఒకరికి తెలియని వారికి ముడిపెట్టటం, లోకాచారంగా జరుగుచున్న ధార్మిక కార్యక్రమం. చాలామంది ఈ ధార్మిక వైవాహిక వ్యవస్థవల్ల తమతమ వైయక్తిక అభిరుచులను, అభిలాషలను,అణచుకొని రాజీపడుతూ వైవాహిక జీవితం గడుపుతుంటారు. కానీ కొంతమంది మాత్రం తమ ప్రేమ భగవద్దత్తమనీ,భావించి తమ ప్రేమ సఫలం కానప్పుడు ఈ లోకంతో పనిలేదని ఆత్మహత్యకు కూడా పాల్పడతారు. ప్రేమించినవారు లోక నియమంతో సర్దుబాటు తనాన్ని పొందలేక,తమ స్వార్థాన్ని వదులుకోలేక (ప్రేమించిన వారిని పొందలేక) మానసికంగా నలిగి చివరకు ప్రాణాలను కూడా త్యజిస్తారు. అట్టి స్థితికి తెస్తుందీ ప్రేమ.

విశ్వనాథ దృష్టిలో ఈ ప్రేమకు దివ్యత్వముంది. ఇది లోకాతీతమైనదని వారి భావన. దాంపత్యధర్మం జన్మజన్మాల బంధంగా ఎట్లా భావింపబడుతుందో,యువతీ యువకుల మధ్య మొదటి చూపులోనే ఏర్పడిన ప్రేమలో కూడా అలాంటి భావనే ఉందని విశ్వనాథ నమ్మతాడు. శారీరక వాంఛలేని దివ్యమైన ఈ ప్రేమ 'భగవద్దత్తమనీ,ఇటువంటి ప్రేమనే ఆరాధనా భావంగా విశ్వనాథవారు తమ "గిరికుమారుని ప్రేమగీతాలలో" కులపాలికా ప్రణయాన్ని మధురంగా చిత్రించారు. వీరిదృష్టిలో స్త్రీ పురుషులు,ప్రకృతి పురుషులు. ద్వంద్వాత్మకమైన (స్త్రీపురుషాత్మకమైన) సృష్టే జీవం. జీవలక్షణం అర్థనారీశ్వర తత్వం కలది. అనగా ప్రతి జీవిలో స్త్రీ పురుషాంశలతో కూడిన చేతనత్వముంటుంది. ఇదే అర్థనారీశ్వరతత్వం. ఈ తత్వం వ్యక్తులలో జన్మజన్మలనుండి ముడిపడి సంక్రమిస్తూ ఉంటుంది.

విశ్వనాథ చిత్రించే ప్రేమతత్వానికి,త్వగింద్రియ స్పర్శకు,తాత్విక భూమిక ఉంది. అది ఆలోచనాత్మకమైనది,లోకాతీతమైనది. విశ్వనాథ తాత్వికుడు. ప్రతిదానికి మూలం దర్శనాలలో, ఉపనిషత్తులలో,వెదికి చూస్తాడు. లోకంలో యువతీ యువకుల మధ్య బంధంగా నిలిచిపోయే

ప్రేమతత్వానికి,స్త్రీ పురుషులు యాదృచ్ఛికంగా భార్యాభర్తలుగా ఏర్పడటానికి గల కారణాలు లౌకికమైనవి కావని విశ్వనాథవారి నమ్మకం. విశ్వనాథ దృష్టిలో వివాహవ్యవస్థలో దాంపత్యధర్మం జన్మజన్మల బంధం. వ్యక్తికి చావు పుట్టుకలున్నా ఆత్మకు లేవు. ఆత్మలు ఈనాటివి కావు. జన్మజన్మలనుండి ఇవి ఉపాధిగతంగా శరీరాలను మాత్రమే పొందుతున్నాయి. అంతేగాక 'ఋణానుబంధ రూపేణ పశు పత్నిసుతాలయ' అనే సూక్తి ప్రకారం ప్రతి వ్యక్తి ఆయా జన్మలలో చేసిన కర్మలకు,ఋణాలకు,ప్రతిపలం ప్రస్తుత జన్మలో అనుభవిస్తాడని మన కర్మ సిద్ధాంతం, పునర్జన్మ సిద్దాంతం చెబుతున్నాయి. వీటిని దృఢంగా నమ్మినవారికే విశ్వనాథ తాత్విక భూమిక అర్థమౌతుంది.

## 3.6 ఏకవీర నవలలో త్వగింద్రియ స్పర్శ సిద్దాంతం.

విశ్వనాథ ఏకవీర నవలలో మొదటిసారిగా త్వగింద్రియ స్పర్శలక్షణాన్ని ప్రవేశపెట్టాడు దీనికి మూలం భవభూతి మహాకవి రచించిన 'ఉత్తర రామచరిత నాటకమ్' లోని తృతీయాంక కథలోని ఘట్టం.

సీతా పరిత్యాగానంతరం, శ్రీరాముడు అడవిలో శంబూకుని వధించి,అగస్త్యుని దర్శించి పంచవటీ సమీపంలో సీతను స్మరించుకుంటూ,అక్కడున్న ప్రదేశాలను,చెట్లను,మృగాలను, పూర్వం తాను సీతతో విహరించిన స్థలాలను,చూస్తూ గత స్మృతులు మనస్సును కలిచి వేయగా తట్టుకోలేక ఉద్విగ్న మనస్కుడై మూర్ఛ పోతాడు. అదే సమయంలో తిరస్కరణీ విద్యవల్ల అదృశ్యంగా ఉన్న సీతాదేవి కరస్పర్శతో రాముడు తేరుకుంటాడు. అప్పుడు సీత స్పర్శానుభూతి స్మృతులు శ్రీరామునిలో మెదులుతాయి. తన సమక్షంలోనే ఉన్నదనుకున్న సీత కనుపించక పోయేసరికి,...

"స్పర్శ పురాపరిచితో నియతం న ఏష
సంజీవనశ్చ మనసః పరిమోహనశ్చ
సన్తాపజాం సపదియః ప్రతిహత్యా మూర్ఛా
మానన్దనేన జడతాం పురాతనోతి." (ఉత్తర, 3-7 )

(ఈ స్పర్శ నాకు మునుపు పరిచితమైనదే. పోయిన ప్రాణము మరల వచ్చుచున్నట్లున్నది. మనోమోహకమైనది. అది సోకగానే దుఃఖంతో కలిగిన ఆ మూర్ఛ తటాలున తేరి మరల ఆనందం వలన మైమరుపు కలిగించుచున్నది.) అని రాముడు అనుకుంటాడు. అంతేగాక రాముడు సీత కరస్పర్శను వర్ణిస్తూ "వడకుచూ,చెమర్చుచూ,మ్రాన్పడిన నా చేతినుండి అదేవిధంగా ఆమె చేయి చివురు జారిపోయినదని' అంటాడు. ఈ విధమైన సీతారాముల స్పర్శానుభూతి ఆధారంగా విశ్వనాథ ఏకవీరలో దానికొక తాత్వికభూమిక ఏర్పరిచి ప్రయోగించాడు.

ఏకవీర నవలలోని నాలుగు పాత్రలు చూపులతోనే ప్రేమించుకున్నట్లు విశ్వనాథ

వర్ణించాడు. వారివారి చూపులలోనే వారి మనసులు కలుసుకున్నాయి. వారి ప్రేమ సఫలీకృతం కావటానికి వారేవిధమైన ప్రయత్నం చేయలేదు. తత్ఫలితంగా వారి వివాహాలు విపర్యంగా జరిగాయి. కుట్టాను మీనాక్షిని ప్రేమించాడు,కాని వివాహం ఏకవీరతో జరిగింది. అట్లే వీరభూపతి ఏకవీరను ప్రేమించాడు కాని వివాహం మీనాక్షితో జరిగింది. లౌకికంగా వీరి వివాహాలు జరిగినా వీరు దాంపత్యధర్మానికి కట్టుబడలేదు. దైవసంకల్పం మరోవిధంగా ఉంది కాబట్టి వీరి దాంపత్య జీవనానికి ఎన్నో అడ్డంకులేర్పడ్డాయి. వీరి ప్రేమకు దైవసంకల్పం ఎట్టిదో నిరూపించటానికి ఒక జంటలో విశ్వనాథ త్వగింద్రియ స్పర్శలక్షణాన్ని ప్రవేశపెట్టాడు.

ఏకవీర కథా నాయకురాలు. దృఢ మనస్తత్వం కలది. సౌందర్యవతి. అతి సూక్ష్మమైన వివేచనాత్మకత కలది. ఏకవీర మానసికంగా కుట్టాను ప్రవర్తనతో కృంగిపోయి తన శరీరాన్ని శుష్కింప చేసుకోసాగింది. ఆ శరీరాన్ని అనేకవిధాలైన ఒత్తుదులకు,వాతావరణాలకు,లొంగదీసి అతిసూక్ష్మమైన స్పర్శ జ్ఞానాన్ని పొందే వీలు కలుగచేసింది. క్రమంగా ఆమె శరీరం ఒక యంత్రంగా తయారైంది. (ఏక. పుట. 152)★.

చివరలో ఏకవీరను అనుకోకుండా వీరభూపతి గాఢాతి గాడంగా కౌగిలించుకున్నాడు ఆ స్పర్శలో ఆమె మధురాతి మధురమైన ఆనందానుభూతి పొందింది(పుట. 174). ఆమె ఆ స్పర్శను గుర్తించింది. అది సజాతీయ స్పర్శగా గ్రహించింది. కుట్టాను ఆమెను కౌగిలించు కోవటానికి రాగా ఏకవీర వారించింది. తన ప్రేమ సంగతి చెప్పింది. నరనరాన వీరభూపతి స్పర్శ అనుభవిస్తున్నానని,అది ఇంకొక విజాతీయ స్పర్శను భరించలేదని పలికింది. (189). కాని కుట్టాను వినిపించుకోలేదు. ఆమెను గాడంగా కౌగిలించుకున్నాడు. ఆ కౌగిటచిక్కిన ఆమె త్వగింద్రియం తట్టుకోలేక చైతన్యరహితమైంది. (190).

ఈ విధంగా ఈ సందర్భంలో విశ్వనాథ 'ఏకవీర,వీరభూపతుల' స్పర్శ సజాతీయ మైనదిగా, 'ఏకవీర,కుట్టానుల' స్పర్శ విజాతీయమైనదిగా, పేర్కొన్నాడు. సజాతీయ,విజాతీయ స్పర్శలనటంలో ఉద్దేశ్యమేమి? ఏకవీర వీరభూపతి భార్యాభర్తలు కారు, కాని వారి స్పర్శ సజాతీయమైనదనీ,అట్లే ఏకవీర కుట్టానులు భార్యాభర్తలైనా వారి స్పర్శ విజాతీయమైనదనీ, విశ్వనాథ వర్ణించి చూపుతాడు.

త్వగింద్రియ స్పర్శ లక్షణం ఏకవీరలో జ్ఞానోదయం కలుగచేసింది. ఏకవీరతో కుట్టాను వివాహం దైవసంకల్పం కాదు. అది కేవలం లౌకికంగా,మానవ ప్రయత్నంతో,సాంఘిక ధర్మంగా చేయబడింది. అనగా వారిద్దరు కలిసి బ్రతకటానికి సంఘం ఆమోదించింది. కాని సంఘానికి మించి దైవమున్నాడు. ఆ దైవసంకల్పం మరోవిధంగా ఉంది. జన్మజన్మల బంధం కూర్చేవాడు దైవం. దైవసంకల్పంగానే ఏకవీర,వీరభూపతులలో తొలచూపులోనే ప్రేమ పుట్టింది. కాని లౌకికంగా విడిపోయారు. దానికి కారణం అడ్డువచ్చిన మానవ సంకల్పం. కాని చివరలో వారు స్పర్శద్వారా

★ గమనిక. కుండలీకరణంలో చూపబడిన సంఖ్యలు ఆయా నవలల్లోని పుట సంఖ్యను తెలుపును.

జన్మజన్మల బంధాన్ని గుర్తించటం ఇందులో విశేషం.విశ్వనాథ ప్రతిభకు తార్కాణం.

## 3.7 ఏకవీర నవలలో మనస్తత్వ చిత్రణ.

అనేక భావాల సమాహార రూపమే మనస్తత్వం.ఈ భావాలు అనుకూలమైనవి కావచ్చు లేదా ప్రతికూలమైనవి కావచ్చు.విరుద్ధమైన భావాల ప్రేరణలతో మనస్సు వికలమౌతుంది. పరస్పర విరుద్ధభావాల ఒత్తడియే మానసిక సంఘర్షణ.అనేక భావాలకు కేంద్రం మనస్సు. అందువల్ల ఈ ఘర్షణ మనస్సులో మొదలై పెరుగుతూ వ్యక్తి ప్రవర్తనను అపసామాన్యంగా మారుస్తుంది.మానసిక సంఘర్షణ వల్ల వ్యక్తి సర్దుబాటు తనాన్ని పొందలేక,బాహ్య పరస్థితులలో రాజీపడలేక.తనలో తాను నలిగిపోతుంటాడు.

విశ్వనాథ ఆ నవలలోని పాత్రలలో విరుద్ధభావాల సంఘర్షణ ప్రవేశపెట్టి,ఆ భావాలను అనేక విధాల పోషించి వాటిని పతాక స్థాయివరకు చేర్చి ఆ పాత్రలు ఆ మానసిక సంఘర్షణకు తట్టుకోలేక క్రమంగా బాహ్యాస్థితినుండి తప్పుకున్నట్లు చిత్రించాడు.

వ్యక్తులలో మానసిక సంఘర్షణ ఎందుకు జరుగుతుందో?ఎట్లా జరుగుతుందో? మానసిక శాస్త్రవేత్త సిగ్మండు ఫ్రాయిడ్ ఈ విధంగా వివరించాడు.

'వ్యక్తులలో మానసిక సంఘర్షణ కలగటానికి మూలం వ్యాకులత.ఈ వ్యాకులత వ్యక్తులలోని బలహీన మనస్తత్వంవల్ల ఏర్పడుతుంది.వ్యక్తులలో బలహీనత అనేక రకాలుగా చోటుచేసుకుంటుంది.వ్యక్తులలోని శారీరకమైన బలహీనతల వలెనె మానసిక బలహీనతకూడా పుట్టుకతో వచ్చేదే.వ్యక్తులలో పుట్టుకతో వచ్చే ఈ మానసిక బలహీనత అనేక కారణాలవల్ల రూపొంది వ్యాకులతకు మూలమై నిలుస్తుంది.బలహీన మనస్తత్వంగల వ్యక్తులు తొందరగా వ్యాకులతకు గురిఅయి మానసిక సంఘర్షణలో నలిగిపోతుంటారు.దృఢమనస్కులు తొందరలోనే తమ వ్యాకులతను అధిగమించి మానసిక సంఘర్షణను తొలగించుకొని,సర్దుబాటుతనాన్ని పొంది బాహ్యపరిస్థితులకు తగినట్లుగా నడుచుకుంటారు.

వ్యక్తులలో వ్యాకులత కలగటానికి బలహీన మనస్తత్వంతో పాటు ఆయా వ్యక్తులలో పనిచేసే మానసిక ప్రక్రియలైన 'అచిత్తు.అహం,అధ్యహం ల' అనైక్యత కూడా తోడ్పడుతుంది. వ్యక్తులలో బలమైన,స్వార్థపూరితమైన,శక్తివంతమైన,మానసిక కేంద్రం 'అచిత్తు'. నైతిక,ధార్మిక, సామాజికాది విలువలకు ప్రాతినిధ్యం వహించేది అధ్యహం.వ్యక్తులలో స్వార్థపూరితమైన అభిలాషలెన్ని ఉన్నా అతనిలోని వివేకం,జ్ఞానం,వాటిని అణిచి వేస్తుంది.అచిత్తు వ్యక్తిని అనేక విధాలైన ఉద్రిక్తలకు,ప్రేరణలకు,గురిచేసినా,ఆ అచిత్తును అణిచే శక్తి అధ్యాహానికి ఉన్నపుడే వ్యక్తి సహజంగా సర్దుబాటు తనాన్ని పొందుతాడు.అట్లాకాకుండా అచిత్తును అణిచే శక్తి కోల్పోయినపుడు ఆ వ్యక్తి వ్యాకులతకు లోనవుతాడు.వ్యక్తి అచిత్తును అణిచేసే శక్తిని సాధారణంగా తనలోని బలహీనతవల్ల కోల్పోతాడు.వ్యక్తిలోని బలహీనత అచిత్తు ఉద్రేకాలకు తట్టుకోలేక

పోతుంది. అచిత్తు కోరికలను అహం తీర్చలేక పోతుంది. అధ్యహం అచిత్తును అణిచే ప్రయత్నం,అచిత్తు అహాన్ని పుకొల్పేవిధం,నిరంతరంగా వ్యక్తులలో జరిగే మానసిక కార్యాలు.

ఈ మానసిక కార్యాలలో అధ్యహం,అచిత్తుల, ప్రేరణలు బలవత్తరమైన సందర్భంలో అహం స్థంభించి పోతుంది. బాహ్యపరిస్థితులలో వ్యక్తియొక్క ప్రవర్తనను విచిత్రంగా మారుస్తుంది వ్యక్తి మానసిక బలహీనతకు లోనై వాస్తవిక పరిస్థితులలో తాను నడుచుకోవాల్సిన రీతిని, మార్గాన్ని,మరిచిపోతాడు. క్రమంగా వివశుడై తనను తానే చంపుకునే ప్రయత్నం చేస్తాడు.

"ఫ్రాయిడ్ వ్యక్తులలో ప్రధానంగా మూడురకాలైన వ్యాకులతలు కలుగుతాయని పేర్కొన్నాడు. 1 నాడీరుగ్మత వ్యాకులత 2 నైతిక వ్యాకులత. 3 వాస్తవికతా వ్యాకులత" [7]

విశ్వనాథ ఈ నవలలోని పాత్రలలోని మానసిక సంఘర్షణకు చాలావరకు నైతిక వ్యాకులతను, వాస్తవికతా వ్యాకులతను ఆధారించుకొని వాటిని పోషించిన విధానాన్ని ఆయా పాత్రల ప్రవర్తన ద్వారా చిత్రించి చూపుతాడు.

వ్యక్తి మనస్తత్వంపై పరిసరాల ప్రభావం కన్న అంతర్గతమైన నైతిక,ధార్మిక,విలువల ప్రభావంవల్ల కలిగే అలజడి నైతిక వ్యాకులతకు మూలం. వ్యక్తి ధార్మికుడైనచో ఈ నైతిక వ్యాకులతకు గురి అవుతాడు. అధ్యహం అహంమీద ఒత్తడి తెచ్చినపుడు నైతిక వ్యాకులత కలుగుతుంది. అధ్యహాన్ని తృప్తిపర్చలేక పోయినపుడు అహం అపరాధ భావాలకు,న్యూనతా భావాలకు లోనవుతుంది. అధ్యహం బలవత్తరమైనపుడు వ్యక్తి అంతరాత్మకు వ్యతిరేకంగా ఏదైనా చేయాలన్నా,చేయాలని ఆలోచించినా అపరాధ భావనకు లోనవుతాడు. ఈ విధంగా వ్యక్తి అధ్యహాన్ని కాదనలేక అచిత్తులోని కోరికలను(ఆత్మధర్మాన్ని) తీర్చుకోలేక పోతాడు. ఏ విధంగా నడుచుకోవాలో తెలుసుకోలేక నైతిక వ్యాకులతకు లోనై మానసిక ఘర్షణలో చిక్కుకుంటాడు. ఈ విధమైన నైతిక వ్యాకులతను విశ్వనాథ 'కుట్టాను,మీనాక్షి' పాత్రలలో మొదట ఉదృతం చేసి చూపుతాడు. తదుపరి 'వీరభూపతి,ఏకవీర' పాత్రలలో రెండవసారి ఈ వ్యాకులతను ప్రవేశపెట్టి ఉదృతం గావించి పతాక స్థాయికి చేరుస్తాడు.

వాస్తవిక వ్యాకులత బాహ్యప్రపంచపు ఒత్తడులు ఎక్కువైనపుడు వ్యక్తులలో కలుగుతుంది. వాస్తవిక విషయాలు వాటి ప్రేరణలు,అహంశక్తికి మించినపుడు వాస్తవికతా వ్యాకులత కలుగుతుంది. ఇటువంటి వ్యాకులత కలిగినపుడు పరిస్థితులను ఎదిరించిగాని,సర్దుబాటు తనాన్ని పొందిగాని వ్యాకులతను తగ్గించుకోవచ్చు.

విశ్వనాథ 'వీరభూపతి,ఏకవీర' విషయంలో మొదట ఈ విధమైన వాస్తవికతా వ్యాకులతను చూపించి తొందరలోనే ఆ పాత్రలు ఆ వ్యాకులతను అధిగమించి వాస్తవిక పరిస్థితులలో రాజీపడే సమయంలోనే విచిత్రమైన పరిస్థితుల ప్రభావాలవల్ల పుట్టిన కారణాలచే ఆ పాత్రలు క్రమంగా నైతిక వ్యాకులతలో పడిపోయినట్లు చిత్రించాడు. ఈ విధంగా ఏకవీర

7. అపసామాన్య మనోవిజ్ఞానశాస్త్రం. పుట. 82.

నవలలోని నాలుగు పాత్రల మనస్తత్వ చిత్రణలో నైతిక,వాస్తవికతా వ్యాకులతలను ఆధారం చేసుకొని ఆయా పాత్రల ప్రవర్తనల ద్వారా వారిలో చెలరేగిన మానసిక సంఘర్షణను అద్భుతంగా చిత్రించి చూపుతాడు.

విశ్వనాథ ఈ నాలుగు పాత్రల మనస్తత్వచిత్రణను సాంఘికమైన రెండు ప్రయోజనాలను ఆశించి రూపొందించినట్లు తోచక మానదు. కుట్టాను,మీనాక్షి,వీరభూపతి, ఏకవీర అనే నాలుగు పాత్రల్లో మొదటి రెండింటిని ఒక ప్రయోజనాపేక్షతో, మిగతా రెండింటిని మరో ప్రయోజనాపేక్షతో రూపొందించాడు.మొదటి ప్రయోజనాపేక్ష వ్యక్తులలో ఉండే స్వార్థ గుణంతో ఏర్పడేది.ఇది అందరికి సహజం కాబట్టి సాంఘికంగా దీని ప్రయోజనం ఎంతవరకు అని నిర్ణయించటంలో ఈ రెండు (కుట్టాను,మీనాక్షి) పాత్రలు తోడ్పడతాయి.వ్యక్తిలో స్వార్థగుణంతో ఏర్పడేవన్నీ ఉదా॥ ప్రేమ,ధనం,పేరు,ప్రతిష్టలు,మొ॥నవి వ్యక్తి ప్రయోజనానికే ఉన్నా అవి వ్యక్తిని ఎల్లప్పుడూ తన కనుకూలమైన భావాలతో ప్రేరేపించి అచిత్తు ఉద్రిక్తలను కలిగిస్తుంది.ఈ విధమైన స్వార్థ ప్రయోజనాపేక్షతో కూడిన ప్రేమను ఆత్మధర్మంగా కుట్టాన్,మీనాక్షి పాత్రలలో ప్రవేశపెట్టి వైయక్తిక మనస్తత్వంతో కూడియున్న వారి ప్రవర్తనను సంఘానికి విరుద్ధంగా ఉండేటట్లు చిత్రించాడు.వీరిలో గూడుకట్టుకున్న సామూహిక మనస్తత్వం,గుప్తంగా సుప్తచేతనంలో ఉండేటట్లుచేసి తర్వాత సమయాను కూలంగా ఆ పాత్రల్లోని అధ్యహాన్ని మేల్కొల్పి ఉధృతంచేసి ఆ పాత్రలు వివశత్వంతో ప్రవర్తించినట్లు చూపించాడు.అదే విధంగా మిగతా రెండు పాత్రల్లో అనగా ఏకవీర,వీరభూపతి మొదట సామూహిక మనస్తత్వంలో వివాహాన్ని ఆధారం చేసుకొని లోకధర్మంగా నడిచే ప్రయత్నంలో ఉండగా విచిత్రంగా అనుకోని పరిస్థితులు ఎదురుతిరగటంతో ఆ పాత్రలు వివశత్వం పొంది క్రమంగా లోకధర్మాన్ని వీడి ఆత్మధర్మం వైపు మళ్ళినట్లుగా(వైయక్తిక మనస్తత్వంలోకి) చిత్రించాడు.

ఈ విధమైన మనస్తత్వచిత్రణ పాత్రలలో చిత్రించుటకు,సమానమైన లేదా అనుకూలమైన మనస్తత్వం కలిగిన పాత్రలను ఏకం చేయక,విరుద్ధ స్వభావంతో రూపొందిన మనస్తత్వం కలిగిన పాత్రలను వివాహంతో ఏకంచేసి,ఆయా పాత్రల మనస్సులలో అలజడిని ఉధృతంచేసి మానసిక సంఘర్షణకు అనుకూలమైన వాతావరణాన్ని నవలలో కలిగించాడు.

ఈ నవలలోని పాత్రల మానసిక సంఘర్షణకు వ్యక్తులలో ఉండే అచిత్తు,అధ్యహం అనే బలమైన మానసిక కేంద్రాలు మూలమై నిలిచాయి.అచిత్తు వైయక్తికమైనది.ఆత్మధర్మానికి ప్రాతినిధ్యం వహించేది.అధ్యహం వివేకానికి,జ్ఞానానికి,నీతికి,నియమానికి,సాంఘిక కట్టుబాట్లకు లోకధర్మానికి,కేంద్రంగా నిలిచేది.పాత్రలలోని మానసిక సంఘర్షణ ఈ రెండింటి మధ్యనే. అనగా ఆత్మధర్మానికి,లోకధర్మానికి. ఇంకా వివరంగా చెప్పాలంటే 'ప్రేమకు,పెండ్లికి'.లోకంలో ప్రేమ గొప్పదా?పెళ్ళి గొప్పదా? లేదా వ్యక్తికి ప్రేమ ముఖ్యమా?లేక పెళ్ళి ముఖ్యమా? అనే సందేహానికి సమాధానంగా ఆ రెండింటికి సమాన స్థాయిలో సంఘర్షణను చిత్రించి పాత్రలలో కూడా ఇదే

సందేహాన్ని ఉద్భృతంచేసి చివరకు ఆ పాత్రలను వివశత్వానికి గురిచేశాడు.

## 3.8 పాత్రల మనస్తత్వచిత్రణ.

పాత్రచిత్రణ నవలకు ఆత్మ వంటిది.రచయిత ఉద్దేశానికి,భావానికి,ఇది ప్రాధాన్యం వహిస్తుంది.ప్రతికాత్మక పాత్రకూడా రచయిత దృష్టిలో ప్రధానమైనదే.(ఈ నవలలో గుఱ్ఱపు వాళ్ళపిల్ల అమృతం).సామాజిక జీవియైన మానవుడు సాహిత్యంలో పాత్రగా మలచబడతాడు. మానవునిలోని మంచిచెడులు పాత్రల్లో కనిపించటం సహజం.రచయిత దృక్పథం ఆ రచన ముగింపులో వ్యక్తమౌతుంది.రచయిత యొక్క అభిప్రాయాలు సామాన్యంగా పాత్రల మనో భావాల వల్ల,ప్రవర్తనలవల్ల,వెల్లడవుతూఉంటాయి.నవలల్లోని పాత్రలు కొన్ని మంచికో,చెడుకో, పరిమితమై చిత్రింపబడటం సహజమే.అయినా మనోవైజ్ఞానిక నవలల్లో పాత్రచిత్రణ సామాజికవ్యక్తి యొక్క మానసిక అలజడులకు ప్రాతినిధ్యం వహించి ప్రవర్తించినట్లు చిత్రంపబడటం చూస్తుంటాం. వీటినే ఇ.యం.ఫార్స్టర్ రౌండ్ క్యారెక్టర్స్ అన్నాడు.వీటిలో మానసిక సంఘర్షణ అధికంగా ఉంటుంది."ఏకవీర నవలలోని పాత్రలన్నీ రౌండ్ కారెక్టర్స్' అనగా క్లిష్టత కలిగిన పాత్రలు."[8].

విశ్వనాథ ఈ నవలలోని నాలుగు పాత్రలను తన ఉద్దేశానికి అనుకూలంగా మలచుకొని చిత్రించాడు.సంఘజీవి అయిన వ్యక్తికి స్వేచ్ఛ ఉందా?ఉంటే ఆ స్వేచ్ఛ ఎటువంటిది?.స్వేచ్ఛా వాతావరణంలో పుట్టిన భగవదత్తమైన ప్రేమ ఆత్మధర్మంగా రూపొందినపుడు వ్యక్తి ఆప్రేమను ఏ విధంగా పొందగలడు?సామాజికంగా ఆ ప్రేమ గుర్తింప బడనపుడు ఆ వ్యక్తి కర్యవ్యమేమిటి? సాంఘిక వ్యవస్థలో భాగమైన వివాహాన్ని సంఘజీవియైన వ్యక్తి కాదనగలడా?ఆ వివాహబంధాన్ని తెంచుకోగలడా?ప్రేమను నమ్ముకొని వివాహాన్ని కాదని వైవాహిక ధర్మాన్ని కాలదన్న గలడా?లేక వైవాహిక ధర్మానికి తలొగ్గి ఆత్మగతమైన భగవదత్తమైన ప్రేమను చంపుకోగలడా?ప్రేమలో చిక్కిన వ్యక్తులకు ఏది కర్తవ్యం?

ఇటువంటి సందేహాలు వ్యక్తులలో కలగటం సహజం. అంతేగాక ఆనాటి కాలంలో చలం రచనలు స్వేచ్ఛా ప్రణయానికి,సెక్సు జీవితానికి,ప్రాతినిధ్యం వహించి,వైవాహిక ధర్మానికి ప్రతికూలంగా నిలిచాయి. కనుక విశ్వనాథ ఈ నవలలోని నాలుగు పాత్రలలో ఈ సందేహాలనే పాదుకొల్పి ఆ పాత్రలు ఎటూ నిర్ణయించుకోలేక తల్లడిల్లి పోయినట్లు చిత్రించి,ముగింపులో తన ఆశయాన్ని,దృక్పథాన్ని,సందేశాన్ని,చూపిస్తూ పాత్రలను నిష్క్రమింప చేసాడు.

ఈ నవలలో ఒకజంట, కుట్టాను-మీనాక్షి పాత్రలను ప్రేమకు ప్రాతినిధ్యం వహించి క్రమంగా ఆ ప్రేమను దివ్యంగా మార్చుకొని సాంఘీకరణం పొందినట్లుగాను,మరోజంట వీరభూపతి-ఏకవీర పాత్రలను వైవాహిక ధర్మానికి కట్టుబడినట్లు నిల్పి,ప్రతికూల పరిస్థితులవల్ల ఆ పాత్రలు తిరిగి ఆత్మగత ప్రపంచంలోకి వెళ్ళిపోయి ప్రేమకు తలొగ్గి సాంఘికంగా బహిష్కరింప

8. నవలా శిల్పం. పుట.30

బడినట్లుగాను, విశ్వనాథ చిత్రించటం మనం గమనించవచ్చు.

సర్దుబాటు తనాన్ని పొందలేక వివశత్వానికి లోనై మొదట అశాంతికి గురైన కుట్టాను, మీనాక్షి పాత్రలు చివరలో సర్దుబాటు పొందినట్లు ,సర్దుబాటుతనాన్ని పొంది జీవితాన్ని శాంతి యుతంగా గడపాలనుకున్న వీరభూపతి,ఏకవీర పాత్రలను చివరలో అశాంతితో సర్దుబాటు పొందలేక పోయినట్లు విశ్వనాథ చిత్రించిన విధానం అద్భుతమైనది.ఇక ఈ పాత్రల్లోని వైయక్తిక సామూహిక మనస్తత్వాలను గురించి పరశీలిద్దాం

## 3.9 వైయక్తిక మనస్తత్వంలో నుండి సామూహిక మనస్తత్వంలోకి.

### (ఆత్మధర్మం నుండి లోకధర్మంలోకి)

### కుట్టాన్ -మీనాక్షి పాత్రల మనస్తత్వ చిత్రణ

### 1) కుట్టాన్ పాత్ర చిత్రణ.

కుట్టాన్ ఉదయన్ సేతుపతి కుమారుడు.శ్రీమంతుడు,పొట్టివాడు,నల్లనివాడు. విశాలమైన నేత్రాలు గలవాడు.గంభీరమైనవాడు.మితభాషి.కాని ఉద్వేగ మనస్తత్వం గలవాడు. యుద్ధరంగాన ఎంతవీరుడో,తండ్రి సమక్షాన అంత భీరువు.తండ్రిముందు ఎటువంటి స్వాతంత్ర్యం,స్వేచ్ఛ,లేని వాడు.పైగా ఆతని దినచర్య కనిపెట్టటానికి తండ్రి కుట్టానుపై ఒక అధికారిని నియమించి ఉంచాడు "వీరభద్ర భట్టరు,కుట్టాన్ సత్ప్రవర్తన కలిగియుండునట్లు చూచుటకు ఏర్పడిన అధికారి.ఇతనికి తెలియకుండా ఏ పని చేయరాదు."(పుట-16)

కుట్టను మేనమామల ఊరు పరమేశ్వర సముద్రం.ఆ ఊళ్ళో కుట్టాను మీనాక్షిని చూశాడు.మీనాక్షి పెదపిల్ల.చూపులలోనే వారిద్దరి మనసులు ముడివేసుకున్నాయి.మీనాక్షిని చూడటానికి కుట్టాను ప్రతిరోజు వారింటికి వెళ్ళేవాడు.మీనాక్షిని గాడంగా ప్రేమించిన విషయం ఆమె తల్లిదండ్రులకు గాని,తన తండ్రికి గాని తెలియచేయలేదు.అతడు చేసిన ఆలస్యంవల్ల కుమారుని విషయం తెలుసుకున్న తండ్రి వెంటనే వేరే సంబంధం కుదర్చి ఏకవీరతో పెండ్లి చేశాడు.కుట్టాను ఏకవీరను వివాహంమాడి కుమిలిపోయాడు.

కుట్టాను మానసికంగా ఎంత బలహీనుడో అతని ప్రవర్తనవల్ల,మాటలవల్ల తెలుస్తుంది. వీరభూపతితో తన ప్రేమగాథను చెబుతూ "నేను మొదట వారి ఇంటికి వెళ్ళుచుండుట వారు నా మంచితన మనుకొనిరి.క్రమక్రమముగా తెలిసిన కొలది వారికి భయమైనది.నా మేనమామ ఆయన భార్య ఈ విషయం తెలుసుకున్నారు.మా తండ్రి కబురు వచ్చింది.'అని 'ఛీ ఛీ! ఈ జన్మ ఎందుకు? నా కోర్కె ఇంత అలభ్యమైనదని తెలిసికూడా నేను బ్రతికియున్నాను చూడు" అని దుఃఖించాడు.(పుట.3)

కుట్టాను తనప్రేమ విషయం మీనాక్షి తల్లిదండ్రులకు,తన మేనమామకు,తన తండ్రికి

తెలిసిపోయిందని భయపడ్డాడే గాని మీనాక్షి తల్లిదండ్రులకు ధైర్యం చెప్పి తన మంచితనాన్ని చూపించుకోలేక పోయాడు. తన తండ్రి వేరే సంబంధం చూస్తుంటే, తాను మీనాక్షిని ప్రేమించాననీ, ఆమెనే పెళ్ళి చేసుకుంటానని తండ్రితో చెప్పలేకపోయాడు. అట్లా చెప్పలేక పోవటానికి తనలోని బలహీనతే కారణమని తెలుసుకున్న కుట్టాను తన జన్మెందుకని నిందించుకొని బాధపడ్డాడు. కుట్టాను కోర్కె అలభ్యమైనదేమీ కాదు. తాను శ్రీమంతుడు. మీనాక్షి పేదపిల్ల తలచుకుంటే వివాహం చేసుకునే వాడే. కాని తండ్రి భయం అతనిలో విపరీతమైన బలహీనతకు, పిరికితనానికి చోటిచ్చింది. ఆ బలహీనతే కుట్టానుకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను లేకుండా చేసింది. "నేను ఎందున్నానో ఏ రోజున ఏమి చేయుచున్నానో నిత్యమూ నా తండ్రికి తెలయ చేయుచుండవలెగదా।" అని కుట్టాను వీరభూపతితో పలికిన మాటలు ఆతని పరాధీనతను తెలుపుతున్నాయి.

ప్రేమకు కట్టుబడిన వ్యక్తి ఆ ప్రేమను పొందాలంటే ధైర్యం చేయాలి. సాహసం చూపాలి. అవసరమైతే తల్లిదండ్రులను, లోకాన్ని, ఎదిరించాలి. ఇంకా పరువు, ప్రతిష్ట, మొదలైనవన్నీ వదులుకోవాలి. సర్వం త్యాగంచేసి ఆ ప్రేమైక మూర్తిని పొందే ప్రయత్నం చేయాలి. ప్రేమికుడు తన ప్రేమ సఫలం కావాలనే తపనతో మార్గాలు వెదకాలి. కాని పిరికితనంతో అశ్రద్ధతో కాలయాపనతో తన జీవితాన్ని నాశనం చేసుకోకూడదు. చేసుకోడు.

మీనాక్షి ఆడపిల్ల. ప్రేమ విషయంలో ఎదిరించి తన తల్లిదండ్రులకు చెప్పే ధైర్యం ఆమెకు లేదు. కుట్టాను ఆ పని చేయవలసి ఉండేది. కాని చేయలేకపోయాడు. అట్లా చేయకపోవటం అతని బలహీనత. వ్యక్తిలోని బలహీనత, మానసిక ఆవేదన, ఆతని ప్రవర్తనను చిన్న పిల్లల స్థాయికి తీసుకెళ్తుంది. ఇక్కడ కుట్టాను కూడా వీరభూపతి ముందు తన అసమర్ధతను తలుకుంటూ చిన్నపిల్లవానిలా కుమిలిపోతూ ఏడ్చాడు. తనలోని బలహీనతను, తండ్రిని ఎదిరించలేని పరికితనాన్ని గుర్తించిన కుట్టాన్ తండ్రి మీదగల కోపాన్ని అబలయైన ఏకవీర మీదికి మరల్చుకున్నాడు.

ఏకవీరతో వివాహం జరుగుతున్నపుడు కుట్టాను ఆడపిల్లలా తలవంచి పెళ్ళి చేసుకున్నాడు. "పెళ్ళిలో కుట్టాన్ స్థితి చిత్రముగా నున్నది. అతడు తండ్రికి భయపడి ఏమియు మాటాడలేదు. తండ్రి లేనపుడు అందరిమీద విసుగుకొను చుండెడివాడు."(50). కుట్టాను ఏకవీరను పెండ్లి చేసుకున్నాడే గాని ఆమెతో మాట్లాడిన పాపాన పోలేదు. వివాహమై మూణ్నెల్లయింది. ఏకవీర మొహంకూడా చూడలేదు.

కుట్టానులోని ప్రేమ వైయక్తిక మనస్తత్వంలో ముద్రించుకు పోయింది. పెళ్ళి సామూహిక మనస్తత్వంలో చేరిపోయింది. వైయక్తిక మనస్తత్వానికి మూలమైన అచిత్తు నుండి పుట్టే ప్రేరణలు, ఉద్రిక్తతలు అతన్ని కలవర పరచసాగాయి. ప్రేమనుగురించి విచారించసాగాడు. పెళ్ళికిగల కట్టుబాట్ల గూర్చి ఆలోచింప సాగాడు. వీరభూపతి, తనతల్లి, ఏకవీరను ప్రేమించ మంటున్నారు. ఏకవీరను ఎందుకు ప్రేమించాలో కుట్టానుకర్థం కాలేదు. ప్రేమ, పెండ్లి విషయంలో విచారంలో పడిపోయాడు.

"నేను ప్రేమించిన స్త్రీని వదిలిపెట్టి బలవంతంగా నా మెడకు కట్టిన స్త్రీనా ప్రేమించ వలె?నాకు అర్థమగుటలేదు.ప్రేమించుట,ప్రేమించక పోవుట, అనునది నా స్వాధీనములో నున్నదా! ఎవరి స్వాధీనములో నున్నది?భగవంతుని స్వాధీనములో నున్నది.ఏ భగవంతుని స్వాధీనములో ఇది ఉన్నదో యా భగవంతుడే నాకీ స్త్రీని దెచ్చి పెండ్లి చేసెను గదా !భగవంతుడు కాదు !నా తండ్రి చేసినాడు.భగవంతుని ఇచ్ఛలేనిది నా తండ్రి ఎవరు చేయుటకు?ఈ స్త్రీకిని నాకును సంబంధమేమున్నది?ఏమియు లేకున్న మేమిరువురము భార్యాభర్తలుగా చేయబడుట ఎట్లు? పూర్వ జన్మములో నే సంబంధమున్నదో !" (71).

ఈ విధమైన ఆలోచనలలో కుట్టాను ఒక నిర్ణయానికి వచ్చాడు.తన వివాహం తండ్రియిచ్ఛగా చేసిన బంధమనీ,ప్రేమ అనేది భగవంతుడు తనలో కలిగించిన ప్రేరణమనీ.ఆత్మ గతమైన ప్రేమే తనకు శరణమని.

ఏకవీరతో వివాహమైన తదుపరి కుట్టాను మరోసారి మేనమామల ఊరికి వెళ్ళాడు. మీనాక్షిని చూసాడు.మీనాక్షి తల్లి పలకరించింది.ఆ పలకరింపులు కుట్టాను హృదయాన్ని గాయపర్చాయి.మీనాక్షి తల్లి ." నీ భార్య క్షేమముగా నున్నదా? నీ పెండ్లికి మమ్ము పిలిచితి వైనగాదు ! పేదవారము.మమ్మేందుకు పిలిచెదవులే ! "అంది. ఇంకా "మా మీనాక్షికి మంచి సంబంధ మెక్కడైనా చూచి పెట్టుము తండ్రీ ! నీవు తలచుకున్నచో నది ఎంతసేపు. "అంది. ఆమె మాటలతో కుట్టాను తాను చేసిన తప్పిదాన్ని గుర్తించాడు.తాను తలచుకుంటే మీనాక్షిని చేసుకునేవాడే.తన అసమర్థతవల్ల మీనాక్షి తనకు కాకుండా పోయింది.తన అసమర్థతకు కారణం తనతండ్రి.తనతండ్రికి లొంగే తానీస్థితికి దిగజారాడు.తండ్రిచేసిన సంబంధాన్ని తానంగీక రించరాదు. కుట్టాన్ మనస్సు వికలమైంది.తండ్రిమీద చెప్పలేనంత ద్వేషం పుట్టుకొచ్చింది.'అత్తమీది కోపం దుత్తమీద చూపినట్లు' తండ్రి కుదిర్చి చేసిన సంబంధమని, ఏకవీర పరోక్షంగా తనకు శత్రువనీ నిర్ణయించుకొని తన తిరుగుబాటు తనాన్ని,ద్వేషాన్ని, ఏకవీరపై మరలించు కున్నాడు. కుట్టాన్ ప్రవర్తన ఏకవీర విషయంలో మహా దారుణంగా పరిణమించిది.

తన ప్రేమను నశింపచేసిన ఏకవీరను దయ్యంలా,భూతంలా,పిశాచంలా,భావించాడు.

"ఆమెకు నాకు నీ జన్మమున కలయికయే లేదు.నన్నీ పిశాచామావేశించినది. అయ్యో! ఈ దయ్యము నన్నెట్లు వదులును.?'అనుకుంటూ కోపంతో ఊగిపోయాడు.కాని అతనిలో వివేకం జాగృతమైనపుడు ఏకవీరమీద తాను కోపగించుకున్న సందర్భాలను తలచుకొని కుమిలిపోయాడు. అతనిలో ఆమెపై కరుణ జాలువారింది."అయ్యో ! నాకీమె సహధర్మ చారిణికదా ! ఈమె నన్ను వదిలి ఎచ్చటికి పోవును.ఇన్నాళ్ళుగా నేను మాటాడకుండిన నెంత శోషిల్లినదో ! నాతో నొక్కనాడు కూడా పలుకలేదే ? "అనుకుంటూ పశ్చాత్తాప పడ్డాడు.

ఏకవీర శయ్యామందిరంలో ప్రేమతో కుట్టాన్ మెడలో పూలదండ వేసింది.వెంటనే

కుట్టాన్ రుద్రమూర్తియై ఆ దండను రెండుగా త్రెంచి నేలమీద విసిరివేసాడు. ఏకవీర నిలువునా కృంగిపోయింది. కుట్టాను మనస్సు శాంతించింది. ఏకవీర పరిస్థితి గమనించి చిన్నమంచంమీద పడుకొని వెక్కివెక్కి ఏడ్చాడు. ఏకవీరను కౌగలించుకొని ఆమె శిరస్సున బాష్పాభిషేకం చేయవలె ననుకున్నాడు. కాని ధైర్యం చాలలేదు.

కుట్టాన్‌లో నైతిక వ్యాకులత ప్రారంభమైంది. అతని ప్రవర్తన విచిత్రంగా మారింది. అచిత్తులో గాఢంగా పెనవేసుకున్న ప్రేమను అణుచుకోలేక పోయాడు. ఏకవీరను ఏలుకొమ్మని అతని అంతరాత్మ పదేపదే హెచ్చరించినా ఆ విధంగా చేయలేకపోయాడు. ఈ విధంగా కుట్టాను మానసిక సంఘర్షణలో చాలాకాలం గడిపాడు. వాస్తవికతా వ్యాకులత, నైతిక వ్యాకులత అతన్ని కృంగతీస్తూ తినివేయ సాగాయి. ఈ బాధ భరించలేక ఒకనాడు ధైర్యం చేసి ఏకవీరతో తన ప్రేమ విషయం చెప్పాడు. తన ప్రేయసిని క్రమంగా మరిచిపోతానని, ఏకవీరను ప్రేమించే ప్రయత్నం చేస్తానని మాటయిచ్చాడు. కాని ఏకవీరను దగ్గరకు తీసుకోలేదు. దాంపత్య ధర్మం నిర్వహించలేదు. మానసికంగా నలిగిపోతూ కాలంగడిపాడు

కుట్టాను వైయక్తిక మనస్తత్వంలో ప్రేమ ఆరాధనా భావాన్ని పొందింది. అది క్రమంగా వృద్ధిపొంద సాగింది. మీనాక్షి వదిలివేసిన మల్లెపూలదండ, స్పృశించిన మట్టిని, భద్రంగా దాచుకొని వాటిని మాటిమాటికి చూసుకొని తన ప్రేమను గుర్తుచేసుకుంటూ, ప్రేయసిని తలచుకుంటూ, మీనాక్షిని మనస్సులో ఆరాధించసాగాడు. మానసిక ఉద్వేగానికి తాళలేక ఉదాత్తీకరణం పొందాడు. మీనాక్షి తనకు దక్కదనీ, నేడో, రేపో, ఆమె వివాహం కాబోతున్నదనీ తెలిసినా, కుట్టాన్ ఆమెను మరువలేక పోయాడు. మరువలేని అసమర్థత ఒకవైపు, తండ్రిమీది ద్వేషం ఏకవీరమీద చూపించటం, తిరిగి పశ్చాత్తాప పడటం మరోవేపు, అతన్ని మానసికంగా చాలా వేధించసాగాయి.

కుట్టానులో చెలరేగిన మానసిక సంఘర్షణ సామాన్యమైనది కాదు. అది ఒక తుఫాను వంటిది. చేతనాస్థితిలో ఆతని ముందు ఏకవీర ప్రత్యక్షమై 'దాంపత్యధర్మాన్ని అనుసరించండి, నన్ను అన్యాయం చేయకండి,'అని దీనావస్థతో ప్రార్థిస్తున్నట్లుగా రూపుకట్టిన రూపం ఒకవైపు, అచేతనస్థితిలో తాను ప్రేమించిన ప్రేయసి మీనాక్షి అంతరంగాన నిలిచి 'నన్ను మరిచి మరిచిపోతున్నారా? మీ ఆత్మధర్మ మిదేనా? మీ ప్రేమ ఇంతేనా?' అని ప్రశ్నిస్తున్నట్లున్న రూపం మరోవైపు, కుట్టానును కలిచివేయసాగాయి. తండ్రిచే అణచివేయబడిన వ్యక్తిత్వం పౌరుషంతో పైకిలేచి తిరుగుబాటుతనంతో 'నీ వ్యక్తిత్వమింతేనా? నీకు స్వంత వ్యక్తిత్వం లేదా? నీకు స్వేచ్ఛలేదా?'అన్నట్లు వేలెత్తి చూపుతున్న దృశ్యం, వీరభూపతి, తనతల్లి, ఏకవీరను ప్రేమించి ఏలుకొమ్మని బ్రతిమిలాడుతూ పదేపదే చెప్పిన దృశ్యాలు ఏకమై కుట్టాను మనసులో వ్యాకులతను అధికంచేసాయి.

ఈ పరిస్థితులలో తనలోని వ్యాకులతను తగ్గించుకోవటానికి రెండు మార్గాలు

అనుసరించాడు.అవి అతనికి రక్షణతంత్రాలుగా పనిచేసాయి.ఇందులో ఒకటి• వ్యక్తిత్వానికి సంబంధించింది.ఇంతకాలం తాను తనతండ్రికి అణిగి ఉన్నాడు.తాను తనతండ్రిని ఎదురించ లేకనే తాను మీనాక్షిని పొందలేక పోయాడు.తనకు తండ్రి ఎంతో ద్రోహం చేసాడు.తండ్రిమీద తిరుగుబాటును చేయలేని అసమర్థత తనలో ఉంది.కాని దానికి ప్రతిగా కుట్టాను తన తండ్రి కుదిర్చిన ఏకవీరమీద తన సామర్థ్యం ప్రదర్శించాలనుకున్నాడు.ఏకవీరకు దూరంగా ఉండటమే తాను తండ్రిపై సాధించే పగగా ఎన్నుకున్నాడు.

వ్యాకులతను అధిగమించటానికి వ్యక్తి తనలోని కోపాన్ని పరోక్షంగా మరొకరిమీదకు మళ్ళించి చూపించటం విస్థాపనం అంటారు.సర్దుబాటుతనాన్ని పొందలేని బలహీనులు, తాత్కాలికంగా దీనితో ఊరట పొందుతారు.కుట్టాను తాత్కాలికంగా ఈ రక్షణతంత్రాన్ని ఉపయోగించి ఏకవీరకు దూరం కాసాగాడు.

ఇక రెండవ మార్గం.ఉదాత్తీకరణమనే పరిహారం.మీనాక్షినిచే పొందబడిన మల్లెపూల దండను మట్టిని మాటిమాటికి స్పృశించి వాటిద్వారా తృప్తిపొందటం.తన ప్రేయసిని జ్ఞాపకం చేసుకొని ఊరటపొందటం.ఈ విధమైన చర్యలద్వారా కుట్టాను తనలోని వ్యాకులతను తగ్గించు కుంటూ స్వస్థత పొందే ప్రయత్నం చేసాడు. కాని వీటిద్వారా మరింత ఉద్వేగానికి లోనయ్యాడు. వీరభూపతితో "వీరా ! ఈ దుఃఖము నా హృదయ శోణితమును త్రాగుచున్నది. నేనింక చాలానాళ్ళు బ్రతకను.ఈ ప్రేమ నన్ను లోలోపలే తినివేయుచున్నది."అనేవాడు.

కుట్టాను చిత్రంగా తాను చనిపోతే ఎట్లా ఉంటుందని ఊహించేవాడు.

"నా ప్రేయసి నేను చనిపోతినని వార్త వినినచో నేమనుకొనును? ఇప్పటి నా భార్య ఏమిచేయును?ఏడ్చునా?ఏడ్వదు.నాకు నామెకు ఏమి సంబంధము.అయిననేమి జీవితాంతము విధవాత్వమును అనుభవించ గ౦దా ! కొంత ప్రేమ యుండకపోదు.లేకున్న రాత్రి పూదండ నా మెడలో ఏల వేయును?"(56).

డోలాయమానస్థితిలో ఉన్న కుట్టాను మానసికస్థితి ఎంతో దిగజారిపోయి పై విధంగా భావించుకోవటం,విచిత్రమైన స్వైరకల్పనలచే మానసిక శాంతిని పొందాలని ప్రయత్నించటం, కుట్టానులోని అచేతన మానసిక క్రియల ప్రభావాన్ని చూపుతున్నాయి.

ఒకనాడు మాటల సందర్భంలో మీనాక్షి,వీరభూపతి భార్యయని తెలుసుకున్నాడు.ఆ విషయం తెలియగానే క్షణంలో మతిభ్రమించిన వాడిలా అయిపోయాడు.పగలంతా ఇంట్లో, తోటలో పిచ్చివానిలా తిరిగాడు.మనోమథనం నుండి తేరుకొని శాంతించాడు.ఏదో నిర్ణయంచు కున్నాడు.రాత్రంతా హాయిగా నిదురించాడు.ఉదయం పసుపు,కుంకుమ,చీరతో తాను ఇంతకాలం భద్రంగా దాచుకున్న వాడినపూలను,కస్తూరి కలిపిన స్పర్శమట్టిని తీసుకొని వీరభూపతి ఇంటికి ప్రశాంత చిత్తంతో వెళ్ళాడు.

ఇంటికి వచ్చిన కుట్టానును చూసి వీరభూపతి ఆశ్చర్యపోయాడు.తెచ్చిన కట్నాలను చూసి'ఏమిటివి?' అని అడిగాడు.కుట్టాను విషయమంతా చెప్పి "నేనీ రోజున నిచ్చటనే భోజనము చేసెదను. మనకు నీ భార్య వడ్డన చేయవలయును."అన్నాడు. వీరభూపతి ఎంతో సంతోషించాడు. మీనాక్షికి కుట్టానును పరిచయం చేసాడు.మీనాక్షి కుట్టానును చూసింది.ఆమె ఆనందంతో కూడిన భయాన్ని పొంది క్షణకాలం స్థంభించిపోయింది.పరిస్థితి గమనించి తేరుకొని తనలోని ఉద్వేగాన్ని అణచుకొని భయాన్ని తొలగించుకొంది.ఆమెతో కుట్టాన్ ఈ విధంగా పలికాడు.

"అమ్మా ! ...ఇది కోరరాని కోరికయా !నీ భర్తకు నాకు నున్న స్నేహమట్టిది.నీవు నాకు సహోదరివి.సందియమెందులకు ?నీవు వడ్డించగా భోజనము చేయవలెనని అనిపించినది. అందుచేత వచ్చినాను.నీవిష్టపడవేని పోయెదను." అన్నాడు (110).

మీనాక్షి కంగారు పడింది.తమాయించుకొంది.హృదయాన్ని చిక్కపట్టుకొని "అన్నా! వడ్డించెదను...తర్వాత చెప్పెదను."అన్నది. ఆ మాటలు ఆనందంతో,ఉద్వేగంతో వెలువడ్డాయి.

ముగ్గరూ కూర్చున్నారు.కుట్టాను తాను తెచ్చిన కానుకలను మీనాక్షికి సమర్పించాడు. ఎంతో ఉత్సాహంతో తన ప్రణయగాథను వీరభూపతికి వివరించాడు.అది వింటున్న వీరభూపతి తనలో ఒక సముద్రం ఉప్పొంగుతున్నట్లు తెలుసుకున్నాడు.కుట్టాను అంతాచెప్పి వీరభూపతి పాదాలను కళ్ళకద్దుకున్నాడు.అది చూసిన వీరభూపతి చకితుడై "సేతూ ! నీవు ఋషివి. నేను ఇంకా మనుష్యుడనే...నీవు నన్నిట్లు తాకరాదు."అని వారించాడు.

ఈ విషయాన్ని ఏకవీరతో చెప్పి ఆమెను మనసారా క్షమించమని కోరి,తన జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలనుకున్నాడు కుట్టాన్.తనలో మేరుపర్వతంలా పెరిగిన బలహీనత, ఆ బలహీనతచే నలిపివేయ బడుచున్న మానసిక సంఘర్షణ ఒక క్షణంలో దూదిపింజలా ఎగిరి పోయి మనసంతా తేలికపడి పైకివచ్చినట్లు,ఆ పైకితేలివచ్చిన మనసులో ఎక్కడలేని ఆనంద తరంగాలు,ఉత్సాహంతో కూడిన ఉద్వేగాలు, కలిసిపోయి శరీరాన్నంతా ఆవరించి కొత్త బలాన్ని కలిగించినట్లు అనుభూతి పొందాడు.ఇంతకాలంనుండి మానసిక సంఘర్షణలో నలిగిన కుట్టాన్ స్థితి,విడుదల పొందిన బందీలా,విముక్తి పొందింది.వెంటనే ఇంటికి వెళ్ళాలనుకున్న కుట్టాను ప్రయత్నం 'మరిరెండు రోజులుండి వెళ్ళుమన్నా !' అని మీనాక్షి కోరటంతో ఆగిపోయింది.

ఈ విధంగా కుట్టాను మీనాక్షి ఇంట్లో ఉన్న సమయంలోనే విధిలేని పరస్థితులలో తండ్రి ఆదేశానుసారం రామనాథపురానికి వెళ్ళ వలసివచ్చింది. ఏకవీరను కలిసి విషయమంతా చెప్పాలనుకున్న కుట్టాన్ ఉత్సాహమంతా నీరుకారిపోయింది.కనీసం ఏకవీరను కలుసుకునే అవకాశంకూడా లేనందువల్ల మీనాక్షి ఇంటినుండే నేరుగా రామనాథపురం వెళ్ళిపోయాడు.

ఇంతకాలం కుట్టాను వైయక్తిక మనస్తత్వంలో కూరుకుపోయి,ప్రేమించిన ప్రేయసిని తలచుకుంటూ ఉద్వేగాలతో,ఉద్రిక్తలతో,కాలం గడిపినా, మీనాక్షిని తన సహోదరిగా భావించిన

క్షణంనుండి అతని వైయక్తిక మనస్తత్వంలో ఆరాధనా భావం రూపుదాల్చింది.క్రమంగా తన కర్తవ్యం గుర్తుకు రాగా అతని మనస్సంతా సామూహిక మనస్తత్వంలోకి జారిపోయి వైవాహిక ధర్మంగా తన ఏకవీరను ఏలుకోవాలనుకున్నాడు.

## 2) మీనాక్షి పాత్రచిత్రణ.

మీనాక్షి పేదపిల్ల.అందగత్తె. కుట్టాన్ హృదయంలో ఆమె ముద్రించుక పోయిన తీరు ఈ విధంగా ఉంది. "వీరా ! ఆమె ఎంత అందగత్తె.అంత సౌందర్యం భూలోక దుర్లభం. ఆమె దేహాంచల రేఖలెంత విస్పష్టంగా నున్నవి...నేనే సామాన్య సంసారంలో పుట్టినచో నాకామె ఇంతదూరమయ్యేడిది కాదు.(8)" అని కుట్టాను వీరభూపతికి చెప్పిన మాటల్లో మీనాక్షి అపురూపసౌందర్యవతి అనే విషయం స్పష్టమౌతుంది.

మీనాక్షి కుట్టానులు మొదటిసారి కలుసుకున్నది పూలతోటలో.చూపులతోనే వారిద్దరి మనసులు ముడిపడ్డాయి.మీనాక్షి చిరువ్వుతో అతని కాళ్ళపై పూలదండ విసిరేసి పారిపోగా అది మీనాక్షికి తనపైగల ప్రేమగా భావించిన కుట్టాన్,ఆమె కూర్చున్న స్థలంలోని మట్టిని సేకరించి పదిలపరుచుకున్నాడు.కాని వారివురు ఆ సమయంలో మాట్లాడుకున్నట్లు గాని కొంతకాలం సన్నిహితంగా మెదిలినట్లుగాని లేదు.మీనాక్షి అందానికి ముగ్ధుడైన కుట్టాను ఆతర్వాత ప్రతిరోజు వారింటికి వెళ్ళేవాడు.ఈ విధంగా తొలిచూపుల్లోనే పెనవేసుకున్న వీరిప్రేమ క్రమంగా బలపడింది.

కుట్టానును ప్రేమించిన మీనాక్షి చాలాకాలం అతనిపై ఆశలు పెట్టుకుంది.తనలోని ప్రేమను చంపుకోలేక,తల్లిదండ్రులకు తమ ప్రేమ విషయం చెప్పలేక కుట్టానే ఏదోఒకరోజు వచ్చి తననే పెళ్ళి చేసుకుంటాడని నమ్మి ఎంతోకాలం గడిపింది.చాలాకాలం తర్వాత కుట్టాను తమ ఇంటికి రావటం,తనతల్లితో మాట్లాడిన విషయాలు విని అతనికి వివాహం జరిగిపోయిందని తెలుసుకుంది.అంతేగాక తన తల్లిదండ్రులు తనకు సంబంధాలు చూస్తున్నారని కూడా తెలిసి ఆమె తనలోని ప్రేమను చంపుకోలేక పోయింది.వైయక్తిక మనస్తత్వంలో గాఢంగా ముద్రించుక పోయిన ప్రేమను ఆరాధిస్తూ కాలం గడపసాగింది.

తల్లిదండ్రులు కుదిర్చిన సంబంధంవల్ల మీనాక్షికి వీరభూపతితో వివాహం జరిగింది. కాపురానికి వచ్చిన మీనాక్షితో వీరభూపతి కలువబోగా ఆమె వారించింది."ప్రభూ! నాకు దానిపై ఇచ్ఛలేదు.భార్యాభర్తృత్వ సంబంధమునకు అదియే ప్రధానమా?నా మనస్సునకట్లు తోచుటలేదు. నేనేమి చేయుదును."(93).అని భర్తను బ్రతిమాలింది.ఇంకా ఆతనితో ప్రాధేయ పూర్వకంగా ఇలా అంది."స్వామీ ! ...మీరన్నచో నాకు ప్రేమయే గలదు.మీతో భార్యవలె మాటాడెదను,నేను చేయవలసిన పరచర్యలన్నియు జేసెదను.ఏలకో ఆ కార్యమునెడల వైముఖ్య మేర్పడినది.నాకు సంతాన మక్కరలేదు.ఎందులకు సంతానము."అని చల్లని మాటలతో వీరభూపతిని దూరంగా ఉంచసాగింది.

వీరభూపతికి ఆమె ప్రవర్తన వింతగా తోచింది.ఆమెను అర్థం చేసుకోలేక"వివాహమే చేసుకోకుండా యోగినిగా ఉండిపోతే సరిపోయెదికదా !'అని నిష్టూరంగా మాట్లాడినా భరించింది. భర్తను సమాధాన పరచటం కోసం "నా తల్లిదండ్రులు నా మాట వినలేదు.పతి మీరైనా నా మాట వినరాదా ! నిజముగా మీరు నన్ను ప్రేమింతురేని నా యీ కోర్కెకు అనుగుణముగా వర్తంచుటకన్న నెక్కువ యిష్టమేమి కూర్తురు."అనుచు అనునయంగా పలికి అతన్ని ఇంకా దూరంగా ఉంచుటకు "నన్నెందులకు వృథా వేధించెదరు?మీరు మరల వివాహము చేసుకొనుటకు నేనొప్పుకొను చున్నాను.స్వామీ ! ఆ వివాహమునకు నేనుకూడా వచ్చెదను.నన్ను క్షమించుడు" అంటూ ప్రాధేయపడింది.మీనాక్షి మనస్తత్వాన్ని అర్థం చేసుకోలేక ఆమెను నొప్పించలేక వీరభూపతి ఆమె కోరిన విధంగా నడుచుకున్నాడు.

కుట్టాను కానుకలతో ఇంటికి వచ్చిందిచూసి,మీనాక్షి భయంతో, ఆనందంతో, వణికి పోయింది.కుట్టాను తనను సోదరీ అని సంబోధించగానే మీనాక్షి క్షణకాలం చిత్త భ్రమకు, లోనైనా వెంటనే తేరుకొని ఆనందంతో కుట్టానుకు,భర్తకు భోజనం వడ్డించింది.ఆమె వైయక్తిక మనస్తత్వంలో నుండి విడువడి సామూహిక మనస్తత్వంలోకి అనగా ఈ లోకంలోకి వచ్చింది.

మీనాక్షి హృదయం నిశ్చలమైన సరస్సులా ప్రశాంతత పొందింది.ఆ సరసులో వికసించిన కమలంలా ఎదుట సహోదరునిగా కుట్టాను కనిపించాడు.ఆమెలో ఆనంద తరంగాలు చల్లగా, మెల్లగా, కదలసాగాయి.ఎన్నడూ లేని ఉత్సాహాన్ని,ఆనందాన్ని పొందుతూ కుట్టానును మరిరెండు రోజులు తన ఇంట్లో ఉండి పొమ్మని కోరింది.మీనాక్షి ఈసంఘటనతో నిర్మల చిత్తురాలైంది.కొత్తవైన అనుభూతులతో,నూతన అనురాగంతో,వీరభూపతిని కాంక్షించ సాగింది.ఇంతకాలం దాంపత్య ధర్మానికి దూరంగా ఉన్న మీనాక్షి తాను చేసిన తప్పిదాన్ని తెలుసుకుంది.తాను తనభర్తను అనవసరంగా అర్థంలేని ఆలోచనలతో వేధించానని బాధపడ్డది.ఇప్పటినుండి అయినా భర్త అనురాగాన్ని పొందాలనీ,తాను తన హృదయాన్ని భర్తకు సమర్పించుకోవాలని ఆరాటపడింది.

ఈ విధంగా చిత్తశాంతని పొందిన మీనాక్షి లౌకిక ధర్మానికి కట్టుబడి భర్త సాంగత్యాన్ని కోరుకుంటున్న సమయంలోనే ఆమె ఆశలు నిరాశలయ్యాయి.మీనాక్షి తన భర్తకు దగ్గరగా రావాలని ఎంత ప్రయత్నించినా, వీరభూపతి అంతదూరంగా జరుగుతూ ఆమెను తప్పించుక తిరుగుతూ రాత్రంబవళ్ళు రాచకార్యాల మీద రాజగృహంలోనే ఉండిపోసాగాడు.

### 3) కట్టాను-మీనాక్షిల మధ్య అమలిన శృంగారం.

అమలిన, శృంగార సిద్ధాంతాన్ని రాయప్రోలు సుబ్బారావుగారు తమ రమ్యాలోకంలో వివరించారు.దానికి లక్ష్యంగా 'తృణకంకణమనే' ఖండకావ్యం రచించారు.భావకవిత్వ ప్రారంభ దశలో ప్రేమ,స్వచ్ఛందప్రణయం, సాహిత్యంలో రూపుదాలుస్తున్న సమయంలో తదనుగుణంగా ఆనాటి కవులు వివిధ భావాలలో గీతాలల్లి గానం చేయసాగారు.ప్రేమకు దివ్యత్వాన్ని సమకూర్చే

ప్రయత్నంలోనే సుబ్బారావుగారు తృణకంకణాది ఖండకావ్యాలు,విశ్వనాథవారి 'గిరికుమారుని ప్రేమగీతాలు',నాయనివారు సౌభద్రుని ప్రణయయాత్ర మొదలైన ప్రేమకు సంబంధించిన కావ్యాలు వెలువడినాయి.ఆ సమయంలోనే సుబ్బారావుగారు శృంగారానికి(ప్రేమకు) కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించి దానిని 'అమలిన శృంగారంగా'పేర్కొన్నాడు.ఆనాటి కొందరు ప్రసిద్ధ కవులు తమ గీతాలలో,కావ్యాలలో,వీరి 'అమలిన శృంగారాన్ని' చిత్రించారు.దాని లక్షణాలు ఈ క్రింది విధంగా ఉన్నట్లు మనం గ్రహించవచ్చు.

స్థూలంగా శృంగారం రెండువిధాలు. 1 సంభోగశృంగారం, 2 విప్రలంభశృంగారం. సంభోగశృంగారం ఆలంబన విభావాదులచే రూపొందినది కాబట్టి అది కొంతవరకు ఆనందానికి మూలమై క్షయమౌతుంది.విప్రలంభ శృంగారంలో ఉపాధి లేకుండా (అనగా శారీరకమైన సంబంధం లేకుండా) వియోగశృంగారం మానసికమై ఉన్నందువల్ల అది కొంతవరకు అక్షయమైనదనే చెప్పవచ్చు.సౌందర్యగతమైన,ఆనందప్రదమైన,మానసికమైన, ఉపాధి రహితమైన వియోగశృంగారమే నవ్యలకు(భావకవులకు) శ్రేష్టమని రాయప్రోలువారి సిద్ధాంతం.ప్రేమలో శృంగార భావమున్నందువల్ల ఆ ప్రేమ వియోగశృంగారానికి మూలమై కామేచ్ఛారహితమై ఆనందానికి అవధికాగా వ్యక్తులలో చిరకాలం నిలిచిపోయేదే 'అమలిన శృంగారమని' సుబ్బారావు గారు తమ రమ్యాలోకంలో వివరించారు.

"సురత సంస్పర్శలేని ఈ శుచిదమల,జీవితాను రాగాదులన్ చిలకరించు,
కానరాని శృంగారము..."[9] అంటాడు.

సురత సంస్పర్శలేని శృంగారాన్ని వీరు 'అమలిన'దానిగా భావించారు.సురతం అనగా స్త్రీ పురుషుల లైంగిక సంబంధం.అట్టి సంబంధంలేని ప్రేమ(వియోగం శృంగారం)అమలిన శృంగారమౌతుంది.అదే జీవితంలో అన్ని అనురాగాలకు మూలమౌతుందని వీరి భావన.

అంతేకాదు ఈ అమలిన శృంగారం స్త్రీ పురుషుల మధ్య ఈ క్రింది విధంగా ఉంటుందని, ఉండాలని తమ 'తృణకంకణ'కావ్యంలో పేర్కొన్నాడు.

"కనుల నొండురులు జూచుకొనుటకన్న,
మనసు లన్యోన్య రంజనల్ గొనుటకన్న
కొసరి యేమోయి యని పిలుచు కొనుటకన్న
చెలుల కిలమీద నేమి కావలియు సఖుడ."[10]

వ్యక్తియొక్క మనస్తత్వం, ప్రవర్తనద్వారా (మాటలు,చేతలు) వ్యక్తమౌతుంది.కాని ప్రవర్తనలోని మంచి చెడ్డలు సామాజిక కట్టుబాట్ల ననుసరించి నిర్ణయింపబడతాయి.కాబట్టి ప్రవర్తన నుసరించి ఒక వ్యక్తియొక్క మనస్తత్వాన్ని,ఉద్దేశ్యాన్ని,భావాన్ని,మంచి చెడ్డలను గుర్తిస్తాం.

9,10. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు. పుటలు.294,296

ఈ విధంగా గుర్తింపబడే మంచిచెడ్డలు ఆతని మానసిక స్థితిని తెలుపుతుంటాయి.కాని కొన్ని పరిస్థితులలో కొన్ని కారణాలవల్ల మనస్తత్వంలో మార్పు రావచ్చు.

ఒక వ్యక్తి మనసులో ఎంత మలినమున్నా ఆ మలినం ఆతని ప్రవర్తనలో కనిపించ నంతకాలం అటువంటి మలినభావం ఆ వ్యక్తిలో ఉందని ఊహించటంగాని, గ్రహించటంగాని, సాధ్యంకాదు.మొదట వ్యక్తి తన మనసులో పొంగిన కామేచ్ఛవల్ల సాంఘికమైన కట్టుబాట్లకు విరుద్ధమైన మలినపు భావాలచే తన మనస్తత్వాన్ని నింపుకున్నా,అతని మనస్తత్వం ఆతని ప్రవర్తనకు సహాయకారి కానంతకాలం అతడు చెడ్డవాడు అనిగాని,ప్రవర్తన మంచిది కాదనిగాని, దుర్మార్గుడని గాని చెప్పలేము.సంస్కారబలంతో ఆ వ్యక్తి క్రమంగా తనలోని మలినం కడుక్కొని దాని స్థానంలో మరో గౌరవభావం లేక ఆరాధనా భావం నింపుకున్నపుడు ఆ మలిన మనస్తత్వమే అమలినంగా మారుతుంది.శృంగార విషయంలో కూడా ఇదే వర్తిస్తుంది. మొదట శృంగారం కామేచ్ఛా జనితమే.కాబట్టి వ్యక్తిలో సహజంగా సంభోగేచ్ఛను కలిగిస్తుంది.ఆ భావన ఉన్నంతకాలం అది మలినంగానే అనిపించవచ్చు.యువతీయువకుల ప్రేమలో ఇది సాధారణం.సంభోగేచ్ఛ తొలిగిన నాడు వ్యక్తులలో వియోగశృంగారం మొదలై క్రమంగా ఆరాధనా భావంగా(కొందరి విషయంలో) మారుతుంది.ఈ విధంగా రూపొందబడే ప్రేమతత్వమే అమలిన శృంగారంగా రాయప్రోలువారిచే సిద్ధాంతీకరించబడింది.

గౌరవభావాలు మలినభావాలుగా,మలినభావాలు గౌరవభావాలుగా రూపొందడంలో కేవలం వ్యక్తియొక్క సంస్కృతి,సంస్కారం బలంగా నిలుస్తాయి.సంస్కారం పొందిన వ్యక్తి ఎటువంటి మలిన భావాన్నైనా కడిగి వేసుకొని ఉన్నతుడుగా జీవిస్తాడు.

వ్యక్తిలో శైశవదశలో అనేక రకాలైన మలినభావాలు ముద్రించుక పోతాయని ఫ్రాయిడ్ అభిప్రాయపడ్డాడు.తల్లి పొందును కోరే కుమారుని మలినభావన,అట్లే తండ్రి పొందును కోరే కుమార్తె మలినభావన మొదలైనవి శైశవంలోనే వ్యక్తికి అజ్ఞాతదశలోనే ఏర్పడతాయని చెప్పటం చూస్తాం.మలినభావాలు శైశవదశలోనే కాదు వ్యక్తిత్వం పొందిన వ్యక్తిలో కూడా అజ్ఞానంతో రూపుదాల్చవచ్చు.సంస్కార హీనతవల్ల వ్యక్తి అడవిమృగంలా ప్రవర్తించవచ్చు.సంస్కృతి, సంప్రదాయాల, విలువలుగాని,నైతిక,ధార్మిక,ఆధ్యాత్మిక,మానవతా భావాలుగాని లోపించినపుడు ఆతని మనస్సులో అన్నీ మలినభావాలే రూపుదిద్దుకుంటాయి.వ్యక్తి తన మనసులోని మలినాన్ని, స్వార్థాన్ని,చాలావరకు తుడిచేసుకొని సద్వర్తనుడై మెలగడానికి ప్రయత్నిస్తాడు.సర్దుబాటుతనాన్ని పొంది సంఘంలో మర్యాద పూర్వకంగా వర్తిస్తాడు.ఈ విధంగా ప్రవర్తించినపుడే లోకం, సంఘం,అతనిని గౌరవిస్తుంది.

ప్రేమలో,శృంగారంలో,ఎక్కువగా పాల్గొనేది కామం.వ్యక్తి ఎల్లపుడూ కామేచ్ఛాజీవియే.

---

9,10. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు. పుటలు. 294,296

ఈ కామం శారీరకమైనది.జీవకణ సముదాయంనుండి సహజాతాలవల్ల పుట్టే ఈ కామేచ్ఛాశక్తి 'ఆకలి' వలెనె వ్యక్తిని వివశుణ్ణి చేస్తుంది.ఈ కామేచ్ఛాశక్తి సృష్టికార్యంగా,ప్రకృతిసిద్ధంగా,ప్రతి జీవికి ప్రేరణకలిగిస్తుంది.మొదట ఇది శారీరకంగానే ప్రారంభమౌతుంది.కాని ఈ శారీరక కామమే వ్యక్తిలో మానసికమైనపుడు అది 'కామన'గా మారుతుంది.కామనలనగా కోరికలు. మానవుని విపరీతమైన కోరికలన్నీ ఈ కామేచ్ఛాశక్తి ప్రభావం వల్లనే వ్యక్తిలో రూపు దాల్చి అనేక విధాలుగా వ్యక్తిని ప్రేరేపించి అతన్ని ముందుకు నడిపిస్తాయి.ఈ కోరికలవల్లనే మనిషి పశుత్వం నుండి విడువడి నాగరికుడైనాడు.ఉదాత్తీకరణ భావాలతో ఉన్నతంగా తన మనసును మలచుకొని దివ్యమైన సంస్కృతిని,సంప్రదాయాన్ని నిర్మించుకున్నాడు.వ్యక్తిలో మొదట మలినంగా రూపు దాల్చిన భావమే ఉదాత్తీకణం ద్వారా అమలినంగా మారి ఉన్నతాశయాలకు మూలమై నిలుస్తుంది. మనోవైజ్ఞానిక శాస్త్రంలో ఉదాత్తీకరణ సదాశయంతోనే మానవుడు ఈ నాటి ప్రగతిని సాధించాడని, వీటన్నింటికి మూలం వ్యక్తిలోని కామేచ్ఛాశక్తియే అని చెప్పటం జరిగింది.

రాయప్రోలు సుబ్బారావుగారు ప్రేమ విషయంలో అమలిన శృంగార సిద్ధాంతాన్ని ప్రతిపాదించి ఆ ప్రేమకు ఆరాధనా భావాన్ని సమన్వయించి సౌందర్యారాధనకు,వాత్సాల్యాది ప్రేమభావాలు మూలమన్నారు.ప్రేయో వత్సలాది రసాలను అమలిన శృంగారానికి అన్వర్తించాడు

ఏకవీర నవలలోని కుట్టాన్ మీనాక్షి ల మధ్య కొనసాగిన ప్రేమ క్రమంగా ఆరాధానా భావాన్ని పొంది చివరకది 'అమలిన శృంగారంగా'మారిందని ఈ క్రింది కారాణాలవల్ల చెప్పవచ్చు.

కుట్టాను మీనాక్షి తొలిచూపులోనే ప్రేమించుకున్నారు.ఈ ఆకర్షణ వారిలో యవ్వ నారంభవేళ పుట్టిన కామేచ్ఛాశక్తివల్ల లేదా యూంగ్ ప్రతిపాదించిన 'అనిమా,అనిమస్' అనే స్త్రీ పురుష అంశల పరస్పరాకర్షణ వల్ల ఏర్పడి ఉండవచ్చు.వారిద్దరిమధ్య చనువు,పరిచయం, ద్వారా స్నేహం మొదలైన సామాన్య పద్ధతులు ఏవీ లేకుండానే తొలిచూపులోనే పరస్పరం ఆకర్షితులై ప్రేమించుకున్నారు.ఈ విధంగా వారిలో కలిగిన ప్రేమ దైవదత్తమని చెప్పవచ్చు.వారి ప్రేమ దివ్యమైనది కాబట్టే ఆ ప్రేమను వారు చాలాకాలం ఆరాధిస్తూ ఆ ప్రేమలోకంలో గడిపారు. తనలో కలిగిన ప్రేమ దివ్యమైనదిగా భావించినందుకే కుట్టాన్ ఈ విధంగా అనుకున్నాడు.

"నేను ప్రేమించిన స్త్రీని వదిలిపెట్టి బలవంతంగా నా మెడకు కట్టిన స్త్రీనా ప్రేమించవలె.నా కర్థమగుటలేదు. ప్రేమించట,ప్రేమించక పోవుట, అనునది నా స్వాధీనములో నున్నదా?ఎవరి స్వాధీనములో నున్నది?భగవంతుని స్వాధీనములో నున్నది."అని విచారించి తన ప్రేమకు కారణం తెలుసుకున్నాడు.

కుట్టాను మీనాక్షిని ప్రేమించినపుడు అతనిలో దైహికవాంఛ లేదనికాదు.ఉంది కాబట్టే అతను మీనాక్షిని చూడటానికి పదేపదే ఆమె ఇంటికి వెళ్ళేవాడు.దైహికవాంఛ అతనిలో ఉధృతం కాలేదు కాబట్టి అతడు మీనాక్షిని పొందాలని పెద్దగా ప్రయత్నం చేయలేదు.మరో విధంగా ఆ

ప్రయత్నం చేయకపోటం అతనిలోని బలహీనత.ఆ బలహీనతకు కారణం అతని తండ్రి.తనకు తండ్రివల్ల మీనాక్షి దక్కలేదని భావించాడే కాని తన ప్రయత్నలోపమేనని గుర్తించలేదు.ప్రయత్న లోపాన్ని మభ్యపెట్టుకొని తండ్రిమీదనున్న కోపాన్ని ఏకవీర మీద చూపించాడు.ఏకవీరతో మాట్లాడకుండా,ముట్టుకోకుండా,దూరంగా మెదులుతూ,ఎంతో కాలం గడిపాడు.కుట్టానులో దట్టమైన శారీరక వాంఛ ఉన్నట్లయిన మీనాక్షిని మరిచిపోయి,ఏకవీర సౌందర్యానికి ముగ్ధుడై, ఆమెతో కాపురం చేసేవాడే.కాని కుట్టాన్ తన శారీరక వాంఛను నశింపచేసుకున్నాడు.అంతేగాక ఎట్లాగైనా మీనాక్షితో వివాహం కాదని మీనాక్షి తల్లి మాటలవల్ల తెలిసింది.ఒకవేళ అతనిలో ఏమాత్రం సుఖ భోగవాంఛ ఉన్నా మీనాక్షి తల్లి కుట్టానుతో "మీనాక్షికి సంబంధమెక్కడనైనా జూచిపెట్టుము తండ్రీ !"అని అడిగినపుడు ధైర్యంచేసి ఆమెతో "నేను చేసుకుంటానని' అనేవాడు. అతడు ప్రధానమంత్రి కుమారుడు.శ్రీమంతుడు.కాబట్టి ఎన్ని వివాహాలైనా చేసుకోవచ్చు. కాని అతనికి ధైర్యం లేకనో,మరే కారణంవల్లనో,ఏమీ అనలేక పోయాడు.మీనాక్షికి సంబంధాలు చూస్తున్నారని,త్వరలోనే ఆమెకు వివాహం జరుగుతుందని తెలుసు.తన వివాహం జరిగిపోయింది. కాబట్టి ఇకతాను ఆమెను ప్రేమించి లాభమేమున్నది అని అనుకోవచ్చు.లాభ నష్టాలు సుఖదుఃఖాలు శారీరక వాంఛ వ్యక్తిలో ఉన్నపుడే ఆలోచిస్తాడు.కాని కుట్టానులో ఏ విధమైన శారీరక వాంఛలేదు.మానసికంగా తన ప్రేయసిని తలచుకుంటూ బ్రతకసాగాడు.విరాగాలా మారిపోయాడు. 'ఆత్మహత్య మహా పాపమనే కారణంగా ఆ ప్రయత్నం చేయకుండా అలాంటి కలలు కన్నాడు.

క్రమంగా కుట్టానులోని ప్రేమ ఆరాధనా భావంగా మారింది.మాటిమాటికి ఆమె వదిలివేసిన,వాడిన మల్లెపూలదండను,ఆమె స్పృశించిన మట్టిని,చూసుకుంటూ ఏకవీరను దూరం చేసుకుంటూ,బ్రతకసాగాడు.ఈ విధంగా కుట్టానులో మొదట ఆకర్షణ రూపంగా ప్రారంభమైన ప్రేమ క్రమంగా దివ్యభావాన్ని పొంది ఆరాధనగా మారింది.ఆ భావం శృంగారంతో కూడినది, కావున అతనిలోని ప్రేమ వియోగశృంగారంగా,ఉదృతమై 'అమలిన శృంగారంగా రూపొందింది..

ఈ విధమైన మార్పును మనం మీనాక్షిలో కూడా గమనించవచ్చు.మీనాక్షికి కుట్టాను వివాహం జరిగిందని,తనకు ఇకమీద కుట్టానుతో ఎటువంటి సంబంధం కలుగబోదని తెలుసు. తరువాత తనకు వీరభూపతితో వివాహమైనా మీనాక్షి కుట్టానును మరిచిపోలేదు.తనలో కలిగిన ప్రేమ భగవదత్తమని,దివ్యమైనదని,గ్రహించినందువల్లనే ఆమె వీరభూపతిని పెండ్లాడినా అతనితో సాంసారిక సుఖాన్ని పొందలేదు.భర్తయైన వీరభూపతికి అన్ని సేవలు చేసింది.కాని తనకు శారీరక వాంఛగాని సంతానాపేక్షగాని లేదని చెప్పి దూరంగా ఉండసాగింది.అంతేగాక తన భర్త సుఖంకోసం మరో వివాహం కూడా చేసుకోమంది.మీనాక్షి ప్రవర్తన వల్ల మాటలవల్ల ఆమెలో నిష్కళంకమైన ప్రేమ,ఆరాధనా భావం పొందిందని చెప్పవచ్చు.ఈ విధంగా శారీరక వాంఛలేని కుట్టాన్,మీనాక్షీల మానసిక ప్రేమ శృంగార పరమైనదైనా అది అమలినంగా మారింది.

కుట్టానుకు,మీనాక్షి వీరభూపతి భార్యయని తెలియగానే విషాదంతో కూడిన ఆనందం మొదలైంది.తాను ఇంతకాలం చావాలనుకున్నాడు.తననే నమ్ముకొని తననే సేవిస్తూ,తన ప్రేమ కోసం రాత్రింబవళ్ళు తపించిపోతున్న ఏకవీరకు దూరంగా ఉంటూ కృశింపచేసాడు. వైవాహిక ధర్మాన్ని మరిచాడు.మనసుకు ప్రశాంతత చేకూర్చుకున్నాడు.పసుపు,కుంకుమలతో, చీరతో, వీరభూపతి ఇంటికి వెళ్ళి మీనాక్షిని ప్రేమతో 'సోదరీ'అని పిలిచాడు.తనలోని మలినాన్ని క్షాళనం చేసుకొని సోదరభావాన్ని మీనాక్షిలో కలిగించాడు.ఆమె కుట్టాను ప్రవర్తనకు మొదట విస్తుపోయినా పరిస్థితులను అర్థం చేసుకొని మనస్ఫూర్తిగా కుట్టానును 'అన్నా'అని పిలిచింది.వారిలో సోదర,సోదరీ భావం నెలకొంది.

ఈ విధంగా ఈ నవలలో విశ్వనాథ కుట్టాను,మీనాక్షి పాత్రలలో అమలిన శృంగార తత్వాన్ని,చిత్రించి చూపాడు విశ్వనాథ.ఈ పాత్రలు మొదట్లో వైయక్తిక మనస్తత్వంలోని ప్రేమకు కట్టుబడి అందులోనుండి విడువడలేక,మానసిక సంఘర్షణకు లోనై ఆ ప్రేమ ఆరాధనగా మారినపుడు వారిద్దరు సోదర,సోదరీ భావాన్ని పొంది క్రమంగా లోకధర్మానికి మూలమైన సామూహిక మనస్తత్వంలోకి ఆనందంగా చేరుకున్నారు.ఏలాంటి వ్యాకులతలేని నిశ్చల మానసికస్థితిని పొందారు.నిజాన్ని గ్రహించి పరిసరాలను అర్థం చేసుకొని తమ జీవితాలతో ఇతరుల జీవితాలుకూడా ముడిపడి ఉన్నాయనే సత్యాన్ని గ్రహించి ఆత్మధర్మం నుండి లోక ధర్మంవేపు ఈ పాత్రలు మళ్ళినట్లుగా విశ్వనాథవారు చిత్రించిన విధానం అత్యంత ప్రతిభావంతంగా సాగిందని చెప్పవచ్చు.

"వీరు ఒకపుడు ప్రేమికులే.తరువాత విప్రలంభ శృంగారాన్ని అనుభవించ వలసి వచ్చింది.అపుడు భౌతికంగా దూరంగా ఉన్నా,మానసికంగా వాంఛఉంది.భౌతకంగా దూరమైనంత మాత్రాన అమలిన శృంగారం కాదు.మీనాక్షి తన ప్రాణస్నేహితుడు వీరభూపతి ఇల్లాలు అని తెలుసుకున్న కుట్టాన్ దారుణమైన సంఘర్షణకు లోనయ్యాడు.మూడురోజులు నిద్రాహారాలు లేక మానసిక ప్రశాంతత కోసం తపస్సు చేసాడు.ఫలితంగా వాంఛామాలిన్యం సమూలంగా తుడుచుకపోయి స్వచ్ఛమైన ఆత్మీయత మిగిలి మీనాక్షిని 'సోదరీ'అని పవిత్ర హృదయంతో సంబోధించ గలిగాడు.కుట్టానులోని ఈ ప్రవర్తన మీనాక్షిలోను జాగృతి కలిగించింది.ఆమె తన ధర్మాన్ని గుర్తించింది.కుట్టాను సాధన అర్థం చేసుకుంది.తాను ఆ సాధనలో ఒక భాగం కాగలిగింది.నిర్మలంగా కుట్టానును 'అన్నా'అని పిలువకలిగింది.వీరి పరస్పర గౌరవాదరా భిమానాలు 'అమలిన శృంగారభావనలు' అని డా॥సి.ఆనందారామంగారు వ్యాఖ్యానిస్తూ ఈ క్రింది విధంగా సమీకరణంలో చూపించారు.

"మధురభక్తి+విప్రలంభశృంగారం−సంభోగేచ్ఛ=అమలినశృంగారం."

అమలిన శృంగారం విప్రలంభశృంగారంలోని ఒక భావన.మానసిక వాంఛతో కూడినట్టిది.

మధురభక్తిలో వాంఛకు అతీతమైన ఒక మహా ఆరాధనాభావం మాత్రమే ఉంటుంది.కాని ' అమలిన శృంగారంలో దైవికమైన భావనలేకున్నా ఆత్మీయతాభావంతో 'ఆరాధనను'చుట్టుకొని తాను ప్రేమించిన వ్యక్తినే దైవసమానంగా భావించటం అమలినశృంగారంలోని విశేషం."[11].

## 3.10 సామూహిక మనస్తత్వంలోనుండి వైయక్తిక మనస్తత్వంలోకి.

### (లోకధర్మంలోనుండి,ఆత్మధర్మంలోకి).

### వీరభూపతి,ఏకవీర ల మనస్తత్వచిత్రణ.

### 1) వీరభూపతి పాత్రచిత్రణ.

వీరభూపతి బీదవాడు.తల్లిదండ్రులు వృద్ధులు.విద్యకోసం మధురలో ఉంటున్నాడు. రాజనీతివిద్యలో కుట్టాను సహాధ్యాయి.కుట్టాను,వీరభూపతి ప్రాణస్నేహితులు.

వీరభూపతి ఎఱ్ఱనివాడు.పొడుగరి."ఆతని నేత్రములు కుట్టాన్ నేత్రములంత విశాల మైనవికావు.ఆతని మొగము చూచినంతనే ప్రతివాడు నతడు సుందరుడని అనుకొనక మానరు. వీరభూపతి వదనము శాంతమై చాలా తరములనుండి వ్యవసాయము,చదువు,వీని యందలవాటు పడిన పితరుల చిన్నెలు కనబఱచుచుండును....వీరభూపతి వదనము స్త్రీలెక్కువ మెచ్చుకొందురు."

కారణాంతరాలవల్ల వీరభూపతి అంబాసముద్రానికి వెళ్ళాడు.ఆ ఊళ్ళో ఏకవీరను చూసాడు.'కుట్టాను,మీనాక్షీల ప్రేమవలె 'వీరభూపతి,ఏకవీర లు చూపుల ఆకర్షణతోనే ప్రేమించు కున్నారు.వీరభూపతి వచ్చినపని మరచి కాలయాపన చేయటంవల్ల వెంటనే తన ఊరికి వెళ్ళవలసి వచ్చింది.పోయేముందు ఏకవీర పూలచెండులో కట్టిన ఉత్తరాన్ని వీరభూపతికి అందుకున్నాడు.ఆ ఉత్తరాన్ని వీరభూపతి తల్లిదండ్రులు కూడా చూశారు.ఆ ఉత్తరంలో ఆమె ఎవరో,ఆమె నెట్లు కలుసుకోవాలో వివరంగా వ్రాసిఉంది.తల్లిదండ్రులకు విషయం అర్థమైంది.వారెంతో భయపడ్డారు.

ఏకవీర తండ్రి ఒక రాక్షసుడు.భార్యపట్లగాని,బిడ్డలపట్లగాని,ప్రేమనేదే అతనికి తెలియదు.శ్రీమంతుడు.అటువంటి రాక్షసుని కూతురిని వీరభూపతి ప్రేమించటం,ఆతని తల్లి దండ్రులకు భయహేతువయింది.

వీరభూపతి తన ప్రేమవిషయాన్ని కుట్టానుతో చెబుతూ,"నా జననీ జనకులు నన్ను గడ్డము పుచ్చుకొని బ్రతిమిలాడిరి.ప్రార్థించిరి.మహాపద నెత్తిపై తెచ్చుకోవద్దనిరి.జొన్నచేనులో మంచెయేగాని మహాసౌధము కూడదనిరి."అన్నాడు.తల్లిదండ్రుల నిర్బంధంవల్ల ఏకవీరను వీరభూపతి మరిచిపోసాగాడు.వారి ఆనందంకోసం తన ప్రేమను త్యాగం చేసాడు."నేనాయూరు వెళ్ళినచో నా తల్లిదండ్రులు చనిపోవుదరని భయం"అన్నాడు.చివరకు తన వారికోసం వారి

11. నవలా విమర్శ. పుట. 54.

సేవలకోసం వారి ఇష్టానుసారం నడుచుకోవాలనుకున్నాడు.

వీరభూపతి ఏకవీరను మనసారా ప్రేమించాడు. కాని ఆమెను పై కారణాల వల్ల వివాహం చేసుకోలేక పోయాడు. తనకు వివాహంమీద కోరిక లేకున్నా తల్లిదండ్రులకోసం చేసుకోవలసి వచ్చింది. వీరభూపతి ధార్మిక ప్రవృత్తి కలవాడు. లౌకికంగా పరిస్థితుల ననుసరించి అనుకూలంగా నడుచుకునేవాడు. ఆతని మనస్తత్వంలోని ధార్మికత్వం అతనిలో సర్దుబాటు తనాన్ని తెచ్చింది. తల్లిదండ్రులపై గలప్రేమతో, సేవాభావంతో, "ప్రజాయై గృహమేధినాం" అనే ధార్మిక జీవనానికి కట్టుబడి వీరభూపతి మీనాక్షిని వివాహం చేసుకున్నాడు.

మీనాక్షిని పెండ్లి చేసుకొని దాంపత్యధర్మాన్ని నెరవేర్చలనుకున్నాడు. కాని మీనాక్షి భర్తకు ఆ అవకాశం ఇవ్వలేదు. మొదటి ప్రేమ ఫలించలేదు. కన్నవారి కోసం చేసుకున్న వివాహం ఈవిధంగా మారింది. వీరభూపతి మీనాక్షితో అన్నాడు.

"నా తల్లిదండ్రులు చీకులు. నా జీవితమంతయు వారిని సంతోషపెట్టుటకే వ్యయ పఱచుచున్నాను. నీతో చెప్పితినిగదా ! నిన్ను వివాహము చేసుకొనుటకూడా వారిని సంతోష పెట్టుటకే." కాని మీనాక్షి సమ్మతించలేదు. తనకు సంసారంమీద ఇచ్ఛలేదంది. సంతానాభిలాష లేదంది. కావాలంటే మరోవివాహం చేసుకోమంది. ఈ మాటలతో వీరభూపతి కృంగిపోయాడు. లోకధర్మానికి కట్టుబడ్డ వీరభూపతి మీనాక్షి తిరస్కారం వల్ల వ్యథకు లోనయ్యాడు. ఆమెను బలవంతం చేయలేకపోయాడు. ఆమె ప్రవర్తన అర్థంగాక నిరాశా, నిస్పృహలతో, క్రమంగా తాను మరిచిపోయిన ప్రేమోదంతాన్ని తలచుకుంటూ, ఏకవీర రూపాన్ని మనసులో తిరిగి నిలుపుకుంటూ, కాలం గడుపసాగాడు.

కుట్టాను మీనాక్షిని గుర్తించి సోదరిగా భావించి తన ప్రేమకథను వీరభూపతికి చెప్పిన క్షణంనుండి అతని మనస్సు వెంటనే పాలలా విరిగిపోయింది. ఆ విధంగా మనసు విరిగి పోవటానికి గల కారణాలు రెండు. మొదటిది, తాను ప్రేమంచిన ప్రేమమూర్తికై జీవితాంతం వివాహం లేకుండానే కాలం గడుపుదామనుకున్నా, లోకంకోసం, తల్లిదండ్రుల కోసం, ఆ ప్రేమను త్యాగంచేసి వివాహానికి అంగీకరించాడు. నిజంగా తాను సుఖపడాలని ఆశించి వివాహం చేసుకోలేదు. ఇదే విషయాన్ని మీనాక్షితో చెప్పాడు. కాని మీనాక్షి ఇంకా కుట్టానును ప్రేమంచుచుండటంవల్ల జీవితం మీద విరక్తి పొందినదానివలె ప్రవర్తించుచు వీరభూపతితో సాంసారిక జీవితానికి అడ్డుపడింది. మీనాక్షి అవరోధం వీరభూపతికి జీవితంమీద పెట్టుకున్న ఆశలు నిరాశలయ్యాయి. అంతేగాక తన భార్య కుట్టానును ప్రేమించిన ప్రణయమూర్తి అనే విషయం వీరభూపతికి భరింపరానిదైంది.

రెండవది, కుట్టాను ప్రేమోదంతాన్ని వీరభూపతి కుట్టాను ద్వారా ఎన్నో విధాలుగా విన్నాడు. "కాని వారివురును ఇప్పుడు 'సోదర సోదరీ భావాన్ని పొందారుకదా !" అని మనసును సరిపెట్టుకోజూచినా, అతని అంతరాత్మ అంగీకరించలేదు. వారి సంబంధ విషయంలో వీరభూపతి

ఆలోచనలు ఈ విధంగా కొనసాగాయి.

"ఇప్పుడు వారి ప్రేమ సోదర,సోదరీ ప్రేమకదా! శారీరకమైన సంబంధం లేకపోయినను వారివురు భార్యాభర్తలే.వారి యాప్రేమ ఊరక పోవునది కాదు.వారి జీవితములున్నంతవరకు నది తుడిచివేయబడునది కాదు.ఇప్పటి వారి యునికి యధార్థమైనను,ప్రథమ ప్రేమ మీనాక్షి హృదయపు మొగ్గను కుట్టాను సేతుపతియే వాసన చూచినాడు.ఇప్పుడది అనన్యభోగ్యము. వీరభూపతికి నిద్రలేదు.ఆహారము లేదు.నిరంతరము మీనాక్షి సాహచర్య మోర్చుకొనలేక రాజసౌధమునకు పోయి యందే నివసించు చుండెను."(121)

వీరభూపతి ఇంతకు ముందు తన ప్రేమసంగతి దాని వైఫల్యం,తల్లిదండ్రుల కొరకు తాను వివాహం చేసేకోవటం,తాను తన భార్యతో సుఖపడక పోవటం,మొదలైన విషయాలన్నీ కుట్టానుకు చెప్పినవాడే.తనసంగతి,తన భార్యసంగతి,కుట్టానుకు తెలుసు.ఈనాడు వారివురూ సోదర సోదరీ భావాన్ని పొందినంత మాత్రాన కలిసిన మనసులు తొందరగా ఆ భావాన్ని విడువలేకపోవచ్చు.రేపు ఏమిగానున్నదో? తెలియదు.అందుకే వీరభూపతి మీనాక్షిని ముట్టు కోకుండా తప్పించుకుంటూ తిరగసాగాడు.

వీరభూపతి ఆలోచనలు మీనాక్షి కుట్టానులను విడువకుండా వారిచుట్టే తిరుగసాగాయి తన కొరకే వారు బలవంతంగా ఈ సంబంధాన్ని కల్పించుకున్నారేమో?వీరిమధ్యన తానుండటమే వారికి ఆటంకంగా ఉందేమో?నేను లేకున్న వారిద్దరూ ఏకమయ్యేవారేమో?తానే వారి ప్రేమను బలవంతంగా ఆ భావానికి మరలించిన వాడైనాడు.ఈ పరిస్థితులలో తాను జీవించి లాభంలేదు. లోకధర్మాన్ని అనుసరిద్దామని ఎంతగా ఆరాటపడ్డానో అంతకంటె రెట్టింపు నిరుత్సాహానికి లోనయ్యాను.ఇక మిగిలిన జీవితాన్ని తన ప్రేమమూర్తిని తలచుకుంటూ గడపటంలోనే మానసిక శాంతి ఉంది.ఈ లోకంతో ఈ లోకవాసులతో మీనాక్షి కుట్టానులతో తనకిక పనిలేదు.జీవించి ఉన్నంతకాలం ఆత్మగత ప్రపంచంలోని తన ప్రణయమూర్తిని ఆరాధిస్తూ ఉండటమే.."అని వీరభూపతి నిశ్చయించుకున్నాడు.

వీరభూపతి మెత్తని హృదయం కలవాడు.శాంతమూర్తి.వివేకి.ధార్మిక జీవనం కోసం ఆరాటపడేవాడు.యవ్వనారంభ దశలో పుట్టిన కామేచ్ఛవల్ల ఏకవీరను ప్రేమించాడు కాని ఆమెతో తన వివాహం అసంభవం అని తెలుసుకొని తల్లిదండ్రులకోసం తన ప్రేమను త్యాగం చేసి మీనాక్షిని వివాహం చేసుకున్నాడు.ఇది వీరభూపతికి మానసికంగా తగిలిన మొదటిదెబ్బ.దీనినుండి కోలుకొని మీనాక్షితో కాపురం చేయాలనుకున్నా అతని ఆశలు నిరాశ లయ్యాయి.మీనాక్షి ప్రవర్తన అతనికి రెండోదెబ్బ. కోలుకున్నట్టి మానసికస్థితి మీనాక్షి ప్రవర్తనతో ఆందోళనకరమైంది.తన భార్యను మొదట కుట్టాను ప్రేమించాడని తెలియగానే అతని హృదయం మరోదెబ్బతో బీటలు వారింది.మెత్తని హృదయంగల వీరభూపతి అంతరంగం ఈవిధమైన అనుకోని సంఘటనలతో

ఛిన్నాభిన్నమైంది.

వీరభూపతి జీవితం మలుపు తిరగడానికి పై కారణాలు తోడ్పడగా మొదట సామూహిక మనస్తత్వంలో నున్న అతని మానసికస్థితి క్రమంగా వైయక్తిక మనస్తత్వంలోకి మరలి అతడు మొదట ప్రేమించిన ఏకవీరను తలచుకుంటూ ఆమె ధ్యాసలోనే మునిగిపోయాడు అదే ధ్యాసలో నున్న వ్యక్తికి అనుకోని పరిస్థితులలో తన ప్రేమమూర్తి ఏకవీర ఎదురుగా ప్రత్యక్షం కావటం, బాహ్యస్మృతి తప్పి ఆతని ప్రవర్తన మారి ఏకవీరను గాఢాలింగనం చేసుకోవటం, ఆమె కుట్టాను భార్య యని తెలుసుకున్న వెంటనే వీరభూపతి హృదయం పగిలి లోకంమీద విరక్తి కలగటం, చివరలో సన్యాసిగా మారి వెళ్ళిపోవటం, క్రమంగా జరిగిన అనుకోని సంఘటనలు. మానసిక సంఘర్షణ ఉధృతమైన తరుణంలో పగిలిన హృదయంగల వ్యక్తులు బలహీనతతో ఆత్మహత్యకు తలపడతారు. వీరభూపతి సన్యాసిగా మారటం దానికి సంకేతమే.

## 2) ఏకవీర పాత్ర చిత్రణ.

పాత్రయొక్క మనస్తత్వాన్ని గుర్తించటానికి విశ్వనాథ రెండు పద్ధతులను చూపిస్తాడు. మొదటిది, పాత్రయొక్క మనస్తత్వాన్ని అక్కడక్కడా చెప్తూ, ఆ పాత్ర ఆ విధంగా ప్రవర్తించినట్లు, చూపించటం. ఇటువంటి పాత్రచిత్రణ మనం జేబుదొంగలు, బద్దన్నసేనాని, తెఱచిరాజులో గమనిస్తాం. రెండవది పాత్ర ప్రవర్తన చిత్రిస్తూ ఆ పాత్ర మనస్తత్వాన్ని గుర్తించేటట్లు చేయటం. పాత్రయొక్క మాటలవల్ల, చేతలవల్ల, ప్రవర్తనవల్ల, ఆ పాత్ర మనసులో ఏం జరుగుతుందో ఊహించి తెలుసుకోవటానికి దీనివల్ల వీలవుతుంది. ఈపద్ధతిని మనం కుట్టాను, మీనాక్షి, వీరభూపతి పాత్రలలో గమనించాం.

ఏకవీర పాత్రచిత్రణలో శ్రద్ధను తీసుకున్నంతగా విశ్వనాథ మరే పాత్రచిత్రణలో తీసుకోలేదని చెప్పవచ్చు. కారణం ఏకవీర ఈ నవలకు నాయకురాలు. అయినా ఈ నవలలో ఈమె చాలా వరకు మౌనంగానే ఉండిపోయింది. చివరలో మీనాక్షి స్నేహంలోను, రాబర్టు నోబలీ తో ప్రసంగించినపుడు మాత్రమే ఈమె మాట్లాడినట్లు మనం చూస్తాం. మాటలవల్ల ఈమె మానసిక స్థితితెలుసుకునే అవకాశం చాలావరకు లేనందువల్ల విశ్వనాథ ఈమె ప్రవర్తనను చాలా జాగ్రతగా చిత్రించాడు. ప్రవర్తనద్వారా, చర్యలద్వారా, ఈమె మానసికస్థితిని గుర్తింప చేస్తూ, అవసరమైన చోట్ల ప్రతీకలను కూడా ఉపయోగించి చిత్రించటం చూస్తుంటాం. ఈమె మానసికస్థితికి తగినట్లుగా వస్త్ర భూషణాదులను ధరింపచేయటం, మధ్యమధ్య గుఱ్ఱపువాళ్ళపిల్ల కన్నడి హెచ్చరిక చేయటం, అక్కడక్కడ చిత్రింపబడిన ప్రకృతివర్ణనలు ఈమె మానసిక ఉద్వేగాలకు దర్పణం పట్టటం మొదలైనవి

ఏకవీర తండ్రి అంబాసముద్రాధిపతి. మిక్కిలి ధనవంతుడు. దయాదాక్షిణ్యంలేని కఠిన హృదయుడు. భార్యాబిడ్డలయందు ప్రేమంటె ఏమిటో తెలియనివాడు. ఏకవీర అతనికి ఒక్కతే

కూతురు. తండ్రి ఎంత కఠినాత్ముడో,తల్లి అంత దయార్ద్ర హృదయురాలు. తండ్రి ఎంత దుర్మార్గుడో తల్లి అంత సన్మార్గురాలు. తండ్రి ఎంత వికృతస్వరూపుడో,తల్లి అంత సౌందర్యతి.

ఏకవీర యాదృచ్ఛికంగా గవాక్షంనుండి వీరభూపతిని చూసి మోహితురాలైంది. వీరభూపతి అందగాడు. మొదటిచూపులోనే ఇతరులచే ఆకర్షింపబడే సౌందర్యం గలవాడు. "అతన్ని స్త్రీలు ఎక్కువగా మెచ్చుకుందురు." వీరభూపతికూడా ఆమె అందానికి ముగ్ధుడై ప్రతిరోజు ఆమె ఇంటిముందుకు వెళ్ళి 'గవాక్షం'నుండి ఆమెను చూస్తూ కాలం గడిపేవాడు. ఈ విధంగా వారు చూపులతోనే ప్రేమించుకున్నారు. ఒకనాడు ఏకవీర పూలచెండులో ఉత్తరం పెట్టి వీరభూపతి మీదకు విసిరింది. అతడు ఆ ఉత్తరం చదువుకొని ఏదీ నిర్ణయించుకోకముందే తల్లిదండ్రుల ఆజ్ఞకు బద్ధుడై ఆమెను మరిచిపోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఏకవీర వీరభూపతిని ప్రేమించి అతని కొరకు ఎదిరిచూసింది. కాని విధివైపరీత్యంవల్ల ఆమెకు కుట్టానుతో వివాహం జరిగింది. కాని ఆమె మనసులో నిండి పోయిన వీరభూపతిని మరువటానికి ఆమె చాలా శ్రమపడాల్సి వచ్చింది.

"వివాహం మూడురోజులు పెండ్లికూతురుకు జబ్బే. ఆ మూడురోజులు పెండ్లికుమార్తె ఏడ్చుచునేయున్నది. అందరు పసిపిల్ల భయపడినది అనుకున్నారు. కొంతవరకు మౌగ్ధ్యమను కున్నారు వీరభూపతిని ప్రేమించిన ఏకవీర ఈ వివాహంతో మానసికంగా దెబ్బతింది. ఆమెకు ఇష్టంలేని వివాహం జరుగుతున్నా ఏ ఒక్కరూ ఆమె మానసికస్థితిని గమనించే పరిస్థితిలో లేరు. జరుగుచున్న వివాహాన్ని ఆమె కాదనలేక కేవలం రోధనతో తనకా వివాహం ఇష్టంలేనట్లు సూచించింది.

ప్రేమ ఫలించని ఏకవీర భర్తప్రేమనైనా పొందాలని ఎంతో ఆశపడింది. తండ్రి ప్రేమకు నోచుకోని ఏకవీర భర్తప్రేమలో అనురాగంతో దాంపత్యసుఖం పొందాలని ఎన్నో కలలు కన్నది. కాని కుట్టాను ప్రవర్తన ఆమెను విచిత్రమైన పరిస్థితిలోకి దించింది. ఇటువంటి పరిస్థితులలో ఏకవీర ఇట్లా అనుకొంది.

"నా తండ్రీ నాకీ సంబంధము చేసి నాలుగు నెలలయింది. ఈయన ఇంతవరకు నా మొగము చూడలేదు. కార్మము నాడు కొంగు పఱచుకొని తలుపుదగ్గరే పడుకొంటిని. నా గారాబ మంతయు నిట్లయినది. ఈ క్రొత్తప్రదేశమునకు నేను లాగుకొని రాబడితిని. నాకు దిక్కులేదు. నాతో మాటాడువారు లేరు. దాసీలతో నా రహస్యము నేమని చెప్పను...నా పుణ్యము వలననే నాకీ కుట్టానుసేతుపతి భర్తగా లభించినాడు...ఇకనైనా నేను అకల్మష హృదయంతో ప్రేమించగలను. ఇతనికి నాయందు ప్రేమలేదు."(21).

ఏకవీర చిన్నతనంనుండి ప్రేమ రాహిత్యాన్ని చవిచూసిన అబల. ప్రేమకోసం తపించి పోతూ కుట్టానును సంతోషపెట్టి తాను అతని ప్రేమలో సుఖించాలని ఆరాటపడింది. కాని ఆమె ప్రయత్నాలన్నీ వ్యర్థమైనాయి. ఒకనాడు ధైర్యంచేసి ఏకవీర కుట్టాను శయ్యపై పడుకొన్నది. కుట్టాను కోపగించుకున్నాడు. ఆతని మెడలో ప్రేమపూర్వకంగా పూలదండ వేసింది. కుట్టాను ఆ దండను

నిర్దాక్షిణ్యంగా వెంటనే తెంపి చింపి నేలమీదకు విసిరేసాడు. కుట్టాను ప్రవర్తన చూసి ఆమె భయపడింది. తనంటే అతనికి ఇష్టంలేనట్లు అనుకొంది. తన సాన్నిధ్యంలో అతడు బాధ పడుతున్నట్లు తెలుసుకుంది. ఆమెలో నిరాశా ఆవరించింది. శారీరకంగా, మానసికంగా, అమె కుట్టాను ప్రవర్తనతో విచిత్రమైన పరిస్థితికి దిగజారిపోయింది. శారీరకమైన ఉద్రేకాలను చంపుకోవటానికి ఆమె భోజనం తగ్గించింది. అలంకరణలు మానింది. చన్నీటి స్నానాలు చేయసాగింది. శరీరాన్ని శుష్కింప చేసుకోవటానికి తీవ్రమైన ప్రయత్నాలు చేయసాగింది.

ప్రతి జీవికి సాధారణంగా దైహికవాంఛ జీవనానికి తోడ్పడుతుంది. కామం, ఆకలి, దప్పిక మొదలైనవి దైహిక వాంఛలే. అవి తీవ్రమైనపుడు ఆ వాంఛలను తీర్చి దేహాన్ని సమస్థితిలో ఉంచాలని జీవి ఆరాటపడుతుంది. ఆకలిదప్పులు తీరనిచో దేహం శిథిలమై నశిస్తుంది. ఆకలిదప్పులకు తాళలేక ఒక్కొక్కసారి జీవి మరణిస్తుంది. మానవుని విషయంలో కూడా అంతే. ప్రతిమానవుడు మొదట చూసేది ఆకలిదప్పుల విషయంలోనే. అవి సమృద్ధిగా చేకూరిన తర్వాత మిగతా దైహిక వాంఛలగూర్చి ఆలోచిస్తాడు. ఈ వాంఛలకు మూలం కామం. ఇది వ్యక్తిలో ఉద్రేకాలను, ప్రేరణలను, కలిగిస్తుంది. సాధారణంగా ప్రారంభదశలో ఈ కామం శారీరకంగా వ్యక్తిని ఉద్రేకపరుస్తుంది. ఈ విధమైన ప్రేరణలకు గురిఅయినపుడు వ్యక్తి ఆ వాంఛలను అణచివేస్తాడు. ఆ విధంగా అణచివేయబడిన 'వాంఛ' మానసికంగా ఉధృతమై వ్యక్తిని సంఘర్షణకు దింపుతుంది. ధార్మికమైన కామం అనగా దాంపత్యజీవనానికి అనుకూలమైన కామానికి ఆటంకం కలిగినపుడు వ్యక్తి మానసికంగా చిత్రవధ అనుభవిస్తాడు.

ఏకవీర మొదట వీరభూపతిని ప్రేమించి మానసికంగా దెబ్బతిన్నది. తాను ప్రేమించిన వ్యక్తినిపొందలేకపోవటం, అతన్ని తొందరగా మరువలేకపోవటం, బలవంతంగా మనసు మార్చుకొని తాను వివాహమాడిన భర్తను ప్రేమించి సుఖపడాలని ఆరాటపడటం, ఆ ఆరాటమంతా భర్త ప్రవర్తనలో నలిగిపోవటం, వరుసగా జరిగిన సంఘటనలు. వీటివల్ల ఏకవీర మానసికంగా చిత్రవధకు గురయింది. మానసికంగా, శారీరకంగా, సుఖానికినోచుకోని జీవితమే వ్యర్థమని భావించిన ఏకవీర తనను తాను కృశింపచేసుకుంటూ, క్రమంగా ఆత్మగత ప్రపంచంలోకి అడుగు పెట్టసాగింది.

మానసికంగా నలగిపోయిన ఏకవీరకు తన వైయక్తిక మనస్తత్వంలో ముద్రించుకపోయిన ప్రణయమూర్తి కనబడటం, అనుకోకుండా ఆ మూర్తివైపు మనసు లగ్నం కాగానే 'ధర్మము చేయుము, ధర్మము చేయుము,' అనే పంక్తులు చదువుకొని తిరిగి జాగృతమై ఈ లోకంలోకి రావటం జరిగేది. 'ఆమె మనస్సులో మాటిమాటికి అరుంజే విరుంబు, అరుంజే విరుంబు," అను ధర్మమూరకే మ్రోగుచున్నది ఆమె కనులు మూసుకొని తన సెజ్జపై పడుకొన్నది. పడుకొన్నది హఠాత్తుగా లేచి తలుపుదగ్గరగా పోయి ఎవరో వచ్చిరనుకొని చూచి పొరపాటు పడితిననుకొని

పోయి మరల పడుకొన్నది."(23).

ఈ విధమైన ఏకవీర ప్రవర్తన ఆమె మానసిక స్థితికి అద్దం పట్టింది.ఇది ఆమెలోని అచేతన మానసిక ప్రక్రియకు నిదర్శనం.కుట్టాను విషయంలో కూడా ఇటువంటి ప్రవర్తనే మనం గమనిస్తాం.చేతనస్థితిలో నుండి అచేతనస్థితిలోకి పోయిన ఘట్టాన్ని విశ్వనాథ "కుట్టాను.. కొంచెపు సేపుండి లేచి తన పుస్తకములున్న చోటికి పోయెను.కుట్టాను తానెందులకు ఆ పుస్తకములున్నచోటికి వచ్చెనో తెలుసుకొన లేకపోయెను.'(115).అని చూపించాడు.

ఏకవీర అచేతన స్థితిలో ఉన్నపుడు ఆమె తన ప్రణయమూర్తిని తలచుకొని అందులో లీనమైనట్లు,చేతనస్థితిలో ఆమె దైహికంగా చేసే చర్యలు ఆమె మానసికసంఘర్షణను చూపిస్తున్నట్లు విశ్వనాథ చిత్రించాడు.

ఆమె వస్త్రాలంకరణకూడా ఆమె మానసిక స్థితికి అద్దం పట్టినట్టిదే.కుట్టానుతో సుఖపడాలని,అతన్ని ప్రేమించాలనీ,అతనికి దగ్గరకావాలనీ,అనుకున్నపుడు ఆమె"తెల్లని పట్టుకోక కట్టి,నరిమిత భూషణములు ధరించి మేన కంచుకము లేక ఉండెడిది.కాని పతిప్రేమ లభించని సమయంలో ఆమె ఆత్మగత ప్రపంచంలోకి వెళ్ళి పోయినపుడు,ఆకుపచ్చ వారణాసి చీర ధరించి పైని బంగరుటంచు కాశ్మీరపు శాలువా పై ముసుగేసుకొనెడిది.ఒడలునిండా నగలు ధరించెడిది."

కుట్టాను శయ్యాగృహంలో ఆమెను విదిలించినపుడు ఏకవీర "ఆమె మంచము తొందరగా దిగి కంచుకము ధరించి సాధారణముగా తాను ధరించు చీరదాల్చి ఒడలనన్ని భూషణములను పెట్టుకొని కాశ్మీరపు సేలువ ముసుగిడి కన్నులు నీరు గ్రమ్మగా తన చిన్న మంచము వద్దకు పోయినది."(22).

ఏకవీర వైయక్తిక మనస్తత్వంలోని ప్రేమ ఆత్మధర్మం వైపు లాగటం,సామూహిక మనస్తత్వంలోని పెళ్ళి,దాంపత్యధర్మం,లోకధర్మం,వైపు లాగటంవల్ల ఆమె ప్రవర్తనలో తీవ్రమైన వ్యాకులత ప్రారంభమైంది.ఈ వ్యాకులత ఆమె మానసిక సంఘర్షణను స్పష్టంగా చూపునట్టిదే. రెండు పరస్పర విరుద్ధభావాల మధ్య సంఘర్షణ ఆమెలో తీవ్రరూపం దాల్చింది.దాంతో ఆమె ఏదిధర్మమో?ఏది తానాచరించాలో?నిర్ణయించుకోలేని స్థితిలో 'నైతికవ్యాకులతతో మతి భ్రమించిన దానిలా ప్రవర్తంచసాగింది.

కుట్టాను ఏకవీరతో తన ప్రణయవృత్తాంతాన్ని చెప్పటంతో ఆమె మానసికంగా మరింత కృంగి పోయింది.కుట్టాను ఇంకా ఆమెతో ఈ విధంగా అన్నాడు.

"ఏకవీరా ! నిన్ను నేను 'ఏకవీరా' అని పిలిచినది ప్రేమచేత కాదు....మనమిరువురం ఈ జన్మలో ఇట్లొక ఎడకు త్రోయబడినాము.నీ ఎడ నాకెట్టి భావమును లేదు.ఈ జన్మకు మనమిరువురము భార్యా భర్తలైనాము.నేను నిన్న కష్టపడి ప్రేమించినను,ప్రేమించకున్నను,నీవే నాకు భార్యవు...నా ఇష్టమునకు వ్యతిరేకముగానే నాకు నిన్నిచ్చి వివాహము చేసిరి.నేనొక స్త్రీని

ప్రేమించితిని....ఆమె పేరు మీనాక్షి....ఆమెకు వివాహము కాబోవుచున్నది...ఆమె మీద నాకున్న ప్రేమను పూర్తిగా నాశనము చేసెదను...అప్పుడు నీమీద ప్రేమ పెంచెదను.ఇదివరకెవ్వని మీదనైన నీ ప్రేమ ప్రవహించెనేని ఈ మన వివాహము నీ కెంత కష్టముగా నుండును.నా స్థితి అట్లే అనుకొనుము. "(77,78).

ఈ మాటలు వింటూ ఏకవీర పిచ్చిదానిలా చూడసాగింది.తన మనసులోని భావాలనే కుట్టాన్ చెబుతున్నాడా ? అని అనిపించింది.తన మనసువలె అతని మనసుకూడా పరదత్తమైనదని తెలుసుకోగానే ఆమెలో పూర్తిగా జీవితాశ చచ్చిపోయింది.ఆలోచనలు స్థంభించి పోయాయి.ఆతృత పెరిగింది.ఏకవీర తన రెండు చేతులను కుట్టాను మెడచుట్టూవేసి తల అతని భుజాలకు ఆనించి "ఇప్పుడే ప్రేమించుము,ఇప్పుడే ప్రేమించుమని" ఏడ్చింది.

"ఏకా ! చెప్పితినికదా ! నీ వద్దకు వచ్చినపుడు పరిశుద్ధమైన హృదయంతో వచ్చెదను. అచ్చమైన ప్రేమను కోరదగిన దానవు.వ్యామోహమునకై వాంఛించెదవెందుకు?"అని కుట్టాను వెళ్ళి పోయినాడు. అయినా ఏకవీర అంతఃపుర జనులకు అనుమానం రాకుండా కుట్టానుతో తాను అనుకూలంగా ఉన్నట్లు, మానసికంగా చిత్రవధ అనుభవిస్తూ కూడా ప్రవర్తించ సాగింది.వారు గదిలో చెరొక పడకపై నిద్రించినా కృతకమైన చేష్టలతో ఆమె దాసీ జనాన్ని మభ్యపెట్టేది.

రోజులుగడిచాయి.నెలలుగతించాయి.ఋతువులుమారాయి,అయినా కుట్టానులో మార్పులేదు.తనను ప్రేమిస్తాడనే నమ్మకమూ ఏకవీరకు కలగటంలేదు.ప్రతిక్షణం,ప్రతిరోజు, ఆమె కుట్టాను ప్రేమకోసం తపించిపోయింది.క్రమంగా అశలు అడియాసలు కాగా,తన మనోగత ప్రపంచంలోకి వెళ్ళిపోయేది.ఏకవీర తన అలంకరణలో కూడా మార్పు చేసుకున్నది. అంతకు ముందు ఆమె ఆకు పచ్చచీర ధరించి వెలలేని నగలు పెట్టుకొని కాశ్మీరవాలువా ముసుగేసుకొని ఉండేది.క్రమంగా ఆమె మనసులో కలిగెడి మార్పులను, స్థితిగతులను,అలంకరణలో చూపసాగింది. .

ఇప్పుడామె మెడలో ఆభరణాల స్థానంలో ఒక్క మంగళసూత్రమే ఉంటున్నది.ఆకు పచ్చచీరలు మానితెల్లచీరలు కట్టసాగింది.వివాహం తర్వాత పట్టుచీరలు,వివాహానికి ముందు తెల్లచీరలు,ప్రేమకు,నిష్కళంకమైన హృదయానికి,సంకేతంగా తాల్చేది.పట్టుచీరలు కట్టినంతసేపు, ఆమె మనసు కుట్టానువైపు పరుగులు తీసేది.కాని ఇప్పుడామె వివాహానికి ముందున్న దశలోకి వెళ్ళిపోయింది.అందుకే తెల్లచీరలు కట్టసాగింది.ఈ విధంగా ఏకవీర మనసులో వస్తున్న మార్పును చిత్రీకరించటానికి వస్త్రాభరణాలను ప్రతీకలుగా గ్రహించి చెప్పటం విశ్వనాథవారి ప్రత్యేకత.

"వివాహానంతరమున తెల్లచీర దాల్చినది కుట్టాను శయ్యమీద నిద్రించిన నాడే.అది మొదలు కుట్టాను పెట్టిన గడువు నుండి నెలనెల కమావాస్యనాడు తాల్చుచు వచ్చినది.గడువు రెండేండ్లు గడిచినవి.ఏకవీరకు కుట్టాను మాటలయందు నమ్మకము పోయినది.మనసు క్రమముగా

తాను తొల్లి ప్రేమించిన అతని మీదకు తిరుగుచు వచ్చినది. ఆతనిగూర్చి ఊహలు వచ్చినపుడల్లా ఏకవీర తెలి ఉడుపులు ధరించు చుండెను."(126).

ఏకవీర మనసు "ధర్మాధర్మముల మధ్య' చిక్కినపుడు అనుకోకుండా గుఱ్ఱపువాళ్ళ పిల్ల 'అమృతం' కనబడి 'అరుంజే విరుంబు' అని అంటున్నట్లుగా భావించి భీతి చెందేది. క్రమంగా ఏకవీర తన శరీరాన్ని కృశింపచేసి దాన్నొక యంత్రంగా మార్చుకుంది. ఆమె శరీరం యంత్రంగా మారిన విధానం ఈ క్రింది విధంగా ఉంది.

ఆమె చన్నీటి స్నానాలతో, వర్షపు నీటితో, శరీరాన్ని తపింప చేయసాగింది. వివిధ రకాలైన సుగంధపు పొడులతో, ఆమె దేహాన్ని అలంకరించుకొని వాటి స్పర్శానుభూతిని పొంది దైహిక వాంఛను తృప్తి పర్చుకునేది. మానసికమైన బాధలోనుండి విముక్తమై ఆమె దైహికమైన కార్య కలాపాలతో మునిగి వివిధ రకాలైన స్పర్శానుభూతులతో తృప్తిపడి ఆ స్పర్శసుఖాన్ని అతి సున్నితమైన దానినికూడా అతి సూక్ష్మవివేచనతో పరిశీలించేది.

## 3) ఏకవీరలో త్వగింద్రియ స్పర్శ జ్ఞానం.

విశ్వనాథ సత్యనారాయణగారు మొదటిసారిగా త్వగింద్రియ స్పర్శ జ్ఞానాన్ని, ఈ నవలలోనే ప్రవేశపెట్టాడని చెప్పుకున్నాం. ఏకవీర పాత్రచిత్రణలో ఎంతో శ్రద్ధ తీసుకున్నాడని ముందే అనుకున్నాం. ఆయన నమ్మిన తత్వానికి, భావానికి చెందిన ఈ స్పర్శజ్ఞానాన్ని ఏకవీర పాత్ర చిత్రణలో కూడా చాలా జాగ్రతగా చూపించాడు.

ఏకవీర తన శరీరాన్ని శుష్కింపచేసుకోవటం ప్రారంభించింది. ఆమెకు జీవితంమీద ఆశ చచ్చింది. ఆత్మహత్య మహాపాపం కాబట్టి ఆమె అందుకు పాల్పడలేదు. కాని ఆత్మహత్యా సదృశమైన చర్యలను మాత్రం చేపట్టింది. ఆకలిదప్పులకు దూరమైంది. క్రమంగా శుష్కించిన విధానాన్ని విశ్వనాథ ఈ క్రింది విధంగా చూపాడు.

"ఏకవీర భోజనము క్రమముగా తగ్గిపోవుచుండెను. ఆమె శారీరకముగా రోజురోజుకు క్షీణించి పోవుచుండెను. మాంసములైన ఆమె నేత్రములు గుంటలు పడినవి. కపోలములయందు రక్తమాంసములు క్షీణించి పావురాయివలె మృదువై తళతళలాడు ఆమె వదనము తెనె పట్టాడి పోయిన వృక్షశాఖవలె శోభాహీనమైనది. చిక్కిపోయినది."(48)

ఏకవీర అబలకాదు, మానసిక బలహీనురాలు కాదు. "ఏకవీర మిగుల ధైర్యము గలది. దిటవైన గుండెగలది. పరమములైన రహస్యములను జీవితాంతము తన మనస్సులోనే దాచియుంచగల మనోదార్ఢ్యము గలది, ఆమె రహస్యము బ్రహ్మదేవునికి కూడా తెలియదు"(22.)

కుట్టాను తన ప్రేమ సంగతి మనసువిప్పి ఏకవీరకు చెప్పినా, ఆమె తనలోని గుట్టును మరింత పదిలంగా అణచుకొని పైకి నిర్విచారంగా ప్రవర్తించేది. తనలో మానసికమైన బడబాగ్ని రగులుతున్నా కుట్టానుకు ఏవిధమైన అనుమానం రాకుండా నడుచుకునేది.

ఏకవీర శరీరాన్ని శుష్కింప చేసుకోవటంవల్ల ఆ శరీరం అతి సున్నితమైన స్పర్శ జ్ఞానాన్ని కూడా పొంది అనుభూతికి నిలయమైంది.ఆమె గవాక్షం వద్ద కూర్చుంది.బయట వర్షం కుండపోతగా కురుస్తున్నది.చల్లని గాలిపొర ఏకవీర మీద విసురుకున్నది.' 'ఆమె త్వగింద్రియము మీద మెరుపు మెరిసినంత కాలంలో నొక తడ్డిగుడ్డవేసి తీసినట్లు తోచినది. ఏకవీర చలించలేదు. "వర్షం ఎక్కువైంది.చల్లగాలులు కిటికీనుండి బలంగా వీచసాగాయి.ఆ గాలులలోని శైత్యాన్ని ఆమె పరీక్షించ సాగింది."ఆమె త్వగింద్రియము రక్త ప్రవాహదఘ్నముగా నీ చల్లని గాలిని కొలుచు కొనెను."గాలి మరల మరల ఆమె మీదకే విసురుకున్నది.గాలిపొర వచ్చినపుడల్లా ఆమె సరిగా కొలుచుకున్నది.

ఈ విధమైన అనుభూతిలో చల్లగాలిలోని శైత్యాన్ని చర్మం దాటి,రక్తప్రవాహంలో చేరి తద్వారా ఆ ప్రవాహందాటి,శల్యముల తాకెనని తోచినదామెకు.ఆమెకు బాహ్యజ్ఞానం పోయింది.ఆమె పంచేంద్రియ గుణములు స్పర్శగుణత్వము పొందెను."(151).

"ఆమె దేహము క్రమక్రమముగా వాయువుయొక్క శైత్యోష్ణతల పరిమాణము కొలుచు విచిత్ర యంత్రమువలె నైనది.కస్తూరిపూత,మంచి గంధపు పూత,కప్పురపు పొడి,వట్టివేళ్ళ విసనకఱ్ఱ,మలయానిలము,వీని ప్రత్యేక స్పర్శ సుఖానుభవమామె మనస్సునను చక్కగా చదివిన పొత్తములోని యర్ధము వలె విజ్ఞాత తత్తద్గాఢత్వ కించిద్గాఢత్వముగా విస్పష్టముగా తెలియవచ్చెను."(68).

ఈ విధమైన త్వగింద్రియ స్పర్శజ్ఞానంతో ఆమె శరీరం అతి సూక్ష్మమైన స్పర్శను కూడా గుర్తించే స్థితికిరాగా,ఆమె మనసు క్రమముగా భౌతిక జగత్తునుండి విడువడి రసానంద జగత్తులో లీనం కాసాగింది.వివాహమైన తర్వాత ఏకవీర తన ప్రియుని మరిచిపోవటానికి చాలా ప్రయత్నించింది.అతని స్థానంలో కుట్టానును నిలుపుకుంది.కాని కుట్టాను ఆమె మనసులో నిలువలేక పోయాడు.'తాను ప్రేమించిన కుట్టానుకు మనసులో నొక ప్రేమసౌధమును నిర్మించినది.కాని కుట్టానావసతిలో నిలిచిన వాడుకాదు.తాను నిర్మించిన ప్రేమాసౌధమునకు కుట్టాను తీసిన నిర్దయ ద్వారమునుండి తన తొల్లిటి వలపుకాడు ప్రవేశించిన మాట ఏకవీరకు అవగతం కాలేదు."(127). ఏకవీరకు తెలియకుండానే వీరభూపతి ఆమె హృదయంలో తిరిగి ప్రవేశించాడు.ఆ ప్రియుణ్ణి తలచుకుంటూ ఆమె రసజగత్తులో మునిగిపోసాగింది.

ఏకవీరకు మీనాక్షికి స్నేహం కుదిరింది.మీనాక్షి స్థానాపతి భార్యయని స్థానాపతి ఉద్యోగాన్ని తన భర్తే ఇప్పించాడనీ,ఏకవీరకు తెలుసు.కాని వారి సాంసారిక విషయాలు అంతగా తెలియవు.మీనాక్షికి ఏకవీరమీద ఎంతో గౌరవం.ఏకవీర భర్తవల్లనే తామీ స్థాయిలో ఉన్నామనే కృతజ్ఞతాభావం మీనాక్షిలో ఉంది.అంతేగాక ఏకవీర దాంపత్య రహస్యాలు మీనాక్షికి తెలుసు. అందువల్ల ఏకవీరను సంతోషపెట్టటానికి ఆమెకు కాలక్షేపంగా ఉంటుందని మీనాక్షి అనేకసార్లు

ఏకవీర ఇంటికి వెళ్ళింది.మీనాక్షి కోరగా ఏకవీరకూడా రెండు,మూడుసార్లు మీనాక్షి ఇంటికి వెళ్ళింది,ఆమె వెళ్ళిన సమయంలో వీరభూపతి ఇంట్లో లేనందువల్ల అతన్ని చూసే అవకాశం ఏకవీరకు కలుగలేదు.

మధురలో మీనాక్షి సుందరేశ్వరుల కళ్యాణ మహోత్సవాలు జరుగుతున్నాయి.కల్యాణ మంటపం వీరభూపతి ఇంటికి ఎదురుగా ఉంది.ఆ నాటిరాత్రి కూచిపూడివారి భాగవతం. భామా కలాపం,ఉంది. మీనాక్షి ఏకవీరను ఆహ్వానింటానికి ఆమె ఇంటికి వెళ్ళింది.ఏకవీరను పిలుచుకొని వచ్చింది.వారిద్దరు పలుచని తెఱచాటున వారి అరుగులమీద కూర్చుండి 'భామాకలాపాన్ని' తిలకిస్తున్నారు.సత్యభామ తెరవీడి వచ్చి అభినయం సాగించింది.ఏకవీర మానసికంగా ఆ అవస్థలను అనుభవిస్తూ రస జగత్తులో మునిగిపోయింది.కొంతసేపు చూసిన తర్వాత ఏకవీర అలసి మీనాక్షి సౌధంలోకి వెళ్ళింది.మీనాక్షి అది గమనించలేదు.ఆ విధంగా వెళ్ళిన ఏకవీర పరిచితమైన ఇల్లగుటచే ఒక గదిలోనికి వెళ్ళి మంచంపైన కొద్దిసేపు పడుకున్నది. బయటనుండి భాగవతుల గానం,రాగం,తాళం, మొదలైన శబ్దాలు వినబడుతున్నాయి.ఆ సమయంలో సత్యభామ వేషధారిణి అష్టవిధనాయికల హావభావాలచే ప్రేక్షకులను రసజగత్తులో ముంచసాగింది.ఏకవీర అచేతన మానసంలో రసజగత్తు నిండిపోయింది.

పడుకున్నదల్లా లేచింది.ఆమెను జడత్వం ఆవరించింది.అచేతనస్థితిలో అటుఇటు తిరిగింది.క్రమంగా వీరభూపతి తైలవర్ణ చిత్రం గోడకు ఆనియున్న స్థలానికి వచ్చింది.ఆ చిత్రాన్ని చూడగానే చలించిపోయింది.తన పూర్వ ప్రణయమూర్తి కరుణించి ఎదురుగా సాక్షాత్కరించినట్లు భ్రమించింది.ఆ చిత్రాన్ని చూస్తూ అచేతన మనస్కురాలై రసజగత్తులో విహరిస్తూ గోడకానుకొని నిలుచుండి పోయింది.ఆమె బాహ్యస్మృతి కోల్పోయి రసానందంలో మునిగి ఉన్నవేళ చిత్రంగా వీరభూపతి ఆ స్థలానికి వచ్చాడు.

## 4) ఏకవీర,వీరభూపతుల కలయిక-స్వర్గానుభూతి.

"ఏకవీర కనులు ద్వారమందున్నవి.వీరభూపతి నిలచుని ఉన్నాడు." వారిద్దరూ ఒకరొనొకరు చూసుకున్నారు.కాలం ఆగిపోయింది.వారికి ఆరేండ్ల క్రింద తాము చూసుకున్న కాలంలా తోచింది."శరీరములతో పాటు మనస్సులతో,నాత్మలతో,వారివురును ఆ స్థానమునకే ఆ భావమునకే లగింపబడిరి."(173). వీరభూపతి ఆమెను కౌగలించు కోవటానికి దగ్గరగా రాసాగాడు.అమె చేతులు చాచి అతన్ని ఆహ్వానించింది.చేతనస్థితిని కోల్పోయిన వారివురూ బిగి కౌగిలిలో దగ్గరయ్యారు.

"ఆతడామెను గాఢాతిగాఢముగా కౌగలించు కొనెను.ఆమె ఘ్రాణేంద్రియమునకు అతని నిశ్వాస పరిమళమనభవించు శక్తి పోయినది....ఆమె హృదయంలోని సర్వ నాళములు ఆ

మహాస్పర్శ సుఖమనుభవించినవి...అతడామెను ముద్దు పెట్టుకొనెను.ఆమె జిహ్వేంద్రియమా ముద్దురుచి తెలుసుకొనలేదు.ఆతని స్పర్శ ఈ సారి ఆమెలోని అస్థి సంచయమునకు కూడా తాకినది.ఆమెకు హృదయ సంచయమునందు మాత్రమే స్థితి.తక్కిన సర్వాణువులయందు ప్రళయము.చక్షు,శ్రోత్ర,జిహ్మ,ఘ్రాణేంద్రియ,జ్ఞానమంతయు త్వగింద్రియమునందు లీనమై యాస్పర్శగుణ మతిక్రాంత మర్యాదయై 'ఆమె' అన్న పదార్థవాచ్యమైన సర్వమునందు నిండెను.

త్వగింద్రియ లక్షణం ఏకవీర పొందిన విధానాన్ని విశ్వనాథ ఈవిధంగా చూపారు.

ఆమె అన్నపదార్థం లౌకికంగా రూపుదాల్చింది.అలౌకిక జగత్తులో జ్ఞానేంద్రియాలన్నీ ఒక్కటే.అనగా శరీరధారణ చేసినపుడే వాటికి ఉనికి.నిర్గుణ రూపంలో అవన్నీ ఒక్కటే.నిర్గుణ రూపంలో నున్న ఆమె ఆత్మ జ్ఞానేంద్రియాల జ్ఞానమంతా త్వగింద్రియములో కేంద్రీకృతమై ఆత్మకు సన్నిహితమై రూపుదాల్చాయి.ఆత్మకు ఆ స్పర్శతో సుఖం లభించింది.ఆత్మకు ఆ స్పర్శతో సాన్నిహిత్యం లభించింది.ఆత్మ ఆ స్పర్శను సజాతీయంగా గుర్తించింది.అతని ఆత్మ ఆమె ఆత్మ ఏకంగా స్పర్శజ్ఞానంతో గుర్తింపబడి సజాతీయమైనందువల్ల దివ్యమైన సుఖాన్ని అనుభవిస్తూ ఆ రెండూ ఏకమై రసజగత్తులో కలిసిపోయాయి.ఈ విధంగా వారు అచేతన స్థితిలో ఉండగా కాలం ఎంత కరిగిపోయిందో వారికే తెలియదు.

మీనాక్షి వచ్చి చూసేంతవరకు చైతన్యంలేని స్థితిలో వారు నిల్చుండి ఉన్నారు.మీనాక్షి రాకతో వారికి అంతరాయం కలిగింది.వీరభూపతి తేరుకొని కంగారు పడుతూ అతి దీనుడై జరిగిన కథంతా మీనాక్షికి చెప్పాడు.మీనాక్షి ఏకవీరను తాకి స్పృహలోకి తెచ్చింది.అంతవరకు ఏకవీర రసజగత్తులోనే ఉండిపోయింది.ఏకవీర లజ్జావనితయై మీనాక్షి ప్రక్కన నిలబడింది.మీనాక్షి వీరభూపతితో ఈమె 'కుట్టాను భార్య' అని చెప్పటంతో అతడు తలబాదు కుంటూ కుప్పకూలి పోయాడు.ఏకవీర క్రమంగా అర్థం చేసుకోసాగింది.నేడో,రేపో,కుట్టాను రానున్నాడని మీనాక్షి చెప్పసాగింది.ఆమె వినే పరిస్థితిలో లేదు.ఏకవీర శరీరం,మనస్సు ఆమె స్వాధీనంలో లేవు. పిచ్చిదానిలా వెలుపలికి వచ్చి కల్యాణమంటపానికి ఎదురుగా నిలుచున్నది.ఆమె కెదురుగా గుజ్జువాళ్ళపిల్ల 'అమృతం' నిలుచున్నది."ఆ సమయమున ఏకవీర మనస్సున సంకల్ప, వికల్పములు శతసహస్ర ముఖముల విజృంభించు చుండెను.ఏకవీర కన్నులు భగవంతుని కన్నులలో కలిసెను.స్వామి ఆ చూపువెంట నామెలో ప్రవేశించెను.ఆ చూపుకు ఏకవీర మూర్ఛపోయినది,"(179).

## 5) ఏరవీరలో విజాతీయ స్పర్శ.

ఏకవీర పిచ్చిదానిలా తిరుగుచున్నదనే వార్తవిని 'రాబర్టు-నొబిలి' అనే క్రైస్తవ మత ప్రచారకుడు ఆమెను తన మతంలో కలుపుకోవటానికి ఆమె ముద్దుకు వచ్చాడు.ఆమెను

చూసాడు.ఏదో మాట్లాడబోయాడు.ఏకవీర ఆతనితో వాగ్వివాదం చేసింది.చివరకు ఏకవీర తనదైన సనాతన ధర్మాన్ని బోధించి ఆతని నోరు కట్టేసింది.

ఏకవీర అచటినుండి పిచ్చిదానిలా ఇంటికి వెళ్ళింది.ఆ రాత్రి భారంగా గడిపింది.ఆమె నరనరాన వీరభూపతి స్పర్శానుభూతి వ్యాపించిపోయి కలవర పెట్టసాగింది.ఇంతలో కుట్టాను వచ్చిన వార్త విన్నది.ఆమెలో విపరీతమైన భయం ఆవరించింది.

కుట్టాను ప్రేమతో,ఉత్సాహంతో,ఏకరీరను కలువటానికి ఆమెకు దగ్గరగా రాసాగాడు. ఆమె భయపడింది.రావద్దని బ్రతిమిలాడింది.తనను తాకవద్దన్నది.తాకితే చచ్చిపోతానన్నది. కుట్టాను వినలేదు. తన ప్రేమ సంగతి మీనాక్షి సంగతి చెబుతూ,ఆమె ముందుకు రాసాగాడు. ఏకవీరకు భయం మరింత ఎక్కువైంది.ఆమె అతన్ని తప్పించుకోవాలని,ఇంట్లోనుండి వెలుపలికి వచ్చి వేగైనదీ తీరంవైపు వెళ్ళిపోసాగింది.కుట్టాను ఆగుమాగుమంటూ ఆమెను అనుసరించ సాగాడు.ఆమె దీనంగా నాలో పాపముంది నన్ను ముట్టవద్దు అని పదేపదే అనసాగింది.కుట్టాన్ ఆమె మాటలు వినలేదు.ఆమెను వెంబడించాడు.ఇంతలో దారిలో వీరభూపతి సన్యాసి వేషంలో కనిపించాడు.కుట్టాను క్షమించమని పలికినా వీరభూపతి జాలిగా చూస్తూ వెళ్ళి పోయాడు.

ఏకవీర వేగైనదీ తీరం దగ్గర నిల్చుంది.కుట్టాను ఆజ్ఞతో ఆమె కదలకుండా అయింది. వీరభూపతికి తనకు గల ప్రేమ వృత్తాంతమంతా ఏకవీర వరుసగా చెప్పింది.తన శరీరంలోని ప్రతి అణువు వీరభూపతి స్పర్శతో సుఖాన్ని అనుభవించుచున్నదని,అది ఇంకొక విజాతీయ స్పర్శను తట్టుకోలేదని జాలిగా చూస్తూ చెప్పింది.కాని కుట్టాను వినలేదు.దగ్గరగా వచ్చాడు. ఆమెను కౌగలించుకునే ప్రయత్నంలో ఉన్నాడు.ఏకవీర వారిస్తున్నా వినకుండా,"హఠాత్తుగా కుట్టాను రెండు చేతులు ఆమె దేహము చుట్టు చుట్టుకొనెను...ఆమె త్వగింద్రియము చైతన్య రహిత మయ్యెను...అతడామెను గాఢముగా నొక్కుకొనెను....ఆమెలో నాడి నిలిచిపోయెను.(190).

ఇదంతా కన్నుమూసి తెఱచి నంతలో జరిగింది."ఆమె నిర్జీవ పదార్థంగా తన కౌగిలిలో ఉందని గ్రహించిన కుట్టాను దానిని వెనుకకు త్రోసెను.అది మోకాలిబంటి నీటిలో పడి దబ్బుమని చప్పుడయ్యెను.

## 3.11 ముగింపు -సందేశం.

ఏకవీర నవల ముగింపు విశ్వనాథ సుఖాంతం చేయకుండా,విషాదాంతం చేయాల్సిన అవసరమేముంది?అని అనిపించవచ్చు. అయితే ఆయన సగం సుఖాంతంగానూ,మిగతా సగం విషాదాంతంగా ముగించి విచిత్రమైన ఉత్సుకతను పాఠకుల్లో రేకెత్తించాడు.కుట్టాను మీనాక్షిలను చంపకుండా బ్రతికించినా వారి కర్మలకు వారిని వదిలివేసాడు.వారికి పరిష్కార మార్గం చూపలేదు.వారి భవిష్యత్తును పాఠకులనే ఊహించుకోమన్నాడు.

ఏకవీర మరణించటం,వీరభూపతి సన్యాసి గావటం,ఇవి విషాదాంతమైన ముగింపుకు దారితీసాయి.కుట్టాను,మీనాక్షీలు వియోగ తపస్సులో పునీతులై అమలిన శృంగారభావాన్ని పొంది సర్దుబాటుతనం తెచ్చుకొని ప్రియమైన సహోదర భావంతో 'అన్నా !చెల్లీ 'అని ప్రేమతో సంబోధించుకో గలిగారు. వారి హృదయాలలో ఎట్టి కల్మషం లేకుండా వారి తపస్సే కడిగివేసింది. వారు లౌకికంగా ధర్మాన్ని తప్పకుండా ఆనుగుణ్యతను పాటించి బ్రతకటానికి వీలుంది. అదే విధంగా వీరభూపతి,ఏకవీరలలో కూడా ఆ భావాన్ని ప్రవేశపెట్టి వారిలో సర్దుబాటు తనాన్ని కలిగించి లౌకికధర్మం వైపు మరలింపచేసి సుఖాంతం చేసే వీలుండేదని మనకనిపిస్తుంది. కాని విశ్వనాథ ఆ విధంగా సుఖాంతం చేయలేదు. అట్లా చేస్తే ఏకవీర నవలకు అంత ప్రాముఖ్యత లభించి ఉండేదికాదు. అది సాధారణమైన నవల అయ్యుండేది. సాహిత్య చరిత్రలో ఇంత విశిష్టత లేని నవలగా మిగిలిపోయేది.ఏకవీర ముగింపు దానికి అత్యున్నతమైన గౌరవాన్ని,విశిష్టతను చేకూర్చి పెట్టింది. ఎందరో సాహిత్యవేత్తలు,విమర్శకులు, ఈ నవలను అనేక విధాలుగా ప్రశంసించారు,ప్రశంసిస్తున్నారు. దీనిలోని సుగుణాలను ఎంతోమంది ఎత్తిచూపారు.

ఏకవీర నవల ముగింపు వల్లనే విశ్వనాథ ఉద్దేశ్యము,అభిప్రాయము,తత్వము,మనకు తెలుస్తున్నాయి. ఆయన ఈ నవలలో స్థాపించిన ప్రేమతత్వం,త్వగింద్రియ స్పర్శ లక్షణమూ, ధార్మకత్వమూ,మొదలగునవి వైయక్తిక మనస్తత్వ లక్షణంతో కూడిన విశిష్టమైన,అతీతమైన జ్ఞానానికి సంబంధించిన శక్తులు విశిష్ట ప్రవృత్తులుగల వ్యక్తులకు చెందినవి. ఇట్లాంటి వ్యక్తులు లోకాన్ని అనుసరించి నడుచుకోరు. వారు లోకంతో సర్దుబాటుతనాన్ని పొందలేరు. వారికోసం లోకం కాదు. లోకం కోసమే వారు. విశ్వనాథ ఒకచోట ఇలా అంటాడు.

"ఒక్కొక్కప్పుడు విచారించినచో నొక పురుషుడు,ఒకవిజేత,ఒక మహాశిల్పి,ఈ తరగతికి చెందినవారుగా గన్పింతురు. వానియందట్టి భావమే లేకున్నచో,వారా మహాకార్యముల చేయజాలకుందురు. అందుకనియే వారు లోకాద్ధారుకులు. లోకోపకారములైన మహాకార్యములు చేసిన వారందరును కొన్ని విషయములలో మిక్కిలి స్వార్ధపరులుగా గన్పింతురు. నిరంకుశులుగా గన్పింతరు. వారు లోకాతీతులు. లోకము వారి కొరకు గాదు. వారు లోకము కొరకు."

బద్ధన్నసేనాని నవలలో విశ్వనాథ బద్దన్నపరంగా పై వాక్యాలను చెప్పించినా ఇవి లోకాతీతవ్యక్తుల★గురించి చెప్పింది కావటంవల్ల ఇక్కడ ఏకవీర విషయంలో కూడా అనువర్తిస్తుంది.

ఏకవీర ఈ నవలలోని కథా నాయకురాలు. లోకాతీతవ్యక్తి. విశిష్టమైన ప్రవృత్తి గలది. మహా పండితురాలు. గుండె దిటవు గలది. రాబర్టు డి నోబిలీ అనే క్రైస్తవ మతాచార్యుని ఓడించి తనదైన సనాతన ధర్మాన్ని బోధించింది. ధార్మిక ప్రవృత్తి కలది. అటువంటి విశిష్ట గుణాలు కలిగిన వ్యక్తి వీరభూపతితో స్పర్శనుభూతి పొంది,వీరభూపతిలోని ఆత్మ తనలోని ఆత్మ సజాతీయమైనదిగా గుర్తించింది. దైవ సంకల్పంతోనే తనకు వీరభూపతిపై ప్రేమ కలిగిందని తెలుసుకుంది. కాని

★ లోకాతీత వ్యక్తుల వివరణ "తెఅచిరాజు" ముగింపు-సందేశం లో చూడండి.

మానవ ప్రయత్నంతో తాను వేరుచేయబడ్డది. తిరిగి దైవ సంకల్పంతోనే తాను వీరభూపతిని కలుసుకోవటం,స్వర్శానుభూతిని పొందటం,వీరభూపతి ఎవరో తెలుసుకోవటం జరిగింది. ఇన్ని విషయాలు తన అతీతజ్ఞానంతో తెలుసుకున్న ఏకవీరకు తిరిగి లోకాన్ననుసరించి కుట్టానుతో వైవాహిక ధర్మాన్ని అనుసరించటం అధార్మికమని తెలుసు. అందుకే ఆమె ఈ లోకాన్ని విడిచి పోవాల్సివచ్చింది.

ఏకవీరలో ఉన్నంత విశిష్ట వ్యక్తిత్వం,కుట్టాన్,మీనాక్షి,వీరభూపతిలలో లేదు. అందువల్ల వారు ఈ లోకంలో మిగిలిపోయారు. లోకంతో సర్దుబాటుతనాన్ని పొందలేకనే తన్నుతాను అనహ్యించుకొని ఆత్మహత్యా సదృశమైన సన్యాసత్వాన్ని వీరభూపతి పొందాడు. ఇక మిగిలిన కుట్టాను,మీనాక్షీలు వారివురూ ఇదివరకే పునీతులై ప్రేమను ఆరాధనగా భావించి సర్దుబాటుతనాన్ని పొందారు. అందువల్ల వారిలో ఎటువంటి మానసిక సంఘర్షణ లేదు. వారు వారి జీవితాలను ఇకముందు ధర్మసాంకర్యం కలుగకుండా చూసుకోగలరు. అందువల్ల ఆ పాత్రలు కూడా ఈ లోకంలో ఆదర్శంగా ఉండిపోయాయి. ఇటువంటి ఉత్తమగుణాలు కలిగిన పాత్రలు ఈ నవలలో మనకు కనిపిస్తాయి. చరిత్రలో ఇట్టినవల"న భూతో న భవిష్యతి.".

చివరలో విశ్వనాథ సందేశం. లోకంలో యువతీయువకుల మధ్య ప్రేమ అనేది దైవసంకల్పంతోనే,మొదటి చూపులోనే,ఏర్పడుతుందనీ,అట్టి ప్రేమను లోకం గుర్తిస్తే సుఖాంతం గానూ,గుర్తించనిచో విషాదాంతంగానూ మారుతుందనీ,అట్లే లోకంలో విధిపూర్వకంగా కలిసిన భార్యాభర్తల సంబంధం కూడా దైవసంకల్పంగానే భావింపబడుతుందనీ,అట్టిదంపతుల స్పర్శానుభూతి జన్మజన్మాల బంధాన్ని గుర్తిస్తుందనీ,మిగతా మూడు నవలల్లో సందేశమిస్తాడు విశ్వనాథ



# 4 ప్రయోజనతా వాద సిద్ధాంత ప్రతిఫలనం

# జేబుదొంగలు.

## 4.1 ప్రయోజనతా వాద సిద్ధాంతం.

లోకంలో వ్యక్తులు ఏదో ప్రయోజనా కాంక్షతో జీవితాన్ని గడుపుతుంటారు.కొందరి ప్రయోజనం స్వార్థపూరితమైనది కావచ్చు,మరి కొందరిది నిస్వార్థమైనది కావచ్చు.ఈ ప్రయోజన మనేది వ్యక్తిలో అనేక విధాలుగా,అనేక కారణాలచే పుడుతుంది.ఆయా ప్రయోజనాలను సాధించటంలో వ్యక్తులు భిన్న మార్గాలను అవలంభించవచ్చు.

నడక నేర్చుకోవటానికి పసిబిడ్డ పడుతూ లేస్తూ పొందిన న్యూనత,ఆధిక్యాల అనుభవాల వలె వ్యక్తి తన జీవితంలో పొందిన న్యూనతాభావాలను అధిగమించాలనే పట్టుదలతో పరిపూర్ణత సాధించాలనే తపనతో ముందుకు సాగటం సర్వ సాధారణమైన విషయం.

సంఘజీవియైన మానవునికి 'ప్రయోజనాపేక్ష' సహజమనీ 'ఆల్‌ఫ్రెడ్ ఆడ్లర్ ' తన వైయక్తిక మనోవిజ్ఞాన శాస్త్రంలో పేర్కొన్నాడు.ఆడ్లరు 'ప్రయోజనతావాద సిద్ధాంతాన్ని' ప్రతి పాదిస్తూ "వ్యక్తియొక్క ఏ ప్రవర్తననైనా ప్రయోజనాన్ని బట్టి ఉంటుందనీ,వ్యక్తి ఏ ప్రయోజనాన్ని ఆశించి ఆవిధంగా ప్రవర్తిస్తున్నాడనేదే ప్రవర్తనను అర్థవంతం చేస్తుందనీ,సహజాతాలు, ప్రచోదనలు,మొ॥లైన వన్నీ వ్యక్తిలో పనిచేస్తూ ఉండవచ్చు కాని వ్యక్తి తాను సాధించాలనుకున్న ప్రయోజనానికి తగినట్లుగా వాటిని మలచుకుంటాడనీ,అందువల్ల వ్యక్తికి ప్రయోజనమే ముఖ్యమై నిలుస్తుందనీ,చెప్తాడు.ఆ ప్రయోజనం సాధించటానికి వ్యక్తి పట్టుదలతో ప్రవర్తిస్తాడు. ఆ మార్గంలో ఆ వ్యక్తికి ప్రత్యేకమైన జీవనశైలి ఏర్పడుతుంది.అందువల్ల లోకంలో ప్రతి వ్యక్తి ప్రత్యేకమైన జీవనశైలి కలిగిఉంటాడని,ఆడ్లర్ సిద్ధాంతం.

వ్యక్తులలో ప్రయోజనమాశించే ఆదర్శాలూ,ఆ ఆదర్శాలను సాధించాలనే పట్టుదలలు ఆ పట్టుదలలోనే ప్రయత్నాలూ,ఆ ప్రయత్నాలలోనే న్యూనతాభావాలు(లోపాలు) కలగటం సర్వసాధారణమైన విషయం.న్యూనతాభావాలు కలుగగానే దాన్ని సాధించాలనే తపన,ఆ తపనతో పరిపూర్ణత కొరకు అనగా ఆధిక్యత పొందాలనే కాంక్షతో వ్యక్తి పనిచేయటం జరుగుతుంది.ఈ విధంగా ప్రతివ్యక్తి జీవితంలోని ప్రతపనిలో న్యూనతా,ఆధిక్యతా,భావాలు చోటు చేసుకుంటాయనీ, వాటిని సాధించటంలోనే వ్యక్తి జీవితం గడిచిపోతుందనీ,ఆడ్లర్ తన సిద్ధాంతంలో వివరిస్తాడు.

జీవితంలో గెలుపు,ఓటమిల మధ్య న్యూనతా,ఆధిక్యతల,పోరాటంలో వ్యక్తి బలహీను డైనపుడు,లేదా వ్యక్తిలో శారీరకంగా కానీ,మానసికంగా కానీ, బలహీనత ఏర్పడినపుడు ఆ వ్యక్తి

మానసిక సమతౌల్యాన్ని కోల్పోతాడు.సర్దుబాటుతనాన్ని పొందలేక పోయినపుడు ఆ న్యూనతాభావాలే తీవ్రరూపం దాల్చి న్యూనతా దుర్దమ భావాలుగా రూపొందుతాయి.

ఈ విధంగా ఏర్పడిన న్యూనతాదుర్దమ భావాలు మరీ తీవ్రరూపం దాల్చినపుడు వ్యక్తి వ్యాకులతకు లోనై నాడీరుగ్మతకు(పిచ్చి) గురి అవుతాడని ఆడ్లర్ అంటాడు.సాధారణ పరిస్థితులలో మాత్రం వ్యక్తికి న్యూనతాభావాలే ప్రేరణశక్తులుగా పనిచేస్తాయి.అందుల్ల వ్యక్తిలో న్యూనతాదుర్దమ భావాలు అతి సాధారణ స్థితిలోకూడా తీవ్రరూపం దాల్చటానికి గల కారణాలు 'వ్యక్తి పెరుగుదల లోని లోపాలు,విద్య.సంస్కృతి,ఆచార వ్యవహారాలు,మొ॥నవి కాగలవని ఆడ్లర్ తన వైయక్తిక మనోవిజ్ఞాన శాస్త్రంలో వివరిస్తాడు.

ఈ విధమైన ప్రయోజనతావాదాన్ని చక్కగా వినియోగించుకొని,ఆదర్శవంతమైన జీవితాన్ని మలచుకొని,అందులో పొందిన కొన్ని న్యూనతాభావాలచే మానసికంగా కొంతకాలం, వ్యాకులతకు లోనై తిరిగిదాన్ని అధిగమించి విజయం పొందిన ఒక యువకుని గాథనే ఈ జేబుదొంగలు నవలలో మలిచాడు విశ్వనాథ.

విశ్వనాథ ఈ నవలలో ఆడ్లరు ప్రతిపాధించిన ప్రయోజనతా వాదాన్నేగాక,ఫ్రాయిడ్ ఊహించిన మానసిక ప్రక్రియలగు,అచిత్తు,అహం,అధ్యహం, అనే వాటికి రూపకల్పన చేసి ఇందులో అప్పడు(అచిత్తు),అవధాని(అహం), విమల(అధ్యహం), అనే ముఖ్యపాత్రలను తీర్చి దిద్దాడా అని అనిపిస్తుంది.ఇంతేగాక యూంగ్ కొత్తగా చెప్పిన 'సామూహిక అచేతనాన్ని' కూడా విమల,అవధాని,పాత్రలలో మనం గమనించవచ్చు.విశ్వనాథ ఈ నవలను 1940లో రచించాడు. ఇందులో ముగ్గురి(ఫ్రాయిడ్,ఆడ్లర్.యూంగ్) సిద్ధాంతాల భావాలు ఉండటం అవి ఆయా పాత్రలలో వ్యక్తం గావటం విశేషం.

## 4.2 నవలలోని కథావస్తువు.

నవలలోని కథాకథనం రచయిత ప్రతిభకు నిదర్శనమైతే,కథావస్తువు ఆ రచయిత దృష్టిలో మెదలిన భావానికో,తత్వానికో,గుణానికో,ప్రయోజనానికో,సంస్కరణకో,సంబంధించి ఉంటుంది.కథాకథనంలో చదివించే గుణం ఉండగా,కథావస్తువులో ఆలోచింపచేసే తత్వం ఉంటుంది.ప్రయోజనం ఉంటుంది.విశ్వనాథ ఈ నవలలో పొదిగిన కథావస్తువును చూద్దాం.

సామాజిక నవలగా కనిపించే ఈ 'జేబుదొంగలు' నవలలో ఇతివృత్తం ద్వారా, అవధాని పాత్రద్వారా,విశ్వనాథ ఉద్దేశించిన లక్ష్యాన్ని,ప్రయోజనాన్ని,గ్రహించవచ్చు. విశ్వనాథ ఏ రచనకూడా కాలక్షేపం కోసం చేసినవారు కాదు. కేవలం తన వ్యక్తిగత అభిప్రాయాలకో, అభిలాషలకో,తన రచనను ముడిపెట్టడు.ఆ రచన వెనుక ఒక ఉద్దేశ్యమూ, ఒక సందేశమూ,ఒక విలువ, ఆలోచింప చేసే తత్వమూ ఉంటాయి.కావాలనీ సాధారణమైన సామాజిక వ్యక్తియొక్క జీవితాన్ని చూపాలనీ,

పనిగట్టుకొని నవలలువ్రాయడు. ఆ నవల కేవలం సంఘసంస్కరణలకే పరిమితం కాదు. భౌతికమైన మార్పులకంటె వ్యక్తిలో కలిగే మానసికమైన మార్పులకే అధికమైన ప్రాధాన్యమిచ్చి విశ్వనాథ రచన సాగిస్తాడు. అందువలన ఈ నవలను సాంఘిక నవలైనా మనోవైజ్ఞానిక నవలగా పేర్కొనవచ్చు.

విశ్వనాథ ఈ నవలలోని అవధాని మనస్తత్వాన్ని ఒక ప్రయోజనం దిశగా చిత్రించాడు. ఆ ప్రయోజనంలో ఒక సదుద్దేశ్యం అంతర్గతంగా ఉండేటట్లు కొనసాగించాడు. తప్పుచేయటం మానవనైజం. దాన్ని తెలుసుకొని పశ్చాత్తాపపడి క్షాళనం చేసుకొని సంస్కరించు కోవటం వ్యక్తియొక్క గొప్పదనం. పశ్చాత్తాప పడటం శిక్షవేసుకోవటమే. విశ్వాసం కలిగి ఉండటం, వ్యక్తికి ఉన్నతమైన మార్గాన్ని చూపిస్తుంది. ఈ విధంగా వ్యక్తికి సంబంధించిన ప్రయోజనాన్ని,సదుద్దేశ్యాన్ని,విశ్వాసాన్ని, మొ॥ సుగుణాలను ముఖ్యమైన అవధాని పాత్రలో చూపి అవి కలగి ఉండటం వల్ల వ్యక్తి జీవితం ఉన్నతంగా ఉంటుందని విశ్వనాథ చిత్రిస్తాడు.

కఠిన శిలానిర్మితమైన గోడల్లో,బీటలు వారిన బండరాళ్ళలో, దైవ వశాన రాలిన బీజం పగుళ్ళలో,పట్టెలలో చిక్కి ,అదనులో మొలకెత్తి ప్రక్కనున్న శిలలను తొలగించుకుంటూ,పైకి పెరుగుతూ, పరిసరాలను చీల్చి మహా వృక్షంగా మారి నలుగురకీ నీడనిచ్చె మర్రిచెట్టు లాంటిది జాతి సంస్కృతి. వ్యక్తిలో ఏ మూలనో ఈ జాతి వారసత్వంలోని ఏ లక్షణమున్నా అది ఆ వ్యక్తిని మహా వటవృక్షంలా నిలుపుతుందని ఈ నవలలోని అవధాని పాత్ర నిరూపిస్తుంది.

విశ్వనాథ అవధాని మనస్తత్వంలో ఓ మూల జాతిసంస్కృతి బీజం నాటాడు. దానికి విమల నీరుపోసి పెంచి పెద్ద చేసింది. పరిసరాల ప్రభావం(ఇంగ్లాండు) గండశిలలవంటి వైనా వాటిని తొలగించుకొని జాతి సంస్కృతి పైకి లేచింది. తనను తాను నిలదొక్కుకొని నలుగురికి నీడనిచ్చింది. ఇదే ఈ నవలలోని కథావస్తువు.

విశ్వనాథ ఈ నవలలో మరొక విశేషాన్ని కూడా చూపించాడు. అది పాఠకులను ఆలోచింప చేసే తత్వం. విశ్వనాథ ఈ నాలుగు నవలల్లో అంతస్సూత్రంగా తాత్వికమైన ఒక భావనను పొందు పర్చాడు. యూంగ్ తెల్పిన అనిమా,అనిమస్ అనే స్త్రీ పురుష భావాలకు సంబంధించిన అంశాలు ప్రతి వ్యక్తిలో ఉంటాయనీ,అవే లోకంలో స్త్రీ పురుషులు పరస్పరం ఆకర్షించుకోవటానికి వీలుకల్పిస్తాయనీ, తెల్పిన వాటినే విశ్వనాథ పౌరాణిక గాథ ననుసరించి తాత్విక భూమికతో మరో రూపాన అనగా స్పర్శ సిద్ధాంతంద్వారా ప్రతి నవలలో స్త్రీ పురుషుల సంబంధాన్ని లోకాతీతంగా చిత్రిస్తూ,వాటి భావనలు సృష్టి ప్రారంభంలోని "ప్రజాపతి–శతరూప' అంశాలుగా నిరూపిస్తాడు. ఇవే అంశలు ఈ నవలలోని అవధాని– సీత పాత్రలలో 'స్పర్శ' ద్వారా ప్రవేశపెట్టి భర్యాభర్తల ఎంపిక విధానాన్ని ,లోకంలో దాంపత్య జీవనానికి,కలయికకు,ఈ అంశాలే ప్రధానమనీ,భావించిన విధానం కథావస్తువుగా కూడా మనం ఇందులో చూడవచ్చు.

## 4.3 నవలలోని కథా సారాంశం.

రిటైర్డు సోమశంకరం గారికి ఒక కూతురు,ఒక కుమారుడు.ఆతని భార్య భవాని. కూతురు విమల,కుమారుడు అవధాని. సోమశంకరం గారు పరమలోభి.తన భార్యాబిడ్డలకు గాని తన అవసరాల నిమిత్తం గాని పైసా ఖర్చుపెట్టేవాడు కాదు.అప్పుడు ఇంట్లో నౌకరు. అప్పుడు,అవధాని ఒకే ఈడువారు.అవధానికి చదువుమీద శ్రద్ధలేదు.ఇంగ్లీషు భాషపై మాత్రం వ్యామోహమెక్కువే. ఫస్టుఫారం రెండేండ్లు,సెకండు ఫారం రెండేండ్లు వానకాలం చదువులా అవధాని చదువుతూ ఉంటాడు.కాని వ్యవహార జ్ఞానం మాత్రం మెండు.లెక్కలు,తెలుగు,సైన్సులలో వివేకం శూన్యమైనా ఇంగ్లీషు మాత్రం బి.ఏ.వాళ్ళకు వచ్చినంత బాగా వస్తుంది.కింది తరగతి పిల్లలు అవధాని దగ్గర ఇంగ్లీషు చెప్పించుకుంటారు.

తండ్రి పిసినారి కావటల వల్ల అవధాని,అప్పుడు పదేండ్ల ప్రాయంనుండే ఇంటికి వచ్చిన బంధువుల,అతిథుల,స్నేహితుల,జేబుల్లోనుండి డబ్బులు కాజేసి పంచుకునేవారు.అవధాని డబ్బులు దాచుకొని తన అవసరాలకు వాడుకునేవాడు.

అవధానికి తప్పుడు పనులు తల్లిదండ్రుల నిర్లక్ష్యంవల్ల అలవాటైనాయి,దానికితోడు అప్పుడు సహాయకారిగా ఉండటంవల్ల అవధానికి జేబుదొంగ తనం తప్పనిసరి అయింది.దాంట్లో క్రమంగా నేర్పు సంపాదించాడు.ఇదంతా చెల్లెలు విమల గ్రహించింది.కాని ఆ డబ్బుతోనే తనకు వైద్యం చేయించటం తెలుసుకుంది.అవధాని ఆ డబ్బుతోనే ఇంగ్లీషు పుస్తకాలు కొని చదివేవాడు. తల్లిదండ్రుల ప్రేమ కరువైనందువల్ల చెల్లెలు విమలను అధికంగా ప్రేమించేవాడు.విమల అవధానికి గురువు.ఆమె ఎంతచెప్తే అంత.విమల అవధాని తప్పుడు పనులకు కోప్పడుతుంది.అవధాని మానేస్తానంటాడు.విమల పెద్దదైనా తల్లిదండ్రులు పట్టించుకోరు. అవధానికి తల్లిదండ్రులమీద ఏ మాత్రం గౌరవం లేదు.అతడు "నాకీ దేశంలో చదువు అయిపోయింది.ఇక్కడ చదవాల్సిందేమీ లేదు.పదివేలు ఖర్చుపెట్టి ఇంగ్లాండుకు పోయి ఐ.సి.యస్ చదివితే ఇకచూడు' 'అనుకునేవాడు. విమల పెండ్లికూడా తానే చేయాలి.ఇంగ్లాండు పోవాలన్నా, పెండ్లిచేయాలన్నా,తన పిసినారి తండ్రి చావాలి.తండ్రి ఆస్థి తనచేతికి రావాలి.అందుకని తండ్రి తొందరగా చస్తే బాగుండు ననుకున్నాడు అవధాని.

ఒకనాడు అవధాని కోరికనెరవేరింది.సోమవంకరంగారుచనిపోయారు.తండ్రి,కొంత డబ్బుభార్యకు,విమలకు,వ్రాసి మిగతాదంతా కొడుక్కి విల్లు వ్రాశాడు.కొడుకుమీద గురుమూర్తి అనే స్నేహితున్ని కొంతకాలం గార్డియన్‌గా ఉంచాడు.అవధానికి వెంటనే ఇంగ్లాండు పోవాలని ఉంది.కాని గురుమూర్తి పోనివ్వలేదు.చెల్లెలుపెండ్లి అయిన తర్వాత వెళ్ళమన్నాడు.గురుమూర్తి పెండ్లి సంబంధం చూడటంతో అవధాని విమల వివాహం చేసాడు.ఆ తర్వాత ఆతడు ఇంగ్లాడు వెళ్ళాడు.

ఇంగ్లాండులో ఐ.సి.యస్ చదువు పూర్తిచేసుకొని ఏడేండ్లకు ఉద్యోగ బాధ్యతమీద అవధాని స్వదేశానికి తిరిగి వచ్చాడు.మద్రాసులోనున్న చెల్లులు విమలను కలిసాడు.విమలమాట అవధానికి ఇప్పటికి వేదవాక్కే.ఆతనివేష,భాషలను,ఆచార వ్యవహారాలను,విమల క్రమంగా మార్చింది.అవధాని పెదమేనమామ కూతురు సీత,తల్లిదండ్రులు లేనిది.చినమేనమామకు ఇద్దరు కూతుళ్ళు.వారు లలిత,శారదలు.సీతను చినమేనమామేపెంచి పెద్దచేశాడు.మేనమామ పెద్ద కూతురు లలితను అవధానికి ఇవ్వాలనుకున్నారు.అవధానికిష్టంలేదు.శారద మీద అవధానికి మనసు పడింది.శారద అవధానిని చేసుకోవటానికి ఒప్పుకోలేదు.చివరకు అవధాని తనలోని స్త్రీవాంఛ సీతగతమేనని తెలుసుకొని సీతను పెండ్లి చేసుకోవాలని అనుకున్నాడు.సీతను కోరుకో సాగాడు.మరోపక్క అవధాని మనసులో ఏదో బలహీనత కృంగదీయసాగింది. మానసిక సంఘర్షణతో అతను చాలాకాలం వ్యాకులతకు లోనయ్యాడు.

అవధానికి కాకినాడ సబ్ మేజిస్ట్రేటుగా ఉద్యోగం వచ్చింది.తన చిన్ననాటి స్నేహితుడు అప్పడు అక్కడే ఉన్నాడు.వాడు కాకినాడలో చిన్నచిన్న దొంగతనాలతో జీవితం ప్రారంభించి ఇపుడక్కడ ఆరితేరిన గజదొంగగా ప్రసిద్ధి పొందాడు.అంతేగాక వానికి స్త్రీ వ్యసనం కూడా ఎక్కువైంది. అవధాని ఉద్యోగరీత్యా కాకినాడకు వచ్చేసరికి అప్పని సంగతి తెల్సింది.అప్పడు అవధానిని కలిసాడు.తన సంగతంతా అవధానితో చెప్పుకున్నాడు.వాని జీవితంకూడా కొన్ని ఘట్టాల్లో తన జీవితం వలెనె ఉందని అవధాని గ్రహించాడు.

సీతజ్ఞాపకాలు కలిచివేయటంతో అవధాని ఆగలేక వెంటనే మేనమామ ఇంటికి వెళ్ళాడు. సీతను కలిసాడు.కొన్ని రోజులు అక్కడే ఉన్నాడు.రహస్యంగా సీతను ఒప్పించి ఆమెను అనుభవించాడు.సీత భయపడింది.సీతను,శారదను విమల దగ్గరకు పంపి అవధాని తిరిగి కాకినాడకు వచ్చాడు.అప్పడు ఒక స్త్రీన్ని బలాత్కారం చేసిన కేసు అవధాని ముందుకు వచ్చింది. అవధాని కావాలని అప్పడికి శిక్ష విధించాడు.గురుమూర్తిగారిని పిలిపించి ఆయనతో“మీరు వెంటనే బొంబాయి వెళ్ళి అక్కడ నాకోసం నెల్లీ అనే యువతి ఉంటుంది.ఆమెను కలిసి తిరిగి ఆమెను ఇంగ్లాండు పంపాలి.ఎంతడబ్బు ఖర్చయినా సరే మీరీపనిమాత్రం చేయాలి.ఆమెతో నేనో తప్పపని చేసాను.నన్నీ నరకంలో నుండి కాపాడండీ.నాకీ సాయం చేయండి”అని కోరాడు.

అప్పడికి శిక్ష విధించిన అవధాని జైల్లో ఉన్న అప్పన్ని రాత్రిపూట ఒంటరిగా కలిసి ఈ విధంగా అన్నాడు.“దైవ భయముచేత వచ్చితిని.నా శిక్ష నేనిదివరకే అనుభవించితిని. ఇంకను అనుభవింతును.కాని నేనిట్టి శిక్ష కొంతసేపైనను పొందుటకు వచ్చితిని.”అని తాను ధరించిన దుస్తులు తీసి సామాన్య ఖైదీ దుస్తులు ధరించి కొంతసూపు నేలమీద కూర్చున్నాడు. ఆ విధంగా అవధాని కొద్ది నిమిషాలు శారీరక శిక్ష అనుభవించాడు.చివరకు అవధాని మద్రాసు వచ్చి చెల్లెలు విమలను కలిసాడు.సీతను వివాహం చేసుకున్నాడు.

## 4.4 ఈ నవలలోని ముఖ్యపాత్రలు-మనస్తత్వ చిత్రణ.

ఈ నవలలోని ప్రధాన పాత్రలు మూడు. అవి. **1 అవధాని. 2. అప్పడు. 3. విమల.**

**1.అవధాని పాత్ర.** - ఆడ్లర్, ఫ్రాయిడ్, యూంగ్, భావనల సమ్మేళనం.

**2.అప్పని పాత్ర.** - ఫ్రాయిడ్ చూపిన 'అచిత్తు' భావానికి ప్రతీక.

**3.విమల పాత్ర** - యూంగ్ చూపిన 'సామూహిక అచేతనంలోని' జాతి వారసత్వానికి ప్రతీక.

## 1. అవధాని పాత్ర-మనస్తత్వ చిత్రణ.

ప్రతి వ్యక్తిలో 'అచిత్తు' స్వార్థాభిలాషకు,'అధ్యహం' జ్ఞానానికి, చెందుతాయని,అచేతన మానసిక ప్రక్రియలే వ్యక్తి ప్రవర్తనకు మూలమౌతాయని ఫ్రాయిడ్ సిద్ధాంతం. కాని ఆల్‌ఫ్రెడ్ ఆడ్లర్ మాత్రం చేతన ప్రక్రియలకే ప్రాధాన్యమిస్తాడు.వ్యక్తి సాంఘికజీవి కాబట్టి,వ్యక్తి ప్రవర్తన సాంఘికాభిరుచి కలిగినదై ప్రయోజనాపేక్షతో ఉంటుందని చెప్తాడు.యూంగ్ ఫ్రాయిడ్ వలె 'అచేతన మానసిక ప్రక్రియలకే' ప్రాధాన్యమిచ్చాడు.కాని ఫ్రాయిడ్ చూపిన 'వైయక్తిక అచేతనాన్ని యూంగ్ రెండు విధాలుగా విభజించి చూపిస్తాడు. 1,వైయక్తిక అచేతనం,ఇది వ్యక్తి చేతనంలో దమింపచేసుకున్న కోరికలకు,అసభ్యకరమైనటువంటి వాంఛలకు,భావాలకు,కేంద్రంగా నిలుస్తుంది. ఇది ఫ్రాయిడ్ చెప్పినటువంటిదే. 2. సమష్టి లేదా సామూహిక అచేతనం. ఇది ఎన్నింటికో కేంద్ర స్థానం.జాతివారసత్వానికి మూలం,మూలరూపాలెన్నో ఇందులో ఉంటాయి.వ్యక్తి లోకంలో, సంఘంలో,సరిగా నడుచుకోవటానికి తగిన సర్దుబాటుతనాన్ని పొందటానికి,వ్యక్తిగతమైన అభిలాషలను అణచుకోవటానికి,నలుగురిలో కలిసి జీవించటానికి, తగిన సామాన్య ప్రవర్తనను అలవర్చుకోవటానికి,వ్యక్తిలో భయం,భక్తి ఏర్పరచటానికి,సంస్కృతి, సంప్రదాయాలకు ఇదే మూలం.

విశ్వనాథ అవధాని ప్రవృత్తిని ఈ విధంగా చేప్తాడు."అవధానియందు ప్రకృతి ద్విధా విభక్తమై యున్నది.పట్టి బలవంతం చేసి ఇంగ్లీషు భాషను బహు నిరోధముల కెదురు నడిచి సంపాదంచిన పట్టుదల యొకటి. సులభ లభ్యమైన దానిని బెణుకు తొణుకులు లేకుండా ననపహరించు ప్రకృతి యొకటి."(జే.దొం.పుట.28)★

మొదటిది ఆడ్లరు చూపిన 'న్యూనతా-ఆధిక్యతా' భావాలకు సంబంధించినది. అవధానిని ప్రయోజనాభిముఖంగా ప్రవర్తింప చేసింది.కాగా రెండవది,ఫ్రాయిడ్ చూపిన 'అచిత్తు' కోరికలకు, కామేచ్ఛకు చెందినది.ఆతని అవకతవక పనులకు కామేచ్ఛయే ప్రాతినిధ్యం వహించి, మూలమైంది.

అవధాని బాల్యం నుండే నిరాదరణకు గురై తల్లిదండ్రుల ప్రేమను పొందక,తగిన శిక్షణను,అభ్యాసాన్ని అలవర్చుకోక,మానసికంగా ఎంతో కృంగిపోతూ పెరిగాడు.తండ్రి పిసినారి

★ గమనిక. కుండలీకరణంలో వేసిన సంఖ్యలు ఆయా నవలల్లోన పుటసంఖ్యను తెలుపును,

తనం,తల్లి నిర్లక్ష్యం,అతన్ని చెల్లెలు విమలవైపు తిప్పాయి.తల్లిదండ్రుల ప్రేమను నోచుకోని అవధాని చెల్లెలిని తల్లిలా,తండ్రిలా,గురువులా ప్రేమించి ఆరాధించ సాగాడు.విమల మాట జవదాట కుండా,ఆమె ఆజ్ఞలకు బద్ధుడై నడుచుకున్నాడు.తల్లి దండ్రుల ప్రేమను పొందలేని 'న్యూనతా భావాన్ని' విమలను అధికంగా ప్రేమించటంలో,ఆరాధించటంలో,'ఆధిక్యత సంపాదించు కున్నాడు.ఆ ఆధిక్యతతో మానసిక తృప్తి పడ్డాడు.తన మంచి చెడ్డలు చూసే అధికారిగా విమలను నిర్ణయించుకున్నాడు.తల్లిదండ్రుల ద్వారా పొందలేని ప్రేమను ఆమె ద్వారా పొందుతూ,పరిపూర్ణతను తెచ్చుకున్నాడు.ఆమెయే సర్వస్వం అనుకున్నాడు అవధాని.

తండ్రి లోభత్వం వల్ల అవధాని వ్యక్తిగత వాంఛలకు అవరోధం ఏర్పడింది.తాను సంపాదనా పరుడు కాదు.తండ్రి తన ఖర్చులకు పైసా విదిల్చడు.సులభంగా డబ్బువచ్చే మార్గాన్ని ఎన్నుకున్నాడు.అతనిలోని అచిత్తు మార్గం చూపింది.ఇంట్లో పనిచేసే నౌఖరు అప్పడు అవధానికి తోడయ్యాడు.(అప్పడు అచిత్తుకు ప్రతీక) అప్పడు,అవధాని కలిసి ఇంటికి వచ్చిన బంధువుల, స్నేహితుల,జేబుల్లోనుండి డబ్బులు కాజేసేవారు.అవధాని దీన్ని తప్పుగా భావించలేదు.తప్పుడు పనని చేప్పేవారు లేరు.ఒక ప్రయోజనాన్ని తానాశించి ఈ పనిచేస్తున్నానని అనుకునేవాడు.ఆ డబ్బుతో తనకు కావాల్సిన ఇంగ్లీషు పుస్తకాలు కొనేవాడు.చెల్లెలిని సంతోష పెట్టేవాడు.ఆమెకు కావాల్సినవి తెచ్చేవాడు.

అవధాని తెలుగు,లెక్కలు,భూగోళం,సైన్సు విషయాలలో వెనుకబడేవాడు.అతనికి ఇంగ్లీషు భాషమీదున్నంత వ్యామోహం వీటీమీద లేదు.స్కూల్లో చెప్పే పాఠాల్లో ఇంగ్లీషులో తప్ప మిగతా వాటిలో శ్రద్ధ చూపేవాడు కాదు.అవధాని ప్రతిసారి ప్రతిక్లాసులో ఫెయిలయ్యేవాడు. తన బలహీనతను గుర్తించిన అవధాని తెలుగు,లెక్కలు..మొ॥నవి రాకున్నా వాటిలో పొందిన న్యూనతాభావాన్ని ఇంగ్లీషు భాషలో తీర్చుకోవాలని(తనకు నచ్చినదానిలో)అనుకున్నాడు.ఆ విధమైన ప్రయోజనాన్ని ఆశించి పట్టుదలతో శ్రమించి ఆ భాషపై వ్యామోహం పెంచుకొని అభివృద్ధి చేసుకోసాగాడు.ఇంగ్లీషు పుస్తకాలకు కావాల్సిన డబ్బులను 'జేబుదొంగగా' సంపాదించే వాడు. జీవితంలో ఇంగ్లీషు భాషలో ఆధిక్యత(పరిపూర్ణత) పొందటమే ప్రయోజనంగా అప్పటి పరిస్థితులలో ఎంచుకున్నాడు.

ఇతర విషయాల్లో పొందిన న్యూనతా భావాలను మరోవిధంగా మలచుకొని వాటిలో ఆధిక్యత సంపాదించుకుంటూ, బాల్యదశలోని తన జీవితాన్ని ఆ విధంగా గడిపాడు.తాను చేసే తప్పుడు పనులకు విమల కోప్పడింది.మంచి పనులకు మెచ్చుకుంది.విమలమీది గురుభావంతో అవధానిలో క్రమేణ తప్పుడు పనులనుండి తప్పుకోవాలని,ఏదో ఒక మంచి పని చేయాలనే తపన ఆతనిలో మొదలైంది.అవధాని దృష్టిలో "విమలయొక దేవత.తా నొక ఆరాధకుడు.తన యదృష్టమామె ప్రసన్నతాధీనము.ఆమె భ్రూభంగరేఖ తనకు శిక్షాపథము.గాలిగా బెరిగిన తన విశృంఖలతకు నామె పట్టుకొయ్య."(పుట.29)

విమల దృష్టిలో అవధాని తప్పుడు మనిషి కాదు.పైగా అవధానిని ఆమె ఊహించిన తీరువేరు."విమలకు అవధాని యన్నచో నొక విచిత్రమైన కోటి సమాకృష్టమైన యొక వంశ గౌరవ పతాక భావన.ఆతడేదో కొండలు త్రవ్వి పోయునని,సముద్రములు పుక్కిలించునని,బాల హృదయంలో నిగూఢముగా నున్న యొక ఆశయొక్క ప్రతి బింబము"(17).

అవధాని పట్టుదల కూడా సామాన్యమైనది కాదు.ఆతని ఆంగ్లభాషా వ్యామోహం కూడా ఆచరణకు కష్టసాధ్యమైనదే. కాని అవధాని దానిని సాధించాడు."అతడు పెద్ద పెద్ద ఇంగ్లీషు పుస్తకములు తెచ్చుకొని రాత్రులందు పొద్దుపోవు వరకు చదువుచును యుండును. తెలియని ప్రతి మాటకు విసుగు లేక నిఘంటువు చూచును.క్రమక్రమముగా నాతడు కళాశాల విద్యార్థులతో పరిచయము చేసుకొని వారివద్ద పుస్తకములు తెచ్చి చదువును..స్కూలు ఫైనలు కాని, ఇంటర్మీడియట్ కాని చదువుచున్న విద్యార్థులతనిని తప్పక రానిత్తురు.ఇంగ్లీషులో నేవైనా తెలియని విషయాలున్నచో నతని నడగి తెలుసుకుందురు. ఒక ముసలి ప్లీడరు సోమశంకరం గారి స్నేహితుడు ..ఇంగ్లీషులో చక్కని పాండిత్యం గలవాడు ..ఆయన ప్రతరోజు అవధానికి ఇంగ్లీషు నూరిపోయును.(13)

విమల చెప్పింది కాబట్టి తా నీ జేబుదొంగతనం నుండి తప్పుకోవాలి.ఇదే తన వృత్తి కాకూడదు.సులభంగా సంపాదించేదైనా విమల చెప్పింది కాబట్టి,తనకు పనికి రాదు.జీవితంలో మంచి సంపాదనాపరుడు కావాలంటే ఏదో ఒక మంచిపని తలపెట్టాలని నిర్ణయించుకున్నాడు. విమలకు పెండ్లీడు కూడా వచ్చింది.తల్లిదండ్రులకు పట్టింపే లేదు. విమల పెండ్లి చేయాలన్నా తాను సుఖంగా బ్రతకాలన్నా, డబ్బు కావాలి.అందుకే డబ్బు సంపాదించాలనే ఆలోచనలు అవధానిలో దారులు వెదుక్కోసాగాయి.

ఒక రోజు అవధానిలో అనుకోకుండా ఒక కోరిక పుట్టింది."పది పదిహేను వేలుపెట్టి ఇంగ్లండు పోయినచో ఏదో ఇక గొప్ప పరీక్షయందు ఉత్తీర్ణుడై రావచ్చు.ఆ పైన ఏదో ఒక గొప్ప ఉద్యోగం దొరక్కపోదు...కాని దానికోసం ముందు డబ్బు కావాలి..డబ్బు రావాలంటే తండ్రి చనిపోవాలి.తండ్రి చనిపోతే ఉన్న ఆస్థిఅమ్మి ఇంగ్లాండు పోవచ్చు.బాగా చదవచ్చు.పెద్ద ఉద్యోగం చేయవచ్చు.తన చెల్లెలి పెండ్లి చెయ్యొచ్చు.ఇవన్నీ జరగాలంటే తండ్రి చావాలి.ఇదీ అవధాని విపరీతమైన ఆలోచన.తండ్రి చావుకోసం అవధాని ఎదురు చూడసాగాడు.

ఇట్లాంటి ఆలోచనలు పుట్టటానికి అవధాని మూల మనస్తత్వం లోనే ఇటువంటి ప్రవృత్తి ఉంది.అది అతనిలో పుట్టుకతో వచ్చింది.అతనిలోని అచిత్తు రకరకాల కోరికలకు నెలవై ఉంది.ఏదైనా సులభంగా సాధించాలనే ఎత్తుగడలో అతనిలో పుట్టే ఆలోచనలు ఇట్లాగే ఉంటాయి. అచిత్తు ప్రభావంవల్లనే అతడు జేబు దొంగగా మారడం,ఈనాడు ఇంగ్లాండు పోవాలని నిశ్చయించు కోవటం,దానికి తండ్రి చావాలని కోరుకోవటం.

అవధాని కోరిక త్వరలోనే నెరవేరింది.సోమశంకరంగారు చనిపోయాడు.ఆయన చనిపోతూ ఒక విల్లు వ్రాసాడు.అందులో పదివేలు భవానికి(భార్యకు),ఇరువై వేలు విమలకు, తక్కిన పొలం,ఇల్లు,అవధానికి.అవధానిమీద గురుమూర్తికి,రామారావుకు అధికారం. ఏడాదిలోగా విమలకు పెండ్లి చేయాలని ఉంది.

అవధాని వెంటనే ఇంగ్లాండు పోవాలని ఉంది.కాని గురుమూర్తి సాగనివ్వలేదు. అయన విమలకు సంబంధం చూసాడు.అవధానికి ఇష్టంలేకున్నా విమల గురుమూర్తి మీదున్న గౌరవంకొద్దీ పెండ్లి కొడుకును చూడకుండానే మోహనరావనే అతన్ని పెళ్ళి చేసుకుంది.అతడు బుద్ధిమంతుడు. అయనకు మద్రాసులో మంచి ఉద్యోగం ఉంది.

ఇంగ్లాండు వెళ్ళకముందే,విమల పెండ్లికి ముందు అవధాని తన మేనమామల ఊరైన పర్లాకిమిడి వెళ్ళాడు.పెద్ద మేనమామ కూతురు సీత.తల్లిదండ్రులు లేనిది.చిన్నాయన పోషణలో ఉంది.లలిత.శారదలు,చిన్న మేనమామ వివేకానందుని కూతుళ్ళు.వయస్సులలో ముగ్గురికి ఒకటి,రెండేండ్లకంటె తేడాలేదు.యుక్త వయస్కులైన ఆ ముగ్గరూ అవధానికి నచ్చారు. వివేకానందుడు లలితను అవధానికివ్వాలని ఆ మాటే దంపతులు అనుకొని అవధానిని అడిగారు. కాని అవధాని ఇంగ్లాండు పోయే తలంపులో ఉన్నాడు కాబట్టి వారితో ఇప్పుడే కాదన్నాడు.

అవధాని ఓ రోజు అంతా సర్దుకొని ఇంగ్లాండు వెళ్లి పోయాడు.విమల భర్తతో మద్రాసులో ఉండసాగింది.విమలకు ఇద్దరు పిల్లలు కలిగారు.అవధాని ఏడేండ్లు ఇంగ్లాండులో ఉండి ఐ.సి.యస్ చదివాడు.ఈ మధ్యన విమలకు ఎన్నో ఉత్తరాలు వ్రాసాడు.ఆ ఉత్తరాలలో అతడు విమల గురించి వ్రాసిన విషయాలు అతనిలోని సంస్కారాన్ని తెలుపుతాయి.

"విమల భారతదేశపు ఆత్మ.భారతదేశపు స్త్రీ శక్తి నిధానము.దేవతా స్వరూప.విమల వంటి యోగ్యశీలురు పాశ్చాత్యదేశాలలో నుండరు.తాను విమలకు అన్నగారుగా నుండుటకు పనికిరాడు." ఇలాంటి అభిప్రాయాలుంటాయి.

విశ్వనాథకు దేశభక్తి మెండు.భారతీయ సంస్కృతిపై చెప్పరాని అభిమానం. ప్రపంచం లోని అన్ని దేశాలకంటె ఉన్నతమైన సంస్కృతి భారతదేశంలోనే ఉందని,ఆ సంస్కృతే భారతీయుని మహాత్మునిగా చేస్తుందని విశ్వాసం.ఏ వ్యక్తిలో భారతీయ సంస్కృతి నిండుగా ఉంటుందో ఆ వ్యక్తులే చరిత్రను సృష్టిస్తారనీ విశ్వనాథ అభిప్రాయం.వీరి నవలల అన్నింటా భారతీయ సంస్కృతిపట్ల ఇదే ఆత్మీయతా భావం కనబడుతుంది.

అవధాని ఇంగ్లాండులో చదువు ముగించుకొని వచ్చాడు.రాగానే విమల ఇంటికి వెళ్ళాడు.అవదాని వేషభాషలు చూసి విమల ఆశ్చర్యపోయింది.మెల్లగా అతన్ని మార్చింది. అతనితో తండ్రి సాంవత్సరీకం పెట్టించింది.అవధానికి ఇంగ్లాండు అనుభవాలతో విమలమీద మరింత విశ్వాసం,గౌరవం,పెరిగాయి.తన జీవితానికి ఆదర్శం విమల చెప్పినట్లు వినటం. ఆచరించట

ఆమెను సంతోషపెట్టటం,ముఖ్యమని భావించాడు.అందుకే తన అలవాట్ల తీరు మార్చుకున్నాడు.

చీకటివల్ల వెలుగు యొక్క ప్రాధాన్యం తెలుస్తుంది.చెడువల్ల మంచితనం గుర్తింపు కొస్తుంది.అదే విధంగా ఒక దేశపు గొప్పతనం,సంస్కృతి,సంప్రదాయం,మరోదేశపు సంస్కృతి, నాగరికతతో పోల్చి చూసినపుడు,ఆయా దేశాల్లోని ఆచార వ్యవహారాలతో బేరీజు వేసుకున్నపుడు ఏది మంచిదో,ఏది చెడ్డదో,తెలుస్తుంది.

అవధానికి ఇంగ్లాండులోని ఏడేండ్ల అనుభవంతో భారతీయ సంస్కృతి యొక్క గొప్పతనం తెల్సింది.అటువంటి గొప్ప సంస్కృతిలో రూపుదాల్చిన మూర్తి విమల.అందుకే ఆమెను భారతీయ ఆత్మగా భావించి గౌరవం పెంచుకున్నాడు.అనగా భారతీయ సంస్కృతి పట్ల స్త్రీలపట్ల అవధానికి గౌరవం పెరిగిందని చెప్పవచ్చు.అంతేగాక ఉత్తరాలలో తాను విమలకు అన్నగా ఉండే యోగ్యత తనకులేదని వ్రాసాడంటే తాను భారతీయునిగా ఉండే అర్హత కోల్పోయాడని అర్థం.అనగా భారతీయతకు తలవంపు తెచ్చే పనేదో అతడు చేసాడని భావం.ఆ భావనే అతని మనస్సును కలిచివేస్తుండగా విమలకు ఆ విధంగా ఉత్తరాలు వ్రాసాడు.ఏ తప్పు చేయనివాడే అయ్యుంటే విమలకు అన్న అయినందుకు గర్వపడేవాడు.ఆనందించేవాడు. కాని అలా కాకుండా విమల ముందు తలవంచాడు.అనగా భారతీయ ఆత్మముందు తలవంచాడు అవధాని.

ఇంగ్లాండులో ఉన్నపుడు అవధాని 'నెల్లీ' అనే పాశ్చాత్య స్త్రీని వివాహమాడాడు.ఆమెతో సత్సంబంధాలు చెడిపోవటంవల్ల అవధాని ఆమెను వదిలించు కోవాలనుకున్నాడు.కాని వీలు కాలేదు.ఒక సంవత్సరం వరకు వారిద్దరు ఏ సంబంధంలేకుండా కాలం గడిపారు.అవధాని విడాకులకు ప్రయత్నించగా నెల్లీ ఒప్పుకోలేదు.అవధాని భారతదేశం వచ్చాక రెండు సంవత్సరాల్లో అక్కడికి వస్తానని నెల్లీ ఉత్తరం వ్రాసింది.నెల్లీ ఎప్పుడు వచ్చి తన బ్రతుకు బండారం బయట పెడ్తుందోనని అవధానికి భయంగాఉంది.విమలకీ విషయం ఇప్పుడిప్పుడే తెలియరాదని, సమయం వచ్చినపుడే చెప్పాలని అవధాని భావన.

అవధానికి ఉద్యోగంలో చేరటానికి ఇంకా సమయం ఉన్నందువల్ల మేనమామల ఊరు పర్లాకిమిడి వెళ్ళాడు.అవధాని వచ్చాడని వారి ఆనందానికి అవదుల్లేవు.ఇంగ్లాండులో ఐ.సి.యస్ చదివి వచ్చాడు.పైగా నేడో,రేపో,కాబోయే కలక్టరు.మేనమరదళ్ళ ఉత్సాహం చెప్పనక్కరలేదు.అతన్ని చేసుకునే అదృష్టం ఎవరికుందో?లలిత,శారదలు పోటీపడుతూ అవధానికి దగ్గర కావాలని ప్రయత్నాలు చేయసాగారు.సీత అమాయకురాలు.ఆమె ఎక్కువగా కల్పించుకోలేదు.

అవధాని సామాన్యుడు కాదు.సులభంగా దొరికేదానిని వదిలిపెట్టేవాడుకాదు.పైగా చేయాలనుకున్న పని ఏదైనా సరే పట్టుబట్టి సాధించే గుణం అతనిలో ఉంది.అవధాని,శారద, వాహ్యాళికి వెళ్లారు.శారదతో ముచ్చటిస్తూ అవధాని ఇంగ్లాండు విషయాలు చెప్పసాగాడు.అక్కడి స్త్రీల గురించి,వారి సంస్కృతి గురించి,వారు పురుషులతో ఎంత అన్యోన్యంగా కలిసి పోతుంటారో

చెప్తూ శారద చెయ్యి పట్టికొని తన వైపు లాక్కున్నాడు. శారద విస్తుపోయింది. అదో రకంగా చూసింది. అవధానికి భయం వేసింది. శారద పది నిమిషాలు మాట్లాడలేదు. అవధానికి ముచ్చెమటలు పోశాయి. తిరిగి శారద నవ్వింది. అవధానికి ధైర్యం కలిగింది. శారద లొంగుతుంది అనుకున్నాడు. కాని ఆమె లొంగలేదు.

పర్లాకిమిడి ప్రజలు అవధానికి స్వాగతసభ ఏర్పాటు చేసారు. ఆ సభలో అవధానిని గౌరవించి,వివేకానందుని స్నేహితుడొకడు పెద్ద ఉపన్యాసమిచ్చి,విచిత్రంగా 'లలితావధాన్ల' గురించి ఒక ప్రకటన చేసాడు. వారిద్దరి మెడలో పూలహారాలు వేసాడు. ఆ సమయంలో లలితకు అవధానికి వివాహమైనట్లుగా సభికులనుకున్నారు. ఈ హఠాత్సంఘనతో అవధానికి చెమటలు పోసాయి. అతనిలోని అంతరాత్మ వెక్కిరించినట్లు అనిపించింది. ఆ సమయంలో లేచి 'వలదు వలదు ఆమెను నేను వివాహము చేసుకొనుటకు వీలుపడదు' అని అనాలని అనిపించింది. కాని అనలేకపోయాడు.

అవధాని సభ జరిగినంతసేపూ మౌనంగా ఉన్నాడు. అందరు అతనిది దొరతనం అనుకున్నారు. ఆ సాయంత్రమే అవధాని లలితలు షికారుకెళ్ళారు. అవధానికి ఉత్సాహంగా లేదు. లలిత,అవధాని మౌనానికి విస్తుపోయింది. లేని ఉత్సాహం తెచ్చుకుంటూ ఏదో మాటాడ సాగాడు. బావ తనను దగ్గరగా తీసుకుంటాడని ఎంతో ఆశపడింది. కాని అవధాని ఆమె నుండి తప్పించుకుంటున్నట్లు మెదలసాగాడు. అతని మనసులో ఏదో తొందర. సులభంగా వచ్చేదానిని పొందే గుణంకల అతనిలోని అచిత్తు లలితను దగ్గరగా తీసుకోమంటూ కోరసాగింది. అంతరాత్మలో విపరీతమైన భయం. తనలోని ఉద్రేకాలను అణచుకోవటానికి అవధాని తంటాలు పడసాగాడు. "లలితా ! నీయందు నాకు ప్రేమలేదు.'అందామనుకున్నాడు. కాని 'లలితా ! నా యందు నీకింత ప్రేమా?'అంటూ అనుకోకుండా ఆతని చేతులు లలితను ఆలింగనం చేసుకో బోయాయి. కాని చాలా ప్రయత్నంతో నిగ్రహించుకొని ఆమెను చూసి నవ్వాడు. ఆ నవ్వును చూసి లలిత బావ తనని ప్రేమిస్తున్నాడనుకొంది.

లలిత ముందు అవధాని చిత్రవధ అనుభవిస్తున్నాడు. అతని అంతరంగంలో ఘర్షణ ప్రారంభమైంది. అచిత్తు,అధ్యహంల ఒత్తడి అహంమీద పనిచేయసాగింది. అచిత్తును అణచలేక తనను తాను నిలదొక్కు కోవటానికి అవధాని విశ్వప్రయత్నం చేస్తున్నాడు. అతనిలోని కామవాంఛ రెచ్చగొట్టసాగింది.

లలిత అవధానికి మరింత చేరువకావాలని దగ్గరగా వచ్చింది అవధాని నరాలు తెగిపోతున్నాయి. "ఆ సమయంలో నామెను కౌగలించుకొని ముద్దాడకుండా నుండుటకు శుకయోగి కున్నంత నిగ్రహము కావాల్సియుండెను. అవధాని ...లలితా ! నాకు వివాహంమీద బుద్ధిలేదు' అన్నాడు(94), లలిత దూరంగా జరిగింది. లలితా ! నీకు నా మీద ప్రేమయున్నదా? అని అడిగాడు. "లలిత అప్రయత్నంగా అవధాని దగ్గరగా పోయి అతనిని కౌగలించుకొనెను." ఆతడు

తత్కాల జనితావేశ పరంపరా వశంవదుడై ఆమెను కౌగలించుకొని ముద్దాడెను.వెంటనే ఆతడు కౌగిలి వదల్చుకొని దూరముగా బోయెను "(95).

అవధాని తెలిసి,తెలిసి, మరోతప్పు చేయదలచు కోలేదు.ఒక తప్పు చేసినందుకే కుమిలి చస్తున్నాడు.అంతరాత్మ మాటిమాటికి వేలెత్తి చూపిస్తూ భయపెడ్తూ ఉంది.వెంటనే లలితావధాన్లు ఇంటిముఖం పట్టారు.ఆమె ఆతడేమీ చేయనందుకు అతని గొప్పతనంగా భావించింది.ఆమెకు అవధానిమీద మంచి నమ్మకం, ప్రేమ ఏర్పడింది.ఇంటికి వెళ్ళినా ఇంట్లో అవధాని చుట్టే ఆమె మనసు తిరగసాగింది.అవధాని కౌగలింతకు ఆమె అతనికి దగ్గరగా రావాలని రహస్యంగా ఎన్నోసార్లు ప్రయత్నించింది.కాని అవధాని లలితను తప్పించుకుంటూ తిరగసాగాడు.ఆమె చొరవకు అవధాని భయపడ్డాడు.తనను తాను నిగ్రహించు కోలేక,మనస్సును అదుపులో పెట్టలేక, వెంటనే ఎవరితో ఏమీ చెప్పకుండానే సర్దుకొని వెళ్ళి పోయాడు.ఇంట్లోని వారంతా ఆతని ప్రవర్తనకు ఆతని గొప్పతనంగా సరిపెట్టుకున్నారు.

అవధానికి కలెక్టరుగా కాకినాడలో పోస్టింగ్ వచ్చింది.అప్పడు, అవధానికి దూరం అయిననుండి కాకినాడలో ఉంటూ తన వృత్తిలో మంచి ప్రావీణ్యం సంపాదించాడు.ఇప్పుడు అతడొక ముఠానాయకుడు.వానికి రాబడికూడా బాగానే ఉంది.అవధాని కాకినాడకు కలెక్టరుగా వచ్చాడని తెలియగానే వానికి చెప్పలేనంత ఉత్సాహం కలిగింది.వెంటనే వెళ్ళి అవధానిని కలిసాడు. అవధానికిష్టం లేకున్నా చిన్ననాటి స్నేహితుడు,కలిసి తప్పుడు పనులు చేసారు బాగుండదని అప్పనితో మాటాడాడు.తన సంగతంతా అప్పడు అవధానితో చెప్పుకున్నాడు.

అప్పడు శృంగార పురుషుడు.వానికి లీల అనే స్త్రీతో సంబంధం ఉది.'అదివరకు అప్పనికి తనకనుకూలమైన,సులభమైన,తక్కువ జాతి స్త్రీలమీదనే మనస్సు.కాని రెండు నెలల నుండి ఆతని మనస్సుపెద్ద,చిన్న,ఉత్తమ.మధ్యమ,అధమ కుటుంబములన్న వివక్షలేకుండా పరుగెత్తు చుండెను."(108).ఈ విధమైన పరస్త్రీ వ్యామోహం అప్పనిలో పెరిగిపోయింది.

అప్పడు రాముని కూతురు సీతను ప్రేమించాడు.దాన్నే పెండ్లాడాలని వాని నిశ్చయం. కాని అప్పడు సులభంగా వచ్చేదానిని వదిలిపెట్టే రకంకాదు.ఇదంతా అవధానికి చెప్పాడు. అవధానికి అప్పని చరిత్ర విచిత్రంగా తోచింది.వాని మనస్తత్వం,తన మనస్తత్వం ఒక విధంగానే ఉన్నట్లు అనిపించింది.తాను సీతనే పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నాడు.తన మనస్సు ఎందుకో లలిత, శారదలను కాదని సీతవైపే మరలింది.తనకు నెల్లీతో సంబంధముంది. తనలాగే అప్పడు చేరవచ్చిన అవకాశాన్ని జారవిడుచు వాడుకాదు.

అవధానికి చాలా రోజుల తర్వాత సెలవులు వచ్చాయి.పర్లాకిమిడి అంటే భయంగానే ఉంది.కాని అక్కడ సీత ఉంది. అవధానికి తెలియకుండానే అతని మనసు సీత వైపు పరగులు తీసింది.ఆవిధంగా ఎందుకు జరుగుతుందో అతనికే తెలియదు.ఏదో అజ్ఞాతశక్తి తనను సీతవైపు

ఆకర్షిస్తోంది.చేరువగా వచ్చిన లలిత,శారదలను కాదన్నాడు.వారెంత ప్రేమ చూపించినా తన మనస్సు వారిని కాదంటున్నది.సీతతో ఎక్కువ కాలం గడుపుకున్నా మనస్సెందుకో ఆమె నీ భార్యయని చెప్తున్నట్లుంది.భయం అనిపించినా అవధాని పర్లాకిమిడి వెళ్ళాడు.

ఉత్తరం ఏదీ లేకుండా,హఠాత్తుగా వచ్చిన అవధానిని చూసి అందరూ ఆశ్చర్య పోయారు.లలిత ఈ మధ్యన అవధానిని గూర్చి ఆలోచించటం మానేసింది.ఎందుకో ఆమెలో అవధాని మీదున్న ప్రేమ క్రమంగా తొలిగిపోయింది.శారదకు అంతగా ఉత్సాహం లేదు.సీత మామూలుగా ఉంది.అవధాని మనసుమాత్రం సీతమీద ఉంది.సీతను జాగ్రతగా చూసాడు. సీతలో అతనికి తెలియని అందమేదో కనబడసాగింది.క్రమంగా తన హృదయం సీతకొరకు పరితపిస్తున్నట్లు అనుకోసాగాడు.సీతతో మనస్ఫూర్తిగా మాట్లాడాలని ఉంది.కాని వీలు దొరకటం లేదు.లలిత,శారదలతో చనువుగా తిరిగిన అవధాని సీతతో చనవుగా మాటాడాలన్నా ఏదో భయం వెంటాడసాగింది.శారద ఎన్నోరోజులనుండి సీతను గమనించసాగింది.ఆ ఇంట్లో సీత స్థానం ఏమిటో,సీతపెండ్లి ఇంట్లో వారికి ఎంత కష్టంగా ఉంటుందో శారదకు బాగా తెలుసు.శారద హృదయం కుసుమ కోమలం.సీత మనసును కనిపెట్టి ఆమెకు అవధానియే తగినవాడని నిశ్చయించుకుంది.ఏ విధంగానైనా అవధాని సీతను చేసుకునేటట్లు చేయాలని నిర్ణయించుకుంది.

శారద అవధాని ఒకరోజు షికారు వెళ్ళారు.శారద అవధానిని సీత గురించి అడిగింది. అతడు ఆమెతో ఈవిధంగా అన్నాడు."సీతయా ! సీత. ఆమె సనాతని.ఈ దేశములోని ఆత్మ. ఆమెకు బుట్టుక లేదు.చావులేదు.ఆమె ఎవని చెంతచేరునో అతడు నిత్యజీవి.వానికి నాలుగు పురుషార్థములు గలవు"(125).శారదకూడా సీత గురించి చాలా ప్రశంసించింది.ఆమె అవధానితో ఇలా అంది."భాకతదేశములో జన్మించినంత మాత్రాన అందరు స్త్రీలును భారత స్త్రీలు కాజాలరు. భారతదేశ మత సాంఘిక, ఆచార వ్యవహారాలు జీర్ణించిన స్త్రీ మాత్రమే భారతదేశ స్త్రీ.వారిలో సీత తలమానికము.నీవు సీతను పెండ్లాడుము.నాన్నకు,అమ్మకు,కోపము వచ్చును.లలిత కొంచెము దుఃఖించును.వారందరికి నేను సర్ది చెప్పుదును."(130). దానికి అవధాని ఇలా అన్నాడు."సీతను పెండ్లియాడుటకు సర్వదా ప్రయత్నింతును.సీత రత్నము వంటిది.సానలు తీరిన జాతి రత్నము."

సీతతో అవధాని చనువుతో ఉండసాగాడు.సీత మనసును తెలుసుకున్నాడు.కావాలని ఒక రాత్రి సీతను దగ్గర తీసాడు.అతనిలో భయం మొదలైంది.సీతకు ఆ ఇంట్లోగల స్థానాన్ని గుర్తించాడు.ఆమె అన్ని విధాల ఆ ఇంట్లో అనాదరణకు గురైనట్లు గ్రహించాడు.సీతను,శారదను మద్రాసులో నున్న విమల ఇంటికి పంపి తాను తిరిగి కాకినాడకు వచ్చాడు.రెండు నెలలయింది. అవధాని మనస్సు సీతమీదే నిలిచింది.ఇంతలో సీత ఒక ఉత్తరం వ్రాసింది.అందులో ఇలా ఉంది. "బావా ! నీవు నన్నొక వ్యూహంలో నిరికించితివి.నేను అమాయకురాలినై ఈ వ్యూహంలో నడిమికి వచ్చువరకు నిది వ్యూహమని తెలుసుకొన లేకపోయితిని.నీకు నా హృదయంతో

నమ్ముడుపోవుట,పోయినచో మూలమట్టముగా దోచియిచ్చుట.నన్ను ఈ వ్యూహములో అభిమన్యు వధ చేయకుము. నీ సీత."(141).

ఆ ఉత్తరాన్ని అవధాని వందసార్లు చదివాడు.సీత తనను ప్రేమిస్తుందని గుర్తించాడు. అభిమన్యు వధ తనకా?లేక సీతకా? తన హృదయంలోని మానసిక వేదన సీత గుర్తించ గలుగునా? సీత,తనను తప్పకుడా క్షమిస్తుంది.లలిత,శారదలు తన సంగతి తెలిసినచో క్షమించ జాలరు.సీత బారతదేశపు స్త్రీ. క్షమాగుణం ఆమె జన్మహక్కు.సీతను పెండ్లియాడినచో తన జీవితం బాగుపడును. వెంటనే సీతను పెండ్లియాడవలయును.ఆలస్యం చేసినచో సీతకు వేరే పెండ్లి చేయగలరు.ఇక ఆలస్యం చేయకూడదు అనుకున్నాడు అవధాని.

మానసిక అశాంతికి లోనైన అవధానిని అప్పడు వచ్చి కలిశాడు.వాణ్ని చూడగానే తన నీడ తన ఎదురుగా నిల్చున్నట్లు అనుకోసాగాడు."వాని జీవితము,తన జీవితము రెండు విడదీయ రాని ప్రవాహములా?వానినుండి తాను త్రెంచుకొనుటెట్లు?"

మరోవైపు నెల్లీ వస్తానన్న సమయం రానే వచ్చింది.అది వచ్చి తనపరువు తీస్తుందోమో నన్న భయం అవధానిని పీడించసాగింది.అప్పడు వచ్చి మాట్లాడుతున్నపుడు వాని మాటలు తనను వెక్కిరిస్తున్నట్లుగా ఉంటున్నాయి.వానికి లీలతో గల సంబంధం,తనకు నెల్లీతోగల సంబంధాన్ని గుర్తుకు తెప్పించ సాగింది.అప్పడు సీతను ప్రేమించాడు.సీత బీదది.దాన్నే పెండ్లి చేసుకోవాలి అనుకుంటున్నాడు.తనసీత బీదది.దిక్కులేనిది.తన మనస్సుకూడా సీతనే పెండ్లి చేసుకోమని చెప్తుంది.సీత ఉత్తరం తనను మరీతొందర సెట్టసాగింది.ఏదో నిర్ణయం తొందరగా తీసుకోలేక పోతే సీత నీకు దక్కదని మనస్సు హెచ్చరించసాగింది.

అవధానిలో తొందర ఎక్కువై వివేచనాశక్తి నశించింది."ఏది ఎట్లయినను సరేయన్న తీవ్ర సాహసము పొందెను "సీతా వియోగం తాను భరించలేడు.సీతను వెంటనే వివాహ మాడలేడు.ఏదో ఒకటి పరిష్కారమయ్యేవరకు తానుండలేడు.మనసుకు వాంతిలేదు.సీతను ప్రేమిస్తున్నాడుగదా ! ప్రేమిస్తూ ఇట్లు ఎంతకాలమైనా ఉండలేడా?ఉండటం సాధ్యమేనా? ఎందుకు సాధ్యం కాదు?సీతను కలువకుండా,చూడకుండా,ప్రేమిస్తూ అట్లాగే ఎందుకుండలేడు ఉండలేవని మనస్సు చెబుతోంది.ప్రేమలో అంత బలం ఉందా?ప్రేమ మానసికమా?శారీరకమా?ప్రేమంటే ఏమిటి?ప్రేమకు శారీరక సంపర్కం అవసరమా?ఈ విధంగా అవధాని ఆలోచనలు విచిత్రంగా సాగాయి.ప్రేమ గురించి అతడాలోచించ సాగాడు.

"మనుష్యుడెంత మనోభావమున కధీనుడైనను శరీరమునకు దాని బలము దానికే యున్నది..అవధానికి సీతయందు కలిగిన ప్రేమభావము సంపూర్ణముగా మనస్సుదే ఐనను శరీరములో దానికి కొంతభాగము లేకపోలేదు.స్త్రీసుఖము సర్వముగా మనోవిషయమే యని ప్రేమ సిద్ధాంతమెంత ఘోషించినను ఆ మానసిక సుఖము శరీరగతేంద్రియ వాంఛా తత్పరణము

వలన మనస్సునకు కలుగు నుత్కృష్ట స్థితిగాని,భగవంతుని యందలి భక్తివలె అశరీర సంపర్క విషయముగాదు.ఈ ప్రేమ యట్టిదియు నగునేని తత్ప్రేమ విషయము స్త్రీ కానక్కరలేదు. ప్రథమదశయందు స్త్రీ.ఉత్తరదశలలో స్త్రీ సంబంధ భావము లేదనుటకు వీలులేదు.అప్పుడు శరీరబలము నొప్పుకొనుట యగును.అవధానికి నీ ప్రసక్త ప్రదేశములందు, వ్యర్థవేదాంతములు తడవుట చేతగాదు.అతడు శరీరము యొక్క సుఖాసుఖములు పరిగణించు వాడు.లౌకికములైన సుఖాసుఖములకు శరీరాతీత వ్యర్థ వేదాంతములకు ముడిపెట్టడు.తాను స్త్రీ విరహితుడై ఇంక బ్రతుకలేడు.అందుచేత నసాధు స్త్రీ సంపర్గ దోషమాచరించలేడు.తాను మనసా వరించిన తన యాత్మ గోరుచున్నదేమో యన్న స్త్రీనుండి దూరమున నుండలేడు."(150)

విశ్వనాథ అవధాని మనస్తతత్వాన్ని ప్రేమతత్వానికి అనుగుణంగా మలచుకొని పై వివరణలో రెండు విషయాలు చెప్తాడు.

శారీరక సుఖమాశించి ఉండే బలవత్తరమైన ప్రేమ మొదటిది.ఇది అచిత్తుకు లోబడి మనస్సును కృంగదీసే కాముకత గలది.ఇక రెండవది,శారీరక సుఖమాశించక అధ్యహంతో ముడివడి ఉండే మానసిక ప్రేమ.ఇదే ఆరాధనా భావాన్ని పొందేది.ఏరవీర నవలలో నాలుగు పాత్రల మధ్య నలిగిన ప్రేమ రెండవ రకందే.

కామపూర్వకమైన ప్రేమ తాను కామించిన స్త్రీ శరీరస్పర్శచే తృప్తి పొందుటకు ప్రయత్నిస్తుంది.శారీరకమైన దగుటవల్ల కేవలం శారీరక సమాగమంతో కామం తీరుతుంది. అటువంటి కామాన్ని సాదారణంగా అసాధు స్త్రీతోనైనా పురుషుడు,లేదా పురుషుని తోనైనా స్త్రీ తీర్చుకోవచ్చు.అందులో ప్రేమ ఉండదు.శారీరక వాంఛమాత్రం తీరుతుంది.కాని కొందరి విషయంలో శారీరక వాంఛ తీరనప్పుడు ఆ ప్రేమను మానసికంగా బలవత్తరం చేసుకొని శారీరక వాంఛలను అణగద్రొక్కుకొని తమ ప్రేమను ఆరాధనా భావంగా మార్చుకుంటారు.లేదా జీవితాన్ని త్యజిస్తారు.ఆరాధనగా మారిన ప్రేమ శారీరక సుఖమాశించక త్యాగపూరితంగా ఉంటుంది.భక్తి లేదా సేవాభవం పొందే ప్రేమకు ఇది వర్తించదు.

విశ్వనాథ తానాశించిన ఉద్దేశానికి,కథావస్తువును,అనుగుణంగా పాత్రలను మలచటం అయన రచనలోని విశేషం.ఇక్కడ అవధానిని స్పర్శసిద్ధాంతానికి ముడిపెట్టాడు.స్పర్శసిద్ధాంత వివరణ ఇంతకు ముందే ఏకవీర నవలలో ఇవ్వబడింది.

## 2) అవధాని మనస్తత్వంలో స్పర్శానుభూతి.

కేతవరపు రామకోటిశాస్త్రిగారు' విశ్వనాథ వైఖరి' అను గ్రంథంలో ఇట్లా చెప్తాడు.

"విశ్వనాథ ఆచరణయోగ్యతకు నోచుకోని కొన్ని ఆచారాలను,కొన్ని విశ్వాసాలను,అదే పనిగా ఒక తర్కాన్ని పెంచి నిరూపించటానికి గట్టి ప్రయత్నం చేస్తాడు.మగవాడు ఎంత వయస్సులో నున్నా చిన్నపిల్లను పెళ్ళి చేసుకునే ఆచారాన్ని,అన్ని జన్మల్లోను ఆ స్త్రీ పురుషులే భార్యాభర్తలుగా

అవుతుంటారన్న విశ్వాసాన్ని ఆయన తీవ్రాభినివేషంతో నిరూపిస్తాడు."(వి.వై.పుట. 27.)

విశ్వనాథకు వివాహవ్యవస్థమీద గాఢమైన నమ్మకం ఉండటానికి గల కారణం,అన్ని జన్మలలోను ఆ స్త్రీ పురుషులే భార్యాభర్తలుగా ఉంటారన్న విశ్వాసమే.దానికి విశ్వనాథ స్పర్శ సిద్ధాంతాన్ని ముడిపెడ్తారు.ఈ నవలో కూడా అవధాని మనస్తత్వంలో స్పర్శానుభూతిని ప్రవేశ పెట్టి తద్వారా అవధాని సీత అనేక జన్మలనుండి భార్యాభర్తలుగా ముడిపడి ఉన్నారని చెప్తాడు.

అవధాని ఇంగ్లాండులో 'నెల్లీ'అనే యువతిని పెండ్లి చేసుకున్నాడు.నెల్లీ ఒక సామాన్య స్త్రీ.అవధానికి అంతకు పూర్వం స్త్రీ సంగమం తెలియదు.యవ్వనంలో పుట్టిన కామేచ్ఛ వల్ల నెల్లీని కలుసుకోవటం,వివాహం చేసుకోవటం,జరిగింది."ఆమెను వివాహమాడుటయు,నొక్క నెల దినములలో జరిగెను.వివాహమైన తదుపరి మూడు గంటలలో తాను చేసిన దోషము తెలిసెను.తెలిసి ఏమి లాభము?అయినను ఆ తెలియుట ఏమి తెలియుట?దీనివలన బహిః పరిస్థితులలో తాననుకొనిన క్రొత్త కలతలు కలుగుననియే తెలిసెను కాని యా వివాహము తన యాత్మకే,తన రుచికే,తన స్వరూపానికే,అంత వ్యతిరేక విషయమని ఆతనికప్పుడే తెలియలేదు.ఒక ఏడాది గడిచిన తరువాత నతనిలో నున్న భారతదేశపు పురుషభావము,నెల్లీలో నున్న పాశ్చాత్యదేశ స్త్రీ స్వభావముతో సమసించదని తెలుసుకొనెను."(152).

విశ్వనాథ అవధాని మనస్తత్వాన్ని ప్రారంభంలో రెండు విధాలుగా పేర్కొన్నాడు. "అవధాని యందు ప్రకృతి ద్విధా విభక్తమైయున్నది.పట్టి బలవంతము చేసి ఇంగ్లీషు భాషను బహునిరోధముల కెదురు నడిచి సంపాదించిన పట్టుదల యొకటి,సులభలభ్యమైన దానిని తొణుకు బెణుకు లేకుండా నపహరించు ప్రకృతియొకటి,(28).

మొదటిది అహానికి సంబంధించింది కాగా రెండవది,అచిత్తుకు చెందినది.అవధాని పట్టుదలతో ఇంగ్లీషుభాషలో ప్రావీణ్యం పొంది,ఇంగ్లాండు వెళ్ళి ఐ.సి.యస్ చదివి ప్రయోజకు డవుట.అక్కడే నెల్లీని పెండ్లాడి అంతలోనే పశ్చాత్తాపపడుట.అనే రెండు సంఘటనలు ఆతని మనస్తత్వాన్ని పట్టిస్తున్నాయి.ఇక్కడే విశ్వనాథ అవధాని మనస్తత్వంలో 'స్పర్శానుభూతిని' ప్రవేశపెడ్తూ, 'వివాహమైన తర్వాత మూడు గంటలలో అతనికి తాను చేసిన దోషము తెల్సిందనీ,ఆ వివాహం తన యాత్మకే,తన రుచికే,తన స్వరూపానికే అంతా వ్యతిరేకమనీ,ఒక ఏడాది గడిచిన తర్వాతగాని తెలియలేదని,భారతదేశపు పురుషభావం నెల్లీలోని పాశ్చాత్య స్త్రీ భావంతో సమసించదనీ,విశ్వనాథ తన సిద్ధాంతానికి అనుకూలంగా అవధాని మనస్తత్వాన్ని మలిచాడు.ఇక్కడ అవధానిలోని పురుషాంశ,నెల్లీలోని స్త్రీ అంశతో స్పర్శానుభూతిని పొంది అది వ్యతిరేక స్త్రీ అంశగా తన యాత్మ గుర్తించినట్లుగా అవధాని గ్రహించినట్లు విశ్వనాథ చెప్తాడు.అనగా స్పర్శ సిద్ధాంతం ద్వారా అవధాని,నెల్లీ తన జీవిత భాగస్వామి కానేరదని గుర్తిస్తాడు.అమెతో తనకు జన్మజన్మల సంబంధం లేనట్లు భావిస్తాడు.అందుకే ఆమెను తొందరగా వదిలించు కోవాలని విడాకులకు

ప్రయత్నిస్తాడు. భారతదేశం వచ్చినా తానొక తప్పుచేసిన వాడిలా బాధపడ్తూ చెల్లెలు చెప్పినట్లు వింటూ కాలం గడుపుతాడు. ఇంతలో ఆతని మనసు ముగ్గురు మరదళ్ళ వైపు పరుగులు తీస్తుంది.

శారదతో అవధాని పరిచయం,ఆమె చొరవ అతనిలోని ఉద్రేకాలకు అచిత్తు కారణ మౌతుంది. మాటల సందర్భంలో అవధాని శారద చేయిపట్టుకొని లాగుతాడు. శారద వెంటనే తన చేతిని వెనుకకు లాక్కుంటుంది. 'ఆమె మొగములో నొక దూరభావము వెంటనే తోచెను. అవదాని ఆమె ప్రకృతిలో నున్న బిగువు గ్రహించి గ్రహించని వానివలె యూరకే తను చెప్పుచున్న కథారస నిమగ్నుని వలె నటించెను. మరల నామెను తాకలేదు."(86).

ఈ వివరణలో "ఆమె ప్రకృతిలోనున్న బిగువు గ్రహించి' అని చెప్పుటలో,అవధాని శారద స్పర్శవలన తన ఆత్మకు వ్యతిరేకమైన స్పర్శానుభూతి పొందినట్లుగా చెప్పుచు మరల నామెను తాకలేదు,అని చెప్పాడు. ఈ అనుభవంతో అవధాని,శారద తన భాగస్వామి కాజాలదనీ నిర్ణయించుకున్నాడు. శారద అవధానితో ఎంత చనువుగా ఉన్నా అతడు తిరిగి ఆమెను తాకలేదు.

అవధానికి పర్లాకిమిడిలో స్వాగతసభ ఏర్పాటుచేసిన సందర్భంలో జరిగిన సంఘటన అతనికి విచిత్రానుభూతిని కలిగించింది. ఆ సభలో మేనమామ స్నేహితుడొకడు అవధానిని ఆశీర్వదించి అతని మెడలో,లలిత మెడలో,పూలమాలలు వేసి వీరు త్వరలోనే వివాహమాడ బోదురని ప్రకటించాడు. "అవధాని ,తనకును లలితకును నొకసారిగా పూలమాలలు వేయుటవలన మనస్సులో నొక కలవరము కలిగెను."(91), చూసిన వారంతా వారివురికి వివాహమైనట్లే భావించారు. శారద,సీతలు సంతోషించారు.

లలిత అవధాని వాహ్యాళికి వెళ్ళిన సందర్భంలో ప్రేమగా లలిత అవధాని దగ్గరకు కావాలని ప్రయత్నించినది. అవధాని ఆమెను కౌగలించుకోబోయి నిగ్రహించుకొని నవ్విన నవ్వులో అతని ప్రేమను దర్శించిన లలిత కావాలని అవధానిని కౌగలించుకొన్నది. ఆవేశం ఆపుకోలేక అతడామెను ముద్దుపెట్టుకుంటాడు. వెనువెంటనే కౌగిలి వదిలించుకొని దూరం జరుగుతాడు. ఈ విధమైన అనుభవం అతనికి మరోసంగతి తెల్పినట్లయింది. స్పర్శానుభూతి ద్వారా అతడు లలిత తనకు భాగస్వామి కాజాలదనీ తెలుసుకున్నాడు. అమెకు దూరంగా ఉంటూ తన మనస్సును సీతవైపు మరలించాడు.

శారద అవధానితో సీతను పెండ్లి చేసుకొమ్మని చెప్పినపుడు"సీతను పెండ్లియాడుటకు సర్వథా ప్రయత్నింతును. సీత రత్నము వంటిది. సానలు తీరన జాతి రత్నము."అన్నాడు. అవధాని మనస్సులో సీత దివ్యభావంగా ముద్రించుకొని పోయింది. అతనికి "సీతను పెండ్లి యాడనిచో తన ప్రేమలోకమున నిప్పంటుకొని మాడిపోవుచున్నట్లు కన్పించు చుండెను." చివరకు సీతనే జీవితభాగస్వామిగా,సర్వస్వంగా భావించి ఆమెను ప్రేమించసాగాడు.

## 3) అవధాని మనస్తత్వంలో ప్రేమానురాగాలు.

విశ్వనాథ అవధాని పాత్రద్వారా లోకంలో భార్యాభర్తల సంబంధం అనేక జన్మలనుండి సంక్రమించే లక్షణంగా నిరూపించి చెప్పటానికి రెండు మార్గాలను ఎన్నుకొని వాటిని తాత్వికంగా ఆలోచించి నిర్ణయించి చెబుతాడు. అందులో మొదటిది స్పర్శ సిద్ధాంతం. స్త్రీ పురుషులు స్పర్శద్వారా తమతమ భాగస్వాములను ఎన్నుకోవటం, స్పర్శ సిద్ధాంతంలోని విషయం. దీన్ని ఏకవీర, బద్దన్నసేనాని, తెఱచిరాజు నవలల్లో స్పష్టంగా చిత్రించాడు. ఈ నవలలో అవధాని స్పర్శద్వారా శారద లలితలను తన భాగస్వాములు కారని నిర్ణయించుకొని తన మనస్సును సీతవైపు మరలించు కున్నట్లు చూపిస్తాడు.

ఇక రెండవది 'ప్రేమతత్వం.". ఇదికూడా స్పర్శ సిద్ధాంతంలోని స్త్రీ పురుష అంశాలకు చెందినట్టిదే. యూంగ్ అనిమా, అనిమస్, అనే అంశలవల్ల లోకంలో స్త్రీ పురుషులు పరస్పరం ఆకర్షించుకుంటారనీ, చెబుతాడు. లోకంలోని ప్రేమికుల ప్రేమానురాగాలు, విడదీయరాని బంధాలు, ఒకరి కోసం ఒకరు త్యాగం చేసుకోవటాలు, ప్రేమ సఫలం కానపుడు ఆత్మహత్యా ప్రయత్నాలు, ఇవన్నీ ఈ ప్రేమ సిద్ధాంతంలోనివే. విశ్వనాథ ఈ ప్రేమతత్వాని కూడా అనేక జన్మలనుండి సంక్రమించే సంబంధలక్షణమనే తత్వాన్ని 'స్త్రీ పురుష' అంశాలద్వారా నిరూపిస్తాడు. ఇది రెండవ మార్గం. ప్రేమ-అనురాగం ఒకటే నని అందరూ అనుకుంటారు. యువతీయువకుల్లో తొలి చూపుల్లోనే ఆకర్షింపబడే గుణమేదో ఉంటే దాన్ని ప్రేమయనీ, అలా కాకుండా పరిచయా నంతరం, పరస్పర సన్నిహితత్వం వల్ల వారిలో క్రమంగా ఏర్పడే ప్రేమను అనురాగమనీ చెప్పుకోవచ్చు. విశ్వనాథ ప్రేమ సిద్ధాంతం కేవలం తొలిచూపులలోనే యువతీ యువకుల్లో కలిగే ప్రేమ విషయంలోనే అని నిర్ణయించుకోవచ్చు.

విశ్వనాథ ప్రేమసిద్ధాంతం ఏకవీర నవలలో 'ప్రేమతత్వం' వివరణ సందర్భంలో కొంత చెప్పబడింది. తొలిచూపులలో ఆకర్షితులై ఆ ఆకర్షణలో స్త్రీ పురుషులు మానసికానందాన్ని పొందుతారనేది విశ్వనాథవారి ప్రేమ వాదం. ఈ నవలలో కూడా అవధాని దీనాతిదీనమైన సీత చూపులతో ఆకర్షితుడై ఆమెను ప్రేమిస్తున్నట్లు చూపిస్తాడు. అయితే అతనిది సజాతీయమైన ప్రేమయని చూపటానికి అవధాని సీత స్పర్శను కోరుతున్నట్లు ఈ విధంగా వర్ణిస్తాడు.

అవధాని తనలో ఇట్లా అనుకుంటాడు. "తాను స్త్రీ విరహితుడై ఇంక బ్రతకలేదు. అందుకని నసాధు స్త్రీ సంసర్గదోష మాచరించలేదు. తాను మనసారా వరించిన తనయాత్మ కోరుచున్నదేమో యన్న స్త్రీనుండి దూరమున నుండలేదు. అవధానికి సీత యందు కలిగిన ఈ విపరీత ప్రేమ భావము సంపూర్ణముగా మనస్సుదే యైనను శరీరములో కొంతభాగము లేకపోలేదు.

ఈ విధంగా విశ్వనాథ అవధానికి సీతయందుగల ప్రేమ మానసికైనదే అయినా అతడీవరకే నెల్లీతో శారీరక సుఖానుభవం పొందిన వాడగుటచే అటువంటి సుఖానుభూతి

సజాతీయ స్త్రీతో పొందటానికి ఇప్పుడు అవధాని తొందర పడుతున్నట్లు చిత్రిస్తాడు.

అవధాని వెంటనే పర్లాకిమిడి వెళ్ళి సీతను చూసాడు.సీత సమక్షంలో అతని మనస్సు ఆనందంతో,భయంతో విపరీతమైన ఆంధోళనకు గుర్తైంది.

'అంతటి ఆతని ఉత్సాహమునకు తెలియకుండా నేదోయొక దోషభావము వాని మొగమునందు జేవురు రంగును కూడా కల్పించెను.ఆమె మొగము చూచినందువల్ల కలిగిన ఆనందోద్వేగములు తాను సీతను ఒక వ్యూహములోనికి మరింత సమాకర్షించుటకు వచ్చితినన్న విషాదోద్వేగము...తత్కాల ప్రణయజనిత మహావాంఛా సమాలిప్తుడైన యతనికా రెండుద్వేగముల విడబరుచు కొనుటకు చేతకాలేదు.సీతవచ్చి తన మెడకు చేతులు తగిలించి తన రెండు కపోలముల ముద్దిడుననుకొనెను."(162).

ఆ సాయంకాలము శారద,సీత,అవధాని సికారు వెళ్ళారు.మాటల సందర్భంలో శారద అవధాని మెడలో పూలదండ వేయమని సీతకిచ్చింది.సీత శారద చేతిలోని దండతీసుకొని అవధాని మెడలో వేసింది.ప్రభావతీ ప్రద్యుమ్నం చదివిన శారద "అయం ముహూర్తోస్తు సుముహూర్తోస్తుః 'అనుచు శశిముఖివలె నవ్వెను"(173). సీత అవధాన్లు తమకు వివాహమైనట్లే భావించిరి.ఇక అవధాని మనస్సు మనస్సులో లేదు.

ఆ రాత్రి అందరూ నిద్రించాక అవధాని మెల్లగా సీతగదిలోకి వెళ్ళాడు.సీత అవధానిని చూసి భయపడింది.భయపడిన సీతను చూసి అవధానికి నెల్లీతో కలిగిన అనుభవం గుర్తుకు వచ్చింది.పాశ్చాత్యస్త్రీకి భారతస్త్రీకి ఎంతభేదం.ఇట్లా అనుకున్నాడు."ఓ సీ ! పాశ్చాత్యదేశ కామినీ,నీకును సీతకును నేమి సంబంధము'అని భారతీయ స్త్రీ మనసు అదోరకమైన సంస్కారంతో పెనవేసుకొని ఉంటుంది.కన్యాత్వంలో నున్న స్త్రీ మనసు ఇలా చెబుతుంది.

"ఈ శరీరమొక పవిత్రగృహము.కన్యాత్వము,భార్యాత్వము,రెండు పవిత్రదశలు. ఒక దశనుండి మరియొక దశకు చెందువేళ నట్టి వణకు,నట్టి దుఃఖము,దశాభేదము సూచించునా? అయ్యో ! పసితనము పోయి స్త్రీత్వము వచ్చుచున్నదని పసితనము మీదనున్న యనురాగమా? ఇంకా తనకు కన్యాత్వము రాదన్న దుఃఖమా?"(176).

సీత భయంతో ముడుచుక పోయి సన్నగా రోధించసాగింది.అవధాని సీతను చూసి వెనక్కు తగ్గాడు.సీతే సాహసం చేసింది.అవధానిలో తిరిగి ధైర్యం మొలకెత్తింది."బావా ! నీవు రెండు రాత్రులనుండి వత్తువనుకున్నాను."అంది సీత.అవధానిలో హుషారు ఎక్కువైంది."ఆమెను కౌగలించుకొని యొక అనిర్వచనీయమైన ఆనందమనుభవించెను.ఆ క్షణంలో నామెను వదిలి తానొక నిముసమైనను నుండగలడా అనిపించెను."(176).

ఒక వారం దినాల్లో వీరిద్దరి పరస్పర సంబంధం ఇంట్లో అందరికి తెలిసిపోయింది. అవధాని సీత పరిస్థితిని గమనించాడు.ఆ పరస్థితులలో సీతను అక్కడ ఉంచటం క్షేమంగాదని

తలచి,శారదను సీతకు తోడిచ్చి మదరాసులోనున్న విమల ఇంటికి పంపాడు.తనకు తిరిగి కాకినాడలో అసిస్టెంటు సెషన్సు జడ్జిగా ఆర్డర్సు రాగా వెంటనే వెళ్ళి పోయాడు.

## 4) అవధాని శారీరక మానసిక శిక్షలు,పశ్చాత్తాపం.

అచిత్తుకు లోబడిన అవధాని శారీరక వాంఛా తత్పరుడై వివాహానికి ముందే సీతను కలిసి మరో తప్పుపని చేసాడు.ఇంతకు ముందే ఇంగ్లాండులో నెల్లీతో కలిగిన బంధాన్ని ఏ విధంగా తొలగించుకోవాలో నిర్ణయించుకోలేక మానసిక వేదనలో పడి నలుగుతున్న సమయం లోనే శారీరక సుఖాభిలాషియై మరో తప్పుపనిచేసి మరింత వ్యాకులతకు లోనయ్యాడు.అచిత్తు ఉద్రేకాలవల్ల కామాభిలాషియై చేసిన తప్పిదాలకు అంతరాత్మ అతన్ని వేదనకు గురిచేసింది. ఇట్టి పరిస్థితులలోనే అవధాని కాకినాడ సెషన్సు జడ్జిగా రావటం జరిగింది.జడ్జి కాబట్టి న్యాయ నిర్ణేతగా వ్యవహరించ వలసిఉంది.వాస్తవిక పరిస్థితులలో వ్యక్తులు చేసిన తప్పులకు తానుశిక్ష విధించవలసిఉంది.అనగా ఒకరుచేసిన తప్పులకుశిక్ష విధించే అధికారం తనకు ప్రభుత్వం ఇచ్చింది. కాని తాను చేసిన తప్పులకు తన అంతరాత్మ పదేపదే వాటిని గుర్తుకు తెప్పించి తీవ్రమైన మనస్తాపానికి గురిచేస్తుంది.అంతరాత్మ విధించే మానసిక శిక్షను అవధాని తట్టుకోలేక పోయాడు.

అవధాని జడ్జిగా నియమితుడై వచ్చిన వెంటనే మొదటి కేసుగా ఆయన ముందుకు వచ్చింది అప్పనికేసు.వాడొక స్త్రీని బలాత్కారంచేస్తూ పట్టుబడ్డాడు.కోర్టుముందుకు తేబడినాడు. జడ్జిగా అవధానిని చూసి అప్పడు ధైర్యం తెచ్చుకున్నాడు.జడ్జి తన స్నేహితుడే కాబట్టి తనకు శిక్ష పడదని అనుకున్నాడు.అప్పన్ని చూసిన అవధాని తనకు తాను దోషిగా భావించుకున్నాడు.

అప్పని జీవితం తన జీవితం,రెండూ ఒక్కటే.శరీరాలు వేరైనా మానసిక ప్రవర్తన మాత్రం ఇద్దరిదీ సమానమే.'తాను చదువుకున్నవాడు,అతనికి చదువురాదు.శరీరం చదువు ఈ రెండు భౌతికమైనవి.లోకం భౌతికమైన వాటినే చూస్తుంది.కాని మా ఇద్దరి మనోగుణం ఒక్కటే.అది నేన్ను మాత్రమే చూడగలుగుతున్నాను. అప్పడు తప్పు చేసాడు.తాను తప్పుచేసాడు.అప్పడు పట్టు బడ్డాడు.తాను పట్టుబడలేదు.అంతే భేదం.అప్పని కేసు చాలారోజులు నడిచింది.అవధాని అప్పనికి జామీనుమీద విడుదల ఇవ్వలేదు.తొందరగా తీర్పుచెప్పలేదు.అవధాని ఆలస్యం అప్పనికి నచ్చలేదు.

ఇంతలో అవధానికి బొంబాయినుండి నెల్లీ ఉత్తరం వ్రాసింది.దానిలో,ఆమె బొంబాయి లోదిగి నాలుగు రోజులయింది.చేతిలో డబ్బులేదు.డబ్బు పంపమని రాసింది.అవధానికి ఆ ఉత్తరం చూడగానే కాళ్ళకింది భూమి కదిలి పోతున్నట్లు,తననెవరో పాతాళానికి తొక్కేస్తున్నట్లు, భావించసాగాడు.ఈ ప్రళయంనుండి ఎలా బయటపడాలో ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.గురుమూర్తిని రావించి ఆయనతో తన పరిస్థితినంతా చెప్పి తనకున్న పొలం,ఇల్లు, ఆస్థిపాస్థులు,గురుమూర్తి పేరవ్రాసి ఏ విధంగానైనా ఈ సుడిగుండంలోనుండి కాపాడమని ప్రాధేయ పడ్డాడు."బొంబాయిలో నెల్లీ ఉంది.దాన్నెలాగైనా ఒప్పించి తిరిగి ఇంగ్లాండుకు పంపాలి.అది

ఇక్కడకు రాకూడదు. ఎంత డబ్బైనా దానికివ్వండి. ఈ సాయం చేసి పెట్టండి. మీరు నాకు తండ్రిలాంటి వారు. నా కోసం, నా విమల కోసం, ఈ సహాయం చేయండి." అంటూ ప్రార్థించాడు. గురుమూర్తి వెంటనే ఆ పనిమీద బొంబాయి వెళ్ళాడు.

అప్పడి కేసు చాలా రోజులు వాదోపవాదాలు జరిగిన మీదట అవధాని తీర్పు చెప్పే సమయం రానేవచ్చింది. అప్పడు పెట్టుకున్న లాయరు 'అప్పని దేమీ తప్పులేదనీ, ఇదంతా నళిని అనే యువతి కావాలని చేసి అప్పనిమీదకు తోసిందని, నళిని బలవంతంమీద అప్పడు ఆమెను కలిసాడనీ, అప్పడు నిర్దోషని నిరూపించాడు. 'నళిని మౌనంగా ఉండటం అప్పని నిర్దోషిత్వాన్ని బలపరిచింది. కోర్టంతా అప్పడు నిర్దోషనే సాక్ష్యాధారాల మూలంగా భావించింది. అప్పడు నిర్భయంగా ఉన్నాడు. తాను కేసు గెల్చాడు. అదీగాక జడ్జి తన స్నేహితుడు. ఏ విధంగానైనా తనకు విడుదల తప్పదు. అప్పని మొహం వెలిగిపోతూ నిర్విచారంగా అవధానికి కనబడింది. అప్పడు తప్పు చేసాడనీ తనకు తెలుసు. తప్పులు చేస్తున్నా అప్పడు ఇంతకాలం (శారీరకంగా కానీ, మానసికంగా కానీ) ఏ శిక్షా అనుభవించలేదు. తప్పుచేసినా నిర్భయంగా, నిశ్చలంగా, శాంతిగా ఉండగలుగుతున్నాడు. తానూ తప్పుచేసాడు. కాని మానసికంగా ఇంతకాలం నరకయాతన అనుభవించాడు. తాననుభవించిన శిక్ష సామాన్యమైనది కాదు. ఆ శిక్షను తన అంతరాత్మ విధించింది. తనలోని న్యాయం తనకు శిక్ష విధించింది. తప్పు చేసినవాడు ఏదోరకమైన శిక్షను అనుభవించాల్సిందే. మానసికమైన శిక్షను వ్యక్తిలోని అంతరాత్మ అనే కోర్టువిధిస్తుంది. తాను మానసికమైన శిక్షను అనుభవించాడు. తనకు శారీరకమైన శిక్ష విధింపబడలేదు. అప్పడు మానసిక, శారీరక, శిక్షలు రెండింటి నుండి తప్పించు కుంటున్నాడు. ఇది అన్యాయం. ఈ విధంగా అవధాని ఆలోచనలు సాగాయి. అప్పని శిక్ష విషయంలో ఒక నిర్ణయానికి రాలేకపోయాడు.

అవధాని దృష్టిలో తానూ అప్పడు వేరుకాదు. అందుల్ల అప్పడుకూడా శిక్ష అనుభవింపవలసిందే. "అప్పని తాను శిక్షించనిచో, వానిమీద తనకు కోపములేదు. ద్వేషమును లేదు. వాని శిక్షలో తన శిక్షకూడా ఇమిడిఉంది. శరీరములు భిన్నముగా నున్నను నిద్దరి జీవితప్రవాహములు నేక ముఖముగా ప్రవహించుచున్నవి.'('197).

అవధాని పరిపరి విధాల ఆలోచించాడు. చిన్నతనంనుండి తామిద్దరు జేబుదొంగలు. తనలోని సంస్కారం ఆ వృత్తినుండి మరలింపచేసింది. కాని అప్పడదేవృత్తిలో కొనసాగాడు. వాని దొంగబుద్ధి చేతనే ఈ నాడు ఈ కేసులో చిక్కుకున్నాడు. దోషిగా నా ముందుకు వచ్చాడు. వాని గతమంతా నాకు తెలుసు. వానికి శిక్ష పడవలసిందే. వాన్ని శిక్షించకున్న నేను నా అంతరాత్మకు మరో ద్రోహం చేసినవాని నవుతాను. నా అంతరాత్మ చెప్పిందే నేను చేయటం న్యాయం. "ఈ శిక్ష అతని శరీరమునకు జరుగవలయును. ఇందన్యాయమేమున్నది? సంఘులో తానాత్మ స్థానీయుడు. అప్పడు శరీర స్థానీయుడు. తామిద్దరు ఏయే స్థానములకు చేందుచున్నారో శిక్ష ఆయా స్థానములకు

చెందుచుండెను. అప్పడికి శిక్షవేసి తీరవలయును. శిక్షవేసి వానితో చెప్పవలయును. ఈ శిక్ష మన ఇద్దరిదిరా అప్పా ! నా బదులు నీ వనుభించి రమ్ము. నా యందు నీకీ మాత్రం స్నేహములేదా ?'

ఈ విధంగా నిర్ణయంచుకున్న అవధాని కోర్టులో అప్పదు నిర్దోషి అని నిర్ణయించుకున్నా తాను మాత్రం ఈవిధంగా తీర్పు చెప్పాడు. "...అప్పని పూర్వచరిత్ర సుప్రసిద్ధ మైనది. అతను చిన్నప్పటినుండియు జేబుదొంగ. దానిని తాను కూడా నెరుగును. ప్రతి దోషమునకు శిక్ష యుండ వలయును. అందుచేత నేనతనికి రెండు సంవత్సరముల చెరసాల విధించుచున్నాను."207)

ఈ తీర్పు వినగానే అప్పని మొహం వివర్ణమైంది. కోర్టంతా ఆశ్చర్యపోయింది. ఎవరూ ఏమీ మాట్లాడలేక పోయారు. అప్పదు ఎందుకో మౌనంగానే ఉండిపోయాడు. బలవంతం చేయబడిన నళిని ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయింది. రక్షక భటులు అప్పన్ని తీసుకెళ్తుండగా అదో మాదిరిగా చూసాడు.

ఆ రాత్రి అవధాని ఒంటరిగా అప్పదున్న జైలుగదిలోకి వెళ్ళాడు. అతనిని చూసి అప్పదు ఆశ్చర్యంలో మనిగాడు. వాడు చూస్తుండగానే తన దుస్తులు తీసి సామాన్యఖైదీల దుస్తులు ధరించి అవధాని నేలపై కూర్చున్నాడు. అప్పదు వింతగా చూస్తుండగా ఈవిధంగా అన్నాడు.

"నేను దైవ భయంచేత వచ్చితిని. నాశిక్ష నేనిదివరకే అనుభవించితిని. ఇంకను అనుభ వింతును. కాని శారీరరమైన ఈ శిక్షను కొంతవరకైనను పొందుటకు వచ్చితిని. అప్పదూ! నీవూ నేనూ దొంగలము. నా తీర్పులో నొక మాటయున్నది. సరిగా విన్నావో లేదో, 'ఇతదు చిన్నపుడు జేబుదొంగ. వానిని తానుకూడా నెరుగును. దాని యర్థమేమి?"అని అడిగాడు అవధాని. అప్పదు 'మీరుకూడా జేబుదొంగలన్న మాట.'అన్నాడు. 'అవును ఇప్పుడు నీ వనుభవించు శిక్ష నీ యొక్కనిదే కాదు. నాదికూడాను. అసలు నీకు శిక్షయేలేదు. నీమీద కేసు నిలువదు. నేను నీకు శిక్ష విధించితిని. అనగా నాకు నేను శిక్ష విధించుకున్నాను. నీవు నా బదులు పోయిరమ్ము. శిక్ష అనుభవించిరమ్ము. నేను నీకు దొరను. నీవు నాకు సేవకుడవు. నాది మనస్సు. నీది శరీరము. మనస్సుద్వారా నేనెంతో శిక్ష అనుభవించితిని. ఇంకా అనుభవించు చున్నాను. నీలో నా శరీరమున్నది. నా శరీరభాగమున్నది. నీకు నేను చెప్పు మాటలు తెలియవు. నాయందు నీకు పూర్వమున్న గౌరవమున్నచో మాటాడకుండా నీ శిక్ష అనుభవించి రమ్ము."(209)అన్నాడు అవధాని.

అవధాని ఆ మరునాడే మద్రాసు వెళ్ళాడు. తన చెల్లెలు విమలను కలిశాడు. ఆమెతో మాట్లాడి సీతను వివాహం చేసుకున్నాడు.

ఈ విధంగా అవధాని మనస్తత్వాన్ని ప్రయోజనదిశగా మళ్ళించి అతని మనస్తత్వంలోని బలహీనతవల్ల తప్పులు చేయించి తిరిగి తాను చేసిన తప్పులకు పశ్చాత్తాపంతో కుమిలి పోయినట్లు చిత్రించి స్పర్శగుణంచే, ప్రేమానురాగాలచే, సీతను తన భాగస్వామిగా ఎన్నుకున్నట్లు, చూపించాడు. అప్పణ్ని అవధాని ఛాయారూపంగా సృష్టించాడు. ఈ రెండు పాత్రలద్వారా ఒక వ్యక్తిలో కలిగియుండే

మానసిక శారీరక ప్రవర్తనలను విశ్వనాథ అద్భుతంగా చిత్రించటం ఈ నవలలో చూస్తాం.

## 4.5 అప్పని మనస్తత్వ చిత్రణ-అవధాని ఛాయారూపం అప్పడు.

అప్పడు అవధాని వయసువాడే.వాళ్ళింట్లో నౌఖరు.అవధాని తండ్రి సోమశంకరం గారు పరమ లోభి.అవధాని ఖర్చులకు డబ్బులిచ్చేవాడు కాదు.అవధాని తన వృధా ఖర్చులకు కాక తన ఇంగ్లీషు భాషాభివృద్ధికి అవసరమయ్యే గ్రంధాల గురించి బాధపడేవాడు.వాటికి డబ్బు కావాలి.అందుకని అవధాని విధిలేక ఇంటికి వచ్చిన స్నేహితుల,బంధువుల,జేబుల్లో నుండి అప్పనిచే డబ్బు దొంగలింప చేసేవాడు.ఈ విధంగా చిన్నతనంలో అప్పడు అవధాని జేబుదొంగలు. అవధానికి ఇష్టం లేకున్నా ఒక ప్రయోజనం ఆశించి ఈ తప్పుడు పని చేస్తున్నా ఆ డబ్బును సద్వినియోగం చేసుకుంటూ క్రమంగా ఈ వృత్తినుండి తప్పుకోవాలని ప్రయత్నం చేశాడు.కాని అప్పడు ఇదే వృత్తిని జీవనోపాధిగా ఎన్నుకున్నాడు.ఈ వృత్తిలో క్రమంగా ప్రావీణ్యం పొందుతూ తన జీవన శైలిని నిర్మించుకున్నాడు.

అవధాని ఇంగ్లాండులో ఐ.సి.యస్ చదువుచున్న కాలంలో అప్పడు కాకినాడలో ముఠారౌడిగా పేరుపొందాడు."పూర్వమువలె తేలికగా రక్షక భటులతనిని పట్టుకొనుటకు నేడంత వీలులేదు.అతని చేతిక్రింద పదిమంది యున్నారు.అతని జట్టులో నెవనిమీద అభియోగము వచ్చినను అప్పనితో చెప్పకుండా నతనిని చెరలో పెట్టుటకు వీలులేదు. ఒక్కొక్కపుడు దొంగలించిన సొమ్ము నిచ్చివేయుటతో సరిపోవును.మరొక్కపుడు లోపాయకారిగా సర్దుబాటు జరుగును".(76).

అవధానిలో ద్వివిధ ప్రవృత్తులున్నట్లే అప్పనిలో కూడా ఉన్నాయి.అందులో మొదటిది బహు కష్టములచే సాధించునది.రెండవది,అలభ్యముగా దొరుకుదానిని తొణకు బెణుకు అపహరించు గుణము.'అప్పడు దొంగతనంలో గల నేర్పులను పట్టుబట్టి సాధించి అందులో ప్రవీణుడయ్యాడు.ముఠానాయకుడుగా పేరు తెచ్చుకున్నాడు.ఇక రెండవ దాని విషయంలో అతనిలోని కామవాంఛ విజృంభించింది."అప్పడు మరియొక విద్యలో నారితేరెను.ఆవూరిలో నాతడు త్రొక్కరాని అశీలవతి గడుపలేదు.అతని కామము బ్రతిమాలదు.ఆజ్ఞాపించును.అనంగీ కృతినొంది శిక్ష వేయును.అతడు ఆవూరిలో పగటి దివిటీవలె వెలుగుచుండెను."(76).

అవధాని కలెక్టరుగా కాకినాడ వచ్చినప్పటి నుండి అప్పనిలో కొత్త ఉత్సాహం,కొత్త సాహసం ముంచుకొచ్చాయి.అతని ప్రవర్తన నానాటికి విశృంఖలమైంది.అతనికి ఇంతవరకు సొంత ఇల్లులేదు.కాని రాముడనే వానిఇంట్లో ఉంటూ వానికింత డబ్బు సహాయం చేసేవాడు.ఆ రామునికిద్దరు ఆడపిల్లలు.పెద్దపిల్లపేరు అప్పి,అనాకారి.రెండవదానిపేరు సీత.అందగత్తె.అప్పడు ఆ ఇంట్లో చేరిన నాటినుండి సీతమీద కన్నువేసాడు.సీత పెరెగుచున్న కొద్దీ ఆమెలోని అందాలు అప్పణ్ణి భ్రమింపచేయసాగాయి.ఇంట్లో ఉన్నంతసేపూ అప్పడు సీతకు ప్రేమకథలు చెప్పేవాడు.

అప్పడు శృంగారప్రియుడు.సీతతో మానసికానందం పొందినా అతని శారీరక కామేచ్ఛకు

బలిచెయ్యలేదు.కాని అతనికి ఒక వారకాంత ఉంది.దానిపేరు లీల.అప్పునికి తన కనుకూలమైన తక్కువజాతి స్త్రీలమీదనే మనస్సు.అందులో లీల ఒకతి.లీలకు అప్పునిమీద ఎంతో ప్రేమ.ఆ లీలకు ఇతరులతో సంబంధమున్నా అప్పడేమీ అనేవాడుకాదు.అందువల్ల లీలకు అప్పడంటే ఎంతో అభిమానం.అప్పుని వద్ద డబ్బులేకుంటే లీల ఇచ్చేది.

కాకినాడలో అప్పడు రౌడిగా పేరుతెచ్చుకున్నాడు.అవధాని కాకినాడ రాగానే అప్పడు వెంటనే వెళ్ళి కలుసుకున్నాడు.తన విషయాలన్నీ చెప్పాడు.వాని చరిత్రవిన్న అవధానికి గుండె గుభేలుమన్నది.'వాని జీవితం తన జీవితం రెండు విడదీయరాని ప్రవాహములా?వాని నుండి తాను త్రెంచుకొనుట ఎట్లు?అని అవధాని ఆలోచించేవాడు.అప్పునికి లీలతో సంబంధం. సీతతోప్రేమ.తనకు నెల్లీతో సంబంధం,సీతను ప్రేమించాడు.అప్పునికి మరో సంఘటన ఎదురైంది.కాకినాడలో రంగయ్య అనేవాడు తన కూతురుని చేసుకొమ్మని అప్పని వెంటబడ్డాడు. అప్పునికది ఇష్టంలేదు.రంగయ్య డబ్బు గలవాడు.కూతురు పేరు నళిని.ఈ విషయమంతా అప్పడు అవధానికి చెప్పాడు.వాని వ్యవహారంచూసి అవధాని అప్పనిని తన దగ్గరకు రావద్దన్నాడు.వానిని చూసినపుడల్లా అవధాని తన నీడను చూసి భయపడినట్లు భావంచేవాడు. అప్పడు దీనంగా అవధానితో “ఈ రెండేండ్లు రెండే నన్ను బ్రతికించుచున్న ఊహలు.ఒకటి సీతను పెండ్లి యాడుట, రెండు మీ సేవకునిగా ఉండుట.నా గుండెలో సీత నన్ను పెండ్లి చేసుకోనన్నచో నెంత దుఃఖము ప్రాప్తించునో,మీరు నన్ను వద్దన్నచో అంత దుఃఖము ప్రాప్తించు.' అన్నాడు.అవధాని వాని మనసులోని కృత నిశ్చయానికి,సేవాభావానికి,పొంగి పోయాడు.అప్పణ్ని ఏమీ అనలేదు.

అప్పణ్ణి ప్రేమించిన నళిని అతన్ని ఆకర్షించటానికి ఎన్నో ప్రయత్నాలు చేయసాగింది. అప్పనికి దానిమీద ప్రేమలేదు.దాన్ని వివాహం చేసుకునే తలంపు కూడాలేదు.కాని అది చూపించే చొరవ,దాని అందము,వికారపు మాటలు,అప్పన్ని సమ్మోహితుని చేస్తున్నాయి. అచిత్తుకు లొంగిన అతని మనస్సు శారీరక వాంఛతో తొందర పెట్టసాగాంది.రెండు,మూడుసార్లామెను అనుభ వించాలని ప్రయత్నించాడు.కాని ఆమె వివాహం కానిది,కూడదని వానిని దూరంగా ఉంచింది. అప్పడు ఇక లాభంలేదని మోసంతో ఆమెను అనుభవించాలని ప్లాను వేసాడు.ఒకరోజు నళిని తండ్రి రంగయ్య,లేని సమయంలో నళినితో సినిమాకు వెళ్ళి,దాన్ని తోడ్కొని బండిలో ఒకచోటికి తీసుకెళ్ళిపెండ్లిచేసుకుంటానని నమ్మబలికి అనుభవించాడు. నళిని జరిగినదంతా తండ్రితో చెప్పగా రంగయ్య సాక్ష్యాధారాలు,డాక్టరు రిపోర్టు,సంపాదించి అప్పని మీద 'బలవంతం' కేసు పెట్టాడు.

అవధాని కాకినాడకు సబ్‌మెజిస్ట్రేటుగా రాగానే అతని ముందుకు అప్పని కేసు వచ్చింది. పూర్వాపరాలు విచారించిన మీదట,అప్పని సంగతి చిన్నతనంనుండి తెలిసిన అవధాని కావాలని రెండు సంవత్సరాలు కారాగార శిక్ష విధించాడు.శిక్ష విధించిన తర్వాత అప్పనితో అవధాని “నేను నీకు దొరను.నీవు నాకు సేవకుడవు.నాది మనస్సు,నీది శరీరము.మానసికంగా నేనెంతో

శిక్ష అనుభవించితిని. నీలో నా శరీరభాగమున్నది. నీకు నేను చెప్పుమాటలు తెలియవు. నాయందు నీకు పూర్వమున్న గౌరవమున్నచో మాటాడకుండా నీ శిక్ష అనుభవించి రమ్ము."అని పలికాడు.

ఈ విధంగా ఈ జేబుదొంగలు అనే నవలలో అప్పని పాత్రను అవధాని మనస్తత్వానికి ప్రతీకగా, ఛాయారూపంగా, చిత్రిస్తూ అవధాని జీవితంలోని సంఘటనలే అప్పని జీవితంలో కూడా తారసిల్లినట్లు పోలుస్తూ విశ్వనాథవారు మలచిన తీరు అద్భుతంగా కనిపిస్తుంది.

## 4.6 విమల పాత్ర- గుణశీలాదులు.

విమల అవధాని చెల్లెలు. విమలకూడా తల్లిదండ్రుల ప్రేమాభిమానాలకు పెద్దగా నోచుకోలేదు. అవధానికి విమలయన్నచో ప్రాణం.'విమలకు అవధాని యన్నచో నొక విచిత్రమైన కోటి సమాకృష్టమైన యొక వంశగౌరవ పతాక భావన. ఆ పసిఎదలో నింతయు సువ్యక్తమై లేదు. ఆ భావనయొక్క జాతి లక్షణమట్టిది. ఆమె సృష్టిచేతనే యొక నిర్లిప్తురాలు. ఆతడేదో కొండలు త్రవ్విపోయునని, సముద్రములు పుక్కిలించునని, ఆ బాల హృదయములో నిగూఢముగానున్న యొక యాశయొక్క ప్రతి బింబము అతనిలో చూచును."(17).

విమల అతనిమీద ఎన్నో ఆశలు పెట్టుకుంది.. అతని తప్పుడు పనులకు నొచ్చుకుంది. మంచిదారిలో పెట్టటానికి ప్రయత్నించింది. విమల తండ్రి సోమశంకరంగారు చనిపోతూ ఒకవిల్లు వ్రాసారు. అందులో అతని స్నేహితులైన గురుమూర్తి, రామారావు, గార్లను అధికారులుగా నియమించి, విమలకు మైనారిటీ తీరకముందే వివాహం వీరిద్దరి అనుమతితో జరుగవలెనని, ఆ వీలులో ఉంది. గురుమూర్తి బాధ్యత వహించి విమలకు సంబంధం తెచ్చాడు. వరుడు మద్రాసు పత్రికాఫీసులో ఉద్యోగి. విమల పెండ్లికొడుకును కూడా చూడలేదు. గురుమూర్తిగారి మాటలనే విమలా, మోహనరావు(పెండ్లికొడుకు)లు, దైవశాసనంగా భావించారు. అవధానికి ఇష్టంలేకపోయినా విమల వివాహం జరిగిపోయింది.

పెండ్లి జరిగిన రెండు నెల్లకే విమల ప్రవర్తన అవధానికి ఆమె ఎడల పూర్వంకన్న వందరెట్లు ప్రేమభావాన్ని పెంచింది. అవధాని ఆమెను ఒక దేవతలా ఆరాధించసాగాడు. అతని దృష్టిలో "విమల యొక దేవత. తానొక ఆరాధకుడు. తన అదృష్టమామె ప్రసన్నతాధీనము. ఆమె భ్రూభంగరేఖ తనకు శిక్షాపథము. గాలికి పెరిగిన తన విశృంఖలతకు నామె కట్టుకొయ్య."(29.)

అవధాని ఇంగ్లాండు వెళ్ళాడు. అక్కడ పాశ్చాత్య స్త్రీల వేషభాషలు, ఆచార వ్యవహారాలు, గమనించాడు. తన చెల్లెలు స్మృతి పథంలో మెదిలింది. వ్యత్యాసం తెలుసుకున్నాడు. విమలకు ఉత్తరాలు వ్రాస్తూ, వానిలో 'విమల భారతదేశపు ఆత్మ, భారతస్త్రీకి శక్తి నిధానము. దేవతా స్వరూప విమలవంటి యోగ్యశీలురు పాశ్చాత్యదేశములో నుండరు. తాను విమలకు అన్నగారుగా నుండుటకు పనికిరాడు.'(34). అని విమలను పొగిడేవాడు.

అవధాని ఇంగ్లాండునుండి రాగానే అతని వేషభాషలు,ఆచారవ్యవహారాలు,చూసి విమల విస్తుపోయింది. తన అన్న ఐ.సి.యస్.చదువుకొని వచ్చాడు.రేపో,మాపో,కలెక్టరు కాబోతున్నాడు.తన మాటలు వింటాడా?అయినా ప్రయత్నంచి చూద్దామని 'తండ్రిగారికి కర్మలు చేయాలనీ,ఆ విధంగా చేయకుండానే నీవు ఇంగ్లాండు వెళ్ళి పోతివనీ,ఇప్పుడు చేస్తావా?అని అడిగింది.అవధాని 'తన కిటువంటి వాటి మీద నమ్మకాల్లేవు....అయినా నీవు చేయమంటే చేస్తానన్నాడు..'.విమల ఆశ్చర్యంతో 'నేనన్నచో నీకంత గౌరవమా?'అని అడిగింది.దానికి అవధాని 'గౌరవమా ! నీవు నాకొక ఆదర్శ స్త్రీవి.నేను ఇంగ్లాండులో నున్నపుడు నీవంటి స్త్రీ కన్పించునేమో యని ఏడేండ్లు వెదికితిని.నాకెచటను కన్పించలేదు'అన్నాడు.

విమల క్రమంగా అవధానిని మార్చింది.అవధానికి విమలవాక్కు వేదవాక్కు.తాను విమలకు అన్నగావటం తన పూర్వజన్మ సుకృతంగా భావించేవాడు.ఆపద సమయంలో అవధానికి విమలే దిక్కు.సీత,శారదలను విమల ఇంటికి పంపి తాను చేసిన తప్పుడు పనులకు చెల్లెలు కోపగిస్తుందోమోనని భయపడేవాడు.తర్వాత అవధాని పశ్చాత్తాపంతో తన పాపాలను కడిగివేసుకొని తనకు తానే శిక్షలు తేసుకొని విమలను సంతుష్టురాలను చేయగలిగాడు.అందుకే అవధాని చివరలో విమలతో ఈ విధంగా అంటాడు.

"విమలా ! నేను తప్పు చేసితిని.ఒక తప్పు కాదు,రెండు తప్పులు.ఒక తప్పునకు పశ్చాత్తాప పడితిని.రెండవ తప్పునకు శిక్ష వేసుకొంటిని.ఇంగ్లాండులో నొక పాశ్చాత్య స్త్రీని వివాహమాడితిని.ఆ తప్పునకు నా పశ్చాత్తాపము,నా యాస్థి అంతయు దానికి వదిలిపెట్టుట. రెండవ తప్పు సీతను వివాహమాడుటకు ముందే సీతను ఒప్పించి అనుభవించుట.ఈ తప్పునకు గంటసేపు జైలులో నున్నాను.రెన్నెల్లనుండి నరక యాతన అనుభవించాను...నీ కింకను కోపము పోదా?నీవు నాయందు కోపించినచో బ్రతుకుట నాకు దుర్లభమగునని నీకు తెలియదా?"

ఈ విధంగా ఈనవలలో విమల అవధాని చెల్లెలుగా,తల్లిగా,తండ్రిగా,గురువుగా, దేవతగా,అతని భావనలలో మెదిలి అతన్ని అన్నివిధాల సంస్కరించుటకు ఉద్దేశింపబడిన పాత్రగా చిత్రీకరింపబడింది.

## 4.7 అచిత్తు-అహం-అధ్యహం ల రూపకల్పన 'అప్పడు,అవధాని,విమల.

ఫ్రాయిడ్ వ్యక్తి ప్రవర్తనకు అచేతన మానసిక ప్రక్రియలే ముఖ్యమన్నాడు.అచేతన మానసిక ప్రక్రియలనే ఆతడు మూడు పొరలుగా విభజించి చూపాడు.అవి అచిత్తు-అహం- అధ్యహం. అచిత్తు వ్యక్తిలోని ఆంతరంగిక వాంఛాకేంద్రం.ప్రేరణలకు మూలం.బాహ్యాజగత్తుతో సంబంధం లేనిది. అహం బాహ్యాజగత్తులో వ్యక్తియొక్క ప్రవర్తనను క్రమబద్దీకరించేది.,సర్దుబాటుతనాన్ని,వ్యక్తికి అలవర్చేది.లోకంలో వ్యక్తియొక్క ప్రవర్తనను సామాన్యంగా ఉంచటంలో అహం తోడ్పడుతుంది. అధ్యహం, వ్యక్తిలోని సంస్కారానికి,జ్ఞానానికి సంబంధించింది.అహాన్ని నియంత్రిస్తూ,అచిత్తును

అణుస్తూ, వ్యక్తి ప్రవర్తనను సరిదిద్దుతుంది. అధ్యహం బాహ్యపరిసరాలనుండి వ్యక్తిలో రూపుకడు తుంది. అచిత్తు,అహంలు, వ్యక్తిలో మానసికంగా ఏర్పడిన వ్యవస్థలు.

ఈ నవలలోని ప్రధానమైన అప్పడు,అవధాని,విమల, పాత్రలను పరిశీలించినపుడు, విశ్వనాథ ఫ్రాయిడ్ చూపిన పై మూడు మానసిక వ్యవస్థలకు రూపకల్పన చేసాడేమో అని తోచక మానదు. అవధాని మాటలవల్ల ఈ విషయం మనకు స్పష్టమౌతుంది.

అప్పని పాత్ర, అచిత్తుకు రూపకల్పనవలె తోస్తుంది. వాని ప్రవర్తన వాంఛా పూరితమై, కాముకమై,స్త్రీ సుఖాన్వేషితమై,ఉంటుంది. అచిత్తుకు లోబడి వ్యక్తి చేసే పనుల్లాగా,స్వార్ధంతోకూడి విచక్షణారహితంగా,మంచి చెడ్డలతో సంబంధం లేకుండా అప్పని పాత్ర సాగుతుంది. చిన్నతనంలో సులభంగా డబ్బువచ్చే మార్గాన్ని ఎన్నుకున్న అప్పడు క్రమంగా దానిలోని మెలకువలన్నీ నేర్చుకొని ముఠారౌడిగా మారటం,శారీరక సుఖాభిలాషియై స్త్రీ సుఖాన్వేషియై లీలతో,నళినితో,సంబంధాలు పెట్టుకోవటం,వంటి చేష్టలవల్ల అప్పని పాత్ర "అచిత్తుకు"దగ్గరగా చిత్రీకరించబడినట్లు తెలుస్తుంది. అవధాని అప్పనితో ఇలా అంటాడు.

"నాది మనస్సు. నీది శరీరము. మనస్సుద్వారా నేనెంతో శిక్ష అనుభవించితిని. నీలో నా శరీరమున్నది. నా శరీరభాగమున్నది. నీకు నేను చెప్పు మాటలు తెలియవు."(214.)

'అహం' బాహ్యజగత్తుకు సంబంధంచినది. లోకంలోని వ్యక్తి ప్రవర్తనకు అహం మూలమౌతుంది. చేతన మానసిక ప్రక్రియలే ఇందులో ప్రధానంగా పాల్గొంటాయి. ఆడ్లర్ అనే మానసిక శాస్త్రవేత్త వ్యక్తి ప్రవర్తనకు చేతన మానసిక ప్రక్రియలే మూలమన్నాడు. అవధాని పాత్ర 'అహానికి' రూపకల్పన. చిన్నతనం నుండి అవధాని ప్రయోజన దిశగా పయనించాడు. అప్పని (అచిత్తు) సహవాసంతో జేబుదొంగగా మారినా,విమల(అధ్యహం) మాటలవల్ల తన తప్పుతాను తెలుసుకొని ఆ మార్గాన్ని మానుకున్నాడు. ఇంగ్లాండు వెళ్ళి ఐ.సి.యస్ చదివాడు. ఇంగ్లాండులోని సభ్యతా,సంస్కృతులను గమనించిన అవధానికి భారతదేశ సంస్కృతి గొప్పతనం తనలో అంతర్గతంగానివురు గప్పిన నిప్పువలె నున్న అధ్యహం(విమల) అతన్ని మేల్కొల్పింది. మొదట తప్పుడు పనులు చేసినా అతనిలోని సంస్కారం సక్రమమార్గంలో పెట్టింది. అవధాని ప్రవర్తన బాహ్యంగా లోకానికి అనుగుణ్యంగానే ఉంది. కాని అచిత్తుకు లోబడినట్లు కనిపించదు. ఈ విధంగా వ్యక్తిలోని 'అహం' అవధాని పాత్రగా మలచబడింది.

అధ్యహం' వ్యక్తిలోని సంస్కారానికి నిలయం. విమల పాత్రలో ఈ విశేషం కనిపిస్తుంది. అధ్యహం బాహ్యపరిసరాలలో నుండి వ్యక్తిలో రూపుకడ్తుంది. కాబట్టి విమల మాటలు,చేష్టలు, నడవడి,అవధానికి మార్గదర్శకంగా నిలిచాయి. ఒక జాతి వారసత్వాన్ని,సంస్కృతిని, సంప్రదాయాన్ని అధ్యహం చూపుతుంది. కాబట్టి అదే విధంగా విమల పాత్ర చిత్రీకరింపబడింది. అంతేగాక విమలను విశ్వనాథ భారతదేశాత్మ,భారతస్త్రీశక్తి నిధానము,దేవతా స్వరూప,అని వర్ణించటం కూడా జాతి లక్షణాలను వ్యక్తీకరించటమే.

ఈ విధంగా ఈ నవలలో అప్పుడు,అవధాని,విమల,ఈ మూడు పాత్రలు విడివిడిగా కన్పించినా ప్రతి వ్యక్తిలో ఉండే ముఖ్యమైన మానసిక వ్యవస్థలే.అపధాని పాత్రలోని మానసిక వ్యవస్థలలాగా అనే మూడు రూపాలు ధరించినట్లుగా విశ్వనాథవారు చిత్రించటం ఆయన ప్రతిభకు తార్కాణంగా చెప్పవచ్చు.

## 4.8 ముగింపు-సందేశం.

యూంగ్ అనే మానసిక శాస్త్రవేత్త వ్యక్తిలోని అనేతనాన్ని రెండు పొరల్లో విభజించి మొదటిది,వైయక్తిక అచేతనమనీ,రెండవది,సమష్టి అచేతనమనీ,పేర్కొన్నాడు.వైయక్తికమైన అచేతనం వ్యక్తిగతమైన అభిలాషలకు,కాంక్షలకు,దమింపబడిన కోర్కెలకు,అణచబడిన అభిప్రాయాలకు,కేంద్రం అవుతుంది.సమష్టి అచేతనం, జాతిని చుట్టుకొని సంస్కృతికి,సభ్యతకు వైఖరులకు, నమ్మకాలకు, మూలరూపాలకు,వ్యక్తి విశ్వాసాలకు,కేంద్రంగా నిలుస్తుంది.

విశ్వనాథ ఈ నవలలో అవధాని పాత్రను ఆడ్లర్ ప్రయోజనతా వాద సిద్ధాంతానికి ప్రతీకగా మలచినా, ఫ్రాయిడ్ ఉద్దేశించిన అచిత్తు,అధ్యహం స్థానాల్లో అప్పడిని,విమలను ప్రతీకలుగా చూపిస్తాడు.చివరలో యూంగ్ తెలిపిన సమష్టి అచేతనం ఒక వ్యక్తిలో ఏ విధంగా పనిచేస్తుందో మూడు పాత్రలద్వారా తెలియచేస్తాడు.

అవధాని అప్పడికి శిక్ష విధించి,తానూ కొద్దిసేపూ జైల్లో ఖైదీగా కూర్చొని శారీరక శిక్ష అనుభవించి విమల ఇంటికి వస్తాడు.విమలకు తాను చేసిన తప్పుడు పనులతో కోపం వచ్చిందేమోనని భయపడతాడు.ఆమెను ప్రసన్నం చేసుకోవటానికి తాను చేసిన పనులన్నీ చెప్పి పశ్చాత్తాపం పొంది, శిక్ష కూడా అనుభవించానని చెప్తూ పెద్ద ఉపన్యాసం ఇస్తాడు.ఆ మాటలు విన్న విమల ఆశ్చర్యపోతుంది.ఆమె అవధానితో ఇలా అంటుంది.

"నీలో ఇంతటి సంస్కారమెలా కలిగింది?నీవు చదివిన చదువులో ఇది లేదు.మన తల్లిదండ్రుల రక్తంలో నిది లేదు.ఇది నెచ్చటినుండి వచ్చినది?ఓయీ ! నీవు పూర్వజన్మలో నెవ్వరవు? నీ ప్రకృతిలో నింత ఉద్వేగమెచటినుండి వచ్చినది?నెత్తురులో లేని,పెంపకంలో లేని,చదువులో లేని, ఈ దివ్యశక్తి ఎక్కడిది?ఇది ఎచటినుండి ప్రవహితమైనది?ప్రంచమున సర్వమును కార్యకారణ భావముచేత బంధితమగుచుండగా కారణమెరుంగరాని ఈ విచిత్ర సంస్కారము నీ కెచటినుండి వచ్చినది?"(218.)

అవధాని ఈ మాటలు విని ఆశ్చర్యంతో "నాకు నదే యూహా.నీ వంటి చెల్లెలు,సీత వంటి భార్య,నాకు దొరుకుటయే ఆశ్చర్యముగా నున్నది.నా చదువునకు,నా బ్రతుకునకు,నా మనస్సునకు,పర దేశములో తెరచాటు పడి యుండవలయును.ఇది నా దేశములో మట్టి లోలోతులలోనుండి త్రవ్వుడుగా నున్నది."

దానికి సమాధానంగా విమల ఇలా అంది

"ఓయీ ! అదియా కారణము. తెలిసినది. నీవు ప్రబలమైన పర సంప్రదాయములను బెగల్చుకొని వచ్చు స్వజాతి, సంస్కారాదులచే,చదువులచే,పెంపకముచే,సమావృత పరిస్థితులచే, సర్వము నధఃకరింపబడియు జన్మయందు కూడా తెలియరానిదై రక్తమునందెచటనో,దాగియున్న యొక స్వజాతిశక్తి...యూరకే శిలామయమైన ఆలయగోపుర కఠినోఫలముల నడిమి సున్నములో నుండి పెగల్చుకొని వచ్చు రావి మొక్కవలె పొటమరించు నిన్నెవరు చంపుదురు.రాళ్ళెంత దగ్గరగా నున్నను,నెడముగా నున్నను,నీవు తల చూపనేచూపుదువు.ఒక వేళ గోపురమంతయు నేకశిలాకారముగా చేసినను కాలము వికసించిన,ఎండలు,వానలు,నారాతిని చిట్లించి అందునుండి ఈ రావి మొక్కను బుట్టించును.నినెవ్వడాపగలడు"(.218.)

వ్యక్తిలో బీజప్రాయంగా ఉన్న జాతి వారసత్వమే ఆ వ్యక్తిని తీర్చి దిద్దుతుందనీ, ఆనువంశికంగా సమష్టి అచేతనంలో రూపుగట్టుకున్న సంస్కృతే ఆ వ్యక్తికి సంస్కారాన్ని కలిగి స్తుందనీ,పై సందేశంవల్ల తెలుస్తుంది.

ఈ విధంగా ఈ నవలను విశ్వనాథ మనోవైజ్ఞానిక నవలగా,ప్రసిద్ధులైన ఫ్రాయిడ్,అడ్లర్, యూంగ్ భావనల కనుకూలంగా పాత్రల మలచి, చిత్రించి తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పింపచేసాడు.

# 5. ఉదాత్తీకరణ సదాశయాన్ని ఉన్నతంగా మలచుకున్న వీరుడు బద్దన్న సేనాని.

## 5.1 ఉదాత్తీకరణం.

" మానవుడు సహజంగా సంఘజీవి.సాంఘికాభిరుచి అనేది వ్యక్తికి జన్మతః లభించే లక్షణం "అన్నాడు మనోవైజ్ఞానిక శాస్త్రవేత్త ఆల్‌ఫ్రెడ్ ఆడ్లర్.సామాజిక జీవియైన మానవుడు సమాజం కోసం ఏదో చెయ్యాలని అనుకుంటాడు.తనకు తోచిన,అనుకూలించిన,తా నభిలషించిన కార్యక్రమాలలో పాల్గొని,తానాశించిన ప్రయోజనం కోసం పాటుపడతాడు.ఆ ప్రయోజనాసిద్ధిలో న్యూనతా భావాలు కలిగినా పట్టుదల,కార్యదీక్ష,కలిగిన వ్యక్తి ఆ న్యూనతా భావాల నధిగమించి, ఆధిక్యత కోసం,మరియు పరిపూర్ణత కోసం ప్రయత్నం చేస్తాడు.ఈ విధంగా సమాజంలోని ఆదర్శం కలిగిన వ్యక్తులు ఎన్నో సామాజిక కార్యక్రమాలలో పాల్గొని అభివృద్ధికి తోడ్పడతారు. మేధావులు,నాయకులు,శాస్త్రజ్ఞులు,కళాకారులు,సంస్కరణాభిలాషులు, సాహిత్యపరులు,మొదలైన వారి కృషి ఫలితంగానే సంస్కృతి,శాస్త్రవిజ్ఞానం,చారిత్రిక ప్రగతి, సాహిత్య పురోగతి, అభ్యుదయం వంటి ప్రయోజనాలు చేకూరాయి.ఆదిమ మానవుని నుండి ఈనాటి వరకు సాధించిన ప్రగతి అంతా వ్యక్తికి జన్మతః లభించిన సాంఘికాభిరుచి వల్లనే అంటాడు ఆడ్లర్.

ఫ్రాయిడ్ మాత్రం ఈ ప్రగతి అంతా వ్యక్తియొక్క ఉదాత్తీకరణం వల్లనే సాధ్యమైందనీ, చెబుతాడు.'ఉదాత్తీకరణం' అనేది కొందరు వ్యక్తులు తమలో తీవ్రంగా రూపుదాల్చిన కామాభి లాషను తమ అభిరుచులకు తగినట్లు తగిన వస్తువులపై,లేదా కార్యక్రమాలపై, మలచుకొని సాంఘికావసరాలకు తగినట్లుగా పాటుపడి తమలోని ఉద్రిక్తలను తగ్గించుకోవటమే నని ఉదాత్తీకరణ సదాశయాన్ని వివరిస్తాడు.

ఫ్రాయిడ్ దృష్టిలో వ్యక్తి ఎల్లపుడూ కామాభిలాషియే.ముఖ్యంగా వ్యక్తిలోని 'లైంగిక సహజాతాలు' వ్యక్తిని ఎల్లప్పుడూ ఉద్రేకపరస్తుంటాయి.వాటి ఉద్రిక్తతలవల్ల వ్యక్తి సహనాన్ని కోల్పోతాడు.వ్యాకులతకు లోనవుతాడు.తనలోని తీవ్రమైన కామేచ్ఛ(లిబిడో)ను అణచుకోలేక పోతాడు.అచేతనంలోని మానసిక చోదనలు వ్యక్తిని తీవ్రంగా మభ్యపెట్టి చేతనంలోకి రావాలని చూస్తాయి.కాని వ్యక్తి వీటిని చేతనంలోకి రానివ్వకుండా దమనం చేస్తుంటాడు.ఆ విధంగా దమనం చేయబడిన కోరికలే వ్యక్తిని కలవర పెడ్తుంటాయి.అటువంటి సమయంలో వ్యక్తి వ్యాకులతను చెందినా తనలోని కామాభిలాషను సంతృప్తి పరచటానికి రక్షణతంత్రాంగమైన ఉదాత్తీకరణం అనేదాన్ని సహాయంగా తీసుకుంటాడు.వ్యక్తిలో వ్యాకులత అధికమైనపుడు ఇది వ్యక్తికి జీవనంలో సహాయకారిగా నిలుస్తుంది.

రక్షణతంత్రాలనేవి వ్యక్తి అచేతనంలో మొదట ఉన్నట్టివే.కాని వ్యక్తికి తనలో ఉన్నట్లు

తెలియదు.అనుకోకుండానే వ్యక్తి సమయానుకూలంగా తనకు అనుకూలించిన రక్షణతంత్రాన్ని ఎన్నుకుంటాడు.ఇవి వ్యక్తులకు క్లిష్ట పరిస్థితులలో తోడ్పడే సహాయకారులు.ఈరకమైన రక్షణ తంత్రాలు మానవుని అచేతనంలోని అచిత్తు,అధ్యహంల మధ్య జరిగే సంఘర్షణలను అరికట్టి అచిత్తుకు సంబంధించిన కోరికలను పైకి బహిర్గతం కాకుండా చూస్తాయని ఫ్రాయిడ్ ఈ రక్షణ తంత్రాలను గూర్చి చెబుతాడు.

నిజ జీవితంలో యథార్థ లైంగిక తృప్తిని పొందలేనివారు కళకు,సాహిత్యానికి, సంగీతానికి, మరలి కాల్పనిక సృష్టిచేస్తారు.కాల్పనిక సృజనాశక్తి లేనివారలు మరోదానిలోకి దారి మరలించి సాంఘికావసరాలకై పాటుపడుతుంటారు.వ్యక్తిలోని అచిత్తు ప్రాక్తన వాంఛలను ఈవిధంగా దారి మళ్ళించి సైకిక(లిబిడో)శక్తిని ఉన్నతమార్గాలలో ప్రవహింపచేయక పోతే నాగరికతే లేదన్నాడు ఫ్రాయిడ్.ఈ నాటి నాగరికతకు మూలం ఈ ఉదాత్తీకరణ సదాశయమే.

విశ్వనాథ ఈ నవలలో ఉదాత్తీకరణ సదాశయాన్ని 'బద్దన్న'అనే కథానాయకునిలో దేశభక్తిగా మలచి అతడు ఆనాటి ఆంధ్రదేశ స్వాతంత్ర్యానికై పోరాడిన విధానాన్ని చిత్రిస్తూ, మరోప్రక్క బద్దన్నలో మిగిలిన కామేచ్ఛ అతని ప్రణయజీవితంలో ప్రవేశించి మొదటనది శారీరకమై,తదుపరి మానసికమై,ఆ తర్వాత ఆత్మగతమై చివరికి చైతన్యంలో లీనంగావటం విశ్వనాథ ఇందులో అద్భుతంగా చూపుతాడు.చారిత్రిక నవలగా ఇతివృత్తం అనిపించినా, ఇందులో నాయికానాయకుల మనస్తత్వచిత్రణే ప్రధానమైనది.

## 5.2 బద్దన్న సేనాని రచనా కాలం-కారణాలు.

ఈ నవలను విశ్వనాథ స్వాతంత్రోద్యమకాలంలో(1947) రచించాడు.పాశ్చాత్యులను భారతదేశం నుండి పారద్రోలటానికి గాంధీజీ భారతీయులకు పిలుపు నిచ్చిన తరుణం.ప్రతి భారతీయుడు సత్యాగ్రహమనే ఖడ్గాన్ని చేతబట్టి కదనరంగంలో కాలిడిన కాలం.స్వతంత్ర భారతంలో అందరూ సమానమనే మానవతా దృక్పథంతో గాంధీజీ ఆదేశాన్ని శిరసావహించి అంటరాని తనాన్ని పారద్రోలి హరిజనుల్ని అక్కున చేర్చుకున్న హరిజనోద్యమం,జాతీయోద్యమం దేశమంతటా ఉధృతంగా సాగుతున్నవేళ.ఆంధ్రకవులందరూ తమతమ గళాలెత్తి దేశభక్తి ప్రబోధకమైన కవితాగానాలు చేస్తున్న వేళ.మహారచయిత లందరూ జాతీయ సమైక్యతా నాదాన్ని తమతమ రచనల్లో పొందు పరుస్తున్న వేళ.

ఆ సమయంలో పుట్టింది ఈ బద్దన్నసేనాని అనే చారిత్రిక నవల.ఆంధ్రదేశాన్ని, ఆంధ్రుల శౌర్యాన్ని,కొనియాడుతూ హరిజనుణ్ణి నాయకునిగా చేసి అతని పరాక్రమాన్ని, ప్రణయాన్ని, ఇతివృత్తంగా గ్రహించి వీరశృంగార రసాన్విత కావ్యనవలగా మలిచాడు విశ్వనాథ.

విశ్వనాథకు దేశభక్తి మెండు.అందులో స్వస్థాన దేశ భాషాభిమానాలు ఆయనలో అధికం.ఆయన ప్రతి రచనలో వీటిని పొగడ్తుంటాడు."రచయిత పుట్టినిల్లు,పెరిగిన యూరు,ఆ

సీమయందలి అచారవ్యవహారాలు,పండుగలు,పబ్బములు,మొదలైన సర్వ విషయములకు తోడు వానిదైన జన్మాంతర గత సంస్కార సంపుటి ..ఇవి యన్నియు వాని మనస్సుమీద నుండునని శ్రీ విశ్వనాథయే పేర్కొనెను."[1]

విశ్వనాథ సాహిత్యరంగాన అవతరించునాటికి తెలుగు దేశాన రెండు,మూడు ఉద్యమాలు ఉధృతంగా సాగుతుండగా ఆయన ఆ ఉద్యమాలచే ప్రభావితుడై తన రచనలన్నీ ఆ విధంగా మలిచాడు.ముఖ్యంగా జాతీయోద్యమం,ఆంధ్ర రాష్ట్రావతరణోద్యమం, భావ కవిత్వో ద్యమం, ఈ మూడింటిచే ప్రభావితుడై ఈ నవలను వ్రాసినట్లు చెప్పుకోవచ్చు.

## 5.3 బద్దన్నసేనాని లోని కథావస్తువు.

ఆధునిక నవలకు కథ శరీరం వంటిది,కథా వస్తువు ప్రాణం వంటిది.కథా వస్తువు లేని కథలు కనిపించవచ్చునేమో గాని, కథ లేకుండా కథావస్తువు ఉండదు.నిజానికి మనస్తత్వ చిత్రణ నవలల్లో కూడా కథ నామమాత్రనికైనా ఉంటుంది.రచయిత కథా వస్తువును అనుసరించి కథారథనం చేస్తాడు.మనస్తత్వచిత్రణగల నవలల్లో కూడా ప్రయోజనాన్ని బట్టి కథావస్తువును ఎన్నుకొని రచయిత కథాకథనం చేస్తాడు.

విశ్వనాథ ,ఏకవీర-బద్దన్నసేనాని, నవలలను చారిత్రిక నేపథ్యంలో రచించినా అవి ప్రధానంగా మనస్తత్వచిత్రణ నవలలే.ఈ నవలలోని పాత్రల మనస్తత్వచిత్రణలో విశ్వనాథ తన అభిప్రాయాలకు,ఆలోచనలకు,అనుగుణమైన అంశాలతో కూడిన పాత్రలను చిత్రీకరించటానికి సాంఘిక వాతావరణం కన్న,చారిత్రిక నేపథ్యమే బలంగా ఉంటుంది అనే భావంతోనే విశ్వనాథ ఈ నవలను చారిత్రిక నేపథ్యంలో రచించారని చెప్పవచ్చు..

వ్యక్తియొక్క ప్రవర్తన కాలానుగుణంగా మారటం సహజం.అధునిక కాలంలో వ్యక్తి ప్రవర్తన సామాన్యంగా తన ఆత్మనిర్దేశంగా సాగుతుందనటంలో సందేహంలేదు.సాంఘిక వ్యవస్థలు కూలిపోతున్న దశలల్లో,వ్యవస్థాధర్మం క్రమంగా వైయక్తిక జీవితంనుండి దూరమౌతూ ఉన్నపుడు, ఆత్మాభిలాషయే వ్యక్తికి ఆదర్శమైనపుడు,ఆతని మనస్తత్వం పూర్తిగా స్వార్థాభిలాషతో కూడినద వుతుందని భావించవచ్చు.

విశ్వనాథ రచనలు వైయక్తికాభిలాషలకు,స్థానమిచ్చునవి కావు.విశ్వనాథ దృష్టిలో వ్యక్తి కన్న వ్యవస్థ ముఖ్యం."భారతీయమత,తాత్విక,సంప్రదాయ విషయాల నన్నింటినీ,ఆధునిక చైతన్యంతో పునర్విచారణ చేసుకొని కలిసి వచ్చిన వాటిని కలిసి వచ్చినంత కలుపుకొని,పోవటం అభివృద్ధి లక్షణమనే,శాస్త్రీయ లక్షణమనే, అభ్యుదయ దృక్పథానికి ఆయన ఎక్కువగా అనుకూలుడు. ప్రతి విషయాన్ని,సమస్యను,తాత్కాలిక దృష్టితోగాక అనంతకాల జ్ఞానంతోను విచారించాలనీ, పరిష్కరించాలనీ,అది మానవ జీవితానికి సరియైన మార్గమనీ,ఆయన ఉద్దేశం" అని కేతవరపు

---

1.'జాగృతి' (26-1-71)వ్యాసంలో విశ్వనాథ ప్రకటించిన భావం.

రామకోటి శాస్త్రిగారు పేర్కొన్నారు.”[2].

భారతీయ ప్రాచీన సంఘం మత,తాత్విక,సంప్రదాయ,లక్షణాలతో విలసిల్లి నట్టిది.ఆ సంఘులో, ఆ వ్యవస్థలో,పుట్టి పెరిగిన వ్యక్తులు సాధారణంగా వైయక్తికమైన అభిలాషలెన్ని ఉన్నా వాటినన్నింటిని అణచుకొని సాంఘిక వ్యవస్థా ధర్మానికై కట్టుబడి ఉండేవారు,అందువల్ల విశ్వనాథ మనస్తత్వచిత్రణే 'కధావస్తువుగా'ఎన్నుకున్న సందర్భంలో ఆ వస్తువుకు తగిన నేపథ్యం బలంగా ఉండాలనే ఉద్దేశంతోనే చారిత్రిక వాతావరణంలో 'బద్దన్నసేనాని' అనే నవలను రచించాడు. ఇందులోని పాత్రల మనస్తత్వాలలోని సంఘర్షణ బలీయమై “వ్యవస్థా ధర్మమా? లేక వైయక్తిక ధర్మమా?వ్యక్తికి ఏది ముఖ్యం?అని నిర్ణయించుకోలేక ఆ పాత్రలు మాపసికంగా చితికిపోవటం,చివరకు 'వ్యవప్థా ధర్మానికి' ఆ పాత్రలు ప్రాతినిధ్యం వహించే విధంగా ప్రవర్తించుటకు 'చారిత్రిక నేపథ్యమే' ఆయా నవలలకు నిండు తనం చేకూర్చుతుందని, ఆధునిక సామాజిక వాతావరణం చేకూర్చదనే నిశ్చయంతోనే విశ్వనాథ తన నవలలకు చారిత్రిక నేపథ్యాన్ని ఆధారంగా తీసుకున్నాడు.

“విశ్వనాథ ఏకవీర,బద్దన్నసేనాని,చారిత్రిక నేపథ్యంలో ఉంచిన 'వ్యక్తి ప్రధాన నవలలు మాత్రమే.ఏకవీరలో వీరభూపతి,కుట్టాను,మీనాక్షి ఏకవీర ల ప్రణయం 'బద్దన్న సేనానిలోని బద్దన్న బాదమ్మల ప్రణయం,దానికి సంబంధించిన ధార్మిక సమస్యలు,చరిత్రకంటె ముఖ్యం.ఈ నవలల్లో చరిత్ర కేవలం నేపథ్యం మాత్రమే.'[3].

ఈ నవలలోని చరిత్ర నిర్మాణం,ఒక ప్రయోజన దిశగా రూపుదిద్దుకున్నదే.చరిత్ర గతిలో స్వాతంత్ర్యసిద్ధికై పోరాడిన ఒక ఘట్టంలోని ఆంధ్రుల వీరత్వాన్ని ఆధారం చేసుకొని విశ్వనాథ ఈ చారిత్రిక కథను కల్పించాడు.

“పశ్చిమ చాళుక్యుల పరిపాలన వల్ల తెలుగుదేశానికి స్వాతంత్ర్యం పోయిందనీ,దాన్ని తిరిగి సంపాదించటానికి 'బద్దన్న'అనే ఒక సామాన్యుదు మహావీరుడై సైన్యాన్ని సమకూర్చుకొని విజయం సాధించిన విషయాన్ని కథగా మలచుకొని విశ్వనాథ ఈ నవలను వ్రాసాదు.చరిత్రలో బద్దన్న లేదు.వెలనాటి చోళులు మాత్రం పశ్చిమ చాళుక్యులను వేంగీనుండి పారద్రోలుటకు రహస్య యత్నం చేసినట్లు చరిత్ర సూచిస్తోంది.ఈ సూచనను ఆధారం చేసుకొని విశ్వనాథ ఈ నవలేతి వృత్తాన్ని కల్పించాడు.ఈ విధంగా ఇది చారిత్రిక నవల అయింది.ఇది మరింత బలంగా ఉండటానికి వీలుగా అప్పటి చరిత్రలో ప్రసిద్ధంగా కనిపిస్తున్న వెలనాటి చోడుడైన గొంకభూపతి, చాళుక్య చోళ చక్రవర్తి కులోత్తుంగ చోళుదు,నాదెండ్ల విషయము,శత సహస్ర విషయము,వేంగీ విషయము,రెండేరుల నడిమి విషయము,మొదలైన వ్యక్తుల, మరియు స్థలముల పేర్లు నవలేతి వృత్తంలో చొప్పించబడ్డాయి”

---

2.విశ్వనాథ వైఖరి.పుట.270. 3. నవలా శిల్పం. పుట. 114. 4. విశ్వనాథ వైఖరి. పుట.253.

పై వివరణ వల్ల ఈ నవలలోని చారిత్రిక నేపథ్యం ఒక ఘటనకు సంబంధించనదని, దాని ఆధారంగా విశ్వనాథ 'బద్దన్న' అనే కల్పిత పాత్రచేత స్వాతంత్ర్య పోరాటాన్ని కొనసాగించిన విధానాన్ని అత్యద్భుతంగా మలచి చూపటం 'కథగా' ఇందులో ప్రాధాన్యత కలిగి ఉంది. బద్దన్న మనస్తత్వ చిత్రణలో దేశభక్తిని ప్రవేశపెట్టి అతనిలోని శౌర్యధైర్యసాహస పరాక్రమాదులను దేశస్వాతంత్ర్య లక్ష్యం వైపు మరలించి ఆంధ్రదేశ విముక్తికోసం పోరాడినట్లు చిత్రించటం,ఒక మహావీరుని మనస్తత్వం ఉదాత్తీకరణం పొంది సదాశయంతో పోరాడిన విధం,మరియు ఆ వీరునిలోని బలహీనతే వైయక్తిక జీవితాన్ని ఎన్నుకోవటంలోను,ఆత్మధర్మాన్ని నమ్ముకొని బాదమ్మతో వైవాహిక జీవితం గడపటంలోను,సామాజికంగా ఆతడు అపరాధిగా గుర్తింపబడి శిక్షింప బడటంలోను,చివరికి వ్యవస్థా ధర్మానికి లొంగి ఆత్మార్పణం చేయటంలోనూ,బద్దన్న బాదమ్మలు పొందిన మానసిక సంఘర్షణే ఇందులో అత్యధికంగా చూపటంవల్లనూ,ఇదే 'కథా వస్తువుగా' నిర్ణయించడమయింది.

## 5.4 బద్దన్న సేనాని నవలలోని కథా సారాంశం.

ఆంధ్రదేశం క్రీ.శ. 1126 ప్రాంతంలో చాలాకాలం పశ్చిమ చాళుక్యుల పాలనలో ఉంది. కృష్ణా,గోదావరి మధ్యస్థమైన తెలుగుదేశాన్ని వెలనాటి చోళులు పాలిస్తున్నారు. వెలనాటి చోళులు క్షత్రియులు కారు. చతుర్థ కులజులు. వీరి రాజధాని ధనదుపురం. రెండవ గొంకరాజు పాలకుడు. ఈయనుకు బంధువులు,సామంతులు అయిన దుర్జయమందుడు నాదెండ్లలోను, నంబయ్య చేబ్రోలులోను రాజ్యం చేస్తున్నారు. ఆంధ్రవీరులు నిర్వీర్యులై తమ తేజాన్ని,శౌర్యాన్ని, మరచి మత వైషమ్యాలతో,కయ్యాలకు కాలుదువ్వుకుంటున్న కాలమది. శైవ,వైష్ణవ,మతాల విజృంభణతో ఆంధ్రదేశం అతలాకుతలమయింది. విజయావాటికా రాష్ట్రకూటుడు,పశ్చిమ చాళుక్యుల సేనానాయకుడైన గోవిందర్సు కుడిభుజమైనవాడు,తాళవృక్ష ప్రమాణ దేహుడు, అరివీర భయంకురుడు,వీరశైవుడు,అయిన కరవాలభైరవుడు కాలుదువ్వుతూ తూర్పుచాళుక్యులను, సామంతరాజులను,ఆంధ్రవీరులను,శైవులను,భయపెడుతూ,వీరవహారం చేస్తున్న తరుణమది.

"మహాశివరాత్రినాడు వీరశైవుల ఉత్సవం ప్రాగ్దిశాభిముఖంగా బయలు దేరును. ఆ యుత్సవమెదురులేకుండా నెంత దూరము పోవునో అంతదూరము వీరశైవుల మతము ప్రాబల్యము చెల్లును. ఆ యుత్సవమును నేనే నడిపెదను. మీ ఆంధ్రదేశములో నెవడైన మహా వీరుడున్నచో నాతో ద్వంద్వ యుద్ధము చేసి నన్ను దరిమినచో విజయకూటముయొక్క ప్రాగ్దిశకు వీరశైవులు రారు. లేనిచో నీ భాగమంతయు వీరశైవులదే యగును." (బ.సే.5).*

ఈ ప్రకటనను పది రోజుల క్రితం కరవాలభైరవుడు చేయించాడు. మహాశివరాత్రినాడు విజయవాటికా సమీపంలో వీరశైవోత్సవం కరవాలభైరవుని నాయకత్వంలో బయలు దేరింది.

గమనిక. కుండలీకరణంలో చూపిన సంఖ్యలు నవలలోని పుటల సంఖ్యను తెలుపును.

ఆంధ్రదేశాన వీరశైవులకు బలంలేదు.విజయవాటిక శైవుల ఉనికిపట్టు.వీరశైవులు ప్రాగ్దిశకు రారాదన్న నియముమున్నది.ఆ నియమం నేడు ఉల్లంఘింప బడుతున్నది.మహాశివరాత్రినాడు కరవాలభైరవుడు ఆ నియమాన్ని ఉల్లంఘించటానికి బయలుదేరాడు.ఆతడు ఒక నల్లని మహాశ్వంపై రాక్షసునివలె కూర్చున్నాడు.చుట్టూ పరివారం కాగడాలు చేబూని ఖడ్గపాణులైన వందల కొలదిమంది చుట్టూమూగి "జయజయ హరహర మహాదేవ"అని నినాదాలు దిక్కులు పిక్కేటట్లు చేస్తూ ముందుకు కదిలిపోతున్నారు.వారంతా విజయవాటికను దాటి ముందుకు వెళ్ళే ప్రయత్నంలో ఉన్నారు.ఈ శైవోత్సవం విజయవాటిక దాటి పోరాదు.అది పూర్వంనుండి వచ్చుచున్న కట్టడి. కరవాలభైరవుని ఎదిరించి నిలుచు వీరుడొక్కడూ ఆ సమయంలో లేడు. వాణ్ణి, వాని ఆకారాన్ని చూసి జనమంతా హడలిపోతున్నారు.వీరశైవులు వాని అండచూసుకొని విర్రవీగుతున్నారు.పశ్చిమ చాళుక్యుల సగం బలం కరవాలభైరవునిదే.మతవ్యాప్తికి వాడు పూనుకొని ఈవిధంగా ఈనాడు విజయవాటిక దాటి రావటానికి ఉద్యమిస్తున్నాడు.వీరశైవుల మతవ్యాప్తికొరకే కరవాలభైరవుడు విజయవాటికా రాష్ట్రకూటిడిగా నియుక్తుడై అధికారం చలాయిస్తున్నాడు.అధికార బలం కలిగినవాడు అహంకారంతో,మదంతో,వాడీనాడు శైవోత్సవం పేరిట కట్టడిదాటి ముందుకు రాదల్చాదు కయ్యానికికాలుదువ్వాడు.ఆ సమయంలో పదుచువాడు,పదునైన కత్తిబలం కలవాడు, ఖడ్గవిద్యా విశారదుడు,తెలుగుతనాన్ని,శౌర్యాన్ని, తేజాన్ని,మూటగట్టుకున్నవాడు,కుడిచేతిలో కత్తి,ఎడమచేతిలో డాలుపట్టి,కాసెబిగించి,కరవాల భైరవుని ముందుకు వచ్చాడు బద్దన్న.

బద్దన్నను చూసి భైరవుడు ఫకాలున నవ్వి 'ఎవ్వడవు నీవు?' అన్నాడు.

"నేను కులము చేత పంచముడను.నా పేరు బద్దన్న. ఈ దేశము వీరశైవులదికాదు. ముప్పది ఏండ్లనుండి అనగా వీరశైవులు ఇచ్చటికి వచ్చిననాటినుండి వీరశైవులకు విజయవాటము యొక్క తూర్పుదేశము ప్రచారములో లేదు.మొదటినుండియు నీ కట్టడికలదు. ఈ కట్టడి నేడేల యుల్లంఘింప బడుచున్నది."అని అడిగాడు బద్దన్న.

కరవాలభైరవుడు సమాధానం చెప్పలేదు."నాతో యుద్ధమాడ వచ్చితివా?'అన్నాడు. "అవునన్నాడు'బద్దన్న. భైరవుడు పెద్దగా నవ్వుతూ "ఏమోయీ ! కత్తినేర్పు చూపించుటకు వచ్చితివా? ఇందులో గెలుచుటలేదు.సంహరించుటయే."అన్నాడు.'చిత్తమన్నాడు'బద్దన్న.

ఇద్దరికి పోరు సంభవించింది.ఖడ్గవిద్యలో అసమాన ప్రతిభ కనబర్చాడు బద్దన్న.తన్ను తాను రక్షించుకోవటంవల్ల చాలా శ్రమపడ్డాడు భైరవుడు.తనకు మించిన యోద్ధ తనతో తలపడి నందుకు భైరవునికి చెమటలు పోశాయి.ఆయాసం ఎక్కువైంది.బద్దన్నను చంపాలనే భైరవుని ప్రయత్నం సాగలేదు.ఓడిపోవటం ఇష్టంలేదు.ప్రాణాలొడ్డి శక్తికి మించి పోరాడసాగాడు.అలసిన భైరవుని బద్దన్న క్రింద పడద్రోసాడు.రొమ్ముమీద కూర్చున్నాడు.

"ఓరీ ! శివుడు శివుడందువు.నీవు శైవుడవే,నేను శైవుడను.అతడు జ్ఞానాకృతి.ఆత్మ

స్వరూపుడు. కాని సంఘవ్యవస్థా రూపుడుకాడు. నీ శైవమేమిటి?"అని అతడి మెడ నరికాడు.

ఒక లక్ష కంఠాలనుండి "జయజయ మహాదేవ శంభోశంకర" అనే మహానినాదాలు చెలరేగాయి. బద్దన్న భైరవుని చంపి చంఢశాసనం చేసాడు. "ఇదిగో ! ..నేను శాసించుచున్నాను. ఇదిగో బద్దె. ఈ కట్టడి నెవ్వడు,నెప్పుడు, ఉల్లంఘింపరాదు. ఉల్లంఘించినచో నిదియే శిక్ష"(13).

కరవాలభైరవుని వధతో నవల ప్రారంభమౌతుంది. బద్దన్న ప్రతాపం,శౌర్య ధైర్యాలు, ఆంధ్రదేశమంతటా వ్యాపించాయి. బద్దన్న పేరు దశదిశలా ప్రాకిపోయింది. బద్దన్న పేరు విన్నవారే కాని విజయవాటికా పురవాసులు తప్ప ఇతరులెవ్వరు అతన్ని చూసినవారుకాదు. బద్దన్న స్వగ్రామమైన 'గోశాల'కిది వ్యాపించగానే గోశాల ప్రజలందరూ ఆ వీరునికి ఘన స్వాగతం పలికారు. ఆ స్వాగత ఉత్సవంలో ప్రజలనుద్దేశించి బద్దన్న అ విధంగా చెప్పాడు.

"మనమాంధ్రులము. ఈ రాజ్యము తూర్పు చాళుక్యులది. పశ్చిమ చాళుక్యులు ఈ రాజ్యము నాక్రమించి ఏడేండ్లయినది. మనము ప్రాచ్యులము. వారు పాశ్చాత్యులు. (పశ్చిమమున నుండువారు). వారికి మనకు శాతవాహనుల కాలమునుండి పొత్తులేదు. మనది ఆంధ్ర సామ్రాజ్యము. నా కులము పంచమ కులము. ఈ సామ్రాజ్యరక్షణకై ఎంతోమంది వీరులు ఈనాటి వరకు తమ రక్తాన్ని ధారపోసి త్యాగధనులయ్యారు. నేనీ రాజ్యము పశ్చిమ చాళుక్యుల వశము చేయను. నేనీనడిమేరులనాటినుండి పశ్చిమ చాళుక్యులను తరిమి వేసెదను. రాజ్య మంతయు గొంకరాజున కిచ్చెదను. ఒక్కొక్క ఇంటిలో నెన్ని కత్తులుండునో యన్ని కత్తులు నావెంట రావలయును. మన మందరము కలిసి ఆంధ్రుల స్వాతంత్ర్యదేవత నూరేగింప వలయును '('15.)

ఆనాటినుండి బద్దన్న ఆంధ్రదేశ స్వాతంత్ర్యానికై రాత్రింబవళ్ళు శ్రమించాడు. పశ్చిమ చాళుక్యుల వశమైన ఆంధ్రదేశాన్ని తిరిగితూర్పు చాళుక్యుల రాజైన వెలనాటి చోళభూపతి గొంకరాజుకు అప్పగించే వరకు నిదురపోలేదు.

కరవాలభైరవుని సంహారంతో అసహాయశూరుడైన బద్దన్న ప్రజల మనస్సులలో బద్దన్న సేనానిగా రూపుదిద్దుకున్నాడు. దేశంనుండి పశ్చిమ చాళుక్యులను పారద్రోలుటకు పథకాన్ని వేస్తూ దేశమంతా తిరుగుతూ,రహస్యంగా సైన్యదళాలను సిద్ధపరచాడు. ప్రజల్లోను, సామంతరాజుల్లోను, దేశాధిపతి గొంకరాజులోను ఏర్పడిన నిరుత్సాహాన్ని,మాంద్యాన్ని, తొలగించే ప్రయత్నం చేసాడు.

బద్దన్న సైన్యసమీకరణలో దనదుపురంలోని గొంకభూపతి,చేబ్రోలులోని నంబయ్య సహాయం తీసుకున్నాడు. అనేక వ్యూహాలతో,పథకాలతో,రహస్యంగా హనుమద్దళాన్ని,కటారి వాండ్ల దళాన్ని తయారు చేసి ఆంధ్రదేశంలోని ప్రతి యువకున్ని వీరునిగా తీర్చిదిద్దాడు. పంచమకుల అవతారపురుషుడుగా బద్దన్న ఈ నవలలో చిత్రింపబడ్డాడు.

ఈ విధంగా బద్దన్న జీవితంలో ఒక మలుపు దేశభక్తిలో లీనమై ఉదాత్తీకరణ పొంది సదాశయంతో దేశస్వాతంత్ర్యానికై పాటుపడగా,మరో మలుపు వైయక్తిక జీవతంలో అతని

బలహీనతకు గురై బాదమ్మ ప్రేమలో పడి అతని జీవితానికి చరమగీతం పాడింది.

బాదమ్మ ముప్పది ఏండ్ల స్త్రీ.ముసలి తిప్పన్న మూడవ భార్య.ఇరువైరెండేండ్ల బద్దన్నకు సుమారు పదేండ్లనుండిగురువు.ఖడ్గవిద్యలో మెలుకువలన్నీ బద్దన్నకు నేర్పింది.తన సొంతవూరు కొప్పాకలో నేర్చుకున్న "గుజ్జాపు ముంగాళ్ళ నరుకుడు" విద్యను బద్దన్నకు నేర్పి సరియైన కాలంలో కరవాలభైరవుని పైకి పంపింది.బద్దన్న తనకంటె పది సంవత్సరాలు పెద్దదైన బాదమ్మను లేవదీసుకొని వెళ్ళి దేశమంతా తిరిగి సైన్యసమీకరణం గావించాడు.కాని చివరలో తాను అపరాధిగా గుర్తింపబడి వ్యవస్థాధర్మానికి కట్టుబడి మరొకరిచే శిక్షింపబడక కత్తియుద్ధంలో తనకంటె అల్పుడైన వానిచేతిలో మరణిస్తాడు.

విశ్వనాథ ఈ నవలలో బద్దన్న జీవితాన్ని రెండు పాయలుగా విభజించుకొని,ఒక పాయను ప్రయోజన దిశగామలిపి దేశభక్తిపూరితమైన బద్దన్న జీవితాన్ని అతి సాహసమైనదిగా చిత్రించుటతో పాటు,మరోపాయను అతని ప్రణయంవైపు మలిపి ఆ ప్రణయమే అతని జీవితానికి చరమగీతం పాడినట్లు ముగించటం,అందులో బద్దన్న బాదమ్మల మానసిక సంఘర్షణను అతి ప్రతిభావంతంగా చిత్రించటం ఇందులో విశేషం.ముఖ్యంగా చివరలో బాదమ్మ పలుకిన పలుకులు విశ్వనాథ ప్రతిపాదించిన ప్రేమతత్వాన్ని కూడా వెల్లడిస్తాయి.

## 5.5 బద్దన్న మనస్తత్వ చిత్రణ

బద్దన్న పంచమకులజుడు.చిన్నపుడే తల్లి గతించింది.తండ్రి ఎనభైఏండ్ల వృద్ధుడు. కొడుకును ప్రేమతో పెంచాడు.తండ్రి మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు.కొడుకులో గతించిన భార్య రూపురేఖలు చూసుకొని మురిసిపోయేవాడు.వ్యవసాయం చేసుకుంటూ కొడుకుకు వండిపెడ్తూ కాలం గడిపేవాడు.బద్దన్న పన్నెండేండ్లు వచ్చేటప్పటికి కఱ్ఱసాము,కత్తిసాములలో,ప్రవీణు డయ్యాడు.శరీర వ్యాయామంతో దేహదార్ఢ్యం పెంచుకొని అసమానవీరుడిగా రూపుదిద్దుకున్నాడు బాదమ్మ దగ్గర సుమారు పదిసంవత్సరాలు శిష్యరికంచేసి అసమాన ఖడ్గవిద్యా విశారదుడయ్యాడు తనకు తెలియకుండానే బద్దన్న బాదమ్మను ప్రేమించసాగాడు.

బాదమ్మ బద్దన్నకన్న పదిసంవత్సరాలు పెద్దది.బాదమ్మ తండ్రి ఆమెను తిప్పన్న అనే వృద్ధునికి అమ్ముకున్నాడు.తిప్పన్న ఆ వూళ్ళో అంతో,ఇంతో శ్రీమంతుడు.గ్రామంలోని పెద్దపెద్ద రైతులకు అప్పులిచ్చేవాడు.బాదమ్మ వూరు కొప్పాక.కొప్పాకలోని పంచమవర్ణస్థుల ఖడ్గవిద్య 'గుజ్జము ముంగాళ్ళ నరికే విద్య' వారికే పరిమితమై ఉండేది.బాదమ్మ పుట్టింట ఈ ఖడ్గవిద్య నేర్చుకొని ప్రవీణురాలైంది.బద్దన్నకు ఈ విద్యనేర్పి అసమానశూరుణ్ణి చేసింది.అతి భయంకరుడైన కరవాలభైరవుని ఎదుర్కొన ప్రోత్సహించింది బాదమ్మే. బద్దన్న శివరాత్రినాడు కరవాలభైరవుని ఎదిరించి వానితల నరికింది ఈ విద్యవల్లనే.అప్పటికి బద్దన్న వయస్సు ఇరువై రెండేండ్లు.ప్రజల జయజయ ధ్వానాలతో పొంగిపోయి బద్దన్న ఒక ప్రకటన చేసాడు. ఆ ప్రకటన దేశభక్తి

పూరితమైంది. వయసు పొంగులో కరవాలభైరవుని వధించి చేపట్టిన విజయోత్సాహంతో పశ్చిమ చాళుక్యుల అధదీనంలో ఉన్న ఆంధ్రదేశాన్ని విముక్తం చేయాలని దృఢంగా నిశ్చయించుకొని స్వాతంత్ర్యపోరాటానికై సిద్ధంకండని ప్రజలను మేల్కొల్పాడు. వారిలో నూతనోత్సాహాన్ని కలిగించాడు. రాత్రింబవళ్ళు శ్రమించాడు.

## 1) బద్దన్న మనస్తత్వంలో దేశభక్తి.

ఇరువైరెండేండ్లున్న బద్దన్నలో దేశభక్తి నెలకొనటానికి కొన్ని కారణాలున్నాయి. మొదటిది. బద్దన్న మపస్తత్వంలో వయస్సుతోపాటు పెరిగిన తీవ్రమైన కామేచ్ఛాశక్తి. దానికి తోడు అతడు నేర్చుకున్న ఖడ్గవిద్యా నైపుణ్యం, శారీరక దారుఢ్యం, అంతేగాక ఆ ప్రాంతానికి శౌర్యశాలిగా ఖ్యాతిగాంచిన, కరడుగట్టిన వీరశైవ దురభిమానియైన కరవాలభైరవుని ఎదిరించి చంపడమే. బద్దన్న, వాని శరీరం పడియున్న స్థలంలో నిలచి "ఇదిగో నేను శాపించుచున్నాను, ఇదిగో బద్దె, ఈ కట్టడి నెవ్వడుల్లంఘింపరాదు. ఉల్లంఘించినచో నిదియేశిక్ష"అని శాసించాడు.

బద్దన్నకిది మొదటివిజయం. మతపరంగా శైవాన్ని నిలబెట్టి విజయం సాధించాడు. ప్రజల్లో మహావీరునిగా, మహాసేనానిగా, ముద్రించుక పోయాడు. ఆ ఉత్సాహంలో బద్దన్నకు తన శక్తి సామార్థ్యాలమీద నమ్మకం కలిగింది. అందుకే ఆతడు వీరశైవ మతావలంబులైన పశ్చిమ చాళుక్యులను దేశంనుండి తరిమికొట్టాలని నిర్ణయించుకొన్నాడు. ఆ ఉద్దేశాన్ని, స్వాతంత్ర్య సమరాన్ని, ఆదర్శంగా చేసుకున్నాడు. ఆ ఆదర్శమే అతన్ని ముందుకు నడిపింది.

రెండవది, బద్దన్నలో సహజాతాలవల్ల పుట్టిన ఉద్రిక్తత. ఫ్రాయిడ్ వాదంప్రకారం బద్దన్నలో లైంగిక సహజాతాల ప్రేరణ అధికమైనందువల్లనే ఆతడు పన్నెండేండ్ల వయస్సులో కత్తిసాము, కఱ్ఱసాము, శారీరకవ్యాయామం, మొదలైన వాటివల్ల తనలోని ఉద్రిక్తతలను అణచుకో కలిగాడు. యుక్తవయస్సులో ఆతనిలోని లిబిడోశక్తి ఉదాత్తీకరణంపొంది 'దేశభక్తి' వైపు మరలింది. ఈ విధంగా బద్దన్నలోని అమితమైన కామేచ్ఛాశక్తి ఉదాత్తీకరణం పొంది సదాశయాన్ని చేపట్టింది

అడ్లరు ప్రయోజనతా వాదానుసారం సంఘజీవియైన బద్దన్నలో కరవాలభైరవుని వధతో అతనిలో ఉత్సాహంపెరిగి మనస్సును సంఘశ్రేయస్సు కోరిమరలించాడు. స్వాతంత్ర్య సిద్ధికై పోరాడటమే అప్పటి లక్ష్యంగా నిర్ణయించుకున్నాడు. నాటినుండి నిర్విరామంగా రాత్రింబవళ్ళు తిరుగుతూ సైన్యసమీకరణకు పూనుకున్నాడు. ఈ విధంగా బద్దన్నలో సాంఘికాభిరుచి పెరిగి దేశభక్తికి మూలమైనిలిచింది.

యూంగ్ ప్రతిపాదించిన జాతివారసత్వ వాదానుగుణంగా బద్దన్నలోని సమష్టి అచేతనం ఉద్దీప్తమై దేభక్తిగా పరిణమించింది. వ్యక్తి దమింపచేసుకున్న కోరికలకు, వాంఛలకు, వైయక్తిక అచేతనం మూలంకాగా, సమష్టి అచేతన మనునది జాతివారసత్వాన్ని ఆశ్రయించుకొని ఉంటుందని యూంగ్ అభిప్రాయపడ్డాడు. జాతివారసత్వంలోని మతం, భక్తి, అనేవికూడా వ్యక్తిలో మూలరూపాలై

చేరునట్టివే. ఇటువంటి ప్రాచీనభావాలు మానవుని విడువకుండా ఆనువంశికంగా వ్యక్తిలో చేరుకుంటవి. మతం వ్యక్తిలోని అనేక భావాలకు మూలమై నిలుస్తుంది. మతంద్వారా ఆధ్యాత్మిక చింతన, భక్తిభావం, వ్యక్తిలో రూపుదిద్దుకుంటుంది. భక్తిఅనేది దైవంవేపు మరలించినచో 'దైవభక్తి'గానూ, దేశంవేపు మరలించినచో 'దేశభక్తి'గానూ మారుతుంది. బద్దన్న శైవుడు. అతనిలోని భక్తిభావం రెండువైపులా ప్రవహించింది. మొదటిది దేశభక్తి, రెండవది శైవభక్తి. భక్తియున్నచోట సేవాభావం కూడా ఉంటుంది. అందుకే బద్దన్న రక్తమంతా సేవాభావంతో నిండిపోయింది. బద్దన్న ఇలా అంటాడు.

"ఆరువందల ఏండ్లనుండి మనదేశము, మనదేశము. మనసామ్రాజ్యము. మన సామ్రాజ్యము. నా కులము పంచమకులము. ఈ సామ్రాజ్యరక్షణకై అయిదువందల ఏండ్లుగా నెన్ని కోట్లమంది నా కులమువారు తమరక్తబిందువులోడ్చిరో? వెలనాటి చోళులు చతుర్థ కులజులు. ఈ గడ్డవారిది. వారు దీనికి రాజులు. వారీనేలమీద అధికారము వదులుకున్నను పంచమ కులజులము మేము వదులుకోము. శాస్త్రములందు కూడా నుత్తరోత్తరము బలీయ మందురు. అన్నిటికన్న నుత్కృష్టమైన బలముగలది మా కులము. నేనీ రాజ్యము పశ్చిమ చాళుక్యుల వశము చేయను. నేనీ నడివేరులనాటినుండి పశ్మిచాళుక్యులను తరమివేసెదను. రాజ్యమంతయు గొంకరాజునకు ఇచ్చెదను. (బ. సే. 15)

చారిత్రిక సత్యాన్ని, పంచమకులజుల పౌరుషాన్ని, వారి సేవాభావాన్ని మర్చిపోలేని బద్దన్న పశ్చిమచాళక్యుల పాలనలో చిక్కిన ఆంధ్రదేశానికి విముక్తి కలిగించాలనే తపనలోపడ్డాడు తన కులంవారందరినీ జాగృతంచేసి వారిని సమాయత్తపరచి వారిలో నూతనోత్సాహం కలిగింప చేసి, స్వాతంత్ర్య సమరానికై నడుముకట్టాడు. ఈ విధంగా అతనిలో దేశభక్తి నరనరాన పొంగులు వారేవీరత్వంతో, సేవాభావంతో పుట్టుకొచ్చింది.

బద్దన్న ఊరూరా తిరిగి రహస్యసమాలోచనలు చేయటం, దళాలను సమాయత్త పరచటం, ఒక్కొక్క సారి బాదమ్మకై పరితపించటం, చూసిన తండ్రికి భయమేసింది. "బద్దన్న కొడుకు సంగతి యంతయు చూచుచుండెను. తండ్రికి కొడుకు మనసులోని బాదమ్మ కనిపించదు. కాని బాదమ్మవలన కలిగిన మనోవికారమంతయు గనిపించుచునే యుండెను. ఈ వికారము కామ జన్యమా? రాజకీయవ్యవహార సంభూతమా? కామజన్యమనుటకు దండ్రి కాధారము కనిపించలేదు"(39)

బద్దన్నలోని లైంగిక సహజాతాల ప్రేరణలే ఉదాత్తీకరణం పొందాయనీ, విశ్వనాథ పై మాటల్లో వ్యంగ్యంగా ధ్వనింపచేసాడు. "ఈ వికారము కామజన్యమా? అనుటలోనే బ్దన్నలోని దేశభక్తి లిబిడో వల్లనే ఉదాత్తీకరణం పొందినదని చెప్పవచ్చు.

## 2) బద్దన్న మనస్తత్వంలో రాజకీయం.

బద్దన్న జీవితం రాజకీయంగా మలుపు తిరగటానికి అతనిలోనే దేశభక్తే కారణం. బద్దన్న జీవనశైలిని ఆంధ్రదేశ విముక్తి కోసం మలచుకున్నాడు. పశ్చిమచాళుక్యులతో పోరాడటానికి అవసరమైన సైన్య సమీకరణకు నడుం కట్టాడు. బద్దన్న రాజకీయజీవితం అధికార వాంఛాపూరితం కాలేదు. కేవలం సేవాభావ తత్పరతే దానికి కారణం. అతడేపదవి ఆశించకుండా తన మాతృదేశ ఋణం తీర్చుకోవటానికి పుట్టిన కర్మవీరునిగా రూపొంది తన రాజకీయచాతుర్యాన్ని చూపాడు.

నన్నయ్య,బద్దన్న రాజకీయవ్యవహారం చూసి,ప్రశంసించి,"బద్దన్నా ! నీవు పంచములలో పుట్టుటతో వచ్చినది. లేనిచో నిన్ను రాజును చేసెడివాడను."అన్నాడు. అందుకు బద్దన్న చేతులు జోడించి"అట్టి మాటలు మటాడకుడు. మేము మట్టిజీవులము. మాకు రాజ్యము లెందుకు? కాదు దొరా!రాజ్యము చేయుదుము,అన్నికులముల వారిని పాలింతుము,బ్రాహ్మణుల నెట్లుపాలింతుము? మీ యజ్ఞములు,మీ వేదములు,మా చేత పాలింపబడునా?"అన్నాడు. నన్నయ నవ్వి'పోరా పో ! అది నీ కులముయొక్క కర్మము. నీ వంటివానియొక్క భయముయొక్క ఫలితము" అన్నాడు.

నిజానికి బద్దన్నలో క్షత్రియలక్షణాలున్నాయి. ధైర్యసాహసాలున్నాయి. రాజనీతిజ్ఞత ఉంది. శత్రువులను ఏ విధంగా పారద్రోలాలో యోచించి పథకాలు వేయటంలో సమర్థుడు. కాని తనస్థానమేదో గ్రహించి తనస్థానానికి వన్నె తెచ్చినవాడు. పంచమకులజుడు కావటంవల్ల సేవాధర్మమే తన ధర్మంగా భావించాడు. "యుద్ధము వచ్చినచో మేము సేన. లేనిచో పాలేరులము. మాలో దేవుడు పుట్టినను మీకు బంటులము,"అని బద్దన్న నన్నయతో తన విధేయతను ప్రకటించుకున్నాడు.

విజయవాటిక ఒక రాజప్రదేశం. దాని అధికారి కాలభైరవుడు. ఇతడు పశ్చిమ చాళుక్యులచే నియమింపబడినవాడు. బద్దన్న కాలభైరవుని వధించిన వృత్తాంతం దేశమంతా ప్రాకింది. ధనదుపురం వెలనాటి చోళుల రాజధాని. చేబ్రోలు మరొక రాజప్రదేశం. ఈ ప్రదేశాల్లో పశ్చిమచాళుక్యుల సైన్యం కొంతనిలువ ఉండేది. ధనదుపురంలోని పశ్చిమచాళుక్యసేనాని, కరవాలభైనవుని సంహరించినందులకు బద్దన్నను పట్టుకోవాలని ప్రయత్నించాడు. అది సాధ్యం కాలేదు. వీరశైవులకు,శైవులకు,సంబంధించిన కలహంగా,మతవిషయకంగా,భావించి ఊరుకున్నాడు. ఈ మతవిషయక కలహాన్ని రాజకీయాలకు ముడిపెట్టినచో దేశమంతా విప్లవాలతో మునిగిపోతుందని భయపడ్డాడు.

బద్దన్న ఇదే అవకాశంగా భావించి ఊరూరా తిరిగి రహస్యసమావేశాలు జరిపాడు. గ్రామగ్రామానికి దళాలను తయారుచేసాడు. దళనాయకులను,దళవాయిలను నియమించాడు. ఏబై ఊళ్ళకు ఒక దుముదారును ఏర్పాటు చేసాడు. వీరందరి దృష్టిలో బధన్న సేనానిగా రూపుదిద్దుకున్నాడు.

ఈ విధమైన శ్రమతో అప్పటికప్పుడే ఇరువదివేల సైన్యాన్ని తయారుచేసాడు. హనుమద్దళాన్ని,రామదండును,కటారివాండ్లను,సేనానాయకులను,తురుముదారులను, రహస్యంగా ఏర్పాటుచేస్తూ,దేశమంతా తిరిగాడు.తనకు నమ్మకమైన పదమందిని వెలనాటి దేశానికి, పదిమందిని వేంగీదేశానికి,పదిమందిని కర్ణాటరాష్ట్రానికి,పంపి వారిని కూడా తాను సమీకరించిన సైన్యంలా రహస్యంగా సైన్యాన్ని సమీకరించుమని ఆదేశించి పంపాడు.

ఈ సైన్యానికి కావాల్సిన ఆహారం,ఆయుధ సంపత్తి, కావాల్సివచ్చింది.అంతేగాక తాను తయారుచేసిన పదాతిదళాలతోపాటు,అశ్వికదళం,గజదళం,కూడా కావాల్సి ఉన్నందువల్ల బద్దన్న నాదెండ్లలోని మందయ్యను,చేబ్రోలులోని నంబయ్యను కలవాలని బయలుదేరాడు.

బద్దన్న నాదెండ్లలోని గంగచోడుని కలిసి అతని సహాయంతో దుర్జయమందయ్యను కలుసుకున్నాడు.తాను చేసిన ప్రయత్నాలన్నీ చెప్పాడు.తాను ఇరవైరెండువేల పదాతిదళాన్ని సమకూర్చాననీ,దానికితోడు పదహారువేల సైన్యంమీది,పదివేలసైన్యం నంబయ్యగారిది కలిసి మొత్తం నలుబైఎనిమిదివేల సైన్యంతో పశ్చిమచాళుక్యులను ఎదిరించవచ్చనీ నచ్చచెప్పాడు. వారిని ఎలా ఎదుర్కోవాలో తాను పథకం సిద్ధం చేసానని,ఈ విషయాన్ని రహస్యంగా ధనదుపురంలోనున్న గొంకభూపతి మహారాజుకు తెల్పాలనీ,ఆ ప్రభువుల పేరుమీదనే ఇదంతా జరగాలనీ,అందువల్ల వెంటనే మీరు,నంబయ్య వెళ్ళి మహారాజును కలిసి రావాలనీ,ప్రార్థించాడు బద్దన్న సేవాభావాన్ని,ప్రయత్నాన్ని,పథకాన్ని,మందయ్య మెచ్చుకున్నాడు." బద్దన్నా ! నీ వంటివాడు చేసినపని కాదనను.మేమేడేండ్లు నిదురపోతిమి.నీవు వచ్చి మేల్కొల్పితివి.మేల్కొన్న తర్వాత మా యహంకారమెందులకు?(79)."అన్నాడు. సైన్యానికి కావాల్సిన ఆహార ఆయుధ సంపత్తులను పంపిస్తానన్నాడు.మందయ్య మాటలకు బద్దన్న ఎంతో సంతోషించాడు.

మందయ్య సహాయం అందునంతవరకు బద్దన్న సైన్యానికి కావాల్సిన ఆహారాన్ని గ్రామగ్రామానికి,ఇంటిఇంటికి,తిరుగుతూ జొన్నలనూ,ధాన్యాన్ని,సమకూరుస్తూ,రహస్యంగా పథకాలు వేస్తూ,తనకు నమ్మకమైన వారిని సహాయాన్ని ఆర్థిస్తూ,ఎన్నోప్రయత్నాలు చేసాడు.

బద్దన్న అతికష్టంమీద చేబ్రోలులో నున్న నంబయ్యను కలిసాడు.నంబయ్య కొల్లిపాక పురాధిపతి.శతసహస్ర దేశాధిపతి.కృష్ణానదియొక్క దక్షినతీరాన ఉన్న మండలానికి ఈయన అధిపతి.ఇతడు రాజవంశీకుడు.గొంకరాజుకు సర్వసైన్యాధిపతి.అమర్చిపెట్టినచో అనుభవించు అధికారి,ఇతరులపై అధికారము చేయుట ఈతనిపని.తనంతటతాను సమకూర్చుకొనుటకు శక్తిచాలదు.అతడు ఫలమనుభవించుటకు పుట్టినవాడు.ధనవంతుడు.భోగి,అహంకాతి,అధికార ధూర్వహుడు,పరులశక్తి తెలుసుకోలేని వాడు,ఈర్ష్యాళువు.

నంబయ్యను బద్దన్న కలిసినా అతడు మాటాడలేదు.బద్దన్నను అనుమానించాడు. అవమానించాడు.బద్దన్న అధర్మకార్యం చేసాడని నంబయ్య భావన.అట్టివాడు దేశద్రోహంకూడా

చేయగలడని నంబయ్య అనుమానం.అందువల్ల బద్దన్న మాటలు నంబయ్యా నమ్మలేదు.తగిన సహాయం చేయటానికి ముందుకు రాలేదు.నంబయ్య తనను అవమానించినందుకు బద్దన్నలో పౌరుషం ముంచుకొచ్చింది.తానింతకాలంనుండి ఏ పదవి ఆశించకుండా కేవలం దేశ స్వాతంత్ర్యం కోసం పాటుపడ్తూ ఇరువైవేల సైన్యాన్ని సమకూర్చినందులకు మందయ్య తనను ప్రశంసించగా నంబయ్య తనను లెక్కచేయక పోవటం,అవమానంగా భావించాడు.నంబయ్యా మీద ప్రతికారం తీర్చుకోవాలనుకున్నాడు.బద్దన్న ఎలాంటివాడో నంబయ్యకు తెల్పాలనుకున్నాడు కాని సమయం కాదని మౌనం వహించాడు.

బద్దన్న ఒక పథకంతో వేంగీపురం చేరాడు.పూర్వం ఆంధ్రదేశాన్ని వేంగీ పల్లవరాజులు పరిపాలించారు.కాని క్రమంగా తూర్పు చాళుక్యరాజులు స్వతంత్రులయ్యారు.సుమారు ఆరువందల సంవత్సరాలు తూర్పుచాళుక్యులక్రింద ఆంధ్రదేశం శాంతిసౌభాగ్యాలతో విలసిల్లింది.ఆ సమయంలో వేంగీ ప్రభువులు తూర్పుచాళుక్యుల సామంతులైరి.క్రమంగా పశ్చిమచాళుక్యుల పాలనలో వేంగీరాజులు బలహీనులైరి.వేంగీపురాధిపతి త్రిపురాంతకదేవుడు. కేవలం పాతిక,ముప్పై గ్రామాలపై అధికారంకలిగి పశ్చిమచాళుక్యుల ఆజ్ఞలను పాలిస్తూ తన అధికారాన్ని కాపాడుకుంటూ ఉన్నవాడు.

బద్దన్న త్రిపురాంతకదేవుని కలిసాడు.కరవాలభైరవుని చంపిన బద్దన్నను చూసి త్రిపురాంతకుడు ఆశ్చర్యపోయాడు.బద్దన్న తాను చేసిన ప్రయత్నాలన్నీ చెప్పాడు. మందయ్య, నంబయ్య లను కలిసిన విషయాలను,వారి సహాయసహకారాలను వివరించాడు.త్రిపురాంతక దేవుడు బద్దన్న చెబుతున్న ప్రతిదానికి ఆశ్చర్యాన్ని,ఆనందాన్ని ప్రకటించాడు.చివరకు"నీవు మహావీరుడవు బద్దన్నా ఇంతకూ నన్నెందుకు కలిసావు?"అని అడిగాడు.

"అయ్యా ! నేను రెండేరుల నడిమివేంగీ విషయంలో ఇరువదిరెండువేల సైన్యాన్ని సమకూర్చితిని.పశ్చిమచాళుక్యులను ఈ దేశంనుండి తరిమివెయ్యాలని పథకమల్లితిని.ఈ సైన్యాన్ని నడుపగల నాయకుడు నాకు కనిపించలేదు.నేను నడుపగలను కాని నాకు కులము లేదు. అధికారంలేదు.ప్రభూ !ఆసేనాని మీరు.కత్తివిద్యలో నా అంతటివారు "అన్నాడు.బద్దన్న మాటలతో మురిసిపోయిన త్రిపురాంతకుడు,వారంరోజులు బద్దన్నతో కత్తియుద్ధంచేసి అందులోని మెలకువ లన్నీ నేర్చుకున్నాడు.బద్దన్న తాను నేర్చుకున్న ఖడ్గవిద్యలన్నీ ప్రభువుకు నేర్పించాడు.బద్దన్న మెచ్చుకొనునట్లుగా త్రిపురాంతకుడు ఖడ్గవిద్యలో ప్రవీణు డయ్యాడు.బద్దన్న మాటలు అంగీకరించాడు.అతనితో ఇలా అన్నాడు.

"బద్దన్నా ! విక్రమచోళుడు నీ చక్రవర్తి.గొంకభూపతి నీ రాజు.నేను నీకు ప్రభువును. నాసేన నీసేన నా అధీనంలో ఉంటుంది.ఆ సేనలకు నేను సేనానిని.నంబయ్యగారు మహా సైన్యాధిపతి.ఆయన ఆజ్ఞలిచ్చువాడు.నంబయ్యగారు తనసేనలను నడుపువాడుగాదు.రెండవది,

రెండేరుల నడిమివిషయములకు తాను ప్రభువు.కృష్ణా,గోదావరుల మధ్యస్థదేశమునకు తాను ప్రభువు" అని (142) బద్దన్న కోరినట్లుగా అంగీకరించాడు.

బద్దన్న త్రిపురాంతకునితో సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.త్రిపురాంతకుడు కొంత సైన్యంతో విజయవాటికకు చేరాడు.అక్కడ పశ్చిమచాళక్యసేనానిని ఈవిధంగా భయపెట్టాడు. "రహస్యముగా పెద్ద యుద్ధప్రయత్నము జరుగుచున్నది.పశ్చిచాళుక్యాధికారము తొలగించు పెద్ద ఉద్యమము బయలుదేరినది.కృష్ణా,గోదావరులమీద నా అధికారములేనిచో మీరీ ఆపదను తొలగ బెట్టుకోలేరు."అని త్రిపురాంతకుడు బయపెట్టేసరికి ఆ సేనాని వెంటనే ధనదుపురం వెళ్ళి వీర భళ్ళానునితో ఈవిషయం చెప్పాడు.వీరభళ్ళాలుడు తొందరగనే ఆప్రయత్నంలో నిమగ్నుడయ్యాడు.

కల్యాణినుండి తొందరగానే వార్తలు వచ్చాయి.త్రిఉరాంతకుడు వేంగీ నడిమేరుల విషయాధీశుడయ్యాడు.గొంకభూపతికిది తెల్సింది.నంబయ్య,మందయ్య లీ వార్తవిని ఆశ్చర్యంలో మునిగిపోయారు.త్రిపురాంతకుడు గొంకభూపతికి ఈ విధంగా లేఖ వ్రాసాడు.

"సర్వాంధ్రదేశమునకు మీరే ప్రభువులు.నేను వేంగీ విషయాధీశుడను.శతసహస్ర విషయమునకు నంబయ్యగారెట్లో,నాదెండ్ల విషయమునకు నేనట్లే.మీరు నాకు రాజులు.విక్రమ చోళుడు నాకు చక్రవర్తి."(144.)

త్రిపురాంతకుని విజృంభణతో విచిత్రమైన వాతావరణం ఏర్పడింది.పశ్చిమ చాళుక్యులకు ఏం జరుగుతుందో అర్థగాకుండా పోయింది.బద్దన్న చేబ్రోలుకు పోవటం,నంబయ్య అతనిని అవమానించటం,మొదలైన వార్తలు క్రమక్రమంగా దేశమంతా వ్యాపించాయి.ఈ వార్తలువిన్న వీరభళ్ళాలునితో బద్దన్న మనసువిరిగి అతడు తమలో చేరుతాడని త్రిపురాంతకుడు చెప్పగా నమ్మి వీరభళ్ళాలుడు,విజయవాటికలోని సేనాపతులు అంగీకరించారు.

బద్దన్న మొదట అజ్ఞాతంగా ఉంచిన సైన్యాన్ని మరోవిధమైన పథకంతో త్రిపురాంత కుని సహాయంతో ప్రత్యక్షంగా సమకూర్చే ప్రయత్నం చేయసాగాడు.పశ్చిమచాళుక్యులసైన్యానికే మాత్రం అనుమానం రాకుండా తాను సమకూర్చిన సైన్యాలనన్నింటిని వారివారి నాయకత్వంతో "కూర్మక్షేత్రాభిముఖంగా" వెడుతున్నట్లు పథకంవేసి ఏర్పాట్లుగావించాడు.బద్దన్న వేసిన పథకం ప్రకారం గొంకభూపతి,వీరభళ్ళాలుడు మందయ్య కూర్మక్షేత్రాభిముఖంగా బయలుదేరారు. నంబయ్యకేమీ అర్థంకాలేదు.త్రిపురాంతకదేవుడు తన సైన్యంతో కొంతదూరంవచ్చి పరిస్థితులను బట్టి వెనుదిరిగాడు.విజయవాటికలోని పశ్చిమచాళుక్యులను పారద్రోలి దాన్ని కైవసం చేసుకున్నాడు. వీరభళ్ళాలుడు అనుకోని పరిస్థితులలో చిక్కి పట్టుబడ్డాడు.సర్వాంధ్రదేశం క్రమంగా తూర్పు చాళుక్యుల వశమైంది.ఈవిధంగా ఆంధ్రదేశంనుండి పశ్చిమ చాళుక్యుల పరిపాలన అంతమైంది. బద్దన్నను అందరూ మరిచిపోయారు.

ఆనాడు గొంకభూపతి మహారాజు విజయసభ గావించాడు.ఆ సభలో యుద్ధంలో

పరాక్రమించి పోరాడిన యోధులకు,బహుమానాలర్పించాడు.మందయ్యకు,నంబయ్యకు, ప్రశంసలతో పాటు బహుమానాలు చిక్కాయి.నన్నయను,నాగయ్యను,పాపయ్యను సత్కరించాడు. ఎవడైతే తన పంచప్రాణాలను దేశవిముక్తికై వినియోగించి స్వాతంత్ర్యానికై దీక్షవహించి నిద్రాహారాలుమాని నిరంతరం సైన్యసమీకరణలో మునిగి అప్రమత్తతో మెలిగి అజ్ఞాతవీరునిగా వెలిగిన బద్దన్నను ప్రభువుగాని,సేనాపతులుగాని,నాయకులుగాని,స్నేహితులుగాని,స్మరించలేదు ఆ సభలో అతన్ని జ్ఞాపకం చేసినవారే లేరు.

ఈవిధంగా బద్దన్న సంపాదించి పెట్టిన స్వాతంత్ర్యబిక్షతో తూర్పుచాళుక్యులు తిరిగి తమ ఆంధ్రసామ్రాజ్యాన్ని ఏలుకోసాగారు.వారి పాలనలో దేశంలో శాంతి నెలకొంది.యుద్ధ వాతావరణం సమసిపోయింది.అందరి మనస్సులు కుదుటపడ్డాయి.బద్దన్న అజ్ఞాతంగా ఎక్కడో కాలం గడపసాగాడు.

## 3) బద్దన్న మనస్తత్వంలో ధార్మికత్వం.

ఎక్కడో అజ్ఞాతంగా తాను ప్రేమించిన ప్రణయమూర్తితో కాలం గడుపుతున్న బద్దన్నను ధర్మాభిలాషులైన కొందరు స్వార్థపరులు అధర్మాన్ని అణచాలనే వంకతో అతన్ని పరిషత్తులకు పిలిపించదలచారు.పరిషత్తుద్వారా శిక్షించదలచారు.దీనికి ప్రతి నాయకుడు నంబయ్య.అతనికి సహకరించినవాడు నాగయ్య.

రాజు నిష్పక్షపాతంగా బద్దన్నను బంధించి తెప్పించాడు.పరిషత్తు ముందుకు బంధీగా వచ్చాడు బద్దన్న.అతనిమీద అభియోగం తెచ్చినవాడు నంబయ్య.పరిషత్తు ఈ విధంగా ప్రశ్నించింది

"నీవు తిప్పన్న యనువాని భార్యను లేవదీసుకొని పోయితివా?లేదా?"అని అడిగాడు. రాజభటుడు. "అవును. లేవదీసుకొని పోయితిని."అన్నాడు బద్దన్న.

"గోశాల పరిషత్తు నిన్ను శిక్షించుటకు బిలువగా పారిపోయితివా?లేదా?"

"పారిపోయితిని."

నాగయ్య గోశాల నివాసి.బద్దన్నకు స్నేహితుడు.కపటి,అతడే "బద్దన్న ఈ దోషము చేసెననియు,తానెరుగుదుననియు,'సాక్ష్యమిచ్చాడు.నంబయ్య తాను అభియోగం తెచ్చానని ఒప్పుకున్నాడు.

పరిషత్తు నిర్ణయం ప్రకారం ఒక సేనానిమీద మరియొక సేనాని తనకు జోక్యంలేని అభియోగం తెచ్చినచో,అతనితో కత్తియుద్ధం చేయాలి.ఆ యుద్ధంలో దోషి చనిపోతే సరే. చనిపోనిచో పరిషత్తు శిక్షిస్తుంది.ఆ నిర్ణయం ప్రకారం బద్దన్న నంబయ్యతో కత్తి యుద్ధం చేయాల్సి వచ్చింది. కత్తియుద్ధంలో బద్దన్న ముందు నంబయ్య 'పులిముందు మేకలాంటి వాడు". తాను నంబయ్యను ఓడించినా పరిషత్తు తనకు మరణశిక్ష విధించకమానదు.తాను వ్యవస్థా ధర్మానికి వ్యతిరేకంగా అధార్మికమైన పనిచేసి ఇంతకాలం తప్పించుకొని తిరిగాడు.తాను సాధించదలచుకున్న

ఆంధ్రదేశవిముక్తి జరిగిపోయింది.దేశమంతా శాంతిసౌభాగ్యాలతో సుఖంగా ఉంది.తన అవసరం ఈ దేశప్రజలకు తీరిపోయింది. కాని ఈ దేశంలో ధర్మం వర్ధిల్లాలి.నాలాంటి అధార్మికుడికి శిక్ష పడాలి.ఇక ముందు ఇలా జరుగకూడదు.'అనే ఆలోచనలో బద్దన్న మనస్సు ధార్మికత్వంవేపు మొగ్గింది.బద్దన్న నంబయ్యతో నామమాత్రంగా యుద్ధం చేయసాగాడు.ఎన్నో సార్లు నంబయ్య బద్దన్న కత్తిదెబ్బలకు తట్టుకోలేక పోతున్నాడు.చూస్తున్న జనమంతా నంబయ్య పాట్లకు బద్దన్న ఖడ్గవిద్యా నైపుణ్యానికి ఆశ్చర్యపోతున్నారు.బద్దన్నకు నంబయ్య చేతిలో ఓడిపోవటం ఇష్టంలేదు. తనకంటె ఏన్నోరెట్ల తక్కువసాహసం,ఖడ్గవిద్యానైపుణ్యం,కలిగిన నంబయ్యను ఓడించటం బద్దన్నకు ఏమంత కష్టంకాదు.కాని బద్దన్న సంఘంముందు తలవంచాడు.ధర్మానికి కట్టుబడ్డాడు. బద్దన్న ఏమరుపాటుతో ఉన్న పమయంలో నంబయ్య కత్తి బద్దన్న గుండెలో దిగింది. బద్దన్న చేతితో రక్తంఓడుతున్న తనగుండెను పట్టుకొని,నంబయ్య కత్తిపిడిలోనికి తనకత్తిని పోనిచ్చి దూశాడు. నంబయ్య అయిదు వ్రేళ్ళు ముక్కలై క్రిందపడ్డాయి. బద్దన్న ఆయాసంతో నేలకొరిగాడు.పడిపోయిన బద్దన్నపై అదంతా చూస్తున్న బాదమ్మ వెంటనే కత్తితో పొడుచుకొని పడిపోయి మహారాజుతో.......

"ప్రభూ ! ..వందేన్నులకు కత్తిపుచ్చుకొని ఎదురు నిలువదగిన వానిఎదుట నొక మేకపిల్లను పెట్టితివి.ఆ మేకపిల్లకు వ్రేళ్ళు తెగిపోయినవి....మహాసేనాధిపతిని బోగొట్టుకుంటివి. నిన్ను మహారాజుగా నిల్పిన వానిని జంపితివి...అతను జారుడు కాడు.నేను జరిణిని కాను. ..మాప్రేమకు మీ సూత్రములు పట్టవు.మాది లంగజ్ఞానాతీతమైన సంబంధము."అని ప్రాణాలు వదిలింది.

బద్దన్న తన జీవతాన్ని,ప్రాణాలను,దేశంకోసం ధారపోసాడు.పంచముడైనా,ఉన్నతులతో కలిసి తిరిగాడు.వారితో క్లిష్టమైన రాజకీయ వ్యవహారాలను నడిపినా,తాను గొప్పవాడినని, తెలివి గలవాడినని,ఎక్కడా తన గొప్పదనాన్ని ప్రదర్శించాలని,ప్రయత్నించలేదు.మందయ్య బద్దన్నతో "బద్దన్నా ! నీవు సామాన్యుడవు,నేను రాజవంశీయుడను,నీవు పంచముడవు,నేనుత్తమ చతర్థకులజుడను,నేను నిన్ను కౌగలించుకొనరాదు.నా మనస్సు నీ మనస్సుతో జోడించితిని. నా హృదయం నీ హృదయంతో బరిష్యంగము చేసుకొంటిని.ఈ స్వాతంత్ర్యయుద్ధమునకు నీవు మహావిష్ణువు."(85) అన్నాడు.

త్రిపురాంతక దేవుడు బద్దన్నకు గొప్పదనం ఆపాదిస్తుండగా,బద్దన్న "అయ్యా ! నా కధికారమక్కరలేదు.నా కులము నాకు చాలును.నా కులమునకున్న గౌరవము దానికున్నది." అని విధేయతను ప్రకటించుకున్నాడు.త్రిపురాంతకుడు తనతో సమానంగా తనకు గౌరవం ఇవ్వగా బద్దన్న "ప్రభూ ! నీ దయకు నా చర్మముకోసి చెప్పులు కుట్టించి ఇచ్చినను నీ ఋణము తీర్చుకోలేను.చూచితిరా ! నా నోటివెంటవచ్చిన మాటకూడా నా కులమునే చెప్పుచున్నది.అందుచేత నేను సేనానిగా నుండదగను.తమరే కావలయును."(141).అని చెప్పుటవలన బద్దన్నలోని అణుకువ,విధేయత,స్పష్టమౌతుంది.

ఈవిధంగా బద్దన్న మనస్తత్వంలో దేశభక్తి,నిస్వార్థత,రాజకీయం,నిష్కళంకత్వం, ధార్మికత్వం,నిండి ఉన్నాయి.అతడు దేశంకోసం పాటునడి "వ్యవస్థాధర్మాన్ని " నిలబెట్టటానికి ప్రాణాలర్పించిన నిస్వార్థ దేశభక్తుడు.

## 5.6 బద్దన్న ప్రణయ జీవితం.

బద్దన్న ప్రణయ జీవితాన్ని విచిత్రంగా మలుపు తిప్పాడు విశ్వనాథ.అసహాయశూరుడై, స్వాతంత్ర్య సముపార్జనకై, దేశప్రజలను మేల్కొల్పి,కూడగట్టి ఒక్క త్రాటిమీదకు తెచ్చిన బద్దన్న మనస్తత్వంలో వీరత్వమే కాదు,అణచుకోలేనంత బలహీనత కూడా ఉందని చూపటానికి తన కనుకూలమైన సిద్ధాంత ప్రతిపాదనకు, అనువుగా ఈ పాత్రను చిత్రించాడు.

### 1) బద్దన్నలో కామేచ్ఛ.

యవ్వనారంభదశలో బద్దన్నలో కామేచ్ఛ తీవ్రమైంది.అజ్ఞాతదశలో ముద్రించుక పోయిన దుర్దమభావాలు క్రమేణ అతని ప్రణయజీవితంలో బయటపడసాగాయి.బద్దన్నకు చిన్నపుడే తల్లి గతించింది.అతనికి తల్లప్రేమ తెలియదు.తండ్రి పెంచిపెద్ద చేసాడు.కత్తిసాము, కఱ్ఱసాము, నేర్పించాడు.శారీరకంగా వీటిపరిశ్రమతో బలిష్టుడయ్యాడు.

బద్దన్న, బాదమ్మవద్ద పదేండ్లు శిష్యరికంచేసి ఖడ్గవిద్య నేర్చుకున్నాడు.బాదమ్మ ఎంతో ప్రేమతో బద్దన్నకు ఖడ్గవిద్యలోని మెలకువలన్నీ నేర్పింది.బాదమ్మ,బద్దన్న కన్న పదేండ్లు పెద్దది. బాదమ్మ తండ్రి ఆమెను ఒక ఖండుక ధాన్యానికి వృద్ధుడైన తిప్పన్నకు అమ్మాడు.ఎనుబైఏండ్ల వృద్ధుడైన తిప్పన్న బాదమ్మతో వైవాహిక జీవితం గడుపలేదు.బద్దన్న బాదమ్మతో చనువుగా ఉండటం ఇష్టంలేకపోయినా వయోభేదంచేత తిప్పన్న ఏమీ అనలేక పోయేవాడు.కాని అతని మనసులో మాత్రం అనుమానం.ఇరువైఏండ్ల బద్దన్నను కరవాలబైరవుని మీదికి ప్రోత్సహించి పంపింది బాదమ్మే.ఆ పోరులో బద్దన్న కరవాలబైరవుని నరికివేసాడు.కాని అతనుకూడా గాయ పడ్డాడు.ఆ పమయంలో గాయపడిన బద్దన్నకు వైద్యం చేయించటమే గాక దగ్గరకూర్చొని సేవలుచేస్తూ ప్రాణంలో ప్రాణంగా చూసుకొని కాపాడింది బాదమ్మ,

బద్దన్నకు వివాహం చేయాలని అతని తండ్రి ప్రయత్నించినా బద్దన్న అంగీకరించ లేదు.బాదమ్మ చనువువల్ల క్రమంగా అతనిలో అతనికి తెలియకుండానే ఆమె మీద ప్రేమ పెరుగసాగింది.బద్దన్న బాదమ్మను గూర్చి తనలోతాను ఇలా అనుకునేవాడు.

"తాను బాదమ్మను కామించుట చాల చిత్రముగా నుండెను.ఇది దేవతలు మెచ్చరు. మనుష్యులు మెచ్చరు. ఎవరు మెచ్చినను మెచ్చకున్నను బాదమ్మ మెచ్చిన చాలననిపించెను.ఆ బాదమ్మయు మెచ్చినట్లు లేదు."(38)

బాదమ్మ కొరకు బద్దన్న తిరుగుళ్ళు అతని తండ్రికి నచ్చలేదు."బద్దన్న తండ్రి కొడుకు

సంగతి అంతయు చూచుచుండెను.తండ్రికి కొడుకు మనసులోని బాదమ్మ కనిపించదు.కాని కొడుకులో బాదమ్మవలన కలిగిన మనోవికారమంతయు గనిపించుచునే యుండెను. ఈ వికారము కామ జన్యమా?రాజకీయవ్యవహార సంభూతమా? కామజన్యమనుటకు తండ్రి కాధరము కనిపించలేదు.తన కొడుకుకు బాదమ్మ మీద కోరిక కలదని తండ్రి ఎట్లనుకొనును. ఊరిలో మరియొకరు మాత్రము ఎట్లనుకొనును?ఒక్క తిప్పన్న మాత్రం అనుకొనును."(37).

వారిద్దరిలోనున్న వయోభేదం ఎవరికీ అనుమానం రాకుండా చేసింది.కాని తిప్పన్న మాత్రం వారి ప్రేమ విషయం గ్రహించాడు.యవ్వనంలోనున్న బద్దన్నను ఏ శారీరక సుఖమెరుగని బాదమ్మ కాంక్షించుటలో అసహజత్వం తిప్పన్నకు కనిపించలేదు.అందుకే బాదమ్మ బద్దన్న ఇంటికి వెళ్ళి అతనికి సేవలు చేస్తుంటే సహించలేక తిప్పన్న ఆమెను తిట్టాడు, అడ్డుకున్నాడు, నానా మాటలన్నాడు.ఆ మాటలు భరించలేక బాదమ్మ "అతడు నాకు శిష్యుడు.నీ వతనినేమన్నను ఓర్చుకొనలేనని" పలికింది.అపుడు తిప్పన్న ఆవేశంతో "వాడు నీకు శిష్యుడు కాదు.మగడు."అన్నాడు. బద్దన్న ఇంటికి వెళితే మరల ఇంటికి రానివ్వనన్నాడు.అయినా బాదమ్మ బద్దన్న ఇంటికి వెళ్ళింది.అతనికి సేవలు చేసింది.

బాదమ్మ సేవలతో బద్దన్న కోలుకున్నాడు.ఆమెను తాను ప్రేమిస్తున్నానని తెలుసు కున్నాడు.కాని తనను బాదమ్మ ప్రేమించునా?తనను ప్రేమించనిది బాదమ్మ తనకు సేవలు ఎందుకు చేస్తుంది?తమ ప్రేమను లోకం మెచ్చుతుందా?ఇవి బద్దన్న ఆలోచనలు.

బాదమ్మ ప్రేమవిషయంలో బద్దన్న ఎటూ తేల్చుకోలేక పోయాడు.ఆమె చనువుగా మాట్లాడిన మాటలు అతన్ని కలవరపెట్టసాగాయి."అహో ! బద్దన్న యొక్క మనస్వరూపము.శౌర్య విషయమున,పరాక్రమ విధమున,రాజనీతి విషయమున,పరిణతమై యుండి ప్రౌఢమై యుండెను. స్త్రీ విషయమున బసర మొగ్గవలె నుండెను.పూపకాయవలె నుండెను.బాదమ్మ మాటాడిన మాటల లోని యర్థములు తన కోరికకు అనుకూలముగా నున్నట్లు భావించెను. వెంటనె కాదనుకొనెను.అతని యొడలులోని నెత్తురుడికి పోవుచుండెను.అతనికేమీ చేయుటకును దోచలేదు.కోరిక బాదమ్మను పోయి కౌగలించు కొమ్మనుచున్నది.ముద్దాడు మనుచున్నది.మనస్సు తొందర పెట్టుచున్నది. భయము లేదనుచున్నది.'

ఈవిధమైన మానసికాందోళనలో బద్దన్న చిక్కుకు పోయాడు.అంతలోనే ఏదో భయం తన్నావరించినట్లు,ఆభయం తన కిక నెరవేరదని చెబుతున్నట్లు,అనుకోసాగాడు.తాను తొందరపడి బాదమ్మను తాకరాదు.తాకినచో తిప్పన్న నలుగురికి చెప్పి అల్లరి చేయగలడు. ఊరంతా తెలుస్తుంది. సంపాదించిన గౌరవమంతా నాశనమౌతుంది.బద్దన్న చికాకు పడి పోయాడు.బాదమ్మ మీద అతనికి కోపం వచ్చింది.ఆమె తననెందుకు ప్రేమించదు?ప్రేమిస్తే తనంత తానుగా వచ్చి తననెందుకు కౌగలించుకోదు?తనకు లేని చొరవ ఆమెకుందికదా.ఒకవేళ ఆమె తనను

ప్రేమించినచో నది జారత్వమేకదా?ఆమెకంత నీతిలేదా?ఆమె తనని ఎందుకు ప్రేమించాలి? తనలోనున్న గొప్పతనమేమిటి?'

బాదమ్మ విషయంలో తానొక సుడిగుండంలో పడ్డట్లు,తన మనస్సును నిగ్రహించు కోలేక పోతున్నట్లు గ్రహించాడు.ఒకనాడు బద్దన్న బాదమ్మ కొరకు అన్నిచోట్లా వెతికి ఊరి వెలుపలనున్న తోటలో కలిసాడు.మాటల సందర్భంలో బాదమ్మను అడిగాడు.

“నీవు నన్ను ప్రేమించుచుంటివా?లేదా?'అని,.బాదమ్మ 'ప్రేమించుచుంటిని'అంది.ఆ మాటలతో పొంగిపోయిన బద్దన్న సంతోషాన్ని ఆపుకోలేక ఏడ్వసాగాడు.బాదమ్మ నివ్వెర పోయింది.'ఎందుకేడుస్తున్నావు'అంది.బద్దన్న శాంతించి 'నేను జబ్బుతో నున్నపుడు నిన్నొక మాటంటిని,దానికి నీకు కోపము రాలేదా?'అడిగాడు.'నాకు కోపము రాలేదంది.'బాదమ్మ.

బద్దన్న తనలోనున్న ప్రేమను వివరిస్తూ 'నాకిపుడెన్నేండ్లు తెలియునా?ఇరువది రెండేండ్లు.నీవు మాయూరు వచ్చి పదనేడేండ్లయినది.నాకు పన్నెండు,పదమూడేండ్లు వచ్చినప్పటి నుండియు నేను నిన్ను ప్రేమించుచుంటిని.నీవే నాభార్య వనుకొంటిని.తిప్పన్న ఎప్పుడైన చచ్చియైన పోవును,లేదా ఎప్పుడో నిన్ను తీసుకొనివచ్చి ఇదిగో నీ భార్య తీసుకొని పొమ్మని అప్పగించియైన పోవునని అనుకొనియుంటిని 'అన్నాడు.

బాదమ్మ తనకు కలిగిన ప్రేమను గురించి చెప్తూ 'నేను నిన్ను పదియేండ్లుగా ప్రేమించు చుంటిని.అంది' 'మరి ఏల నాతోచెప్పలేదు?' 'మరి నీవేల చెప్పలేదు?' “నేను చిన్నవాడను ఏమని చెప్పుదును.'

ఈవిధంగా వారిద్దరి మధ్య జరిగిన సంభాషణలో బద్దన్న ప్రేమవిషయంలో ఎంత అమాయకుడో తెలియక మానదు.తిప్పన్న వచ్చి బాదమ్మను అప్పగించునని బద్దన్న తలంచుట అతని అమాయకత్వాన్ని,స్వచ్ఛమైన ప్రేమను,నిష్కళంకమైన హృదయాన్ని తెల్పుతున్నాయి.

బద్దన్న మనస్సులో మొదట బాదమ్మ విషయంలో చెలరేగిన భావాలు పూర్తిగా కామేచ్ఛా జనితాలే.యవ్వనారంభదశలో అవి క్రమంగా ఫలోన్ముఖమయ్యాయి.పదిపన్నెండేండ్ల వయసులో బాదమ్మను ప్రేమించటం మాత్రం విచిత్రమైన కాంప్లెక్సుకు మూలం.బాల్య కౌమార దశల్లో అతనిలో అజ్ఞాతంగా ముద్రితమైన భావాలని చెప్పవచ్చు.

## 2) బద్దన్నలో ఇడిపస్ కాంప్లెక్స్.

ఫ్రాయిడ్, యూంగ్ ల మనోవిశ్లేషణ సిద్ధంతాలలోని భావాల దృష్ట్యా బద్దన్న మనస్తత్వాన్ని పరిశీలిస్తే,అతని సేవాభావం,దేశభక్తి,'అహం–ఆదర్శానికి చెందుతాయి.అంతేగాక ఇవి యూంగ్ చూపిన సమష్టి అచేతనంలోనుండి ఉద్బుదమై బద్దన్న మనస్తత్వంలో నిలిచాయని చెప్పవచ్చు.ఇక బద్దన్నలోని ఇడిపస్ కాంప్లెక్సు (కుమారునికి తల్లి మీది కోరిక) భావన ప్రాయిడు చెప్పినదే, కాక యూంగ్ చెప్పిన సమష్టిఅచేతనంలోని ఆదిమ మానవుని నీతిరహిత మైన ప్రవర్తనలోని భావాలే

అజ్ఞాతంగా ముద్రించుకపోయి ఉండవచ్చునని చెప్పవచ్చు. నాగరికత పొందిన దశల్లో మానవుడు నీతి,న్యాయం,ధర్మం,కట్టుబాట్లు,నియమాలు,వివాహం, సంసారం,మొదలైన వాటిచే తనకు తాను బంధించుకుంటూ వైయక్తికమైన అభిలాషలను అణచుకుంటూ సంఘజీవనంలో నీతి ప్రవర్తనకు అలవాటు పడ్డాడని చెప్పుకోవచ్చు.

బద్దన్నకు చిన్నపుడే తల్లిపోయింది.అతడు తల్లిప్రేమకు నోచుకోలేదు.నిజంగా తల్లి ఎలా ఉంటుందో కూడా ఊహించలేని స్థితి.తల్లిలేని లోటు,తల్లిప్రేమకు నోచుకోలేని వెలతి, బాల్యావస్థలోనే బద్దన్న మనస్సును తీరను ఘర్షణకు లోనుగావించాయి.కౌమారంలో బద్దన్న బాదమ్మ దగ్గర ఖడ్గవిద్య నేర్చుకోసాగాడు.బాదమ్మలో తల్లిని చూసాడో,గురువును చూసాడో, తెలియదుగాని అతనిలో అజ్ఞాతంగా ముద్రించుకపోయిన భావాల ప్రభావం బాదమ్మతో మాటాడినపుడు బయటపడ్డాయి.బాదమ్మతో బద్దన్న "నాకు బన్నెండు,పదమూడేండ్లు వచ్చినప్ప టినుండియు నేను నిన్ను ప్రేమించుచుంటిని.నీవే నా భార్య యనుకొంటిని...'అన్నాడు.

బాదమ్మకూడా "నేను నిన్ను పదిఏండ్లుగా ప్రేమించుచుంటిని"అంది.బాదమ్మ ప్రేమకు, అతని ప్రేమకు భేదముంది.అయినా కౌమారదశలో నున్న బద్దన్నను బాదమ్మ ప్రేమించటం కామేచ్ఛవల్లనా?లేక పుత్రవాత్సల్యమా?అనే సందేహం రాకమానదు.అందుకే బాదమ్మ మనస్సులో కొంత గందరగోళం ఏర్పడింది.బద్దన్న తనను ప్రేమిస్తున్నాడని తెలియగానే ఆమె నివ్వెర పోయింది.కౌమారదశలోనున్న బద్దన్న తనకేవిధంగా అనుకూలిస్తాడు?అందుకే ఆమె ఆలోచనలు విపరీతంగా సాగాయి.

బద్దన్న చిన్నతనంనుండే బాదమ్మను ప్రేమించసాగాడు.ఆ చిన్నతనంలోని అమాయకత్వం అతని మాటలవల్లనే తెలుస్తుంది.లోకజ్ఞానం(భార్యయనగా నేమో?) తెలియని అతడు బాదమ్మతో "నాకు పన్నెండేండ్లు ..వచ్చినప్పటినుండి .నేను నిన్ను ప్రేమించుచుంటిని నీవే నాభార్యవని అనుకొంటిని..."అని అనటంలో బద్దన్న నిష్కల్మషంగా,అమాయకంగా, బాదమ్మను ప్రేమిస్తున్నాడని తెలియకపోదు.ఆ ప్రేమ అతనిలో కామేచ్ఛాజనితం కాదు.ఆ వయసుకు కామమంటె ఏమిటో తెలియదు.శారీరక కామస్పర్శలేని వయసులో తనకంటె పదేండ్లు పెద్దదైన బాదమ్మను మనసారా ప్రేమించటం,బాల్యావస్థలో అతడు తల్లిలేని లోటును,తల్లి ప్రేమనోచుకోని స్థితిలోనుండి విపరీత మైన మానసిక సంఘర్షణలో చిక్కి "ఇడిపస్కాంప్లెక్సు" లకు గురికావటమే.బాదమ్మ అతనికి గురువుగా ఉండి చనువుగా ఖడ్గవిద్య నేర్పుటలో ఆమె సన్నిహితత్వంవల్ల అతనిలో ముద్రించుక పోయిన ఇడిపస్‌భావాలు క్రమంగా ఆమెపై ప్రేమను పెంచాయి.

మొదట బద్దన్నకు బాదమ్మమీది ప్రేమ అజ్ఞాతమై మానసికమైనదే.కాని శారీరకమైనది కాదు.యవ్వనం రాగానే శారీరకంగా అతడు విచలితుడయ్యాడు.విచారంలో మునిగాడు.బాదమ్మ తనను ప్రేమిస్తున్నదా?లేదా?అనే సందేహంలో పడ్డాడు.బాదమ్మ తనను ప్రేమిస్తున్నానని చెప్పగానే బద్దన్నలో నూతనోత్సాహం కలిగింది.

ఈవిధంగా బద్దన్న కౌమారంలో 'ఇడిపస్‌కాంప్లెక్సు'కు చిక్కి బాదమ్మను ప్రేమిస్తూ, యవ్వనారంభదశలో ఆమెను శారీరకంగా అనుభవించాలని ఆతృతపడ్డాడు.ఆమె సేవలు చేస్తుండగా ఆమె స్పర్శవల్ల అతనిలోని కామేచ్ఛ క్రమంగా శరీరగతమై ఉధృతం కాసాగింది. శారీరకమైన కామేచ్ఛాప్రేరణలకు తట్టుకోలేక పోయాడు.తనలోని బలమైన ఉద్రేకాలను, కామేచ్ఛాశక్తిని, ఉదాత్తీకరణం పొందించి దేశభక్తి వైపు మరలించుకొని శ్రమఅనుకోకుండా రాత్రింబవళ్ళు తిరుగుతూ కాలం గడిపినా,మానసికమైన కామేచ్ఛను మరలింపచేసుకున్నా, మిగిలిపోయిన లిబిడో అతన్ని శారీరకంగా నలిపివేయసాగింది.

బాదమ్మకొరకు అతని శరీరం తహతహలాడింది.'బద్దన్నకు బాదమ్మమీద కోపం వచ్చెను.ఆమె తన్నెందుకు ప్రేమించదు?ప్రేమించినచో ఆమె తనంతటతానే వచ్చి తన్నేల కౌగలించుకోదు?నేనామెను కౌగలించుకున్నచో ఆమె ఏమనునో యనుభయము నాకు గలదుకదా?ఆమెకా భయమక్కరలేదు.ఆమె ఏలవచ్చి కౌగలించుకోదు?కామ విద్యయందు పరిచయములేని పసిబుద్ధి బద్దన్నను వేయివిధములుగా నిట్లు భావింపచేసెను"(46).

బద్దన్నలోని పిరికితనం బాదమ్మమీద కోపంగా మారింది.ఆమెయే వచ్చి కౌలించు కోవాలనీ,ఆతడు తొందరపడసాగాడు.కాని ఆతని ఆలోచనలు వాస్తవికతా మార్గం పట్టాయి. 'ఆమెతో మాటాడిన కొలది నా గుండె చెరువగుచున్నది.ఆమెకు దేలుకుట్టినట్లయిన లేదు.ఆమె పదిపదునేడేండ్లనుండి భర్తతో గాపురము చేయుచున్నస్త్రీ.తానేమందగాడనియా?ధనవంతు డనియా?తన్నామె ఏల ప్రేమించును?తన్నామె ప్రేమించినచో నది జారత్వమేకదా?ఆమె కంత నీతిలేదా?ఇంతకు తన్నామె ఏల ప్రేమించును?"

బద్దన్నలోని కాంప్లెక్సు బాదమ్మమీద ప్రేమ పెంచగా క్రమేణ అది శారీరకమై బాధించగా అహం వాస్తవికతను గుర్తించటంవల్ల అతనిలో'అచిత్తు,అహం'ల పోరు అధికం కాసాగింది. అచిత్తయొక్క ప్రేరణల,అహంయొక్క 'వాస్తవికత'ల మధ్య అతడు నలిగిపోయాడు.

బద్దన్న బాదమ్మను ఒకరాత్రివేళ ఒక సంకేతస్థలంలో కలుసుకోమన్నాడు.బాదమ్మ ఎట్లో తిప్పన్న కనులుగప్పి సంకేతస్థలానికి వెళ్ళి తెల్లవార్లూ బద్దన్న కొరకు ఎదిరిచూసింది.కాని రాజకీయాలలో మునిగిన బద్దన్న అచటికి రాలేకపోయాడు.బాదమ్మలో నిరాశమొలకెత్తింది.ఆ రాత్రి తెల్లవార్లూ ఎక్కడోగడిపిన బాదమ్మను తిప్పన్న చావబాదాడు.బాదమ్మ ఆ దెబ్బలబాధ భరించలేక పోయింది.తిప్పన్నతో ఇక వేగలేకపోయింది.ఎటు వెళ్ళాలో నిశ్చయంచుకోలేక పోయింది.ఆ పరిస్థితులలో తిప్పన్న ఇంట్లోనుండి ఆమెను వెళ్ళగొట్టాడు.

బాదమ్మ పుట్టింటికి పోలేక,ఆత్మహత్య చేసుకోలేక,తిన్నగా బద్దన్న ఇంటికే వెళ్ళింది. దేశస్వాతంత్ర్యమునకై పోరాడుతున్న బద్దన్న తనకు ఆశ్రయమివ్వకపోతాడా?కాని రాజకీయాల లో వాని మనస్సు పరిపక్వమైనట్లు కామ విషయమున కాలేదుగదా?అని అనుకొంది.ఏదైనా

కాని అని నిర్ణయించుకుంది.

బాదమ్మ వెళ్ళేసరికి బద్దన్న తండ్రి ఇంట్లోలేడు.కార్యాంతరంగా పొరుగూరికెళ్ళాడు. బద్దన్న బాదమ్మను చూసాడు.దెబ్బలతో ఆమె శరీరం వాచిపోయింది.ఇంకేమీ గమనించకుండా బాదమ్మనుగట్టిగా కౌగలించుకున్నాడు.ఇదే వారి ప్రథమ స్పర్శానుభూతి.ఆ కౌగిలిలో వారివురూ ఆ ఊరును ఈ లోకాన్ని మరిచారు.బాదమ్మను తనింట్లో ఉంచుకుంటే తండ్రి ఏమంటాడో?నని బద్దన్న ఆలోచించలేదు.ఆమెను తనంట్లోనే ఉండిపొమ్మన్నాడు.వెలుపలినుండి తాళంవేసి లోపల వారివురూ కొన్నిరోజుల పాటు సుఖసంసారంలో లీనమయ్యారు.ఆ రోజుల్లో వారు ఈలోకాన్ని మరిచి మహదానందంలో మునిగిపోయారు.వారివురూ మనసువిప్పి మాటాడుకున్నారు.ఒకే ప్రాణంగా మెదిలారు.

బద్దన్న తండ్రి ఆగమనవార్త తెలుసుకొని,ఆమెను తిప్పన్న వద్దకు పంపేవీలులేక తాను నాదెండ్లకు పోతూ ఆమెను తీసుకెళ్ళాడు.ఆవూర్లో వారివురూ పేర్లు మార్చుకున్నారు.

బద్దన్నలో ఇంతవరకు ఉద్రిక్తలకు లోనైన శారీరకవాంఛ బాదమ్మతో తీరింది.ఆమెను ఇప్పుడు మానసికంగా ప్రేమించసాగాడు.ఆ మానసికమైన ప్రేమ క్రమంగా ఆత్మగతమై, రూపుదిద్దుకో సాగింది.విశ్వనాథ, బద్దన్న-బాదమ్మ విషయంలో ఈవిధంగా అనుకుంటున్నట్లు చిత్రిస్తాడు.ఇది బద్దన్న ఆత్మగతమైన విచారం.విశ్వనాథ ప్రతిపాదించిన ప్రేమతత్వం.

"తాను బాదమ్మను ప్రేమించుట అతని ఉద్దేశ్యంలో నది ధర్యము.ఆది ఎవ్వరును కాదనుకొనును.అతనికందులో దోషము కన్పింపదు.తాను ప్రేమించెను కావున దానిని దోష మనరాదు.అతని అహంకారము,స్వాభిమానము,వాని ఆత్మలో ముడిపడెను.ఈ ప్రపంచమునకు మొట్టమొదటివాడుతాను.ఈ జగత్తు తనకోసమున్నది.ఇది తాను శాసించునట్లు నడువవలయు ఈ మనస్సు ఈపద్ధతి మీద నడుచును.'('69.).

### 3) బద్దన్నలో ఆత్మ నిర్దేశం.

ఫ్రాయిడ్ వ్యక్తిలోని 'అధ్యహాన్ని' రెండు ఉపవ్యవస్థలుగా విభజించాడు. 1 అంతరాత్మ. 2 ఆదర్శాహం.అచిత్తు,అహంలవలె 'అధ్యహం' వ్యక్తిలో పుట్టే మానసిక వ్యవస్థకాదు.ఇది కేవలం పరిసరాల విజ్ఞానంతో కూడుకొనిఉంటుందని ఫ్రాయిడ్ భావన.అనగా వ్యక్తి శైశవంనుండి నేర్చుకునే గుణపాఠాలు,ఆచారవ్యవహారాలు,నైతిక,ధార్మిక,ఆధ్యాత్మిక,విలువలు,సాంఘిక విషయాలు, మొదలైన వాటిచేతను,విద్య,శిక్షణ,అనుభవం,అభ్యాసాదులచేతను,పొందిన జ్ఞానంతో ఇది వ్యక్తిలో రూపుకడ్తుంది.సాంఘికంగా వ్యక్తి నైతిక ప్రవర్తనకు ఇది మార్గదర్శకం వహిస్తుంది.అవసరానికి తగిపట్లుగా సర్దుబాటుతనాన్ని వ్యక్తిలో కలిగిస్తుంది.

కాని భారతీయుల ఆత్మ విచారం వేరు.వ్యక్తిలోని ఆత్మకు జన్మపరంపర ఉంది.ఈ బేధం మనకు విశ్వనాథ బద్దన్న పాత్రచిత్రణలో చూపిస్తాడు.

బద్దన్న బాదమ్మ పేర్లు మార్చుకొని నాదెండ్లలో ఉంటుండగా ఓ రోజు బాదమ్మ,"నేను నీ భార్యను కానని నీ మిత్రునితో చెప్పితివా?"అని అడిగింది."చెప్పలేదన్నాడు". బాదమ్మ విచారంతో "ముందుముందు నీకు విరోధులెక్కువగుదురు. అప్పటికి వారిమనస్సు నీయందు విరుగుటకిది కారణము కావచ్చును"అంది.

బద్దన్నలో ఆత్మగతమైన నిర్ణయం విచిత్రంగా పైకి వచ్చింది. అతడు బాదమ్మతో "నీ వనునది నాకు దెలియుటలేదు. నాలో స్త్రీవాంఛయన్నది ప్రారంభమైనప్పటినుండి నేను నిన్నే ప్రేమించితిని. అప్పటినుండి నీవు నన్ను ప్రేమించితివి. మనమిద్దరము ననుభవించుచున్న యీ సుఖము మరియే ఇద్దరు స్త్రీ పురుషులు అనుభవించరు. ఇది భగవంతుడు చేసిన పని. నీవును నేనును చేయలేదు. దీనికి లోకము మనలను నిందంచినచో భగవంతునియొక్క ఉద్దేశ్యము తెలియక పోవుట యగును"అన్నాడు(.91.)

బాదమ్మ నవ్వి "మనము మనముగా బ్రతుకుటలేదు. లోకములో నున్నాము. నీవీ యుద్ధపు గొడవలుమాని మనమే అడవులకో పోయి,ఏ సెలయేటి ఒడ్డునో,యొక గుడిసె వేసుకొని యుందము. మానవుల కంటబడము. అప్పుడది తప్పని నాకనిపించదు. ఇప్పుడు మాత్రం తప్పే. అంది. బాదమ్మకు లోకదృష్టి ఉంది. తెగించే బద్దన్నతో వచ్చింది. లౌకికంగా ఆమె బద్దన్న కన్నా వివేకవంతురాలు. అనుభవంగలది. తాము చేసింది,చేసేది, తప్పేనని ఆమెకు దృడంగా తెలుసు. బద్దన్నను గాఢంగా ప్రేమించటం,శారీరక సుఖాన్ని తిప్పన్నతో పొందలేక పోవటం, తనలోని మోహం బలీయం కావటం,మొదలైన కారణాలవల్ల విధిలేని పరిస్థితులలో బద్దన్నతో లేచివచ్చింది. కాని ఆమెకు భయంగానే ఉంది.

బద్దన్నలో లౌకికజ్ఞానం మించిన ఆత్మజ్ఞానం పెంపొందసాగింది. నిజానికి వ్యక్తిలోని మానసిక విచారమెప్పుడూ లోకంచుట్టే తిరుగుతుంది. సాధారణ వ్యక్తులందరూ లోకాన్ననుసరించి నడుచుకుంటారు. మానసిక బంధాలు తగిలించుకుంటారు. కాని ఆ బంధాలకు తగిన కారణాలు ఆత్మగతంగా విచారించరు. ఏ కొందరో లోకాతీత వ్యక్తులు ఆత్మవిచారంలో పడ్తారు.

బద్దన్న "ఈ సుఖము జగత్తులో మరి ఏ ఇద్దరు స్త్రీపురుషులు అనుభవించరు. ఇది భగవంతుడు చేసిన పని"అన్నాడు. ఈ మాటలు ఆతని ఆత్మనిర్దేశంగా వెలువడ్డాయి. ఈ మాటలవల్ల ఆతనిలో లోకాతీత వ్యక్తిత్వముందని తెలియక మానదు. అందుకే విశ్వనాథ,

"ఒక్కొక్కపుడు విచారించినచో నొక శకపురుషుడు,ఒక విజేత,ఒక మహాశిల్పి,ఈ తరగతికి చెందినవారుగా కన్పింతురు. వానియందిట్టి భావమే లేనిచో వారా మహాకార్యములను చేయజాలకుందురు. అందుకనియే లోకోద్ధారకులు,లోకోపకారములైన మహాకార్యములను చేసిన వారందరు కొన్ని విషయములలో మిక్కిలి స్వార్థపరులుగా గన్పింతురు. వారు లోకాతీతులు. లోకము వారి కొరకు గాదు. వారు లోకము కొరకు"(69).

బద్దన్న దేశంకోసం నిండుమనసుతో,ఆత్మనిర్దేశంగా ఏవిధంగా పోరాడుచున్నాడో, అదే విధంగా నిక్కమైన ప్రేమతో ఆత్మధర్మంగా బాదమ్మతో లేచిపోయాడు.అతని దృష్టిలో ఈ రెండూ తప్పుగావు.ఒకటి మాతృదేశ ఋణాన్ని దేశభక్తిద్వారా తీర్చుకుంటున్నాడు.రెండు ఆత్మనిర్దేశంగా బాదమ్మను తన స్త్రీగా గుర్తించి ఏలుకుంటున్నాడు.మొదటిది వ్యవస్థాధర్మానికి, అనుకూలమైతే రెండవది ఆత్మధర్మానికి సంబంధించినది.

నాదెండ్లనుండి బద్దన్న బాదమ్మలు గోశాలకు బయలుదేరారు.దారిలో వారి ప్రసంగాలు ప్రేమ,ధర్మం,వివాహం,మొదలైన వాటిపై జరిగాయి.మొదటినుండి బాదమ్మకు భయంగానే ఉంది.ఆమె మనస్సు మనస్సులో లేదు.బద్దన్న దృఢచిత్తంతో ఉన్నాడు.అతడు లోకంగురించి ఎందుకు ఆలోచించటం లేదని,తాను తప్పుచేస్తున్నానని ఎందుకు అనుకోవటంలేదని,రకరకాల సందేహాలు బాదమ్మను పీడించసాగాయి.

బద్దన్న మాటలలో కొంతసేపు బాదమ్మదే తప్పని మాట్లాడాడు."నీ వితర స్త్రీలవలె నుంటివా?నీకన్న పదేండ్ల చిన్నవాని మోహించి వానితో లేచివచ్చితివి.నీ భర్తకంటె నింకను ముసలి వాండ్రయిన భర్తలతో లోకములో స్త్రీలు చాలామంది కాపురము చేయుచున్నారు" అన్నాడు.అపుడు బాదమ్మ"వారికి ప్రేమయననేమో తెలియదు?"అంది.దానికి బద్దన్న నవ్వి "నీకు ధర్మమనగా నేమో తెలియదు?"అన్నాడు.బాదమ్మ ఆశ్చర్యపోయింది.ఆమె లేచివచ్చింది అధర్మమే కాని ప్రేమతో. ధర్మముకంటె ప్రేమగొప్పదా?తనకు ధర్మమనగా నేమో తెలియదా? లోకదృష్టిలో తాను చేసింది అధర్మమే కదా.ఇంతవరకు తాను చెప్పింది లోకధర్మం గురించి." బాదమ్మ విచిత్రంగా బద్దన్నను చూసింది.అపుడు బద్దన్న "నాకిది ధర్మమో?అధర్మమో? పుణ్యమో? పాపమో? తెలియదు.నాకు దెలిసినదొక్కటే విషయము.నేను నిన్ను ప్రేమించితిని. ఆ ప్రేమను భగవంతుడు కల్పించెను.భగవంతుడు ఎట్లు చేయించునో అట్లు చేసెడివాడను నేను.అది పుణ్యమనీ,పాపమనీ, ధర్మమనీ,అధర్మమనీ,లోకమనవలయును.నేనిది కామప్రవృత్తిచే చేయలేదు. కామముయొక్క స్వరూపము నాకు తెలియనప్పుడు నేను నిన్ను ప్రేమించితిని.ఇది పాపమెట్లగునో నాకు తెలియదు"

బాదమ్మ నిట్టూర్చింది."స్త్రీపురుషుల నడుమనున్న దూరమున లోకము వివాహము, వివాహము లేకపోవుట యను కొలబద్దతో గొలుచును."అంది.."ఇచ్చట దూరములు లేవు' అన్నాడు బద్దన్న.దూరములు లేవనుట లోకాతీతమైన విషయము.బద్దన్న ఆత్మలో "ప్రకృతి-పురుష" సంబంధమైన తత్త్వం నిండుగా ఉంది.అందుకే ఆతడు ఆత్మగతంగా లోకాన్ని,బాదమ్మతో సంబంధాన్ని, చూడసాగాడు.

"నీయందు నాకుగలప్రేమ నా యౌవనసంబంధి కాదని అనిపించుచున్నది.అయినచో ఈ యవ్వనము తొంగియే చూడనపుడు ఇట్టిస్థితి నొకదానిని నేను భావించలేనపుడు,నీ యందు నాకు ప్రేమేల కలిగెను?అనేక విధముల ప్రేమ కలుగవచ్చును.నా చిన్ననాటికి నీవు పెద్దదానవు.

అప్పుడు నిన్నొక అక్కగారివలె ప్రేమించవచ్చును.నా మనస్సునందప్పుడు ఇట్టిదిగా లేదు. అప్పటినుండి నేను నిన్ను నా భార్యగానే భావించితిని.నీవు నన్ను భర్తగా భావించితివి. అప్పటికి నాకు ఈకామవిషయము తెలియదుగదా."అని బద్దన్న వివరించాడు.

బద్దన్న శరీరగతకామాన్ని,స్త్రీసుఖాన్ని,ఊహించుకోలేని స్థితిలోనే బాదమ్మను ప్రేమించ సాగాడు.ఆ ప్రేమకు మూలమేది?ఆ ప్రేమనాలో ఎందుకు కలుగవలెను?మొదలైన ప్రశ్నలతో కూడిన ఆత్మగత విచారం బద్దన్నలో మొదలైంది.బాదమ్మ వివేకవతి.లోకధర్మాన్ని అతనికి వివరించింది.ఆత్మధర్మం కన్నా లోకధర్మం గొప్పదని బద్దన్నకు చెప్పింది.

"కామము ధర్మముగా నుండవలయునన్నచో,కామముయొక్క ఫలితము వివాహ మైనచో నా వివాహము ఇద్దరు వ్యక్తులయొక్క సమాగమమైనచో,ప్రధాన ధర్మము చెడకుండా నీ వ్యక్తులు వ్యక్తిగత ధర్మముల నుల్లంఘింపరాదు.అట్లుల్లంఘించుట ఉత్తరోత్తర ప్రధాన,ధర్మ విచ్ఛేదనమునకు హేతుభూతమగును.ఇదియొక బంధనము.ఇది బహుసూత్రములయొక్క సమాకర్షణము చేత చేయబడినది.ఇందే సూత్రమునకు పురి తక్కువైనను ప్రధానమైన ముడియందు సడలుట కనిపించును."(152).

బద్దన్నలో సంఘర్షణ మొదలైంది.కామ విషయంలో తనచర్య అధర్మంగా భాసిస్తున్నది. తాను సాహసవంతుడే కాని లోకధర్మాన్ని ఎదిరించగలడా?సర్వకామము ధర్మకామము బోదెల వెంటనే పోవలయును.తానాచరించినది ధర్మకామమా?ధర్మకామమైనచో తాను బాదమ్మను వివాహమాడియుండలేదు.లోకదృష్టిలోనది అధర్మకామమే....తానొక్కడు సాహసముచే, ధైర్యముచే,పలుకుబడిచే,ఈ అధర్మకామాన్ని జయించలేడు.జయించి ఆదర్శంగా ఉండలేడు.

నంబయ్య,నాగయ్య, మరికొందరు స్వార్థపరులు తిప్పన్నకు సహాయంగా నిలిచి బద్దన్నమీద నేరంమోపి శిక్షింపదలచారు.గోశాలపరిషత్తు ముందుకు రావాలని బద్దన్నను ఆదేశించారు.బద్దన్న తప్పించుకొని బాదమ్మతో కొప్పాక గ్రామానికి వెళ్ళాడు.నాగయ్య బద్దన్న అన్వేషణలో నున్నాడు.కొప్పాకలో మారుపేర్లతోనున్న బద్దన్నను పరిషత్తు ముందుకు పిలిపించారు. కాని శిక్షింపలేకపోయారు.ఈవిషయం గొంకభూపతి రాజుకు నివేదించారు.బద్దన్న స్వాతంత్ర్య వీరడని రాజుకు తెలియదు.నంబయ్య మాటలునమ్మిన రాజు బద్దన్న ఎక్కడున్నా పట్టితెమ్మని భటులకు ఆజ్ఞలిచ్చాడు.బద్దన్న వేంగీలోనున్న త్రిపురాంతకుని నీడలో తలదాచు కున్నాడు. త్రిపురాంతకుని కుమారుడు విష్ణువర్మ బద్దన్నకు అభయమిచ్చాడు.ఆ సమయంలో త్రిపురాంతకుడు కాశీయాత్రకు వెళ్ళాడు.బద్దన్న విషయం తండ్రీకొడుకులకు తెలుసు.అతడు దేశభక్తితో పోరాడుచున్నాడని,ఈ తప్పిదం గొప్పదేమీ కాదని,అతన్నెలగైనా రక్షించాలని విష్ణువర్మ అనుకున్నాడు.

వేంగీలో విష్ణువర్మ ఆశ్రయంలో బద్దన్న బాదమ్మలు నాల్గునెలలున్నారు.బద్దన్న వేంగీలో

నున్నట్లు తెలిసిన రాజు వెంటనే ఆజ్ఞాపత్రము తోడిచ్చి బద్దన్నను బంధించుకొని రమ్మని భటులను పంపాడు. విష్ణువర్మ బద్దన్నను కాపాడదలచాడు. "గొంకరాజుతో యుద్ధము చేసెదను. నీవు సేనా నాయకుడవు కమ్ము.' అన్నాడు. అపుడు బద్దన్న "బాబూ! నీవు కుఱ్ఱవాడివి. నీకు తెలియదు. మీతండ్రి గారు వచ్చినచో నిన్ను కోపగించెదరు." అని నచ్చచెప్పి బద్దన్న రాజభటులతో ధనదుపురం వెళ్ళాడు

రాజసభలో బద్దన్నను దోషిగా నిలబెట్టారు. నాగయ్య సాక్ష్యంతో, నంబయ్య అభియోగంతో నేరం మోపబడంది. కట్టడి ప్రకారం బద్దన్న నంబయ్యతో కత్తియుద్ధం చేయాల్సివచ్చింది. ఆ యుద్ధంలో తప్పకుండా నంబయ్య ఓడిపోతాడని, బద్దన్న అతన్ని చంపుతాడని అందరికీ తెలుసు. త్రిపురాంతకదేవుడు, నన్నయ మరికొంతమంది బద్దన్న పక్షంగా ఉన్నారు. అటువంటి ధైర్యశాలి, వీరుడు, మహాసేనాని, మరల దొరుకడని వారికి తెలుసు. అందువల్ల బద్దన్నను ఏ విధంగానైనా కాపాడితీరాలని నిశ్చయించుకున్నారు. కాని బద్దన్న తన అధర్మకార్యానికి తలవంచాడు. లోకధర్మానికి కట్టుబడ్డాడు.

నంబయ్య ప్రహారాలకు బద్దన్న తప్పించుకుంటున్నాడేగాని నంబయ్యపై బలమైన కత్తివేట్లను వేయలేదు. మేకపిల్లముందు తాను పులిలా నిల్చున్నా తాను మేకపిల్ల అయ్యాడు." బద్దన్న పదిదినములనుండియు తన్నుతాను చంపుకొనెను." అతని మనస్సులో ధర్మాధర్మముల తీవ్ర సంఘర్షణ చెలరేగి అది శారీరకంగా, మానసికంగా, అతన్ని బలహీనున్ని చేసింది. పరిషత్తు నిర్ణయాలు తనకు తెలుసు. నంబయ్యమీద తనకుగల కోపం తెలుసు. తనకు కత్తి యుద్ధంలో గల నేర్పు తెలుసు. ఏ విధంగాచూసినా నంబయ్య తనముందు మేకపిల్లే. క్షణంలో అతని కంఠాన్ని తెగ నరికేవాడే. అదే ఆశిస్తున్నారందరూ. కాని విచిత్రంగా నంబయ్య కత్తి బద్దన్న గుండెలో దిగబడింది. బద్దన్న ఆయాసంగా నేలకొరిగాడు. అందరూ విస్తుపోయారు. ఎక్కడో ఉన్న బాదమ్మ హాహాకారాలు చేస్తూవచ్చి చేతికందిన కత్తితో పొడుచుకొని బద్దన్న మీద పడిపోయింది. ఆమె ప్రాణాలు వదుల్తూ ..."ప్రభూ ! అతడు జారుడు కాడు, నేను జారిణి కాను, మాప్రేమకు మీ సూత్రములు పట్టవు. మాది లింగజ్ఞానాతీతమైన సంబంధము" అంది.

## 5,7 బాదమ్మ మనస్తత్వ చిత్రణ.

"బాదమ్మ ముప్పది ఏండ్ల యువతి. చామనఛాయ కలిగి కోలపుచువ్వవంటి మనిషి. ఆమె శరీరావయవ విన్యాసము భగవంతుడు చూచి క్రొత్తబండి కట్టనట్లుండెను. ఆమె మొగమున సౌందర్యమెంతయుండునో ప్రసన్నత అంతయుండెను. ఆమె శరీరమున కాఠిన్యమెంతయుండెనో సౌకుమార్యమంతయుండెను. ఆమె నేత్రములలో తీక్షణత ఎంతయుండెనో దయయంత యుండెను." (18) ఇది విశ్వనాథ బాదమ్మ శారీరక సౌందర్యాన్ని వర్ణించిన తీరు.

బాదమ్మ తండ్రి బీదవాడు. తిప్పన్న అనే వృద్ధునికి ఒక ఖండుక ధాన్యానికి ఆమెను అమ్ముకున్నాడు. బాదమ్మ కొనుక్కోబడి తిప్పన్న భార్య అయింది. తిప్పన్న ఆవూర్లో శ్రీమంతుడు.

బాదమ్మది కొప్పాక,ఆ గూడెంలోని కత్తిసాము దేశమంతా ప్రసిద్ధిపొందింది. చిన్నతనం లోనే బాదమ్మ కత్తిని చేపట్టింది. సాము,గరిడీలు నేర్చింది. ఖడ్గవిద్యలో ప్రవీణురాలైంది. కొప్పాక వారి ఖడ్గవిద్య తక్కినవారికి తెలియరానిది. ఆ గూడెంవారికి తప్ప మరొకరికి అందులో ప్రవేశం లేదు. గుఱ్ఱము యొక్క ముంగాళ్ళ నరుకెడు విద్య వారిదే. బాదమ్మ తాను నేర్చిన ఈ విద్యలోని ఒడుపులు ఆనాటి హోయసాలులు,కాకతీయులు,పాండ్యులు,రాష్ట్రకూటులు,వెలనాటి చోళులు, వంక తేరి చూడకుండా చేసింది.

బాదమ్మ బద్దన్నకు ఏడెనిమిదేండ్లనుండి ఖడ్గవిద్యలో గురువు. బద్దన్నను పుత్రవాత్సల్యం తో,చేరదీసి తాను నేర్చిన విద్యనంతా ప్రేమతో నేర్పింది. బద్దన్న బాదమ్మకడ నేర్చుకున్న విద్యతో ఆనాడు కరవాలభైరవుని చంపాడు,వానిమీదకు పంపింది బాదమ్మే.

తిప్పన్న వైష్ణవుడు. బాదమ్మ వైష్ణవి. వైష్ణవమత రహస్యాలెరిగిన చాలామంది దాసరుల దగ్గర బాదమ్మ అనేక విషయాలు తెలుసుకుంది.'కొప్పాక వాడలో నందరును వైష్ణవులు. అక్కడ బల్లిపిల్లకు కూడా వైష్ణవము తెలియును."

కరవాలభైరవుని మతదురహంకారం పెరిగిన వీరశైవుడు. బద్దన్న శైవుడు. ఆకాలంలో శైవులకు,వీరశైవులకు,మతసంబంధ కలహాలెన్నో జరిగేవి. కరవాలభైరవుడు తన వీరశైవమతాన్ని బలవంతంగా వ్యాప్తిలోకి తేసాగాడు. కరవాలభైరవుని మదమడగించనిదే దేశంలో శైవం,వైష్ణవం, నిలిచే అవకాశంలేదు. బద్దన్న కండపుష్టిని,ఖడ్గవిద్యా నైపుణ్యాన్ని,బాదమ్మ తెలుసుకుంది. ఆనాటి శివరాత్రినాడు కరవాలభైరవునిమీదికి బద్దన్నను ప్రోత్సహించి పంపింది.

కరవాలభైరవుని వధించి వీరసేనానిగా గుర్తింపబడి బద్దన్న గాయపడి ఇంటికిరాగా బాదమ్మ ప్రేమతో మందులిప్పించి,కట్లుకట్టించి,రాత్రింబవళ్ళు అతని దగ్గరే ఉండి సేవలుచేసి ఆరోగ్యవంతుని చేసింది.

బద్దన్న ఇంటికి బాదమ్మ వెళ్ళటం తిప్పన్నకిష్టంలేదు. వారిలో వయోభేదం ఎంతఉన్నా తిప్పన్నకు మాత్రం అనుమానం. తిప్పన్న బాదమ్మను అడ్డగించాడు. బాదాడు. వానింటికి వెళ్ల వద్దు. వెళితే ఇంటికి రానియ్యనన్నాడు. "వాడు నీకు శిష్యుడు కాదు మగడు'అన్నాడు. బాదమ్మ నవ్వి 'వాడు మగడెట్లగును,అతడు నా బాబుకు వంద నిష్కములిచ్చెనా? నివర్తనము లిచ్చెనా?' అంది. ఆమె భర్తమాటను లెక్కచేయలేదు. తిప్పన్న దెబ్బలకు తాళలేక ఆమె ఇంటిని వదిలి గాయాలతో బద్దన్న ఇంటికి వెళ్ళింది. బద్దన్న ఆమె గాయాలను చూసాడు. బాధపడ్డాడు. 'నీవు వచ్చుట మానివేయ మన్నాడు. "నీకిష్టములేనిచో నట్లే'అంది బాదమ్మ.'నాకిష్టము లేకపోవుట ఏమి?' అన్నాడు కోపంగా బద్దన్న. బాదమ్మ ఆలోచనలో పడింది.

బద్దన్నకు తనమీద ప్రేమయున్నట్లు తెలుసుకుంది. ఆ ప్రేమ ఎలాంటిదో ఆమె మనసుకు తొందరగా తట్టలేదు. పరిపరివిధాల ఆలోచనలు పరిభ్రమించసాగాయి. "ఇది యంతయు తనమీది

ప్రేమచేతనా?తానైనచో అక్కగారగును,తల్లియగును,ఈయీడు భేదంతో అతనికోర్కె తన మీదుండునా?మరి తనకెట్లుండును?తనకున్నచో అదెట్లుండును?ఇపుడు చూచినచో నిదివరకతడు తనయందు ప్రవర్తించిన ప్రవర్తనయంతయు నీ కోరిక కనుగణముగా గనిపించుచున్నది."తాను లోలోపల బద్దన్నను ప్రేమిస్తున్నట్లు గ్రహించింది.కాని ఈ ప్రేమ ఈ దేశంలో కొనసాగుతుందా?" తాను బద్దన్నను ప్రేమించరాదు.అతడు కుర్రవాడు.పైకి రాదగినవాడు.సేనానాయకుడు కాదగినవాడు.ఈ జయంతో నతడెంతో పైకివచ్చినను రా వచ్చును.తనతోడి కూటమి అతని శీలమునకు మచ్చతెచ్చును.

కాని ఆమెలోని అచిత్తు ఉద్రేకాలకు గురిచేసింది.ఆమెలోని కామవాంఛ బుసలు కొట్టింది.తిప్పన్నచేత అనేకసార్లు దెబ్బలు తింది.కాని ఆతనితో వైవాహిక జీవితాన్ని గడుపలేదు. ఆమెకు జీవితంమీద అనురాగం చావలేదు.అందుకే ఆత్మాహత్యా ప్రయత్నం చేయలేదు.లోకం ఏనుకున్నాసరేనని నిశ్చయించుకొని బద్దన్న ఇంటికి వచ్చింది.

"ఆమెకు దన ప్రాణమంతయు బద్దన్నగా కనుపించెను.తనకు వయసు వచ్చినప్పటి నుండి ఆ వయసుయొక్క పంట కనుపించలేదు.తిప్పన్న పురుషుడేకాని వానివద్ద భోగలక్షణములే లేవు.వానికి ప్రేమ యనగా నేమో తెలియదు.తన జీవితమంతము,తన ప్రేమయంతయు, బదియేండ్లుగా బద్దన్న కోసము ముడుపుకట్టియుండెను.అది ఇప్పటికి పంటమొగము తిరిగెను"(66

ఈవిధమైన శారీరక వాంఛ,బద్దన్నమీది ప్రేమ,బాదమ్మను అనాలోచితంగా బద్దన్న ఇంటివేపు మరలించింది.ఆ సమయంలో బద్దన్న తండ్రి ఇంట్లోలేడు.బద్దన్న ఒక్కడే ఉన్నాడు. దెబ్బలతో వచ్చిన బాదమ్మను చూసి కోపంతో'.."వాడు నా స్త్రీని తాకవలసిన అవసరమేల వచ్చెను."అన్నాడు.బాదమ్మ నవ్వి "ఓయీ ! నేనింతవరకు అతని స్త్రీనే.నీవు నన్ను నీ స్త్రీగా నెప్పుడు చేసుకుంటివి?అంది.బద్దన్న తనలోని ప్రేమగురించి చెప్పాడు.

కొన్నిరోజులు వారివురూ ఆ ఇంట్లో రహస్యంగా సర్వసుఖాలు అనుభవించారు.బద్దన్న తండ్రి రానున్నట్లు తెలియగానే వారివురూ నాదెండ్లకు పోయి పేర్లు మార్చుకొని ఉండసాగారు. ఆ విదంగా పేర్లు మార్చుకొని రహస్యంగా ఉండటం బాదమ్మ కిష్టంలేదు.బాదమ్మ వివేకవతి. తాము యవ్వనపుపొంగులో తప్పుచేస్తున్నట్లు తెలుసు.పర్యవసానం ఏమవుతుందో ఊహించ లేకుండా ఉంది.కాని బద్దన్న మాత్రం నిర్విచారంగా ఉండటమేగాక తాను మాత్రం ఆత్మనిర్దేశంగా ఈ పనిచేస్తున్నానని,లోకంతో తనకు నిమిత్తంలేదని వాదంపసాగాడు.ఆ వాదనలో తప్పంతా ఆమెదే నన్నట్లు మాట్టడాడు.ఆ మాటలతో ఆమె మానసికంగా కృంగిపోయింది.బద్దన్న మాటలవల్ల వారివురి ప్రేమ ఈలోకానికి సంబంధించినది కాదని తెలుసుకున్నా లోకంద్రుష్టిలో మాత్రం ఇరువురూ అపరాధులే.తనకన్న బద్దన్న ఎక్కువగా శిక్షింపబడతాడని బాదమ్మ విచారంలో పడిపోయింది.తాను చేస్తున్నపని అధర్మమని,బద్దన్న అనుకోకపోవటం,ఆమెకు ఆశ్చర్యం

కలిగించింది. బాదమ్మ విచారాన్ని గమనించి బద్దన్న "ఆడది ఎప్పుడును నోటితోఅనదు. అందుకనియే అధర్మమైన స్త్రీపురుష సంగమమునందు పురుషుడధిక శిక్షార్హుడగుచున్నాడు ఆ దోషమునకు వీడుకర్త."అన్నాడు.

ఆ మాటలు విని బాదమ్మ, "..ఆ దోషమునకు పురుషుని కర్తగా చేయుట స్త్రీపురుషుల యొక్క ఈ ప్రవర్తన బట్టి కాదు.దానికి వేరే కారణమున్నది.ఇందులో పురుషుడెంత దోషియో స్త్రీయునంత దోషవతి.ఒక్కొక్కపుడు పురుషునికన్న స్త్రీయందే దోషమధికమగును."అంది.బాదమ్మ. ఈ తప్పిదానికి ఈ అధర్మకార్యానికి తనే కారణమని గ్రహించి ఈ విధంగా మాటాడింది.బద్దన్న తప్పంతా తనమీద వేసుకొని ఒకవేళ శిక్ష పడితే తానే శిక్షార్హుడిగా నిర్ణయించుకొని బాదమ్మను రక్షించాలనుకున్నాడు."పురుషుడధికముగా శిక్షింపడుటకు వేరే కారణమున్నదంటివి అది ఏది?'అని అడిగాడు బద్దన్న.

"ధర్మములు,శిక్షలు,స్మృతులు,లౌకికములైన కారణములను బురస్కరించుకొని ఉండవు. మనము లౌకికముగా విచారించినచో వానిని కారణములుగా నంగీకరింపము. పురుషుడు సృష్టియొక్క ప్రాణము.స్త్రీ శరీరము.ఈ వట్టి శరీరము కదలదు.ప్రాణము కదులును. కదులుట ప్రాణముయొక్క లక్షణము.ఇది స్త్రీపురుషుల యొక్క సృష్టి రహస్యము...ఒక శరీరమునందు తన ప్రాణములుండ వలయునని భర్తయూహ.అతని కుద్దిష్టమైన శరీరమునందు తన ప్రాణముగాక మరియొక పురుషుని ప్రాణముండుట,యా భర్తయైన పురుషుడు సంహరింపబడుట నిశ్చేతను డగుట,ఇటువంటియొక్క లౌకిక సిద్ధాంతములను బురస్కరించుకొని పురుషుడధికముగా దండార్హుడగుచున్నాడు."అంది బాదమ్మ.

బాదమ్మ లౌకికములైన స్త్రీపురుషుల సంబంధాన్ని పురుషాధిక్యతను,బద్దన్నకు చెప్పిన దానిలో వివాహితయైన స్త్రీ భర్తను కాదని పరపురుషుని ఆశ్రయించినా భార్యదే తప్పు, అయినా లోకం ఆ స్త్రీని చేరదీసినవానిని దోషిగా నిర్ణయిస్తుంది.దానికి కారణాలను బాదమ్మ పై విధంగా తాత్వికంగా చెప్పింది.ఎంత చెప్పినా బద్దన్న ఆత్మలోని విచారం లౌకిక ధర్మాన్ని మరపింప చేసింది.తన ఆత్మలో ఏముందో చెప్పటానికి ప్రయత్నించేవాడు.అందుకోసం బద్దన్న" ..నీ కోసమే నిన్ను నేను తీసుకొనివచ్చుట.పరునిభార్యను దీసుకొని వచ్చుటగా వ్యాఖ్యానము చేయుచున్న ఈ దేశమును శిక్షించినను దప్పులేదు.నీవు నా భార్యవు.భార్యవశ:గా పెండ్లి చేసుకొన వలయునా? తాళి కట్టవలయునా?నా హృదయము నీయందు లగ్నమైనది.నేను పురుషుడనని తెలియకముందు నాలో లింగజ్ఞానమేర్పడక ముందు నేను నిన్ను భార్యగా స్వీకరించితిని.ఇందు దోషమేమున్నది? అవనీతి ఏమున్నది?"అని బాదమ్మనడిగాడు.

బాదమ్మ నిశ్చేష్టురాలైంది.అతీతమైన ఆత్మజ్ఞానం బద్దన్నలో నున్నట్లు గ్రహించింది. అతడు తనకంటె ఉన్నతమైన జ్ఞానసంపద గలవాడని తెలుసుకొని తనలో తాను ఆత్మపరిశీలన

చేసుకోసాగింది."తాను తిప్పన్నను వదలి ఈ పసివానితో నేల వచ్చెను?ప్రధానముగా నాతని యవ్వనము చేత నాకర్షింపబడెనా?ఆతని విద్యచేతనా?కాదనిపించెను.బాదమ్మ తన అంత రాంతర ములలో వెదికి చూసెను.బద్దన్న శైవుడు.తాను వైష్ణవి.చాలా దినములుగా బద్దన్న అంతటివాడు శైవుడై యుండుటకామె మనస్సంగీకరించుటలేదు.అతడు వైష్ణవుడైనచో నెంత బాగుగానుండునని ఆమె చాలాసార్లు ఊహించెడిది.ఆమె ఆలోచించగా...అదియే ప్రధానకారణముగా తక్కినవి యుపకారణములుగా నామె బుద్ధికి తోచెను.'(207.)

బాదమ్మ ఆత్మపరిశీలనలో మతం వ్యక్తమైంది.ఆమె ఇంకా లౌకికమైన వాసనలలోనే చుట్టుకొనిఉంది.బద్దన్నతో లేచివచ్చిన తర్వాత రెండేండ్లు అతనితో కాలం గడిపింది.తాను వైష్ణవినని,అతడు శైవుడని,యవ్వనపొంగులో మరిచిపోయింది.మొదట జీవితంవేరు,మతం వేరు అనుకున్నది.కాని బద్దన్నను చేరినప్పటినుండి నా రెండింటికి భేదం కనిపించలేదు.

ఈవిధమైన ఆలోచనలో బాదమ్మ లౌకికమైన మతంనుండి,జీవితసత్యాన్ని తెలుసుకుంది. జీవితానికి,మతానికి సంబంధంలేదని ఇంకా ఆలోచించగా బద్దన్న మాటలలోని సత్యాన్ని తరచి చూడగా ఆమెకు స్త్రీపురుషుల సంబంధంలో క్రొత్తక్రొత్త విషయాలు తెలియసాగాయి.ఆమె బద్దన్నలోని లోకాతీతవ్యక్తిత్వాన్ని చివరకు తెలుసుకో గలిగింది.

బద్దన్న గాయంతో నేలకొరగగానే ఆమె కత్తితో పొడుచుకొని అతనిపై బడి మరణిస్తూ మహారాజుతో "ప్రభూ ! అతడు జారుడుకాడు,నేను జారిణిని కాను,మా ప్రేమకు మీసూత్రములు పట్టవు. మాది లింగజ్ఞానాతీతమైన సంబంధం"అంది.

బాదమ్మ వైయక్తికంగా ఎంతో ఎదిగిన తర్వాత లౌకికమైన మతాన్ని,ధర్మాన్ని,వివాహ బంధాన్ని,కట్టుబాట్లను,మించిన లోకాతీతమైన సంబంధం తామిద్దరిలో ఉందని గ్రహించి నందువల్లనే బద్దన్నతో మరణించింది.ఇరువురి ఆత్మలు పై లోకాల్లో ముడివేసుకున్నాయి.

## 5.8 బద్దన్న బాదమ్మల బంధం-లోకాతీత సంబధం. విశ్వనాథ తీర్పు.

బాదమ్మ మరణిస్తూ రాజుతో "అతడు జారుడు కాడు,నేను జారిణిని కాను,మా ప్రేమకు మీ సూత్రములు పట్టవు.మాది 'లింగజ్ఞానాతీతమైన సంబంధం " అన్నట్లు విశ్వనాథ చివరలో పలికించాడు.

నవల ప్రారంభమైనది మొదలు చివరిదాకా బద్దన్న బాదమ్మల సంబంధం అక్రమ మైనదనీ,జారత్వంతో వారు దోషులనీ,నవలను చదివిన వారందరూ అనుకోవాల్సిన సమయంలో విశ్వనాథ ముగింపులో వారిద్దరి బంధాన్ని 'లోకాతీతమైనదిగా' మలుపు తిప్పాడు. విశ్వనాథ దృష్టిలో ప్రేమకు,దాంపత్యానికి,వావాహబంధానికి,లౌకికమైన నిర్ణయాలు,కట్టుబాట్లు, నిలువవని, వాటికి అసలు కారణం జన్మజన్మల సంబంధంగా ఉంటుందని నిరూపిస్తాడు.విశ్వనాథ ఇదే విషయాన్ని బద్దన్నచే పలుమార్లు పలికిస్తాడు.బద్దన్న ఒకసారి ఈవిధంగా అనుకుంటాడు. "తాను

బాదమ్మను కామించుట చాల చిత్రముగా నుండెను.ఇది దేవతలు మెచ్చరు, మనుష్యులు మెచ్చరు,ఎవరు మెచ్చినను మెచ్చుకున్నను బాదమ్మ మెచ్చిన చాలును."అనిపించెను.వివాహితయైన స్త్రీని బద్దన్న కామించుట నిజంగా ఎవరును మెచ్చని విషయమే.శారీరకమైన కామవాంఛ ఉధృతంకాగా పై విధంగా అనుకున్నాడు.బద్దన్న బాదమ్మ మెచ్చితే చాలని అనుకోవటంలో అతనిలోని కామేచ్ఛ యవ్వనంలోనున్న అతన్ని ప్రేరేపించి యుండవచ్చును.బద్దన్నకు లోకజ్ఞానం లేదనికాదు.తాను కావాలని తప్పుచేయలేదు.పైగా"బాదమ్మ తన్నెందుకు ప్రేమించదు? ఆమె ఏలవచ్చి కౌగలించుకొనదు?అనిఅనుకుంటాడు.తిరిగి తనకుతానే'తానందగాడా,శ్రీమంతుడా, తన్నామె ఏలప్రేమించును?తన్నామె ప్రేమించినచో నది జారత్వమే కదా?ఆమెకంత నీతిలేదా? ఇంతకును తన్నామె ఏలప్రేమించదు?"అని అనుకోవటంలో బద్దన్నలో ఇంతవరకు ఉద్రేకపరచింది 'కామేచ్ఛయే'గాని పిజమైన ప్రేమఅతనిలో ఇంతవరకు జాగృతం కాలేదని తెలుస్తున్నది.

లోకజ్ఞానం కలగిన బద్దన్న తనలో రేగిన కామవాంఛకు తట్టుకోలేకనీతి,అవనీతి, విషయంలో ఘర్షణ పడ్డాడు.కాని క్రమంగా అతనిలో ఆత్మ విచారం మొదలుకాగానే బాదమ్మ విషయంలో "నాకు బన్నెండు,పదమూడేండ్లు వచ్చినప్పటినుండియు నేను నిన్ను ప్రేమించు చుంటిని.తిప్పన్న ఎప్పుడైనను చచ్చియైనపోవును,లేదేని ఎప్పుడో నిన్ను తీసుకొనివచ్చి ఇదిగో నీ భార్య తీసుకొని పొమ్మని యప్పగించియైన పోవునని అనుకొనుచుంటిని"అని బద్దన్నతో విశ్వనాథ పలికిస్తాడు.

విశ్వనాథ ఇక్కడ 'లోకాతీతమైన విషయాన్ని' బద్దన్నలో ప్రవేశపెడ్తాడు.మొదట బద్దన్నలోని శారీరకమైన వాంఛ మానసికమై,క్రమంగా మానసికమైనదే ఆత్మగతమై విచిత్రంగా బద్దన్న ఆత్మలో నుండి లోకాతీతంగా వెలువడినట్లు చిత్రిస్తాడు.

ఇక్కడ'లోకాతీత విషయమని' ఎందుకంటున్నామంటె, బద్దన్న బాదమ్మను పన్నెండేండ్ల వయస్సునుండే ప్రేమించటం,ఆమెనే భార్యగా అనుకోవటం,తనకంటె పదేండ్లు పెద్దదైన స్త్రీనే భార్యగా అతడు భావించటం,లౌకికంగా బాదమ్మను భార్యగా కట్టుకున్న తిప్పన్న చనిపోవటమో, లేక తిప్పన్న వచ్చి ఇదిగో నీ భార్యయని అప్పగించటమో,చేస్తాడని బద్దన్న తలంచటం,మొదలైన విషయాలు అలౌకికతత్వాన్ని తెలుపుతున్నట్లు కనిపిస్తాయి.కాని ఈ మాటల్లో బద్దన్న అమాయకత్వం కూడా ఉండవచ్చునేమో అని అనిపిస్తుంది.అలాంటి సందేహం రాకుండా ఉండటానికి బద్దన్నలోని ప్రకృతితత్వాన్ని విడమర్చి చూపటానికి విశ్వనాథ బద్దన్నలోని ఆత్మ విచారాన్ని అనేక విధాలుగా చిత్రిస్తాడు.

బద్దన్న బాదమ్మను ఆత్మగతంగా తెలుసుకొని తన భార్యగా స్వీకరించాడు.ఆనాటి నుండి అతనిలో అహంకారం పొడసూపింది.బాదమ్మ తన సొత్తని భావించసాగాడు."తాను బాదమ్మను ప్రేమించెను.అతని ఉద్దేశంలో నది ధర్మము.అది ఎవ్వరును కాదనరనుకొనును.

అతని కందులో దోషము కన్పింపదు. తాను ప్రేమించెను. కావున నెవ్వరును దోషమనరాదు. అతని అహంకారము,స్వాభిమానము,ఆత్మతో ముడిపడెను."

విశ్వనాథ బద్దన్నలో లోకజ్ఞానం కొరవడలేదని,పైగా అతను అమాయకుడు కాదని లోకజ్ఞానాన్ని మించిన ఆత్మజ్ఞానంలోకి అతడు వెళ్ళిపోయాడని పై మాటలవల్ల తెలియచేస్తాడు. బాదమ్మను ప్రేమించటం,బద్దన్న ఉద్దేశంలో ధర్మమే అంటాడు. లౌకికంగా వివాహితను ప్రేమించటం అధర్మమే. అధార్మికమైన విషయాన్ని బద్దన్న దృష్టిలో ధార్మికమైనదిగా చెప్పటం, అందులో బద్దన్నకు దోషం కనిపించక పోవటం,విచారణీయమైన అంశాలుగా గోచరిస్తాయి.

బద్దన్న బాదమ్మలు శారీరకంగా కలుసుకొని సుఖభోగాన్ని అనుభవించినపుడు,బద్దన్న తనకు కలగిన "స్పర్శానుభూతితో" ప్రాత,క్రొత్తల తనాన్ని అనుభవించాడు. "ఆ క్రొత్తదనములో కొంత ప్రాతదనమున్నట్లుండెను. ఆ క్రొత్తదనము సిగ్గుచే ప్రాతదనము ప్రత్యక్షముచే". ఇక్కడ క్రొత్తదనము లౌకికమైనది. ప్రాతదనము అలౌకికమైనది. ఇది-ప్రత్యక్షముచే అని అనటంవల్ల అది ఆత్మగతమైన ప్రాతదనాన్ని సంతరించుకున్నది. అనగా బద్దన్న స్పర్శజ్ఞానంతో బాదమ్మ తన జన్మజన్మల భాగస్వామిగా గ్రహించాడు. అదే ప్రాతదనమైనది. తాము చేస్తున్న పని అధర్మ కార్యమని,లోకమెప్పుడైనా తమను శిక్షించక మానదని బాదమ్మకు తెలుసు. బద్దన్న ఈ చిన్న తప్పిదాన్ని ఎందుకు గుర్తించడో బాదమ్మకు అర్థంకాదు. కాని బద్దన్న మాటలు నీతి, అవినీతి, విషయంలో విచిత్రంగా తోచసాగాయి. బాదమ్మ తాము చేస్తున్న పని అధర్మకార్యమని చెప్పినపుడు, బద్దన్న ఈ విధంగా అంటాడు.

'నాకిది ధర్మమో,యధర్మమో,పుణ్యమో,పాపమో,తెలియదు. నాకు తెలిసినది ఒక్కటే విషయము. నేను నిన్ను ప్రేమించితిని. ఆ ప్రేమనాలో భగవంతుడు కల్పించెను. భగవంతుడెట్లు చేయించునోఅట్లు చేసెడువాడను నేను...నేనిది కామ ప్రవృత్తిచేత చేయలేదు. కామముయొక్క స్వరూపము నాకు తెలియనపుడు నేను నిన్ను ప్రేమించితిని. ఇది పాపమెట్లగునో నాకు తెలియదు ..స్త్రీపురుషుల నడుమునున్న దూరమును లోకము వివాహము,వివాహము లేకపోవుట యను కొలతబద్దతో గొలుచును. ఇచ్చట దూరములు లేవు.....నా చిన్ననాటికి నీవు పెద్దదానవు. అప్పుడు నిన్నొక అక్కగారివలె ప్రేమించవచ్చును. నా మనస్సునందిట్టిదిగా లేదు. అప్పటి నుండి నేను నిన్ను భార్యగానే భావించితిని. నీవునన్ను భర్తగా భావించితివి. అప్పటికి నాకు మన కామ విషయము తెలియదుకదా."

విశ్వనాథ బద్దన్న విషయంలో మరోచోట ఈవిధంగా అంటాడు.

"ఒక్కొక్కపుడు విచారించినచో నొక శకపురుషుడూ,ఒక విజేత,ఒక మహాశిల్పి,యీ తరగతికి చెందినవారుగా గన్పింతురు. వానియందిట్టి భావమే లేనిచో వారా మహాకార్యములను చేయంజాలకుందురు. అందుకనియే లోకోద్ధారకులు,లోకోపకారములైన మహాకార్యములు చేసిన

వారందరూ కొన్ని విషయములలో మిక్కిలి స్వార్థపరులుగా గన్పింతురు. నిరంకుశులుగా నుందురు. వారు లోకాతీతులు. లోకము వారి కొరకు కాదు,వారు లోకము కొరకు"(59).

మొదటి విషయం బద్దన్న దేశభక్తి విషయంలో అన్వయించగా,రెండవది అతడి అధర్మ ప్రవృత్తికి చెందుతుంది. దానిని విశ్వనాథ సమర్థిస్తూ బద్దన్నది 'లోకాతీతదృష్టి"అంటాడు.

బద్దన్న జ్ఞానమార్గస్థుడు. అతనికి పరుని ఆశ్రయించనన్న అహంకారము, స్వాభిమాన ముండును.'ఈ విధంగా బద్దన్న వ్యక్తిత్వాన్ని క్రమంగా పెంచుకుంటూ పోయి అతనిని ఆత్మజ్ఞానిగా రూపొందించాడు విశ్వనాథ.

భారతీయుని మనస్తత్వం సాధారణంగా కర్మనీ,జన్మజన్మల ఋణానుబంధాన్నీ, ఆధారం చేసుకొని దేనినైనా తాత్వికంగా భావింపచూస్తుంది. "ఋణానుబంధ రూపేణ పశుపత్నీ సుతాలయః "అనెడి సూక్తి మనకుంది. జన్మజన్మల బంధం మానవునికి ఉన్నట్లు మనం నమ్ముతాం. ఋణంవల్లనే పత్నికూడా సమకూరుతుందనీ,మన విశ్వాసం. పూర్వజన్మలకు పలితాలు ఈ జన్మలో అనుభవిస్తామనీ తాత్వికంగా మనం చెప్పుకుంటాం. అంతేగాక "భగవద్గీత" ప్రభావం భారతీయు లందరిమీద మిక్కుటముగానే ఉన్నదని చెప్పవచ్చు.

విశ్వనాథ సంప్రదాయవాది. మహాతాత్వికుడు. భారతీయ సంస్కృతిని బాగా జీర్ణించు కున్నవాడు. ప్రేమ,దాంపత్యం,వివాహం,సంపద,సంతానం,మొదలైనవన్నీ జన్మజన్మలనుండి వ్యక్తులకు సంక్రమించే భావాలచే రూపొందుతాయని విశ్వనాథ విశ్వసిస్తూ నిరూపిస్తాడు. ఈ నాలుగు నవలల్లో మనం ఇదే విషయాన్ని గమనిస్తూ ఉంటాం. ఇవి నమ్మినవారికే 'విశ్వనాథ' తాత్వికతత్వం అర్థం అవుతుంది.

ప్రకృతి పురుషుల సంబంధాన్ని "దాంపత్యధర్మంగా' విశ్వనాథ భావిస్తాడు. ఇదే విషయాన్ని మతానుసారం "అర్థనారీశ్వర తత్వంగా" తమ 'గిరికుమారుని ప్రేమగీతాలలో' చూపించాడు. ప్రతి తాత్వికమైన నవలల్లో ఈ భావాలనే మన ముందుంచుతాడు.

బద్దన్న బాదమ్మలను కూడా ఈ విధంగానే ముడివేశాడు. బద్దన్నలో 'కామప్రవృత్తి' లేనప్పుడే బాదమ్మను భార్యగా గర్తించాడు. అనగా అతనిలోని 'జీవలక్షణం' స్పర్శతో బాదమ్మను గుర్తించి తెల్పింది. ప్రతి జీవునిలో "పురుషాంశ,స్త్రీ యంశ" ఉంటుందనీ ఇదే "ప్రజాపతి-శతరూప"గా భావించి విశ్వనాథ ప్రేమవిషయంలో వీటికి స్థానం కల్పిస్తాడు. (శతరూప యనేది బ్రహ్మ మానసంలోనుండి సగం పురుషునిగాను,సగం స్త్రీగాను పుట్టిన అంశ). ఇదే "అర్థనారీశ్వర తత్వం" తర్వాత వీటినే యూంగ్ పేర్కొనటం చూస్తాం.

యూంగ్ ప్రతి వ్యక్తిలో అనిమా,అనిమస్, అనే స్త్రీ పురుష అంశలు ఉంటాయనీ,లోకంలో స్త్రీపురుషుల ఆకర్షణకు ఇవే మూలమౌతాయనీ,చెప్తాడు. మనస్తత్వ శాస్త్రరీత్యానే గాకుండా జన్మ శాస్త్రపరంగా కూడా ఇది సత్యమైన విషయమే.

ఇక్కడ బద్దన్న మనస్తత్వంలో ఈ అంశలు ప్రవేశించి,స్పర్శానుభూతిద్వారా బాదమ్మను తన స్త్రీ అంశగా గుర్తించి అతడు ఆమెను తన భార్యగా చెప్పటం మనకు లోకాతీత విషయంగా తోస్తుంది.అందులన ఈ అంశలను దృష్టిలో ఉంచుకునే బాదమ్మచే చివరలో "మా ప్రేమకు మీ సూత్రములు పట్టవు.మాది లింగజ్ఞానాతీతమైన సంబంధం"అని పలికిస్తాడు.

## 5.9 ముగింపు-సందేశం.

లోకంలోని వ్యక్తులను సాధారణులు,అసాధారణులు అని స్థూలంగా రెండు విధాలుగా విభజించవచ్చు,సహజంగా సమాజంలో ఒదిగి సామాన్య జీవితం గడుపువారు సాధారణులు. అలా కాకుండా సమాజంలో జీవిస్తూనే కొన్ని పరిస్థితులలో సామాజిక కట్టుబాట్లకు,నీతి నియమాలకు,కట్టుబడక తమ అంతరాత్మ నిర్ధేశంతో ధైర్యంగా ముందుకు నడిచేవారు అసాధారణులు.వారి వ్యక్తిత్వం ప్రత్యేకంగా ఉండి సాధారణుల వ్యక్తిత్వం కంటె భిన్నంగా ఉంటుంది. వారి ప్రవర్తనకూడా ప్రత్యేకంగానే ఉంటుంది.ఇటువంటి వ్యక్తిత్వంగల వారినే ప్రతిభావంతలనీ, మేధావులనీ,భావించవచ్చు.వీరి వ్యక్తిత్వాన్ని ప్రవర్తనను కొంతవరకు ఊహించి అర్థం చేసుకోవచ్చు, కానీ ఇంతకన్న విలక్షణమైన వ్యక్తిత్వం కలిగిన వ్యక్తులు కొందరుంటారు. వారి వ్యక్తిత్వాన్ని మనస్తత్వాన్ని అర్థం చేసుకోవటం కష్టం.

ఏ మనోవిజ్ఞానశాస్త్రానికి,ఏ వైద్యశాస్త్రానికి,లొంగని వ్యక్తిత్వంగల అసాధారణవ్యక్తులే లోకాతీత వ్యక్తులు.వీరి మానసిక శక్తి అపూర్వమైనది,అద్భుతమైనది,వీరి ప్రవర్తనకూడా లోకాతీతమైనదే.వీరి ప్రవర్తనలను మనం ఏ తత్వానికో ముడిపెట్టుకొని అర్థం చేసుకోవాల్సిందే.

విశ్వనాథ ఈ నవలలో బద్దన్న బాదమ్మలను లోకాతీత వ్యక్తులుగా చిత్రించాడు.సహజ వాతావరణంలో పుట్టి పెరిగినా,సామాజిక పరిస్థితులలో మెదలినా,లోకజ్ఞానం కలవారైనా, సాధారణ జీవితం గడపక తమ అంతరాత్మ నిర్దేశించిన ప్రకారం లోకాతీతంగా నడుచుకోవటం ఇదులో విశేషం.ఇది సాధారణులకంటె భిన్నమైనదని చెప్పవచ్చు.

విశ్వనాథ బద్దన్న పాత్రను మనోవిజ్ఞానశాస్త్రానికి, ప్రాచీనమైన "ప్రజాపతి–శతరూప" తత్వానికి,తన ఉద్దేశానికి,అనుకూలంగా మలిచాడు.యవ్వనారంభదశలో అతని బలిష్టమైన దేహదారుఢ్యం,ఉదాత్తీకరింపబడిన అతని మానసికశక్తి ,ప్రయోజనతా దిశగా మళ్లించి అతనిలో దేశభక్తి పుట్టించి,అసాధారణమైనరీతిలో స్వాతంత్ర్య సముపార్జనకై అతడు నిర్విరామంగా శ్రమించిన విధానాన్ని చూపటం ఒకెత్తుకాగా, అతనిలోని కామవాంఛ బుసలు కొట్టగా వివాహితయైన స్త్రీని లేవదీసుకొని,పేర్లు మార్చుకొని,దేశమంతా తిరుగుతూ,ఆమెతో తాను చేస్తున్న పని ధార్మికమైన దేననిచెప్పటం,అతని మాటలు అర్థంగాక ఆమె క్రమంగా అతనిమాటల్లోని అంతరార్థాన్ని గ్రహించి ఆమె కూడా సత్యాన్ని తెలుసుకోవటం,బద్దన్న ఆత్మ పరిశోధనలో లౌకికంగా తాను చేస్తున్న పని తనకు ధార్మికమైనా,లోకానికి మాత్రం అది అధార్మికమని,తనలాంటి సాహసి ఇట్టి తప్పుపని

చేయటం సమాజానికి మేలు కాజాలదని తెలుసుకోవటం,అందుకే న్యాయబద్ధంగా పరిషత్తు ముందుకు రావటం,తనకు తానే శిక్ష విధించుకోవటం,అపూర్వమైన మరొక ఎత్తుగా చిత్రించి ముగించటం విశ్వనాథ ప్రతిభకు తార్కాణం.బాదమ్మలా మనంకూడా ఎంతో ఆత్మపరిశీలనతో విషయాన్ని గ్రహిస్తేగాని విశ్వనాథ పాత్రలచే పలికించే మాటలు,చిత్రించే విధానం మనకర్థంగాదు.

లోకంలో లోకాతీత వ్యక్తులుండటం అసహజమేమీకాదు.వారిని మనం అర్థం చేసుకోవటమే కష్టం,వారు మనవలె సహజంగా ఆలోచించక పోవటం,దీనికి కారణం.వీరే అసాధారణ వ్యక్తులు.వీరిలో లోకాతీతవ్యక్తత్వం ఉన్నందువల్లనే వీరిచ్చే సందేశాలవెనుక అలౌకిక మైన తత్వమేదో ఉందని గుర్తించి తెలుసుకోవటమే మన బాధ్యత.



# 6. త్వగింద్రియ స్పర్శచే బంధం-తెఱచిరాజు

## 6.1 త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతం.

విశ్వనాథ సత్యనారాయణగారు సాహిత్యంలో వినూతనమైన ప్రయోగాలు చేసి చూపిస్తారు.వీరికి ప్రాచీన సాహిత్యంమీద ముఖ్యంగా ఉపనిషత్తులు,దర్శనాలమీద విశ్వాస మధికం. భూతప్రేతాల గురించి 'బాణావతి'అనే నవల వ్రాశారు.పూర్వజన్మ పరజన్మల గూర్చి 'పునర్జన్మ' అనే మరోనవల వ్రాశారు.హాస్యవ్యంగ్యోక్తులతో 'విష్ణుశర్మకు ఇంగ్లీసు' చెబుతారు. 'పులులచే సత్యాగ్రహం' చేయిస్తారు.'పురాణవైర గ్రంథమాల' పేరుతో చరిత్రను ఆధారం చేసుకొని మానవుని లోని మూలరూపాలను వెలుపలికి తీస్తారు. ఈ విధంగా రకరకాలుగా చేసే సాహిత్యప్రయోగాలలో "తెఱచిరాజు" అనే నవల ఒక విశిష్ట ప్రయోగం.

విశ్వనాథ రచన ఎటువంటిదైనా అందులో ఉండేది,మనకు గోచరించేది, మానవుని లోని మూలమనస్తత్వం. భౌతికమైన నాగరికత,విజ్ఞానం,ఎంత పెరిగినా మానవజీవితంలోని శైశవం (ఆదిమ మానవుని దశనుండి) నాటి అనేకవిధాలైన అజ్ఞాతముద్రలెన్నో మనస్సులో ముద్రంచుక పోయిన భావాల నాధారం చేసుకొని వృద్ధిపొందిందే మూలమనస్తత్వం.

దీన్నే కారల్ గస్టాఫ్‌యూంగ్ 'జాతి వారసత్వాన్ని'గా చూపి అందులో మూలరూపాలను వివరిస్తూ ఇవి మనిషిలో 'సమష్టి అచేతనం'లో భాగంగా, 'అనువంశికంగా' చేరుతాయని చెప్పాడు.ఏ జాతి మానవునికైనా ఆ జాతి విశ్వాసాలతో కూడిన ప్రాచీన పురాణవాఙ్మయంలోని గాథలన్నీ మూలరూపాలుగా వ్యక్తి అచేతనంలో నిలువ ఉంటాయని 'యూంగ్' వివరిస్తాడు.

మనోవిజ్ఞానశాస్త్రజ్ఞులందరూ,వారివారి ప్రయోగాలతో మానవుని మనస్సులోని మానసిక క్రియాకలాపాలన్నీ వెలుగులోకి తెచ్చి మనోవిశ్లేషణకు అనుకూలమైన దారులు ఏర్పరచారు.కాని మానవునిలోని అతీంద్రియ శక్తులనుగూర్చిగానీ,లోకాతీతవ్యక్తిత్వం గూర్చిగానీ వారేమీ చెప్పలేక పోయారు.దానికి 'పారా సైకాలజీ' అనేపేరుతో వ్యవహరిస్తూ అటువంటివి సహజమైనవికావనే నమ్మకంతోనే ఉండిపోయారు.

తాను రచించిన నవలల్లోని ఏపాత్రలోని ఎటువంటి మనస్తత్వానికైనా విశ్వనాథగారు పౌరాణికతత్వంతో ముడిపెడతారు.దానికి ఆధారంగా ప్రాచీనసాహిత్యంలోని ఉదంతాలనెత్తి చూపుతారు.ఆ విధంగా "మత్స్యపురాణంలోని శతరూప" వృత్తాంతాన్ని ఆధారంచేసుకొని అపూర్వమైన కథాకల్పనం గావించి ఈ నవల వ్రాసారు.ఈ నవలలోని ప్రధానవిషయం "త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతం".

"తెఅచిరాజు" నవలలోని త్వగింద్రియ స్పర్శ గురించి కొందరి అభిప్రాయాలు ఈవిధంగా ఉన్నాయి.

"తెఅచిరాజు" మనస్తత్వ నిరూపణమునందు చేసిన అద్భుతప్రయోగము.లోకాతీత వ్యక్తులైన నిరువురి మహావ్యక్తుల జీవసంపుటి యందలి ఆత్మచైతన్యం పరస్పర త్వగింద్రియ స్పర్శచే నెట్లుద్భుదమయ్యెనో ఈయన భవభూతివలె వర్ణించెను.ఇంత ఆత్మలక్షణ వివేచనముగల నవల తెలుగున మరియొకటిలేదు. '1.

"సృష్టి కదలిక కామంతోనే.పరమేశ్వరుని కామభావన విరాట్పురుషుని స్పర్శగా రూపొందింది.కనుక ఈ అచ్ఛమైన తొలికామం స్పర్శ సంబంధమే.కనుక వాసంతి సారథుల మధ్య కవి ఈ రహస్యాన్ని అతికాడు."[2]

"నీచమైన త్వగింద్రియ నైశిత్యమును కూడా మోక్షప్రాప్తికు సాధనముగాచేసి చూప గలిగిన శ్రీవిశ్వనాథవారి 'ఏకవీర-తెఅచిరాజు'ల వంటి నవలల యుత్తమత్వము నిచట సోపపత్తికముగా నిర్ణయింపమికి హేతువు లక్ష్యలక్షణ సమన్వయమీ ప్రకరణోద్దేశము గామియ్యే[3]"

విశ్వనాథయే స్వయంగా ఈ నవల గురించి ఈ విధంగా చెప్పాడు."ఏకవీరలో నేను ప్రారంభించిన త్వగింద్రియ స్పర్శలక్షణము 'తెఅచిరాజు'లో మరల నెత్తుకొని వ్రాశాను"[4].

తెరచిరాజు నవలలోని ముఖ్యమైన త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతమును విశ్వనాథ ఏవిధంగా స్థాపించాడో పరిశీలంచాల్సి ఉంది.దీనికి మూలం దర్శనాలలో ఉన్నా భవభూతి మహాకవి సంస్కృతంలో రచించిన "ఉత్తరరామచరితమ్" నాటకంలో ప్రవేశపెట్టిన స్పర్శలక్షణాన్ని విశ్వనాథ గ్రహించి పెంచి పెద్దది చేసాడు.[5,6.]

(నాటకాంశ కథకోసం -చూడు,పుట, 3.6 ఏకవీర)

విశ్వనాథ మొదట దీనిని ఏకవీర నవలలో ప్రస్తావించటమేగాక ఆ నవలలో సజాతీయ,విజాతీయ స్పర్శను కూడా ప్రవేశపెట్టాడు.అదేవిధంగా ఈనవలలో సారథి,వాసంతిల మధ్య సజాతీయస్పర్శను,వాసంతి ఇతరుల మధ్య విజాతీయస్పర్శను విస్తరించి వివరించాడు.

ప్రాచ్య పాశ్చాత్య తాత్వికాంశాలను,శాస్త్రీయ పరిజ్ఞానాన్ని, కళారీతులను,ఆకళింపు చేసుకన్న విశ్వనాథగారికి స్పర్శసిద్ధాంతానికి కావాల్సిన తాత్వికభూమిక రూపొందించుకోవటంలో ఈ క్రిందపేర్కొన్న అంశాలు తోడ్పడి ఉంటాయని భావించవచ్చు.

ప్రకృతినిస్త్రీగా,పరమేశ్వరుని పురుషునిగా భావించటం మన సంప్రదాయం.స్త్రీపురుషుల కలయికవల్లే సృష్టి అనగా 'జీవం' పుడుతుంది.ఆ జీవంలో ఆత్మ ఉంటుంది.ఆ ఆత్మకు చావు, పుట్టుకలుండవు.ఆత్మ ఒకశరీరాన్ని విడిచి మరోశరీరంలో ప్రవేశిస్తుందనీ,ఆ ఆత్మ ఒక చైతన్య

1.విశ్వనాథ భ్రమరవాసిని ఒక పరిశీలన.పుట.11
2.విశ్వనాథ శారద,తెఅచిరాజు,వ్యాసం. పుట.75.
3.ఆంధ్రనవలా పరిణామం.పుట.116.
4.'నేను- నా సాహిత్య రచనలు'.మహతి.పుట.13.
5.6, ఉత్తర రామచరిత.తృతీయ శ్లోకం.

స్వరూపమనీ,జన్మజన్మల బంధం ఆత్మకుంటుందనీ,కర్మలవల్లనే జన్మలు కలగుతాయనీ,కర్మ నివృత్తిచే ఆత్మకు మోక్షం లభిస్తుందనీ మన దర్శనాలు,ఉపనిషత్తులు,వెల్లడిస్తున్నాయి.[7]

జ్ఞానేంద్రియాలతో,కర్మేంద్రియాలతో,పంచతన్మాత్రలతో(శబ్ద,స్పర్శ,రూప,రస, గంధాదులు)పొందిన అనుభవజ్ఞానాన్ని మనస్సుగ్రహించి ఆత్మకు తెలియచేస్తుంది.అదేవిధంగా త్వక్కు(శరీరం)గ్రహించిన స్పర్శజ్ఞానాన్ని మనస్సు గ్రహంచి ఆత్మకు తెలియచేస్తుంది.అదే 'త్వగింద్రియ స్పర్శ జ్ఞాన సిద్ధాంతం".చైతన్యవంతమైన ఈ ఆత్మ స్త్రీపురుషాత్మకం.అనగా సృష్టికి మూలమైనది.ప్రతి ఆత్మలో స్త్రీ అంశ,పురుషాంశ,ఉంటుంది.అదే అర్థనారీశ్వరతత్వం.ఈ తత్వానికి మూలం మత్స్యపురాణంలోని ఒకకథ.అందులో,'బ్రహ్మ 'శతరూప'అనే స్త్రీని సృష్టించి ఆమెనే వివాహ మాడెనట. పూర్వ గాథాలహరిలో శతరూపను "బ్రహ్మమానసమునుండి సగము స్త్రీరూపముగను, సగము పురుషరూపముగను,బుట్టిన శక్తిగా చెప్పబడినది".[8].దీనినే విశ్వనాథ తన కల్పవృక్షంలో "ఒంటరియై ప్రజాపతియు నూరక భీతివహించి తోడు వాల్గంటిని సృష్టి చేసెనట"[9],అని చెప్పటం జరిగింది.కోటానుకోట్లు రూపాలు ధరించే శతరూపే ప్రథమచ్ఛధం, ప్రజాపతే పురుషతత్వం.

స్త్రీ పురుష సంబంధమైన శతరూప ప్రజాపతి భావాలు మూలరూపాలుగా వ్యక్తులలో ఉంటాయని యూంగ్ తన విశ్లేషణాత్మక మనోవిజ్ఞాన శాస్త్రంలో పేర్కొన్నాడు.వీటినే ఆతడు అనిమా,అనిమస్ లని వ్యవహరించాడు.యూంగ్ భావనలు ఈవిధంగా ఉన్నాయి.

"పరిణామప్రక్రియలో ద్విలింగ జీవులనుండి క్రమంగా స్త్రీపురుష భేదమున్న జీవులు ఏర్పడినాయి.ఈ విధంగా సంక్రమంచిన విధానంవల్ల వ్యక్తులలో కూడా స్త్రీలలో పురుషలక్షణాలు పురుషులలో స్త్రీలక్షణాలుండటం సంభవిస్తుందినీ,అదీగాక జన్యువులుకూడా తల్లినుండి కొన్ని తండ్రినుండి కొన్ని సంక్రమించి అండంలో చేరుతాయనీ,ఆవిధంగా కూడా స్త్రీపురుషలక్షణాలు ప్రతివ్యక్తిలో ఉంటాయనీ వివరించాడు."[10]

పురుషులలో అంతర్గతమైన స్త్రీలక్షణాలను అనిమా,స్త్రీలలో అంతర్గతమైన పురుష లక్షణాలను అనిమస్ అంటారు.ఈ అంతర్గత మూలరూపాల వల్లనే స్త్రీపురుషులు ఒకరినొకరు ఆకర్షించుకోవటానికి పరస్పర ప్రతిస్పందనలు జరుపుకోవటానికి వీలవుతున్నది.

విశ్వనాథ దీనినే తాత్వికంగా రూపొందించుకొని ప్రతి వ్యక్తిలో "అర్ధనారీశ్వరతత్వాన్ని" భావవిస్తాడు.ఈవిధంగా భావింపబడిన అర్ధనారీశ్వర తత్వమే లోకంలో ప్రేమికులుగా గాని,భార్యా భర్తలుగా గాని ఏర్పడటానికి మూలం అవుతుందనీ,ఈ తత్వం ఏ ఒక జన్మకో కాకుండా జన్మజన్మాలకు కూడా సంక్రమించి ప్రతి జన్మలో కూడా వారే భార్యాభర్తలుగా రూపొందటానికి

---

7.భారతీయ తత్వశాస్త్రం. సమగ్రపరిశీలనం.షడ్దర్శనములు.పుట.185.

8.పూర్వగాథాలహరి.పుట.114. 9. విశ్వనాథ శారద, 'తెలుచిరాజు'వ్యాసం.పుట.76.

10.అపసామాన్య మనోవిజ్ఞాన శాస్త్రం.పుట.101.

దైవం నిర్ణయిస్తాడనీ,కాని మనం దానిని గ్రహించలేక స్త్రీపురుషుల మధ్యగల ప్రేమను అపార్థం చేసుకుంటామనీ,సాంఘిక నియమాలచే మనం బందీలమవుతామనీ,తన రచనల్లో వ్యక్తం చేస్తాడు.

"మగవాడు ఎంత వయస్సులోనైనా చిన్నపిల్లను పెళ్ళిచేసుకునే ఆచారాన్ని అన్ని జన్మల్లోను ఆ స్త్రీపురుషులే భార్యాభర్తలుగా అవుతుంటారన్న విశ్వాసాన్ని ఆయన తీవ్రాభినివేశంతో నిరూపిస్తాడు."[11]

సమాజంలో వ్యక్తుల(స్త్రీపురుషుల) మధ్య జరిగే ఎన్నో సంఘటనల ద్వారా అనుకూలించే 'దాంపత్య' వ్యవస్థను మనం రెండు విధాలుగా సమకూరే సంభావన ఉన్నట్లు భావించవచ్చు. స్త్రీపురుషులను వివాహ వ్యవస్థ ఆధారంగా 'దంపతులుగా'గుర్తించి,వారిని సాంఘికాచార పద్ధతిలో కట్టి బంధించటమనేది మానవసంకల్పంగా జరగే తంతు. అది ఆ జన్మకే పరిమితమైన బంధం.కాగా రెండవది దైవసంకల్పం, దీనిని అర్థం చేసుకోవటమే కష్టం. జన్మజన్మలతో ముడిపడి ఉన్నదని తెలుసుకోవటం అంత సులభమైన విషయంకాదు.

లోకంలో స్త్రీపురుషులు బలంగా ఆకర్షించుకోవటానికి,ప్రేమించుకోవటానికి,ఒకరి కొకరు ప్రాణలర్పించు కోవటానికి,గల కారణలను వెదికిచూస్తే వారిమధ్యగల ఆకర్షణకు దైవసంకల్పమే గాని మరేమి కాదనే విషయం మనకు స్పష్టమౌతుంది. అంతేగాక ఆయా వ్యక్తులలో జన్మజన్మల నుండి సంక్రమించిన అర్థనారీశ్వరతత్వం అనగా స్త్రీపురుషుల అంశలకు చెందిన ఆకర్షణశక్తి వారివురిని ఆకర్షింపచేసి ఆ జన్మలో కట్టిపడేయటానికి ప్రయత్నిస్తుందని చెప్పవచ్చు.

ప్రతి వ్యక్తిలో ఉండే 'స్త్రీపురుషాత్మక' ప్రవృత్తి లోకంలో స్త్రీపురుషుల మధ్య ఆకర్షణకు ప్రేమకు,బంధానికి మూలమై నిలుస్తుంది. ఈ ఆకర్షణ, ఈ బంధం, ఈ ప్రేమ, ఈ జన్మకే పరిమితం కాదు. జన్మజన్మలనుండి అవే ఆత్మలు అదే ఆకర్షణతో అదే బంధంతో కలుస్తూ, విడిపోతూ,తిరిగి కలుస్తూ ఉంటాయని విశ్వనాథ భావిస్తూ తన రచనల్లో వ్యక్తపరుస్తుంటాడు.

స్త్రీపురుషులు స్పర్శజ్ఞానంద్వారా తమతమ భాగస్వాములను గుర్తించటం,ఆ విధంగా గుర్తించి వారు ఏకం కావాలని ప్రయత్నించటం,"త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతంలోని మూల తత్వం. ప్రేమతత్వాన్ని మరియు స్పర్శద్వారా తమ భాగస్వామిని గుర్తించటం,రేఖా మాంత్రంగా తన ఏకవీర నవలలో చూపించాడు విశ్వనాథ.

ఈ నవలలో త్వగింద్రియ స్పర్శజ్ఞానాన్ని ప్రయోగపూర్వకంగా నిరూపించాడు.ఎంతో వయోబేదమున్న సారథీ,వాసంతీల మధ్య ఈ స్పర్శజ్ఞానాన్ని ప్రవేశపెట్టాడు. సారథీ వాసంతీ పాత్రల మనస్తత్వచిత్రణలో విశ్వనాథ నిర్వహించిన రచనా చమత్కారం ఆయన ప్రతిభకు పట్టంగట్టింది. ఈవిధమైన నవల తెలుగు సాహిత్యంలో "న భూతో న భవిష్యతి".

---

11. విశ్వనాథ వైఖరి. పుట. 271.

## 6.2 తెఅచిరాజు నవల రచనాకాలం-కారణాలు.

విశ్వనాథ సత్యనారాయణగారు ఈ నవలను 1954లో వ్రాశారు. ఈ నవలను ఎందుకు వ్రాశారో ఆయన "నేనూ-నా సాహిత్యరచనలు" అనే వ్యాసంలో ఈవిధంగా చెప్పాడు. "ఇంక నవలలగరించి చెప్పవచ్చును.'తెఅచిరాజు''స్వర్గానికి నిచ్చెనలు' ఇవి రెండూ ఈ పాతికేండ్ల లో మొదటనే పడతవి. బందరులో మంజులూరి కృష్ణారావని ఒక మహనటుడండేవాడు. పూర్వపు కూచిపూడి వాళ్ళలో పరదేశి మొదలైనవాళ్ళు ఎటువంటి అభినేతలో ఆయన అటువంటి వాడు. నాకు అభినయం చాలాతెలుసు. అదంతా అతనిని చూసి తెలుసుకున్నదే. అతడొక విచిత్రమైన పురుషుడు. అతని నాట్యకౌశలమంతా 'తెఅచిరాజు'నిండా వ్రాశాను. ఆహార్యకము, వాచికము, ఆంగికము,సాత్వికము,మనకు పేర్లు తెలుసు. ఈ నాటకాలు వేసేవాళ్ళలో ఈనాలుగు సర్వంకషంగా తెలిసిన వాడాతడొక్కడే... కథ,భావము,రసము,పాత్ర పోషణ,మొదలైన వానిని పురస్కరించుకొని వ్రాస్తూవుంటే ఆ ఎరిగివున్న పురుషుడు మారిపోతాడు. చాలా మారిపోతాడు....ఏకవీరలో నేను ప్రారంబించిన త్వగింద్రియ స్పర్శలక్షణం' తెఅచిరాజులో మరల నెత్తుకొని వ్రాసాను."[12].

ఈ నవల వ్రాయటానికి గల కారణాలను వారే స్వయంగా పైవిధంగా చెప్పుకున్నారు. ఈనవలోని కథా నాయకుడు సారథి. ఆ సారథి విశ్వనాథ ఎరిగిన కృష్ణారావుగారు. సారథిలోని నటనాకౌశలం వరకే కృష్ణారావుగారి పాత్ర మిగిలినదంతా సారథి స్వంతం,విశ్వనాథ కల్పన.

'తెఅచిరాజు'నవల 1954లో రచింపబడినా,ఈనవలలోని సామాజిక జీవనచిత్రణం 19వ శతాబ్ది చివరో లేక 20వ శతాబ్ది ప్రారంభదశనుండి తీసుకొనబడింది. నవలలోని ఇతివృత్తం ద్వారా జమీందారుండే పట్టణం లేదా బస్తీగానీ ఉంటుందని,ఆ కాలంలోనే నాటకసమాజాలు పెక్కు వెలిశాయని,అందులో పద్యనాటకాలు ఎక్కువగా ప్రర్శింప బడుతుండేవని తెలుస్తుంది.

పద్యం భావయుక్తంగా,రాగంతో పాడటమనేది ఆంధ్రుల ప్రత్యేకత. ఈ విధంగా పాడటానికి ఆనాడు నటులు పోటీపడేవారు. ఆనాడు ఆంధ్రదేశమంతటా పల్లెపల్లెలో పద్య నాటకాలు ప్రదర్శింపబడి ఎన్నో ప్రశంసలు కూడా పొందుతుండేవి. స్వాతంత్ర్యానంతరం మన దేశంలో సాంఘికనాటకాల విజృంభణతో పద్యనాటకాలు కొంత వెనుక బడ్డాయి.

ఆనాడు ఆంధ్రదేశంలో వెలసిన చాలా నాటక సమాజాల్లో ప్రసిద్ధమైనది,ప్రధానమైనది, "సురభినాటక సమాజం". ఈ సమాజం ఆనాడు ఆంధ్రదేశమంతటా తిరిగి తమ నాటకాలను ప్రదర్శించింది. ఒక్కొక్కసారి ఈసమాజం ఒకే వూళ్ళో నెలలతరబడి ప్రదర్శనలిస్తూ ఉండేది.

'సురభిసమాజంలోని నటులందరూ ఒకే కుటుంబానికి గాని లేదా రెండు,మూడు కుటుంబాలకు గాని చెంది ఉండేవారు. అందువల్ల బాల,స్త్రీ,వృద్ధ,పాత్రలను వెతుక్కోనవసరం లేకుండా వారే ఆ పాత్రలను నిర్వహించి రక్తి కట్టించేవారు. వీరి నాటకాలు చాలావరకు

12. మహతి. నేను-నా సాహిత్య రచనలు. విశ్వనాథ. పుట. 13.

'భరతముని" సంప్రదాయానుగుణంగా ప్రదర్శింపబడేవి.

ఈ నాటకసమాజంలో ఉండే ఒక పెద్దవాడు అన్నింటికి సూత్రధారిగా వ్యవహరించే వాడు.ఆయనే ప్రజల అభిరుచులకు తగినట్లుగా నాటకాలు వ్రాసిగాని,వ్రాయించిగాని, ఆ నాటకంలోని పాత్రధారులకు తగిన అభ్యాసం చేయించి ప్రదర్శించేవాడు.వీరి జీవనం నాటకరంగం కాబట్టి నాటకంలో డబ్బువస్తేగాని సమాజం బతికేదికాదు.అందువల్ల వీరు ప్రదర్శనలకోసం గ్రామగ్రామానికి,పల్లెపల్లెకూ తిరిగేవారు.

'తెఅచిరాజు'నవలలో సారథి మహానటుడు.అవివాహితుడు.ఆ గ్రామంలో స్త్రీపాత్రలు లేని నాటకాలను వీర,కరుణ,రౌద్ర,అద్భుత,రసాలతో కూడిన నాటకాలను ప్రదర్శించేవాడు. తాను వేయదలచుకున్న నాటకాలకు అవసరమున్న పాత్రలకోసం ఆ గ్రామంలోనున్న కొందరిని ఎంపిక చేసి వారికి శిక్షణ ఇచ్చి నాటకాలు ప్రదర్శించేవాడు.వాటవల్ల వచ్చిన డబ్బుతో తన జీవితం గడిపేవాడు.

సారథి నటుడిగా జీవితం గడుపుతున్నా, ఆప్తమిత్రులకు మాత్రం యోగిలా,విరాగిలా, కనిపించేవాడు.అతని నటన ఆనాడు ఆంధ్రదేశమంతటా ప్రసిద్ధిపొందింది.అతని నటనా కౌశలానికి ముగ్ధులై ప్రజలు ఆయా రసాల్లో మునిగితేలేవారు.

విశ్వనాథ సారథి పాత్రను తానెరిగియున్న కృష్ణారావుగారి నటనాకౌశలాన్ని దృష్టిలో ఉంచుకొని చిత్రించినా సారథిపాత్రలోని వైయక్తికమనస్తత్వ చిత్రణమంతా తాను భావించిన త్వగింద్రియ స్పర్శసిద్ధాంతాన్ని ప్రతిపాదించటానికి అనుకూలంగా చేసిన కల్పనయే.

## 6.3. తెఅచిరాజు నవలోని కథావస్తువు.

ఈ నవల సాంఘికమైనది.ఈ నవలలోని ప్రధానపాత్రలు సారథి వాసంతి.ఇందులో సాంఘిక ప్రయోజనం కన్నా విశ్వనాథ తాత్విక ప్రయోజనం మిన్న.అందువల్ల ఇదిఒక విధమైన తాత్విక నవలగా,ఇందులోని తత్వం స్పర్శసిద్ధాంతానికి చెందినదిగా చెప్పవచ్చును.

సాంఘికప్రయోజం దృష్ట్యా ఇది ఆనాటి నాటకాల ఉదంతాన్ని,నటుల నటనా కౌశలాన్ని,చూపించటానికి ఉపయుక్తమైనది.ఈ నవలలోని పాత్రలు సాంఘికవాతావరణంలో ప్రవర్తస్తాయి కాబట్టి ఆనాటి సాంఘిక కట్టుబాట్లు,నీతి నియమాలు,మొదలైన ప్రభావాల ఉద్రిక్తలను పాత్రలలో చూపించటానికి అనువుగా ఉండే సమాజం ఇందులో చిత్రితమైనది.

ఈనవలలో ప్రధానపాత్రలు సారథి,వాసంతులు ఎంతో వయోభేదంగల వ్యక్తులు. అనుకోకుండా ప్రణయబంధంలో పడిపోతారు.వాసంతి తెలియకుండా,సారథి తెలిసి ఈ అయోమయంలో చిక్కుకుంటారు.ఆ సాంఘికవాతావరణంలో అమాయకురాలైన వాసంతి, అన్నీ తెలిసిన సారథి మానసికంగా నలిగిపోయిన చిత్రణ అద్భుతంగా ఉండటంవల్ల ఇది మనస్తత్వ చిత్రణ నవల అయింది.ఫ్రాయిడ్,యూంగ్ ల భావాలు అధికంగా పాత్రల మానసిక ప్రవర్తనలో

కనిపిస్తాయి.అంతేగాక విశ్వనాథ సమయానుకూలంగా త్వగింద్రియ స్పర్శ లక్షణాన్ని సారథి, వాసంతి పాత్రలలో ప్రవేశపెట్టటం,దాని ద్వారా ఆ పాత్రలు సంఘర్షణకు గురికావటం, విశ్వనాథ ముగింపుద్వారా తన సిద్ధాంతాన్ని వ్యక్తం చేయటం ఇందులో విశేషం.

పై కారణాలవల్ల ఈ నవల మనస్తత్వచిత్రణకు,త్వగింద్రియస్పర్శ సిద్ధాంతానికి మూలమై నిలిచింది.అందువల్ల ఈనవలలోని కథావస్తువు ఇదేనని చెప్పవచ్చును.

## 6.4 తెలిచిరాజు నవలలోని కథాసంగ్రహం.

అదొక చిన్న పట్టణం.ఆ పట్టణంలో ఒక జమీందారుడున్నాడు.ఆంగ్లేయుల ప్రభావం వలన ప్రజల్లో నాగరికతకూడా పెరిగింది.ఆ పట్టణంలో కళాశాల కూడా ఉంది.ప్రజలు సగం రాజాశ్రితంగా (రాజు),సగంమంది స్వతంత్రులుగా,జీవిస్తున్నారు.అందులో కొందరు రాజాశ్రితం పొందాలని ఆరాటపడేవారూ,కుయుక్తులు పన్నేవారూ,కూడా ఉన్నారు.అందులో ముఖ్యులు అవధాని,రంగనాథం.అవధాని ఇంతకుముందే ఆశ్రయం పొందినవాడు.రంగనాథం కుయుక్తులు పన్నుతూ అదే ప్రయత్నంలో ఉన్నాడు.ఇద్దరూ కవులే.అవధాని పండితకవి.రంగనాథం మహాకవి. ఇద్దరూ తామంత గొప్పవారు లేరనే గర్వంతో ప్రాచీనకవులను, పండితులను విమర్శించేవారే. తమకు తోచినది వ్రాసి జమీందారుకు వినిపించి మెప్పులు పొందాలని ఆరాటపడేవారు.

ఆ ఊరిలో ఒక నాటక సమాజం ఉంది.ఆ సమాజం దేశదేశాలలో పేరు మ్రోగింది. ఆ సమాజానికి అధిపతి సారథి.ఆయన మహానటుడు.అతని నటనా కౌశలం దశదిశలా తెల్సింది.అతని హావభావాలకు,అభినయాదులకు,ఆ ఊరిప్రజలేగాక చుట్టుప్రక్కల గ్రామాల వారు కూడా చూసి మురిసిపోయేవారు.సారథి నాటకమంటేనే ఎక్కడెక్కడినుంచి ప్రజలు వచ్చిచూసి ఆయా రసాల్లో మునిగి ఆనందించేవారు.సారథి ఆనాడు అంతగొప్ప నటుడు.

ఆ ఊరిలో శిరీషుడున్నాడు.అతనికి ఒకే కూతురు.పేరు వాసంతి.ఆమె సంగీతం నేర్చుకుంది.పాటలు బాగా పాడుతుంది.తన కూతురుని సంగీత విద్వాంసురాలిగా చేయాలని శిరీషుని కోరిక.పెండ్లీడు వచ్చినా వివాహం తలపెట్టకుండా ఆమె మనస్సును పూర్తిగా సంగీతం వైపు మరలించాడు.సంగీతంతో పాటు ఆమెకు అభినయంకూడా నేర్పించాలని శిరీషునకు బుద్ధిపుట్టింది.అందువల్ల అతడు తన ఈడువాడు,తనకు మిక్కిలి స్నేహితుడైన సారథి నాటక సమాజంలో అమెను చేర్పించాడు.

వాసంతిని నాటక సమాజంలో చేర్పించటం మిగతా స్నేహితులకు నచ్చలేదు.సారథి నటనలో గొప్పవాడే,ప్రజల్లో అతని అభినయానికి గౌరవాభిమానాలున్నాయి.కాని వ్యక్తిగతంగా మంచివాడు కాదని,అతని శీలం అంత మంచిది కాదని,మహాకాముకుడని,అందరూ అనుకుంటూ, ఉంటారు.ఆ సంగతి శిరీషునితో అన్నారు.అయినా శిరీషుడు లెక్కచేయలేదు.పైగా తన వయస్సుగల సారథికి వాసంతి బిడ్డవంటిది.సారథి తన చేతుల్లో వాసంతి చిన్నతనంలో ఎత్తుకొని

తిప్పినవాడు.వాసంతికి తానెట్లో సారథికూడా అటువంటివాడే.అని శిరీషుని విశ్వాసం. అందుకే వాసంతి విషయంలో సారథి శీలాన్ని శంకించ వలసినది లేదన్నాడు శిరీషుడు.

మొదటిసారిగా సారథి నాటకంలో వాసంతి వేషంవేసింది.ఆ నాటకం "మోహినీ రుక్మాంగద".ఆ నాటకం ఆడటం సారథికి ఏ మాత్రం ఇష్టంలేదు.సాధారణంగా స్త్రీ పాత్రలున్న నాటకం సారథి ఆడడు.కాని తన నటనను చూసుకోవాలన్న అభిలాషతో వాసంతి సారథిని ఒప్పించిది.వాసంతి కొరకు సారథి నాటకం ఆడటానికి ఒప్పుకున్నాడు.ఆ నాటకంలో సారథి రుక్మాంగదుడు,వాసంతి మోహినీ వేషాలు వేసారు.మోహిని వేషంలోనుండి వాసంతి రుక్మాంగదుని ఎదుట అపూర్వంగా నటించింది.ఆ నటనలో వాసంతిని చూసి సారథి విచిత్రంగా మారిపోయాడు. ఆతడు ఆత్మగతంగా ఏదో పెద్ద మార్పుకు గురి అయినట్లు తెలుసుకున్నాడు. తనలోని స్త్రీవాంఛ బుసలు కొట్టి విచలితుణ్ని చేసినట్లు గమనించాడు.తనలోని ఈ స్త్రీవాంచకు కారణమేమో తెలియక చాలా తిప్పలు పడ్డాడు.సారథి నాటకాలను చూసి అతని నటనా కౌశలాన్ని విమర్శించి మెరుగులు పెట్టేవాడు ఉమాపతి.సారథికి మంచి స్నేహితుడు.సారథి యోగాభ్యాసం చేసేవాడు.ఉమాపతికి చెప్పగా అది నీలోని 'కామేచ్ఛ'కు చెందినది,మానసికమైనది అన్నాడు.తనలోని కామేచ్ఛను యోగాభ్యాసం ద్వారా నిర్మూలించాలనుకున్నాడు. కాని సాధ్యం కాలేదు. నాటకాలద్వారానే దాన్ని జయించాలని 'కామదహనమనే' నాటకాన్ని వేసాడు.కాని అతనిలోని కామం దహింపబడలేదు. వాసంతిని ఆధారం చేసుకొని తన కామాన్ని జయించాలనుకున్నాడు.

"రాణాప్రతాపసింహ"నాటకం వేయాలనుకున్నాడు.అందులో ప్రతాపసింహుని భార్యగా వాసంతికి వేషముంది.సారథి ప్రతిరోజు వాసంతికి ఆ పాత్రను అభినయించే విధానం చూపేవాడు.ఆ సమయంలో వాసంతి అనుకోకుండా సారథిని కౌగలించుకుంది.ఆ కౌగిలిలోని స్పర్శకు వాసంతి విచిత్రమైన అనుభూతికి లోనయింది.ఆ విషయం సారథితో చెప్పింది.సారథి నివ్వెర పోయాడు.తనలోని స్త్రీవాంఛ వాసంతి గతమైనదేగాక, వాసంతిలోని 'పురుషవాంఛ' తన పరమైనదని గ్రహించాడు.కాని ఈ విషయం అలౌకికంగా లోకవిరుద్ధమైనది.వాసంతికి ఎలా చెప్పాలో తెలియక మరోవిధంగా చెప్పి పరపురుషులను ఇలా కౌగలించుకోరాదనీ,పతినే కౌగలించుకోవాలనీ,"స్పర్శానుభూతితో" భర్తను గుర్తించవచ్చునీ చెప్పాడు.

అమాయకురాలైన వాసంతి తన భర్తను తానే ఎన్నుకోవాలనుకకుంది.అందుకు సారథి చెప్పిన విధానం అనుసరించాలని అనుకుంది.తనకు దగ్గరైనవారిని కౌగలించుకొని "స్పర్శా నుభూతిని'పొంది పరీక్షించేది.ఈ విధంగా చేసిన ప్రయోగాల్లో ఆమెకు సారథే తన భర్తయని రూఢి అయింది.కాని సారథి దీనికి సమ్మతంచలేదు.లౌకికంగా,సాంఘికపరంగా,ఇది సమకూరే విషయంకాదు.కాబట్టి కిరీటి అనే యువకుణ్ణి సారథి తనదగ్గరకు చేర్చి యోగాభ్యాసం ద్వారా తనలోని స్పర్శానుభూతిని కిరీటిలో ప్రవేశపెట్టి వాసంతిచే కిరీటిని కౌగలింపచేసి,ఆమెకు

కిరీటిద్వారా స్పర్శానుభూతిని కలిగింపచేసి,కిరీటే నీ భర్తయని వాసంతిని ఒప్పించి వారిద్దరినీ జతకూర్చి ఆ వూరినుండి సారథి వెళ్ళిపోతాడు.

మనోవైకల్యం పొందిన సారథి ఎన్నో ఊళ్ళు తిరిగాడు.మతాలు మార్చుకున్నాడు. ఎందరినో పెళ్ళి చేసుకున్నాడు.కాని మానసిక శాంతిని పొందలేక మతిభ్రమించిన వానిలా తిరిగితిరిగి ఆ ఊరికే వచ్చాడు.'మోహినీ రుక్మాంగద' నాటకం వేసాడు.

ఆ నాటకంలో అతనికి తెలియకుండా వాసంతి మోహిని వేషంవేసింది.రంగంమీద మోహినీరుక్మాంగదులు ఏకమయ్యారు.వారి ఆత్మలు లౌకికమైన ఈ ప్రపంచానికి,ఈ సమాజానికి "చెక్" చెబుతాయి.ఈవిధంగా ఈ నవల ముగుస్తుంది.

## 6.5 సారథి పాత్ర-మనస్తత్వ చిత్రణ.

### 1) సారథిలోని కాముకత్వం.

"సారథి మహాకాముకుడు.అతని కామమొక విలక్షణమైనది.అతనికి నిజముగా స్త్రీ గతమైన కామ భావన యున్నదో,లేదో తెలియదు.అతడు తుచ్ఛ కాముడని లోకమనుకొనును. అతడా స్త్రీతో కలిసియున్నపుడు వానికంటె మించిన కాముకుడున్నట్లు సారథి అనుకొనడు.ఆస్త్రీయు అనుకొనదు.ఆ స్త్రీతో కాముకలక్షణములు ప్రదర్శించుచున్నపుడు కూడా నా స్త్రీయందు మనసా వైరాగ్యమునే భావంచును.ఆ కాముకత్వమును మనసులో నిందించు కొనుచుండును." (తె,363)

తనలోని అధికమైన కామాన్ని సారథి నిగ్రహించుకోలేక పోయేవాడు.పెళ్ళిచేసుకోలేదు అయినా బ్రమ్మచారి కాడు.యోగసాధన చేసేవాడు.దైహికమైన తన కామాన్ని తీర్చుకోవటానికి ఎన్నో ప్రయత్నాలు చేసేవాడు.మైళ్ళకు మైళ్ళు సముద్రతీరంవెంట పిచ్చిగా తిరిగేవాడు.ఇంటి ముందున్న స్థలాన్నంతా త్రవ్వి తోటగా మార్చేవాడు.ఇంకా మిగిలిన శక్తినంతా వివిధ ప్రయత్నాలకు మరలించటమే గాక తాను తీసుకొని వచ్చిన 'విశాలాక్షి' అనే పూటకూళ్ళ స్త్రీతో సంబంధం పెట్టుకునేవాడు.ఈవిధంగా తనలోని 'కామవాంఛ'ను తీర్చుకుంటూ వైరాగ్య భావం పెంచుకోవాలని అనుకునేవాడు.

### 2) ఉదాత్తీకరణం.

సారథి తనలోని కామాన్ని కొంత ఉదాత్తీకరించుకున్నాడు.నాటక సమాజం స్థాపించాడు. నాటకాలు వేసేవాడు.తనపాత్రలో లీనమై అపూర్వమైన అభినయంచేసి ప్రేక్షకులను ముగ్ధులను చేసేవాడు.నాటకరంగం అతనికి జీవితంలో ఒక ముఖ్యభాగమైంది.

ఫ్రాయిడ్ కామేచ్ఛాశక్తికి(లిబిడో) ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడని ఇదివరకే మనకు తెలుసు.వ్యక్తి ప్రవర్తనకు ఇదే మూలం,అంతేగాక అచిత్తుకు,అచేతన మానసిక ప్రక్రియలకు లైంగిక సహజాతాలకు, వ్యక్తి ప్రవర్తనకు ఈ లిబిడోయే కారణమనే విషయం కూడా తెలుసు.

'సారథి పాత్ర మనస్తత్వచిత్రణలో లైంగిక సహజాతాల ప్రేరణలను అత్యధికంగా చూపటంవల్ల వాటి తాకిడికి తట్టుకోలేని సారథి వాటిని ఉదాత్తీకరణం గావించి,నాటకాలను ఆశ్రయించాడు. ఈ లైంగిక సహజాతాల ప్రేరణతో ఉద్రిక్తుడైన సారథి నటనలో వాటిని అనేకవిధాలైన హావ,భావ,విన్యాసాలతో ప్రదర్శించి తన నటనాకౌశలాన్ని పెంచుకున్నాడు. అతడు పాత్రలో లీనమై స్వాభావికంగా నటించే విన్యాసాన్ని చూసిన ప్రేక్షకులు ముగ్ధులై ఆతడు గొప్ప నటుడని ప్రశంసించేవారు.అతని నటనాకౌశలానికి మూలమై నిల్చింది అతనిలోని ఉధృతమైన కామేచ్ఛాశక్తియే.

## 3) సారథిలోని ఆత్మాభిలాష.

ఒకనాడు వాసంతితో 'మోహిని రుక్మాంగద' నాటకం వేస్తున్నాడు సారథి.ఇంతకు ముందు నాటకాల్లో శృంగారనాయకుడుగా సారథి నటించలేదు.భారత నాటకాల్లో 'కృష్ణపాత్ర, చారిత్రిక నాటకాల్లో ప్రతాపసింహుడు,మొదలైన వీరరస నాయకపాత్రలను ధరించేవాడు.వీర, కరుణ,రసాలకు ప్రాధాన్యమిచ్చేవాడు.వాసంతి సారథితో "మీరు రుక్మాంగద వేయవలయును, నేను మోహిని వేషము వేసెదను"అంది.సారథి పెదవి విరిచాడు.'మీరు నా కోసం వేయవలయు,' అంది.సారథి ఎంతో అయిష్టంగా చివరకు అంగీకరించాడు.

మోహిని వేషంలో సారథి ఎదుట అపూర్వశృంగార విలాసంతో,అప్సరసలను తలదన్నే అందచందాలతో,రూపుగట్టిన వాసంతి ఎదుట నిల్చొని చేసిన అభినయంచూసి సారథి నివ్వెర పోయాడు.విచిత్రమైన అనుభూతికి లోనయ్యాడు.అజ్ఞాతంగా తనలోనుండి పైకి ఉబికివస్తున్న గగుర్పాటును అణచుకోలేకపోతున్నాడు.వాసంతిని వాసంతిగా చూడలేకపోతున్నాడు.ఏదో తాను ఊహించని మార్పు తనలో కలుగుచున్నదని గ్రహించాడు.తానపుడు చదవాల్సిన పద్యాలను చదవకుండా కేవలం భావాన్ని మాత్రం చెప్పాడు.ఆ భావం అతని అవ్యక్తచేతనంలోనుండి పుట్టుకొచ్చింది.అది ఈవిధంగా కూడియున్నది.

"ఈమె ఎవ్వరు?నా మనసులోనున్న స్త్రీవాంఛ,కాంతాకృతి పొంది నా ఎదుటవచ్చి నిలుచుండెనా?ఆ నటపరమేశ్వరుడు తన మనసులోని స్త్రీవాంచ జగన్మోహనాకారముతో వెలికి వచ్చుట అభినయించెను."(తె. 19).

సారథిలో మనోమంథనం ప్రారంభమైంది.తనలో స్త్రీవాంఛ ఇంకా మిగిలి ఉందా? అనే సందేహంలో పడ్డాడు."అతని హృదయంలోనుండి నిజముగా నొక స్త్రీమూర్తి సమావిర్భ వించుచున్నట్లు,అతనియొక్క మేనికండల యూర్ధ్వ చలనము భాసించెను.అతని మొగములో మధురసృష్టిచేయు ప్రజాపతియొక్క సమాధిస్థితి కనిపించెను."(20).విశ్వనాథ ఇక్కడ సారథి యొక్క మానసికస్థితిని అభినయంద్వారా ప్రదర్శించాడని చిత్రించాడు.

విశ్వనాథ ఇక్కడే సారథిలోని స్త్రీవాంఛను అద్భుతంగా తాత్విక భూమికతో జోడించాడు

సారథిలోని స్త్రీవాంఛ దైహికమైనదికాదు.దైహికమైన వాంఛను అతడు తీర్చుకుంటూనే ఉన్నాడు. ఇది మానసికమా?లేక ఆత్మగతమా?అనే సందేహంలో సారథి పడిపోయాడు.కాని విశ్వనాథ సారథిలోని ఆత్మగతమైన స్త్రీ అంశను మేల్కొల్పి ఇక్కడ సమయానుకూలంగా ప్రవేశపెడ్తున్నాడు. ఉపనిషత్తు ప్రతిపాదించిన ప్రథమచ్ఛదమైన శతరూప,ప్రజాపతి అంశలను విశ్వనాథ ఇక్కడ ఉపయోగించుకున్నాడు.సారథి ప్రజాపతిగా,వాసంతి శతరూపగా ప్రతిపాదించటమే విశ్వనాథ ఉద్దేశ్యము.సారథిలోని స్త్రీగతమైన అంశ వాసంతిలోని శతరూపకు మూలమైంది.ఆ విధంగానే వాసంతిలోని శతరూప తత్వం,సారథిలోని ప్రజాపతిని తట్టిలేపింది.ఈవిధమైన మార్పు ఇద్దరిలోనూ ఆత్మగతంగానే జరిగింది.అందుకే ఇరువురు విచలితులయ్యారు.సారథి అన్నీ తెలిసినవాడు,అయినా తనలో కలిగిన సంచలనాన్ని వెంటనే తెలుసుకోలేక పోయాడు. కారణాలను అన్వేషించసాగాడు.

సారథి వాసంతి విషయంలో ఆలోచించాడు.'వాసంతి ఏమీ తెలియంది.కామమంటె ఏమిటో తెలియని పరిస్థితులలో పెరిగిన అమాయకురాలు.కాని తనలో విచిత్రమైన గగుర్పాటు ఉత్పన్నమైనదని అది తనవల్లనే కలిగిందని గ్రహించి దాని ఆధారంతో అద్భుతగా నటించానని అనుకుంది.ఆ నటనా నైపుణ్యమంతా నావద్ద నేర్చుకున్నదేనని అనుకుంది'

యూంగ్ చెప్పిన అనిమా,అనిమస్,ఈ సందర్భంలో వాసంతి,సారథులమధ్య వ్యక్త మౌతున్నాయి.ఈ విషయమే మనకు సారథి తనలో అనుకున్నపుడు ఈవిధంగా వ్యక్తమైనట్లు విశ్వనాథ ప్రకటిస్తాడు.

"ఆధునిక మనస్తత్వశాస్త్రం చూపిన పురుష చేతనాగతమైన స్త్రీభావన(అనిమా)ప్రతీక "నా శరీరస్పర్శయందు వ్యాపించియున్న స్త్రీసంబంధ కామస్వరూపమే వాసంతి.ఈ కామం జీవసంపుటిలోనిది తప్ప బాహ్యామైనదికాదు.వాసంతలోనున్న పురుషభావ ప్రతీక(అనిమస్), సారథి.అందుకే ఆతనిస్పర్శ వాసంతికి సుఖదాయకమైనది.ఇది జీవలక్షణం".[15]

తనకు తెలియకుండానే ఇంతకాలం తనలోదాగి మనస్సును కలియబెడుతూ లావా వలె పైకి ఉప్పొంగి వచ్చిన స్త్రీవాంఛను గూర్చి సారథి విచారంలో పడిపోయాడు.గతాన్ని నెమరువేసుకొని జరిగిన జీవితసంఘటనలను తలచుకుంటూ విశ్లేషించ సాగాడు.అయినా సారథికి కారణం తెలిసిరాలేదు.

"ఆతనికొక కామమావేశించి మనసు తిప్పలుపెట్టి గగ్గోలుపరిచిన ఘట్టమతని జీవితంలో లేదు.అతనికి స్త్రీ వట్టి స్త్రీ.కామోద్రేక నివారకమైన యొక సాధనము.తక్కినపుడామె నొక జీవుడు."(తె.33)

పైవిధంగా విశ్వనాథ చెప్పటంవల్ల సారథిదృష్టిలో స్త్రీ కేవలం పురుషుని ఉపయోగ

15. విశ్వనాథ శారద. 'తెరచిరాజు' వ్యాసం.సుట.75

భోగవస్తువని,తక్కినపుడామె అలంకారప్రాయమైన ప్రాణమున్న వస్తువని తెలుసుకోవచ్చు.అనగా ప్రకృతిలోని అన్ని వస్తువులను పురుషుడు తనకనుకూలంగా మలచుకొని అవసరానికి తగినట్లుగా (ఆకలికి ఆహారం,దాహానికి నీరు,శారీరకమైన కామానికి స్త్రీ) ఉపయోగించు కుంటున్నాడని,సారథి ఇంతకాలం భావించినట్లు విశ్వనాథ చూపించాడు.అందుకే వాసంతి సమక్షంలో అతనికి దైహికమైన చలనత్వంగాక మానసికమైన సంక్షోభం మొదలైంది.

సారథి విశాలాక్షితో దైహికమైన వాంఛను తీర్చుకుంటున్నా అతనిలో కలవరపాటు తగ్గలేదు.కాని ఆ వాంఛ శారీరకమైనది కాదని మానసికమైనదని గ్రహించాడు.అది మానసికమైనదై కలవరపెట్టునది ఎలంటిదో అతనికి తొందరగా అంతుపట్టలేదు.వాసంతి అభినయం తనలోని మానసికమైన స్త్రీవాంఛను తట్టిలేపింది.కాని వాసంతిని తాను కూతురివలె చూసాడు. ఆమె చిన్నతనంలో ఎత్తుకొని తిప్పాడు.ఆమెతండ్రి వయసులో నున్నవాడు.కాని తనకు కూతురువలె కనిపించే వాసంతి యవ్వనం రాగానే మోహినీవేషంలో అప్సరసల అందాన్ని పుణికిపుచ్చుకొని ఎదుట నిలిచేసరికి తనలో కలిగిన వికారానికి ఆశ్యర్యపోయాడు.

సారథి తనలో కలిగిన ఈ వికారాన్ని తెలుసుకోవటం కోసం చేసిన ప్రయత్నాలలో తన జీవితంలోని ముఖ్యమైన ఘట్టాలను నెమరువేసుకోసాడు.

"అతడు బుద్ధిపూర్వకముగా నీచస్త్రీ సంగమము చేసినాడు.యవ్వన ప్రథమ దశావిర్భావవేళ నతనికి గామోదయము కలిగినది.అతడు తనస్థితి నెంచుకొనినాడు... మరియాద గల స్త్రీ,నాగరికురాలైన స్త్రీ,మోహమును వృద్ధిచేయును.తదితరమైన స్త్రీ కామమునందు వైరాగ్యమును కలిగించును.అని అతడు నిశ్చయించుకొనెను."(364).

అని విశ్వనాథ సారథి మనసులోని స్త్రీవాంఛకు గల కారణాలను విశదపరిచాడు.

సారథి వట్టి నటుడుకాదు.నాట్యాన్ని యోగంగా అభినయించేవాడు.సారథి యోగాభ్యాసం చేత జీవగత కామాదులను జయించాలనుకున్నాడు.దానిని నాటకాలలో వినియోగించి గొప్పనటుడయ్యాడు.అందుకే సాధారణంగా చాలామందికి సారథి బికారిగా, వికారిగా,విరాగిగా,యోగిగా కనిపించేవాడు.తన అభినయం లోకోత్తరంగా ఉండాలనే దీక్షతోనే సారథి అపూర్వమైన నటనా కౌశలాన్ని ప్రదర్శించేవాడు.నాటకాలనే తన జీవితలక్ష్యంగా పెట్టుకొని అందులో ఎక్కువగా వీర,కరణ,రస ప్రధానమైన పాత్రలనే ధరించేవాడు.కాని ఈనాడు వాపంతివల్ల శృంగారరస ప్రాధాన్యంగల నాటకమాడి వాసంతి అభినయంతో చిత్తవికారానికి లోనయ్యాడు.

## 4) సారథి స్వైర కల్పనలు.

ఫ్రాయిడ్ వ్యక్తులలో పుట్టే లైంగక సహజాతాలకు అధికమైన ప్రేరణ ఉంటుందనీ,అవి వ్యక్తిని వివశుణ్ణి చేస్తాయనీ,చెప్పాడు.ఆ ప్రేరణలను తట్టుకోలేని వ్యక్తి శారీరకమైన కామవాంఛను కూడా మానసికంగా మార్చుకొని ఉదాత్తీకరణం ద్వారా లేదా స్వైరకల్పనల ద్వారా వాటిని

స్థానాంతరీకరణం గావించి అనేకవిధాలుగా తీర్చుకుంటాడని,వ్యక్తికి 'కలలు' 'స్వైరకల్పనలు' మామూలవుతాయనీ చెబుతాడు.

"అచిత్తుకు కావాల్సిన వస్తువు లభించనపుడు అది తన్యతను(టెన్షన్) తొలగించు కోవటానికి,ఒక మానసిక ప్రతిమ (Mental image)ను సృష్టించుకొని ఆనందాన్ని పొందవచ్చు అంటే ఉదాహరణకు ఆకలిగా ఉన్న వ్యక్తి షడ్రసోపేతమైన భోజనాన్ని ఊహించుకొని తాత్కాలిక తృప్తిపొందవచ్చు.ఈవిధంగా స్మృతిప్రతిమ(Memory imaage)ల సహాయంతో తన్యతను తగ్గించుకోవటాన్ని అభిలాషసిద్ధి(Wish fulfilmelt)అంటారు.సామాన్య మానవునిలో స్వప్నాలు ఈ అభిలాషసిద్ధికి తోడ్పడతాయి.'16.

సారథి తనలోని దైహిక కామవాంఛను తీర్చుకోవటానికి నాటకాలను,విశాలాక్షిని ఆశ్రయించాడు.కాని అది మానసికమైనపుడు తీరని వ్యధకు గురైనాడు."ఈ స్త్రీగతమైన వ్యామోహామే లేదు.స్త్రీ శరీరగతమైన అభిలాష లేదు.కాని యాతని ఆత్మ విచిత్రముగా సౌందర్య వతులైన స్త్రీలను,తానప్పుడప్పుడు భావించుచుండును.ఆ సౌందర్యవతులైన స్త్రీలుకూడా మనుష్య స్త్రీలుకారు. అప్సరసలు,నాగకన్యలు."(364).

అతని స్వైరకల్పనలు ఈవిధంగా ఉండేవి.

"సారథి ఒకనాడు సముద్రతీరము వెంట నడుచుచుండగా నతనికొక విచిత్రపుటూహ కలిగెను.సముద్రములో నాగకన్యలుందురు.వారు పూర్వము పైకివచ్చి రాజకుమారులను ప్రేమించెడి వారట.తానొక రాజకుమారుడు.సముద్రములోనుండి ఒక నాగకన్య వచ్చి తన్ను ప్రేమించెను.తనను సముద్రములోనికి తీసుకొనిపోయెను.అచటనొక పెద్ద రాజభవన ముండెను. తన్నాకన్య రహస్యముగా నంతఃపురమున దాచెను.ఆమె గర్భవతి అయ్యెను.అంతఃపుర రహస్యము వెలుపలికి బొక్కెను.మహాసర్పరాజు అతనిని వధించుటకు వచ్చెను.తాను గరుత్మదు పాసకుడు.ఆ సర్పరాజును గెలిచి ఆ నాగకన్యను భూలోకమునకు దెచ్చెను.ఇట్టి యూహలతనికి వచ్చుచుండును ఊరక యూహచేసి గోరికలను నశింపచేయవచ్చునని కూడా అతడు అనుకునేవాడు"(364)

మరోసారి "జీవుడు సర్వకామములను గోసివేయవచ్చు గాని స్త్రీకామమును జయించలేడు అని నారదుడు స్త్రీరూపమును బొంది అరువైమంది కొడుకులను ప్రభవ.విభవ... మొదలగు నట్లూహించెను."(324).

మానసికమైన స్త్రీవాంచకలిగిన ఈ కలతను నాటకలద్వారానే తీర్చుకోవాలనుకున్న సారథి "కామదహనం"నాటకం వేయాలనుకున్నాడు.ఆ నాటకం తనలోని స్త్రీవాంఛను దూరం చేయగలుగుతుందా?శివుడు స్త్రీవాంఛనుండి గెలిచిన నాటకమది.శివుడు పూర్వం సంసారి, దాక్షాయణి భర్త.తర్వాత తపస్సు చేయుచుండెను.మన్మధుని తగులబెట్టెగదా?తనకు కలిగిన

16.అపసామాన్య మనోవిజ్ఞానము. పుట.68.

స్త్రీవాంఛను తొలగద్రోసెనన్నమాటయేగదా?ఇది బాగుగా ఉన్నది."(326).

కామదహన నాటకంలో పార్వతి వేషం వాసంతికి ఇవ్వాలని అనుకున్నాడు. "వాసంతియే కదా పార్వతి వేషం వేయును.ఆ పార్వతియందలి కామభావమును శివుడు దహనము చేయుట ప్రారంభింప వచ్చును.తొలుత వాసంతియందు గామభావమును పెంచు కొనవలయును గదా? పెంచుకొన నక్కరలేదు,కామభావన జీవునియందే ఉన్నది.ఆ కామభావనకు వాసంతిని లక్ష్యము చేయుట.ఇదివరకున్న వాసంతి దాక్షాయణి.ఈ వాసంతి పార్వతి."(331)

సారథి మొదటిసారిగా వాసంతిమీద తనకు ప్రేమయున్నట్లు,తానామెను కోరుతున్నట్లు గ్రహించాడు.కూతురువంటి వాసంతిపై ఏర్పడిన ఈ మానసికమైన ప్రేమకు మూలమేమిటి యని సారథి ఆలోచనలో పడిపోయాడు.

## 5) సారథికి వాసంతి మీదగల ప్రేమ.

వాసంతి తండ్రి శిరీషుడు ఆమెకు అభినయం నేర్పించాలని సారథి నాటకసమాజంలో చేర్పించాడు.అప్పుడు సారథితో" నీవు వాసంతిని తండ్రివలె జూతువు.నీవు నా యింటిలో వచ్చి యున్నచో నేను దిగులులేకుండా కొన్ని నా పనులు చూచుకోవచ్చును.''అన్నాడు.దానికి సమాధానంగా సారథి శిరీషునితో,"వాసంతి నీకెటువంటిదో నాకటువంటిదే యనుకొనుము. అయినను నేను నిజముగా దండ్రి నగుదునా?...తండ్రి కూతురులమధ్య స్త్రీ పురుషభావము కలదు.ఆ స్త్రీపురుషభావములో కామస్పర్శ యుండదు.అది సృష్టికి వ్యతిరేకమైనది.సృష్టికి వ్యతిరేకమైన ప్రకృతులు కొందరికుండవచ్చును.వారి ప్రసక్తికాదు.ఎంతకూతురిని జూచినట్లు జూచినను పరుడు స్త్రీని సంపూర్ణముగా కూతురువలె జూచుట అసంభవము.కూతురు నవ్వినచో తండ్రికి పసిపిల్ల నవ్వినట్లే యుండును.కాని పరునకానవ్వునందు సౌందర్యము కనిపించును. అన్నాడు" (122).

పై వాక్యాల్లో విశ్వనాథ తండ్రీకూతుళ్ళ సంబంధాన్ని అందులో నిజమైన వారిగురించి, వరుస కలుపుకున్న వారిగురించి వారివారి మనస్సులలో ఉండే భేదాన్ని స్పష్టంచేసాడు.దీనివలన సారథి ఆత్మలో వాసంతి విషయంలో అనురాగం(అనుసరించి పుట్టే ప్రేమ) ఉందని తెలుస్తుంది.

ఈవిధంగా సారథిలో మొదలైన వాసంతిమీదగల ప్రేమ క్రమంగా అతనికి తెలియ కుండానే వృద్ధిపొంది మోహినీవేషంలోనున్న వాసంతిని చూడగానే ఆత్మగతమైన ప్రేమ మానసికమై,అది శారీరకమై అతన్ని విచలితుణ్ణి చేసింది.కాని ఈ ప్రేమకు లౌకికంగా స్థానంలేదు యోగియైన సారథికి తెలుసు.తనలో ఇట్లాంటి ప్రేమపుట్టటానికి సాధారణమైన పరిస్థితులు దోహదం కావు.అట్లాగే వాసంతిలో కూడా .అయినా బలోపేతమైన ఈ ప్రేమ పుట్టటానికి గల కారణాలను తెలుసుకోవటంలోను,ఈ ప్రేమనుండి విముక్తి పొందాలని తాపత్రయం పడటంలోను సారథి అన్వేషించని మార్గంలేదు.అందుకే 'కామదహననాటకం'వేయాలను కున్నాడు.వాసంతికి మరింత దగ్గరయ్యాడు.

సారథి ఈ నాటకాన్ని కిరీటిచే వ్రాయించి వాసంతికి అభ్యాసంచేయించేవాడు.ఆ అభ్యాస సమయంలో వాసంతిని ఎన్నోసార్లు తాకేవాడు."ఈ సర్వాభ్యాసవేళయు సారథి మనస్సుచేత నామెయందు గామమును పెంచుకొనుచుండెను.ఆ కామాభివృద్ధి వట్టి మానసికమై యుండెను. ఎంత మానసికముగా నున్నను దానికి వాసంతీ శరీరాభివ్యాప్తి కొంత అతనికి తెలియకుండా జరిగెను."(363).

"వాసంతియందు దానా అప్సరస స్త్రీలను,నాగకన్యలను,భావించవలయును. నాటకము నాడువేళ దాను వానిని భావించి తన జీవునిలోనున్న యా వాంఛనంతయు నామెయందు బుంజీవింపచేసి జ్ఞానఖడ్గముతో నొకసారి నరుకవలెనని అతని సంకల్పం."(365)

## 6) సారథి స్పర్శానుభూతి.

ఈ విధమైన అభ్యాసంలో సారథి వాసంతిని కౌగలించుకున్నాడు.అతనికి తెలియ కుండానే అతనిలోనున్న స్త్రీగత వాంఛ పెరుగసాగింది.కాని ఆకౌగిలింతలో వాసంతి ఒక విచిత్రా నుభూతికి లోనయింది.ఆమె అతని స్పర్శలో మధురమైనన అనుభూతితో తన్మయత్వం పొందింది. అదే అనుభవం సారథికికూడా కలిగింది.ఆ పరిస్థితులలో సారథి తనలోని కామవాంఛయొక్క ఉధృతిని గ్రహించాడు."తాను దనకు యవ్వనము వచ్చిన తర్వాత బదమూడు,బదునాలుగేండ్లు దీనిని నిగ్రహించెను.శరీరమునకు స్త్రీ సంబంధం లేకుండా నిగ్రహించెనేగాని మనసుచేత నిగ్రహించలేకపోయెను."(367).

సారథి యవ్వనారంభదశలో తనలో పుట్టిన కామవాంఛను,లైంగిక సహజాతాలను, అనేక సంవత్సరాలు బలవంతాన దమనం చేసుకుంటూ నిగ్రహించుకున్నాడు.ఈవిధంగా దమింపబడిన లైంగిక ప్రేరణలే అచేతనంలో కూరుకుపోయి ఈనాడు అతనికి తెలియ కుండానే పైకివచ్చి అతనిని కలవరపెట్టసాగాయనీ,బలవంతంగా అణగద్రొక్కబడిన వాంఛలు,కోరికలు, అచేతనంలో బలవత్తరమై ఏదో ఒకనాడు అవిపైకి రావాలని వ్యక్తికి ప్రేరణలు కలిగిస్తాయనీ, అందుకే వ్యక్తి వాటిని పైకిరానివ్వకుండా పగటికలలతో,స్వైరకల్పనలతో,వాటిని తీర్చుకునే ప్రయత్నం చేస్తాడనీ,ఫ్రాయిడ్ చెప్పిన విషయాలు సారథి అనుభవంలో నిజమయ్యాయి.

వాసంతిపై తనకుగల ప్రేమను స్పర్శానుభూతితో గ్రహించిన సారథి ఈవిధంగా అనుకునేవాడు."జీవుడు సర్వకామములను గోసివేయవచ్చునుగాని,స్త్రీపరమైన కామమును జయించలేడు".ఫ్రాయిడ్ కామేచ్ఛాసిద్ధాంతానికి ఇది బలమైన నిదర్శనమని చెప్పవచ్చు.

సారథి కామదహనం నాటకం వేశాడు.ఆ నాటకంద్వారా తనలోని స్త్రీగతమైన కామవాంఛను పూర్తిగా భస్మీపటలం చేసుకున్నానని అనుకున్నాడు.వాసంతి మీదగల వ్యామోహాన్ని త్రెంచివేశా ననుకున్నాడు.కాని సారథిలోనుండి వాసంతి వెడలిపోలేదు.అది మరోవిధంగా అతన్ని

చుట్టుకుంది.

సారథి చెప్పిన మాటలవల్ల వాసంతి అతని స్పర్శలో కలిగిన అనుభూతివల్ల అతనినే భర్తగా భావించసాగింది.ఆమెలో ఆభావం కలిగించింది సారథే.వాసంతి సారథిని కౌగలించిన సందర్భంలో ఆమె ఒక మధురానుభూతిని పొందింది.ఇంట్లో అనేకసార్లు తండ్రిని కౌగలించు కోగా ఏ అనుభూతిని ఆమె పొందలేదు.కాగా జమీందారుడు,రంగనాథాన్ని కౌగలించుకోగా, వ్యతిరేకమైన స్పర్శానుభూతిని పొందటంతో వారు తన ఆత్మకు సమ్మతమైనవారు కాదని తెలుసుకుంది.వాసంతి తనలో ఈవిధంగా అనుకునేది.

"సారథి యొకవ్యక్తి.తానొకవ్యక్తి.మా ఇద్దరికి సంబంధం రక్తస్పర్శతోడిది కాదు. అతనిలో జీవుడున్నాడు.ఒక జీవునికి ఇంకొక జీవునితో పరిచయము కలిగినపుడు జీవుడేదో సంతోషించును.అట్టి సంతోషమునే తాను పొందెను."(356).

యూంగ్ చూపిన అనిమా,అనిమస్,భావాలు ఈ విచారణలో మనకు కన్పిస్తాయి. వాసంతి,సారథి స్పర్శతో తనలోని జీవుడు సంతోషపడుతున్నాడనీ,తన ఆత్మీయుడు సారథేననీ, గ్రహించి ఆ అనుభవాన్ని పరీక్షించాలనుకొని తండ్రిని,జమీందారును,రంగనాథాన్ని, కౌగలించు కుంది.వ్యతిరేకమైన అనుభూతిని పొందింది.తన అనుభవాలను సారథికి చెప్పింది. సారథి ఆమె అనుభవాలను వింటూనే కుప్పకూలిపోయాడు.అమాయకురాలైన వాసంతికి ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియక ఈవిధంగా అన్నాడు.

"పతివ్రతకు తన భర్తను కౌగలించుకున్నపుడే,ఆతడు ఆమెను కౌగలించుకున్నపుడే, అట్టి సుఖానుభూతి యుండును.పరుడు కౌగలించుకున్నపుడు నొడలంతయు మండిపోవును. దుఃఖము వచ్చును.ఒడలదేళ్ళు ప్రాకినట్లుండును.పతివ్రతలు కాని స్త్రీలకు నెవరు కౌగలించు కున్నను నొక్కటే."(394).

ఆ మాటలు వింటూనే వాసంతి "అయితే నీవే నా భర్తవు అంది". సారథి చిక్కుల్లో పడ్డాడు.స్పర్శానుభూతితో ఆమె తనను భర్తగా భావిస్తుందని ఊహించలేదు.ఆమెను ఈ భ్రమనుండి తప్పించటానికి,తాను ఆమెను వదిలించుకోవటానికి,మార్గాలు వెదుకసాగాడు. వాసంతి సారథిని విడువకుండా వేధించసాగింది.తనలోని తాపం తగ్గటానికి మరోనాటకం ఆడాలని సారథిని బలవంతపెట్టసాగింది.

సారథి ఆమెకు నచ్చచెప్పటానికి ఎన్నోవిధాల ప్రయత్నించాడు."వాసంతీ ! నేను నిన్ను ప్రేమించుటలేదు.పైగా నీవు నా బిడ్డవంటి దానవు.నా స్నేహితుని కూతురువు.పసిపిల్లవు. నేను ముదిసిన వగ్గును.ఎండిపోయిన కొమ్మను.నాలో పచ్చి మొదటినుండియు లేదు."అని ఎంతగానో చెప్పిచూసాడు".(510).

కాని వాసంతి ఆతని మాటలు వినిపించుకోలేదు.నాటకం వేయాలంది."నీలోని క్షోభను

నీవెలా తగ్గించుకున్నావో నేనలాగే నాలోని క్షోభను తగ్గించుకోవాలి.నాకోసం నీవు మరో నాటకం వేయాలి"అని పట్టుబట్టింది.

## 7) సారథి, కిరీటిని వాసంతి భర్తగా నిర్ణయించుట.

వాసంతికోసం సారథి సరేనన్నాడు.కిరీటిని పిలిపించాడు.తిరిగి కామదహనమే నన్నాడు."కాదు కామదహనం తర్వాత కథకూడా కావాలి"అంది వాసంతి.సారథి కిరీటితో నాటకం వ్రాయించాడు.అంతేగాక యోగాభ్యాసం ద్వారా కిరీటిని కౌగలించుకొని తనలోని స్పర్శను కిరీటికి సంక్రమించేటట్లు చేసాడు.కిరీటి ఈ చర్యకు ఆశ్చర్యపోయాడు.ఈ ప్రయోగం వల్ల తన శరీరంలో ఏదోశక్తి ప్రవేసిస్తున్నట్లు దానివల్ల తాను దహింపబడుతున్నట్లు గ్రహించి కిరీటి తన అనుభవాన్ని సారథికి తెలిపాడు.సారథి తనప్రయోగం విజయవంతం అయినందుకు సంతోషించాడు."ఓహో! నాకు తెలియకుండా వాసంతిమీద నాకెంతకోరిక యున్నది?ఏమి జీవలక్షణము?రేండేండ్లుగా నేను వాసంతిని గురించి ఊహించకుండా నెపుడుంటిని?వాసంతి నానుండి వెడలిపోయినది. ఇతనియందావేశించినది.వాసంతి,నా శరీరస్పర్శ నావరించిన స్త్రీ సంబంధకామము.ఆ కామభావ మంతయు నిట్లు కిరీటిలోని కోద్చుకున్నది.ఇట్లోద్చుకొనుట నా సంకల్పము."(569).

కిరీటి ఒకనాడు వాసంతితో ఇట్లా అన్నాడు."వాసంతీ నిన్ను తలచుకున్నపుడల్లా నా ఒడలు మండిపోవుచున్నది.తెల్లవారలు నిదురలేదు.తెల్లవారిన తర్వాత నా బాధ కొంతతగ్గినది ఇప్పుడు నీవు కనిపించినంతనే మరల నా యొడలు మండిపోవుచున్నది.నిన్ను కౌగలించు కొనినగాని నా యీ తాపము తీరదనిపించుచున్నది."అన్నాడు,(579).

వాసంతి అంగీకరించటంతో కిరీటి ఆమెను గాఢంగా కౌగలించుకున్నాడు. వాసంతి కిరీటిస్పర్శతో సారథితో కలిగిన స్పర్శానుభూతిని పొందింది.ఆమె ఆశ్చర్యపోయింది.సారథి ఏదో మాయచేశాడని అనుకుంది.కాని సారథి మాత్రం "కిరీటి వాసంతులు పరస్పరాలింగినులై ఉండటంచూసి సంతోషించాడు.పైగా వాసంతితో ఇట్లా అన్నాడు

"వాసంతీ ! దుష్యంతమహారాజు శకుంతల కలిసికొన్నదనగా కణ్వమహర్షి దెలుసుకొని ఎంత సంతోషించెనో నేనిప్పుడంత సంతోషించుచున్నాను."

వాసంతి ఆ మాటలకు నవ్వి "భేదములు కలిగించు విషయములు రెండున్నవి,కాదు మూడున్నవి.శకుంతల కణ్వుని ప్రేమించలేదు ! రెండు శకుంతలకు కలిగిన శృంగార భావము కణ్వుడు నేర్పలేదు ! మూడు కణ్వుడు దుష్యంతుని తనవలె శకుంతల కొరకు సిద్ధపఱచి యట్టేపెట్టలేదు !."అని వ్యంగ్యంగా పలికింది.ఆమె మాటల్లోని అంతరార్థాన్ని సారథి గ్రహించి అవాక్కయిపోయాడు.

ఆమె అమాయకురాలు కాదని తన ప్రయోగాన్ని తెలుసుకున్నదని అయినా ఇది తనకు తప్పదని ఆమె క్రమంగా తెలుసుకోగలదని తన ప్రయత్నమేదో తాను చేయసాగాడు.

వాసంతి తనను కోరినా, తాను వాసంతి కోరిన ప్రకారం చేపట్టినా,అది లోకవిరుద్ధం.లౌకికమైన ఈ లోకంలో వయోభేదంతో తాము జన్మించటం,ఆత్మనిర్దేశంగా ఒకరినొకరు ఆకర్షించుకోవటం, జీవునిలోని 'అర్ధనారీశ్వరతత్వం' ఏకం కావటానికి ప్రయత్నించటం,తత్ఫలితంగా తామిద్దరూ లౌకికంగా దూరంగా ఉంటూ మానసిక సంఘర్షణకు లోనుగావటం,విధి ఆడిన నాటకంగా సారథి గ్రహించాడు.దీనిని ఏవిధంగానైనా అధిగమించాలని ఒక నిర్ణయానికి వచ్చాడు.

## 8) సారథి మతిభ్రమణం.

విధి ఆడిన నాటకానికి మహానటుడైన సారథి ఆ విధి రూపొందించిన పాత్రలో లీనమై నటించినందుకు గాను క్రమంగా అతని మతి భ్రమించసాగింది.కిరీటి వాసంతులు ఏకం గావటం,చూసి ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళి పోదామనుకున్నాడు.తానున్న పాక,తోట, నాటకశాల. జమీందారు స్వాధీనమయ్యాయి.ఈ విషయం వాసంతికి చెప్పి వెళ్దామనుకొని వాసంతి ఇంటికి వెళ్ళాడు.ఆమెకు చెప్పాడు.వాసంతి ఎటువెళ్తున్నావని అడుగగా చేత్తో ఆకాశం వేపు చూపిస్తూ ఎటో వెళ్ళిపోయాడు.

వాసంతి వాస్తవ పరిస్థితులకు తలొగ్గింది.కిరీటిని తనింట్లోనే ఉండమంది.శిరీషుడు ఏమీ అనలేదు.ఊరివాళ్ళు అదోవిధంగా అనుకున్నారు.రెండేండ్లు గడిచాయి.సారథి విషయాలు విచిత్రంగా తెలియసాగాయి.

సారథి ఆ ఊరువిడిచి వెళ్ళాక ఒక క్రైస్తవ స్త్రీని పెండ్లాడాడనీ,క్రైస్తవమతాన్ని తీసుకున్నాడనీ,కొంతకాలానికి అదికూడా వదిలి ముస్లింమతం చేపట్టాడనీ,మతి స్థిమితంలేక మతాలు మార్చుకుంటూ దేశదిమ్మరియై తిరుగుతూ తిరిగి హిందూమతంలో చేరాడనీ,చివరికి ఆ ఊరికి వచ్చి 'రుక్మాంగద' నాటకాన్ని వేస్తాడనీ పుకార్లు వ్యాపించాయి.

వాసంతి లోని జీవలక్షణం బలీయమై సారథికొరకు తహతహలాడ సాగింది.అతనికొరకు ఎదురు చూడసాగింది.సారథి ఆ ఊరికి వచ్చాడు.వాసంతి అతన్ని కలిసింది.తాను నాటకంలో 'మోహినీ' వేషం వేస్తానంది.సారథి అంగీకరించలేదు.నాటక సమయంలో అతనికి తెలియకుండా 'మోహినీ' వేషంవేస్తున్న స్త్రీని బ్రతిమిలాడి తాను 'మోహినీ' వేషంవేసుకొని రంగంమీదికి వెళ్ళింది.

రుక్మాంగదుని వేషంలోనున్న సారథి వాసంతిని గుర్తించాడు.సమయంకాదని ఏమీ అనలేకపోయాడు.సారథి రుక్మాంగదుని పాత్రలో లీనమయ్యాడు.వాసంతి మోహినీ పాత్రలో లీనమైంది.తాదాత్మ్యంతో ఇరువురు గాఢంగా కౌగలించుకున్నారు.ఆ విడిపోని కౌగిలి రంగస్థలంమీద అట్లాగే ఉండిపోయింది.చూపరులకు,ప్రేక్షకులకు,వారిజంటలో "అర్ధనారీశ్వర తత్వం" గోచరించింది.వారి ఆత్మలు ఏకమైనట్లు కనిపించాయి.

## 6.6 వాసంతి పాత్ర-మనస్తత్వ చిత్రణ.

### 1) వాసంతి పెంపకం.

శిరీషుని కూతురు వాసంతి.శిరీషుడు,తన తండ్రి తెచ్చిన సంబంధాలను కాదని ప్రేమించిన పిల్లను వివాహమాడాడు.భార్యది శ్రావ్యమైన కంఠం.ఆమెకు సంగీతంకూడా వచ్చేది. తల్లిదండ్రులు బీదవారు.కూతురి సంగీతానికి మెరుగులు పెట్టించే స్థితి వారికిలేదు. శిరీషుడు భార్యాసమేతంగా తీర్థయాత్రలు సేవించాడు.తత్ఫలితంగా వాసంతి జన్మించింది.ఆ పిల్ల ఎనిమిదవ ఏటనే తల్లి చనిపోయింది.శిరీషుడు భార్యమీది ప్రేమచేత మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు

తల్లి కంఠం కూతురుకు వచ్చింది.వాసంతి చిన్నతనంనుండే చక్కగా పాడేది.తండ్రి మురుసిపోయేవాడు.కూతురుని పెద్ద సంగీత విద్వాంసురాలిగా చేయాలనే కోరికతో ఆమెకు సంగీతం నేర్పించాడు.వాసంతి సంగీతం మూలపడుతుందని ఆమెకు పెళ్ళీడు వచ్చినా శిరీషుడు ఆమాటే తలపెట్టలేదు.వివాహమైతే పిల్లలు పుడుతారు,సంసారంలో పడిపోతుంది,ఆత్మ వికాసం పెరుగదు,అందువల్ల తండ్రి వాసంతికి పెళ్ళి చేయదలుచుకోలేదు.పైగా వాసంతి సంగీతంతో పాటు అభినయం,నాట్యం,కూడా నేర్చుకోవాలని శిరీషుని కోరిక.అందుకనే వాసంతిని సారథి నాటక సమాజంలో చేర్పించాడు.

సారథి వ్యక్తిగతంగా మంచి నటుడైనా అతని శీలం మాత్రం తెలిసిన వారి దృష్టిలో అంత మంచిగాలేదు.సారథి నలుభై ఏండ్లవాడు.ప్రౌడుడు.అవివాహితుడు.నటనలో మాంచి ప్రావీణ్యం సంపాదించాడు.శిరీషునకు స్నేహితుడు.వాసంతి పదహారేళ్ళది.వాసంతి తనకెట్లో సారథికి అట్లేనని శిరీషుని భావన.అందుకే ఎవ్వరేమన్నా వాసంతి సారథుల మధ్య శిరీషునకు ఎటువంటి అనుమానం రాలేదు.శిరీషుడు ఈవిధంగా అనుకునేవాడు.

మహానటడైన సారథి తనజీవితాన్ని నటనకే అంకితంచేసి గొప్పనటుడిగా ఖ్యాతిగాంచి అవివాహితుడుగా ఉండిపోయాడు.ఆవిధంగానే తన కూతురుకూడా గొప్ప సంగీత,నాట్య, విశారదగా ఖ్యాతిగాంచాలి.ఒక గొప్పప్రయోజనం కోసం అల్పమైన కష్టాలను అధిగమించాలి. తన కూతురు గొప్ప ప్రయోజకురాలు కావాలి.ఆ ప్రయోజనం కోసం వాసంతి,సారథుల స్నేహాన్ని లోకం ఏమనుకున్నా తాను లెక్కచేసేది లేదు.అదీగాక వాసంతి శీలం తనకు తెలుసు. వాసంతిలో స్త్రీ పురుషభావం వికసించకుండా,దానికి ప్రాధాన్యం ఇవ్వకుండా,తాను పెంచాడు.అందువల్ల వాసంతి విషయంలో అనుమానించాల్సిన పనిలేదు.'

వాసంతికి పదహారేండ్లు వచ్చినా స్త్రీ పురుష సంబంధమైన 'కామ' వ్యవహారం తెలియదు.తెలియదనగా తండ్రి చెప్పలేదు.చేప్పేవారు లేరు.అనుభవంమీద,లౌకికంగా,ఆమె తెలుసుకోవాల్సిందే గాని శిరీషుడు ఆమెలో లోకజ్ఞానం కూడా కొరవడ చేసాడు.ఆమె ఒంటరిగా

ఎక్కడికి వెళ్ళేదికాదు.ఎవ్వరితో మాట్లాడేదికాదు.వాసంతి ఎటువెళ్ళినా తండ్రి వెళ్ళేవాడు.తండ్రి సర్వకాల,సర్వావస్థలందు ఆమెకు రక్షణగా ఉండేవాడు.ఎవరితో మాట్లాడినా,సంగీతం,నటన, వంటి విషయాలమీదనే గాని వేరే విషయాలు మాటాడనిచ్చేవాడుకాదు.

ఈవిధంగా తండ్రి పోషణలో,సంరక్షణలో,అమాయకంగా పెరిగింది వాసంతి.ఇంట్లో వంటమనిషి తప్ప ఎవ్వరూ ఉండరు.ఆ వంటమనిషికూడా తనపనేదో తాను చేసుకొని పోయేది. ఆమె వాసంతితో మాట్లాడేదికాదు.తండ్రి ఎప్పుడూ ఇంట్లోనే ఉండేవాడు.అతనికి ఏ వ్యాపకం లేదు.కూతుర్ని చూసుకుంటూ కూర్చోవటమే ఆయన పని.

## 2) వాసంతి ప్రవర్తన.

లోకంలో వ్యక్తి ప్రవర్తన సాధారణంగా వ్యక్తి మనస్తత్వంపై అధారపడి ఉంటుంది. ఆ ప్రవర్తనద్వారా ఆ వ్యక్తియొక్క మనస్తత్వాన్ని అర్థం చేసుకుంటాం.నవలలో రచయిత పాత్రల మనస్తత్వాన్ని రెండు విధాలుగా గుర్తించేటట్లు చిత్రిస్తాడు.ఒకటి పాత్రప్రవర్తనను చిత్రిస్తూ పాత్రయొక్క మనస్తత్వాన్ని గుర్తించే వీలు కలుగచేయటం,రెండోది పాత్ర మనస్తత్వాన్ని మొదటే చెప్పి అవిధంగా ఆ పాత్ర ప్రవర్తించినట్లు చూపటం.విశ్వనాథ ఈనవలలో ఈ రెండు రకాల పద్ధతులను చిత్రించాడు.సారథి పాత్ర విషయంలో రచయితయే సారథియొక్క మనస్తత్వాన్ని చాలావరకు చెప్పి ఆ పాత్ర ప్రవర్తనను ఆ విధంగా మలచిచూపాడు.

వాసంతి విషయంలో అట్లాకాదు.వాసంతిని తండ్రి ఆవిధంగా పెంచడమే దానికి కారణం.వాసంతికి స్త్రీపురుష భేదం భౌతికంగానే కాని లౌకికంగా తెలియదు.మానసికంగా ఆమెను తండ్రి ఎదగనీయలేదు.అనగా ఆమెకు భౌతికంగా స్త్రీపురుషులు వేరువేరు అనే భావమే తప్ప,వారివురూ,ఒకరినొకరు ఆకర్షితులై ప్రేమించుకుంటారనీ,కలుసుకోవాలని ప్రయత్నిస్తారనీ, లౌకికంగా వివాహబంధంతో దంపతులౌతారనీ,వారు స్పర్శానుభూతులతో ఆనందాన్ని పొందుతారనీ, ఈ సృష్టికి స్త్రీపురుషులే కారణమనీ,సృష్టికార్యానికే స్త్రీపురుషులు ఏకం అవుతారనీ, వాసంతికి తెలియని విషయాలు.లోకజ్ఞానం ఆమెలో పెరుగకుండా పెంచిన నిర్వాకం ఆ తండ్రిది. ఇంత అమాయకంగా పెరిగినా వాసంతికి నటనలో,లోకజ్ఞానం కలిగించటంలో,తెలియని విషయాలెన్నో తెలియచేయటంలో,సారథి గురువు అయ్యాడు.ఇందులో వాసంతి తన అనుభవాల ద్వారా గ్రహించిన జ్ఞానం కొంత,సారథిని అడిగి తెలుసుకున్న జ్ఞానం కొంత,ఆమెలోని మానసిక పరివర్తనకు ఉపకరించాయి.వాసంతి ప్రశ్నలు సారథికి చాలా చిత్రంగా అనిపించేవి.అందుకే "ఈకాలమున తెలియని దానవు నీవొక్కతివే.మీనాయన చేసిన మహాకార్యమిది యొక్కటియే నిన్నిట్లు పెంచగలుగుట.కొంత నీప్రకృతిలోనున్నది.'అన్నాడు

వాసంతి చాలా విషయాలను అనగా స్త్రీపురుషులకు సంబంధించిన వాటిని తల్లి ద్వారానో,స్నేహితురాండ్ర ద్వారానో,తెలుసుకోవల్సినది.కాని వాసంతికి తండ్రి అటువంటి అవకాశం

రాకుండా చేసాడు. వాసంతిలో కౌమారందాటి యవ్వనం ప్రవేశిస్తున్న వేళ, ఆమెలో శారీరకంగా, మానసికంగా,మార్పులు కలుగుతున్న వేళ,సారథి పరిచయమయ్యాడు. నాటకసమాజంలో చేరటం వల్ల అతనితో బాగా చనువేర్పడింది. సారథి ఆమెకు కేవలం అభినయం నేర్పే గురువు మాత్రమే కాదు, సర్వ విషయాల్లోను గురువుగా,స్నేహితడుగా,ఆత్మీయుడుగా,ఆమెకు కనిపించాడు చివరకు ఆమెకు కలిగిన అనుభవంవల్ల అతన్నే భర్తగా భావించుకుంది.

వాసంతి సారథినే భర్తగా భావించుకోవటానికి గాను ఆమెలో పుట్టిన జ్ఞానం భౌతికాన్ని దాటి,మానసికమైన లోకజ్ఞానం మించి,ఆత్మానందంలోకి వెళ్ళిపోయి,జీవుని మూలతత్వంలోకి ప్రవేశించింది. ఆమె కేవలం తనలో పుట్టిన 'కామవాంఛతో' సారథిని భర్తగా స్వీకరించలేదు. ఆమెలో 'కామవాంఛ'పుట్టినా అది ఆవిధంగా భౌతికంగా పరిణమించలేదు. ఆ వాంఛ ఆమెను జ్ఞానార్జనలోకి దింపింది. సారథిద్వారా జీవుని మూలతత్వాన్ని తెలుసుకునే విధంగా చేసింది. ఆమెలో పుట్టిన కామేచ్ఛయే ఏవిధంగా జ్ఞానానికి మూలమయిందో విశ్వనాథ చిత్రించిన విధానం అద్భుతంగా మనకు కనిపిస్తుంది. విశ్వనాథ ప్రతిభను మనం ఇక్కడే గుర్తించవచ్చు. వ్యక్తిలోని కామేచ్ఛయే అపూర్వ జ్ఞానానికి కూడా మూలమౌతుందనే విషయం ఈ నవలలో ప్రయోగ పూర్వకంగా చిత్రించి చూపాడు విశ్వనాథ. అమాయకత్వంతో ప్రారంభమైన వాసంతి పాత్రను అన్నీ తెలిసిన సారథితో మేళవింపచేసి ఆతనిద్వారా జ్ఞానంపొంది తత్వాన్వేషణలో సాగినట్లుగా రచయిత చిత్రించటం అపూర్వ రచనావిధానంగా మనం చెప్పుకోవచ్చు.

### 3) వాసంతి నాటకానుభవం-శృంగార భావన.

వాసంతి సంగీత,నాట్యవిశారద కావాలని ఆశించి,శిరీషుడు ఆమెను సారథి నాటక సమాజంలో చేర్పించాడు. తండ్రిచాటుబిడ్డగా ఏమాత్రం లౌకిక జ్ఞానంలేక అమాయకంగా పెరిగిన వాసంతి, తండ్రి వయసున్న సారథితో చనువుగా ఉండటంవల్ల తనకే సందేహం కలిగిన అతన్ని అడిగి తెలుసుకునేది. మానసిక వికాసం సరిగా వృద్ధిపొందని వాసంతి మాటలు సారథికి విచిత్రంగా తోచేవి. రచయిత ఈపాత్ర మానసిక వికాసం పొందిన విధానాన్ని 'మనకు ఆమె మాటలవల్ల, చేష్టలవల్ల. ‐ప్రవర్తంచిన విధానంవల్ల, తెలియచేస్తాడు.

వాసంతి ప్రవర్తన నాటకానుభవంతో ప్రారంభమౌతుంది. వాసంతి మొదటిసారిగా సారథితో "మోహినీ రుక్మాంగద'నాటకంలో వేషం వేయబోతున్నది. నిజానికి సారథి స్త్రీ పాత్రలున్న నాటకాలు వేసేవాడు కాదు. కాని ఈనాటకం వాసంతి ప్రోద్బలంతోనే వేస్తున్నాడు. సారథి రుక్మాంగదుడుగా,వాసంతి మోహినీగా పాత్రలు ధరిస్తున్నారు. వాస్తవంగా ఆ రెండు పాత్రలు వారికి క్రొత్తవే. సారథి మహానటుడైనా ఆతడింతవరకు స్త్రీ పాత్రముందు నటించలేదు. అందువల్ల అతనికి శృంగారనాయకపాత్ర అనుభవం లేని కొత్త పాత్రయింది.

వాసంతిలో యవ్వనం తొంగి చూస్తున్న వేళయది. ఆమె ఇంతవరకు సారథి నటించిన వీర,కరణ,అద్భుత,రస సమ్మితాలైన నాటకాలను చూసింది. ప్రేక్షకులదృష్టిలో సారథి మహానటుడు. ఆయా రస సన్నివేశాలలో లీనమై అపూర్వ అభినయాన్ని ప్రదర్శించి,చూచుచున్న వారినందరినీ, రసముగ్ధులను చేసేవాడు. శృంగార ఘట్టాలను అతడెలా అభినయిస్తాడో చూడాలనీ కోరిక ఒకవైపు, తానెలా నటించిందో,చూసిన ప్రేక్షకులవల్ల తెలుసుకోవాలనే ఆరాటం ఒకవైపు తొందర పెట్టగా ఆమె సారథితో "మీరు నాకోసం వేయవలయును. మీరు రుక్మాంగద వేషము ధరించినచో నెట్లుండునో చూడవలయునని యున్నది."అంది. ఈకోరిక ఆమెలో శృంగార భావపరమైనది. వాసంతి మాటకాదనలేక సారథి రుక్మాంగదుడయ్యాడు. వాసంతి మోహినివేషంలో అపురూప లావణ్యవతి అయింది. అప్సరసల అందాన్ని పుణికి పుచ్చుకుంది. ఆమె సర్వాంగాలలో వికసిస్తున్న 'కామ'వికాసంచేత ఆనాడు వాసంతి అపూర్వంగా అభినయం చేసింది.

ఆమె తన ఎదుట చేసిన అభినయం చూసిన సారథి నిర్ఘాంతపోయాడు. వారిద్దరూ ఆ సమయంలో,ఆయా పాత్రల్లో,ఆ రసాల్లో,లీనమై తన్మయత్వాన్ని భజించారు. బాహ్యస్మృతిని కోల్పోయి విచిత్రమైన మధురానుభూతికి లోనయ్యారు. ఆ అనుభూతి వారిద్దరికీ కొత్త అనుభవాన్ని చేకూర్చి పెట్టింది. సారథి ఆ అనుభూతినుండి తేరుకునేసరికి చాలాకాలం పట్టింది. వాసంతి విషయం కూడా విచిత్రంగా మారింది.

తనలో వచ్చిన మార్పుకు కారణాలు తెలియక వాసంతి అనేకవిధాలుగా తర్కించు కుంది. ఆనాటి అపూర్వ అభినయానికి సారథే కారణమని తెలుసు,కాని ఇందులో కూడా ఆమెకు సందేహమే ఉంది. సారథితో "నాకు భావమనగానేమో దెలియజెప్పినది నీవు. రసానంద మనుభవించుట నేర్పినది నీవు. తన్మయత్వము పొందుట నీ పరిచయమువలన కలిగినది. అథీ! నేను మోహిని వేషము వేసితిని. రంగము మీదికివచ్చి నీ ఎదురుగా నిలుచుంటిని. నీ అభినయము పరుసవేది. నేను కూడా బంగారమునై పోయితిని. ఆనాడు రంగము మీద నిలుచుంటినే గాని నా యొడలు నాకు దెలియదు. నేనాడు గొప్పగా నభినయించితినని, పలుమంది గొప్పగా చెప్పిరి...నీ అనంతమైన నటనాకౌశలముతో కూడిన ఆత్మ నాలో ప్రవేశించి యట్లు చేయించినది కాబోలు. అథీ ! నీవు నన్ను వదలిపెట్టి పోకుము. నాకు భగవంతుడిచ్చిన విద్య సంగీతము. నీ అభినయము నాకు రాదు. నేను తరించవలయు ననగా నీతోడి సంపర్కము చేత నీయాత్మలోనున్న పారవశ్య లక్షణము నాలోజొచ్చి,అది నా సంగీతవిద్యయందు ప్రసరించ వలయును. నాకది తారకము. నన్ను వదిలిపెట్టి పోకుము."(112)

ఈవిధమైన మాటలవల్ల ఆమెలో శృంగారభావమే ప్రేమకు పునాదిగా నిలిచి సారథిని ఆవరించుకొని అతన్ని విడువకుండా చేసిందని చెప్పవచ్చు.

## 4) వాసంతిలో ప్రేమ వికాసం.

వాసంతి రెండవసారి సారథితో "రాణా ప్రతాపసింహ" నాటకం వేసింది.అందులో ప్రతాపసింహుని భార్యగా అద్భుతంగా నటించింది.వాసంతి తనమనస్సులో కలిగే మార్పులను గుర్తించసాగింది.నాటకానుభవంవల్ల లోకంలోని భార్యాభర్తల సంబంధం లీలగా ఆమెకు గోచరించింది.తన మనస్సు క్రమంగా సారథివైపు మళ్ళుతుందని తనకు తెలియకుండానే తన మనసు అతన్ని కోరుతుందని గ్రహించింది.తండ్రి తనకు వివాహం చేయకుండా కేవలం ధర్మో పన్యాసాలు చేస్తూ శీలరక్షణ గురించి చెప్పటం ఎన్నోసార్లు వింది.ఒకనాడు తండ్రితో "సర్వ జనులకు కామాదులున్నవి.ఆ కామాదులు ధర్మమార్గమున బరిరక్షించినపుడు శీలవంతులు అధర్మ మార్గమున బోరు.ధర్మమార్గ పరిరక్షణ లేనప్పుడు బుద్ధి యదర్మమార్గమున నడుచుటకు వీలున్నది" అంది.(195)

వాసంతిలో మానసిక పరిణామం అభివృద్ధిచెంది లోకాన్ని నిశితంగా పరిశీలించి జ్ఞానాన్ని పొందుతున్నట్లు, ధర్మాధర్మ విచక్షణ చేయకలిగే స్థితికి ఆమె వచ్చినట్లు, పై మాటలవల్ల తెలుస్తున్నది.లోకంలో స్త్రీపురుషులకు యుక్తవయసులోనే తల్లిదండ్రులు ఎందుకు వివాహం చేస్తున్నారో,గ్రహించే తండ్రితో ఇట్లా పలికింది.

వాసంతితో శిరీషుడు "....ఋషులు మహాధర్మకార్య వ్యగ్రులు.కామాదులను నశింప చేసుకుందురు."అన్నాడు. వాసంతికి చురుక్కుమంది."ఋషులు కామాదులకు లొంగినవారు చాలామంది కలరు.'అంది.శిరీషుడు నొచ్చుకున్నాడు."వారి సంగతికాదు.విశ్వామిత్రుడు లొంగెను, వశిష్ఠుడు లొంగెనా?నీవు వశిష్ఠునివలె నుండవలెనని నాయూహ."అన్నాడు.వాసంతికి తండ్రి మూర్ఖత్వం విచిత్రంగా తోచింది.తను వశిష్ఠునివలె ఎందుకుండాలో ఆమెకు అర్థం కాలేదు.అందుకే తండ్రితో ఇట్లా అంది.

"నాయనగారూ ! ..మానవజన్మ యన్నంతనే సగము శరీరము,సగము ఆత్మ.ఋషుల విషయములో దేహముకంటె ఆత్మ బలవత్తరమేమో కాని మానవుల విషయంలో నాత్మకంటె దేహము బలవత్తరము.నేనింత నెట్లు నేర్చితినని యాశ్చర్యపడవచ్చును.నాకు దెలియకుండా నేను మీకు చెప్పెడునంత గొప్పగా రాత్రినెట్లు నభినయించితిని?నిదియు నట్లే నేర్చితిని. సారథితోడి పరిచయము నాకు దినదినము జ్ఞానాభివృద్ధి కలిగించుచున్నది.ఆతడొక మహాపురుషుడు,లోకము యొక్కదృష్టిలో శీలములేనివాడు.చదువుకొనని వాడు.నాదృష్టిలో నతడు జీవితము యొక్క రహస్యమునంతయు మూటకట్టినవాడు.ఆతనిమాట,ఆతని ప్రవర్తన,ఆతని జ్ఞానము,నాకు నిచ్చెలు నచ్చెరువు గొలుపును.ఆతనిని జూచినచో చాలును లౌకికజ్ఞానము సంపూర్ణముగా కలుగును.ఈ లోకముయొక్క వ్యర్థత్వము తెలియును"అంది(197).

క్రమంగా వాసంతిలో జ్ఞానాభివృద్ధి పెరిగి,వచ్చన సందెహాలకు,సారథి సహచర్యంలో

పొందిన అనుభవాలకు,ఆ అనుభవాలతో పొందిన మార్పులకు,సారథినడిగి సందేహాలను తీర్చుకుంటూ ఆత్మజ్ఞానం పొందటంలో ఏ విధంగా సఫలీకృతమయిందో విశ్వనాథచూపిన విధానం అత్యంత ఆసక్తిదాయకమైనదే గాక అద్భుతమైన చిత్రణ కలది.

'రాణాప్రతాపసింహ' నాటకంలో వాసంతి బాగా నటించిందని తండ్రేకాదు,ఇతరులు కూడా ప్రశంసించటం వింది.తానెలా నటించకలిగిందో సారథి నడిగి తెలుసుకోవాలనుకొని అతని పాకకు వెళ్ళింది.ఇట్లా అతని పాకకువెళ్ళి సందేహాలను తీర్చుకోవటంలో ఆమె తండ్రికి కాని లోకానికిగాని భయపడలేదు.కాని ఆవిధంగా వాసంతి మాటిమాటికి తన పాకకు రావటం సారథికి ఇష్టంలేదు.ఇష్టంలేదనికాదు,లోకం కోసం,అందుకే ఇట్లా అన్నాడు.

"మొన్న నీవొంటరిగ వచ్చితవి,నేడు మరల వొంటరిగ వచ్చితివి.మీ నాయనయూర కుండునా?"అన్నాడు.వాసంతి "ఊరకుండినచో మొన్ననంత గొప్పగా నెట్లు నటింతును.అంది". మొన్ననీవు గొప్పగా నటించితివన్నమాట.'సారథి అన్నాడు.'మా నాన్నగారు,అయనతో చాలా మంది అన్నారట'అంది.దానికి సాకథి మెచ్చుకుంటూ "వసూ ! నేను యాశ్చర్యపోయితిని, తర్వాత గ్రహించితిని.'అన్నాడు."ఆ సంగతియే నిన్నడిగి పోవుటకు వచ్చితిని'అంది.

దానికి సారథి తన అనుభవాన్ని చెప్పి "అభినయము మాత్రము ఆత్మ సంస్కారమున్న చో జీవుడు పొందెడు క్షోభచేత వెలికి వచ్చునది.'అన్నాడు."నేనా క్షోభపడలేదు.ఈరెండు నాటకములలో నెట్లు నభినయించితిని?'అని అడిగింది.

ఆమె అమాయకత్వానికి నవ్వుకొని "నీకు వయస్సు వచ్చినది,నీకు స్వేచ్ఛలేదు.నీ శరీరము నీదికాదు.నీ మనసు నీదికాదు.దానికి స్వాతంత్ర్యయము లేదు.సంగీతవిద్య కృతకమైనది.అన్ని విద్యలు కృతకములే.అవి జీవునకు సహజలక్షణములు కావు...నీకు దెలియకుండా నీ మనస్సు క్షోభపడుచున్నది.నీ తండ్రికి చెప్పకుండా మొన్న నా దగ్గరికి వచ్చితివి. అది క్షోభించుటయొక్క లక్షణము."అని ఆమె మానసికస్థితి గురించి విడమర్చి చెప్పాడు.

ఫ్రాయిడ్ చెప్పినట్లుగా వ్యక్తులలో కామమధికం.లైంగిక సహజాతాలచే ప్రేరితుడైన వ్యక్తి వాటిని ఉదాత్తీకరించి శాంతి పొందాలనుకుంటాడు.ఉదాత్తీకరణంలో కళలు,అబినయం, సంగీతం, నృత్యం,కావ్యసృష్టి,మొదలైనవి ప్రధానాంశాలు.సారథి అభినయాన్ని,వాసంతి సంగీతాన్ని ఆశ్రయించారు.కాని అవి కృతకాలే.అందువల్ల వారిలోని మానసిక క్షోభ వారి కళలకుమెరుగులు పెట్టింది.ఈ క్షోభ లేక మానసిక సంఘర్షణ అచేతనంలోనుండి పుట్టినదే.సంఘర్షణ ఎందుకో వ్యక్తికి తెలుసు,గాని లౌకికంగా దాన్ని వెల్లడి చేయలేక క్షోభను మాన్పకోలేక మానసిక శాంతిని కోల్పోయి దేన్నో ఒకదానిని ఆశ్రయించి కృత్రిమంగా దానిద్వారా సంఘర్షణను తగ్గించు కోవటానికి వ్యక్తిచేసే ప్రయత్నమె గాని అసలు క్షోభను నివారించటం కాజాలదు.దానికి కారణం వ్యక్తికి సమాజపరంగా స్వాతంత్ర్యయం లేకపోవటం.ఈక్షోభను వాస్తవాన్ని తెలిసినవాడు సారథి.

తెలియకుండా క్షోభపడేది వాసంతి. ఆమె సంశయాన్ని తీర్చటానికి సారథి,వ్యక్తికి స్వేచ్ఛ ముఖ్యమన్నాడు. లోకం కట్టుబాట్లకు బంధితుడై క్షోభ అనుభవిస్తాడని సారథి మాటలలో వెల్లడి అయిన విషయాలు.

వాసంతి సారథితో ఉన్నపుడు ఆమె అతన్ని "అధీ" అని పిలుస్తుంది. సారథి 'వసూ అధీ'అనగానేమి? అడిగాడు. "అధీ.... నీపేరులో కొంత"అంది. "అధివ్యాధులందురు'వ్యాధి యనగా శరీరము యొక్క అనారోగ్యము. అధీ అనగా మనస్సుయొక్క అనారోగ్యము"అన్నాడు

'సరిపోయినది. నీవు నామనస్సునకు పట్టిన వ్యాధివేకదా?'అంది వాసంతి. సారథి ఆ మాటలకు కృంగి పోయాడు. ఆమెకు ప్రేమజబ్బు పట్టుకుందని తెలుసుకున్నాడు. వాసంతికి కూడా తెలుసు. అందుకే ఆమె ఆ విధంగా అంది.

## 5) వాసంతిలో స్పర్శానుభూతి.

సారథి కామదహనమనే నాటకం ఆడదల్చుకున్నాడు. 'వాసంతికి పార్వతి వేషం ఇచ్చాడు. ఇతర పాత్రధారులకు అభ్యాసం చేయించసాగాడు. వాసంతికి అభ్యాసం చేయించేవేళ జబ్బపుచ్చుకొని లాగటం,వీపుమీద చిరుదెబ్బలు వేయటం జరిగేది. ఈవిధమైన తాకిడిలో ఆమె అదోవిధమైన ఆనందాన్ని అనుభవించేది. ఈ స్పర్శతో ఆమెలో విచారం మొదలైంది. ఈ స్పర్శను తండ్రి స్పర్శతో పోల్చిచూసుకునేది. ఏదో భేదం కనుక్కొంది. "సారథిస్పర్శవల్ల హృదయమునకేదో యొక ఉత్సాహమును,సంతోషమును దోచినట్లు గుర్తించినది. సారథి యొక వ్యక్తి,తానొక వ్యక్తి, మా ఇద్దరి సంబంధము రక్త స్పర్శతోడిది కాదు. అతనిలో జీవుడున్నాడు. ఒక జీవునికి ఇంకొక జీవునితో బరిచయము కలిగినపుడు,జీవుడేదో సంతోషించును. అట్టి సంతోషమునే తాను పొందెను. (356)

ఫ్రాయిడ్ చూపిన ఎలెక్ట్రా కాంప్లెక్స్ భావాలు ఈ సందర్భంలో గమనించాల్సి ఉంది. "ప్రతిబాలునిలోను శైశవదశలో తల్లిని పొందాలనే అభిలాష,తండ్రి పట్ల ద్వేషం దీనినే ఇడిపస్ కాంప్లెక్స్ అంటారనీ,అలాగే బాలికలలో తండ్రిని పొందాలనే అభిలాష,తల్లిపట్ల ద్వేషం దీనినే ఎలెక్ట్రా కాంపెక్స్ అంటారనీ,ఈ దుర్దమ భావాలు ప్రతి వ్యక్తికి శైశవదశలోనే అజ్ఞాతంగా ముద్రించుక పోతాయనీ,తరువాత జీవితంలో స్త్రీపురుషులు ఒండొరుల పట్ల ఏర్పడే వైఖరులకు పునాదులు వేస్తాయనీ,అంతేగాక పెద్దలపట్ల,అధికారుల పట్లకలిగే వైఖరులు కూడా కారణాలవు తాయనీ,ఫ్రాయిడ్ సిద్ధాంతంలోని ముఖ్యమైన భావనలు.

## 6) వాసంతిలో ఎలెక్ట్రా కాంప్లెక్స్ భావాలు.

వాసంతికి చిన్నపుడే తల్లి గతించింది. తండ్రే పెంచిపెద్ద చెసాడు. ఆమె మనసునిండంతా

17.. అపసామాన్య మనోవిజ్ఞానము. పుట. 68.

సంగీతంవైపు మళ్ళించి అదే ప్రపంచమన్నట్లుగా పెంచి పెద్దదానిని చేయటంవల్ల ఆమె మానసికంగా సక్రమంగా ఎదగలేకపోయింది. తల్లిప్రేమకు నోచుకోలేదు. ప్రేమంటె ఏమిటో తండ్రి చూపలేదు. లోకజ్ఞానం కొరవడిచేసి కేవలం సంగీతమే సర్వస్వం అన్నట్లు ఆమెతో మెదిలాడు. సారథి శిరీషునకు స్నేహితుడు. వాసంతి చిన్నతనంనుండి శిరీషుని ఇంటికి వచ్చి పోయేవాడు. వాసంతి చిన్నతనంలో సారథి ఎత్తుకొని తిప్పినవాడే. శైశవతనంలో ఆమెకు తండ్రిపై ఎటువంటి దుర్దమ భావాలు అజ్ఞాతంగా ముద్రించుక పోయాయో చెప్పలేము గాని ఆమె తండ్రిని కంటె ఎక్కువగా సారథిని ప్రేమించసాగింది. ప్రేమంటె ఏమిటో తెలియకున్నా ఆమె తండ్రి దగ్గరకన్నా సారథివద్ద చనువుగా ఉండేది.

పదహారేళ్ళ వయసులో ఆమె నాటక సమాజంలో చేరటంవల్ల సారథి ఆమెకు గురువు అయ్యాడు. కేవలం అభినయం చూపటంలోనేగాక లోకాలోకజ్ఞాన ప్రదాతగా కూడా సారథి ఆమెకు దగ్గరయ్యాడు. శృంగారరసాభినయవేళ ఆమెలో మానసిక పరివర్తన కలిగింది. ఆ అనుభవంతో ఆమె స్త్రీపురుషులు పరస్పరం ఆకర్షితులౌతారని గ్రహించింది. తాను క్రమంగా సారథినే మనసారా కోరుతున్నట్లు తెలుసుకుంది. సారథిని చూడకుండా, అతనితో మాట్లాడకుండా ఉండలేక పోతున్నట్లు ఎందుకో తెలియకుండా అతనివైపే తన మనసు లాగుతున్నట్లు కనుక్కుంది. అంతేగాక రాణాప్రతాప సింహనాటకంలో సారథి భార్యగా అపూర్వంగా నటించినట్లు తండ్రి, మరియు ఇతరులు ప్రశంసించగా వింది. దానికి కారణం సారథేనని తనకు తెలుసు. అయినా అతన్ని కారణం అడిగింది. సారథి క్షోభగురించి వివరిస్తూ వ్యక్తికి స్వేచ్ఛలేనందు మానసికంగా క్షోభపడతారని చెప్పాడు. తనకు తండ్రివల్ల స్వేచ్ఛలేదని, తనకు యుక్త వయస్సు వచ్చినా తండ్రి తన వివాహంవిషయంలో ఆలోచించడనీ, తన కోరిలకు తండ్రి వల్లనే విఘాతం కలుగుతుందనీ, వీటివల్లనే తాను క్షోభ పడుతున్నట్లు తెలుకుంది.

సారథి శిక్షణలో మానసికంగా ఎంతో ఎదిగిన వాసంతి తనమనసు తన ప్రయత్నం లేకుండగనే అతన్ని ఆకర్షిస్తున్నట్లు తెలుసుకోవటానికి ఎంతో కాలం పట్టలేదు. అంతేగాక సారథితో నాటకం అభ్యాసం చేస్తున్నవేళ అతను స్పృశించినపుడల్లా ఏదో మధురానుభూతికి లోనయింది. ఆ మధురస్పర్శకు తనలోని జీవుడు సంతోషిస్తున్నట్లు గ్రహించింది.

వాసంతి సారథిని ప్రేమించటం, యవ్వనంలోనున్న ఇద్దరు స్త్రీపురుషుల మధ్య జరిగే ఆకర్షణకు ఫలితంకాదు. పరిచయంద్వారానో, స్నేహంద్వారానో, ఒకరి అభిరుచులు ఒకరు తెలుసుకొని ప్రేమించుకున్న విషయం కాదు. అంతేగాక ఎంతో వయోభేదమున్న సారథితో ఆమె పొందిన అనుభూతి శైశవంలో తండ్రిపట్లగల ప్రేమభావం దుర్దమభావాలుగా అజ్ఞాతంగా ఆమెలో ముద్రంచుక పోవటమే దీనికి కారణమనీ, అందువల్ల ఆమెలో క్రమంగా ఎలెక్ట్రా కాంప్లెక్స్ భావాలు పొడసూపాయనీ, వాసంతి ప్రవర్తనవల్ల తెలుసుకోవచ్చు.

## 7) వాసంతి స్పర్శానుభూతి ప్రయోగాలు.

నాటకం అభ్యాసవేళలో ఒకనాడు సారథి వాసంతిని గట్టిగా కౌగలించుకున్నాడు.ఆ కౌగిలిలో ఒదిగిపోయిన వాసంతి తన్మయత్వాన్ని పొందింది."ఆమె శరీరమొక మధురస్పర్శ మనుభవించుచుండెను.ఆమె యొదలు ఆమెకు దెలియుట లేదు.ఒడలంతయునది ఏదోయొక రమణీయ మధురస్పర్శవాహినీ తరంగప్లుతముగా భాసించుచుండెను.దాని స్వరూపమామెకు బొడకట్టలేదు"(367).

ఆ అనుభవాన్ని పొందిన వాసంతి నివ్వెరపోయింది.దీనిలోని రహస్యమేదో తెలుసు కోవాలనుకుంది.ఇంటికి వెళ్ళాక తండ్రిని కౌగలించుకొని పరీక్షించుకుంది.తనలో కలుగుచున్న అనుభూతిద్వారా భేదం గ్రహించింది.తండ్రిని కౌగలించుకున్నపుడు నిర్భయంగా,మానసికంగా పొందిన శాంతాన్ని,సారథిని కౌగలించుకున్నపుడు భయంతో కూడిన అశాంతిని గుర్తించింది. కారాణాలన్వేషించింది.ఒక్కసారిగా ఆమెకు జ్ఞానోదయమైనట్లయింది.స్త్రీపురుషుల ఆకర్షణకు మూలమైన కామమామె మదిలో మెదలింది.భయంతో కూడిన అశాంతి,తద్వారా కలిగిన మధురానుభూతి మొదలైన కారణాలు ఊహించి తెలుసుకుంది.

నాటక ప్రదర్శన సమయంలో పార్వతి వేషంలోనున్న వాసంతి కావాలని హఠాత్తుగా సారథిని కౌగలించుకుంది.సారథి ఈ హఠాత్పరిణామానికి విస్తుపోయిడు.తర్వాత ఆమె అమాయకత్వానికి జాలిపడి "తల్లీ ! స్త్రీ పరపురుషుని కౌగలించుకోరాదు."అన్నాడు.ఆమె "పరపురుషుడనగానేమి?'అంది.'భర్తకానివాడు.'అన్నాడు."భర్తను కౌగలించుకోవచ్చునా? అడిగింది. 'భర్తనే కౌలించు కొనవలయును.' 'తండ్రిని కౌగలించుకోరాదా?" వాసంతి మాటలు సారథిని తికమక పెట్టాయి.

వాసంతిలో ఎన్నో సందేహాలు ఉత్పన్నం కాసాగాయి.వాటికి తగిన సమాధానం చెప్పేవాడు సారథి ఒక్కడే.అందుకే ఆమె అన్ని విషయాలను సారథిని అడిగి తెలుసుకునేది. ఒకరోజు సారథిని వాసంతి తోటలో కలుసుకుంది.అతనితో ఇట్లా అంది.

"మానాయనగారు నన్ను పెండ్లి చేపుకోవద్దందురు.పెండ్లి చేసుకున్నచో నా సంగీత విధ్య నశించిపోవునట.పెండ్లి చేసుకున్నచో భర్తను ప్రేమించుటయేకదా.ఆ ప్రేమయంతయు దండ్రి మీదనే చూపించవచ్చుకదా".(391)

"తండ్రిమీద చూపించు ప్రేమవేరు,భర్తమీద జూపించు ప్రేమవేరు.'అన్నాడు సారథి. "తండ్రిని కౌగలించుకోరాదా?"అడిగింది.'తండ్రిని ఎవ్వరూ కౌగలించుకోరు.'"మొన్నరాత్రి నేను కౌగలించుకొన్నానే.''ఊరకే కౌగలించుకోవచ్చును.' అన్నాడు.'ఊరకేకాదు కావాలనే'అంది. ఆమె మాటలతో సారథి కూర్చున్నవాడు కూర్చున్నట్లే క్రుంగిపోయాడు.ఇంకా వాసంతి సారథితో "నేను నిన్ను కౌగలించుకున్నపుడు,మానాయనగారిని కౌగలించుకున్నట్లు లేదు.ఏదో క్రొత్తగా

నున్నది. బాధగా నున్నది. నీవు రాత్రి పరపురుషుని కౌగలంచుకోరాదంటివి. భర్తనెందుకు కౌగలించు కోవలయును,పరపురుషుని ఏల కౌగలించుకోరాదు?"చెప్పుమంది వాసంతి.

సారథి ఆలోచనలో పడ్డాడు."ఈ తెలియని పిల్లకు దెలిపినచో నామె శీలము నశించు మార్గము చెప్పినట్లగునని" భావించుకొని "పతివ్రతకు భర్తను కౌగలించుకున్నపుడే,ఆతడు ఆమెను కౌగలించుకున్నపుడే యట్టి సుఖానుభూతి యుండును. పరుడు కౌగలించుకున్నపుడు నొడలంతయు మండిపోవును. దుఃఖము వచ్చును. ఒడలు దేళ్ళు ప్రాకినట్లుండును. పతివ్రతలు కాని స్త్రీలు నెవరు కౌగలించుకున్నను నొక్కటే."అని చెప్పాడు."ఎందుకీ కౌగలించుకొనుట?" అడిగింది. సారథికి ఏం చెప్పాలో తెలియక "అంతయు దెలిసినదంటివికదా."అన్నాడు."నీవు చెప్పవు,నేనే తెలిసి కొందును లెమ్ము."అంది. సారథి భయపడ్డాడు."ఇందులో దెలుసుకొనదగిన దేదియులేదు. ఈ కాలమున దెలియని దానవు నీవొక్కతివియే,మీనాయన చేసిన మహకార్య మిదియొక్కటియే. నిన్నిట్లు పెంచగలుగుట"(395).

వాసంతి గానసభను జమీందారు ఇంటిలో ఏర్పాటుచేసారు. ఆ సందర్భంలో జమీందారు వాసంతికి బంగారు పతకమివ్వబోగా ఆమె కావాలని దొరచేయి తనచేతికి బాగా తాకునట్లు లాగుకొని అతని చేతిని తాకి పరీక్షించుకుంది. ఈ పరాణామానికి జమీందారు చిత్రపోయాడు.ఆమె అతని చేయి వదిలేసింది.స్పర్శను పరీక్షించసాగింది."దొరగారి చేతులు నా చేతులవత్తుకొనగా నా చేతులపైని చర్మము భగభగలాడెను."అనుకుంది. మరొకసారి వాసంతికి జమీందారుతో కలిసే అవకాశం కలిగింది. ఆ సమయంలో దొర ఇదివరకున్న చనువుతో వాసంతిని గాఢంగా కౌగలించుకున్నాడు."ఆమె కొడలంతయు దేళ్ళు పాకినట్లయినది. దానితో మరో రహస్యాన్ని వాసంతి తెలుసుకోగలిగింది. వెంటనే అతన్ని వదలించుకొని ఈ విధంగా పలికింది.

"మీకును నాకును సంబంధము లేదు. మీరు స్పృశించి నప్పటినుండి నా శరీరము తగులబడి పోవుచున్నది. నేను మీ బార్యనుగాను. నన్ను మీకొరకు భగవంతుడు సృష్టించలేదు. మిమ్ము నా కొరకు సృష్టించలేదు. మన శరీరానుగత శక్తులు పరస్పర భిన్నములు. అట్టి సంయోగము చేయరాదు".(437). వాసంతి మాటలు దొరకు అర్థం కాలేదు,చిత్రంగా చూసాడు

మరోసారి వాసంతికి రంగనాథమనే మరో పురుషునితో తనింట్లోనే ఏకాంతవాసం కలిగింది. రంగనాథమే ధైర్యం చేసి వాసంతిని కౌగలించుకున్నాడు."వాసంతి యా అనుభవమును విస్పష్టంగా బరిశీలించెను. సరిగా రాజు(జమీందారు) తన్ను కౌగలించు కొన్నపుడెట్లుండెనో యిప్పుడు నట్లేయున్నది."(400) వాసంతి వెంటనే రంగనాథాన్ని తోసేసింది. రంగనాథానికి వాసంతి ప్రవర్తన అర్థం కాలేదు,భయపడ్డాడు.

శిరీషునకు కమలతో పరిచయమైంది. కమల రంగనాథం కూతురు. కమల వాసంతి ఇంటికి రావటంవల్ల వాసంతికి కమలతో స్నేహం ఏర్పడింది. వాసంతి కమలను ఎన్నోసార్లు

తాకి చూసింది. స్పర్శను పరీక్షించింది. "వాసంతిలో స్పర్శగుణవివేచన జనిత పరమార్థజ్ఞాన మామె సర్వ శరీరాణువుల యందు ప్రవేశించి యామె మనఃపరిపాకమున కొక విక్లప్తి జరిగెను." "ఏ జీవుడు తన శరీరమునందు ,దన రక్తమునందు,దన యంద్రియాభిలాషలయందు నభివ్యాప్తుడై యుండునో వానికితర వ్యక్తులయందు సౌహార్థము,ప్రేమ,కలుగును. ఒక పురుషుడు ఇంకొక పురుషుని ప్రేమించుచుండెననగా నర్థమేమి? ఆ పురుషుడో,ఆ స్త్రీయో ఎవరు? ఇంద్రియ వాంఛలయొక్క సమాహారము. మనోవాంచలయొక్క కూడిక. మనోభావములయొక్క యునికిపట్టు." (482) ఇది విశ్వనాథవారి ప్రేమసిద్ధాంతం.

లౌకికంగా స్త్రీపురుషుల మధ్యగాని,ఏ ఇరువురి పురుషులు లేక స్త్రీలమధ్యగాని ప్రేమ,స్నేహం,కుదరటానికి గల కారణాలను విశ్వనాథపై విధంగా చూపుతాడు. అనగా ఆయా వ్యక్తులయొక్క ఇంద్రియవాంఛలయొక్క సమాహారమని చెప్పుటలో మానసికమైన వారివారి అభిప్రాయాలు,కోరికలు,అభిరుచులు,ఏకంగా ఉండటంవల్లనే వారు ప్రేమించుకోవటానికి గాని,స్నేహంగా ఉండటానికిగాని,లోకంలో సంభవిస్తుందని రచయిత అభిప్రాయం.

కమల వాసంతులు స్నేహితురాండ్రు. కమలయొక్క స్పర్శ వాసంతకి బాధాజనకంగా లేదు. లేదు సరికదా సుఖంగా ఉంది. కాని "సారథి స్పర్శసుఖానికి కమల స్పర్శసుఖానికి ఎంతో భేదముంది. కమలను తాకినపుడు మనస్సులో నుండి ఒక సుఖరేఖ శరీరములోకి ప్రవహించు చున్నది. సారథిని తాకినపుడు సుఖరేఖ శరీరము నుండి మనస్సునకు ప్రసరించెను. తాను తండ్రిని తాకినపుడు తత్సుఖరేఖ యధాస్థితముగా నుండెను. దానికి స్రరణమే లేదు. అదియొక సుఖము. శరీరాణువులు కదలలేదు. మనస్సు చలించలేదు."(463).

లోకంలోని వివిధ రకాలైన ప్రేమను విశ్వనాథ, వాసంతి పాత్ర ప్రవర్తించి పొందిన అనుభవాన్ని చిత్రించి ఈవిధంగా తెలుపుచున్నాడు. ప్రేమరకాలను,అనుభవాన్ని,శారీరక అనుభూతిని, ప్రయోగాల ద్వారా వాసంతి పొందిన అనుభవాలే ప్రస్తుతం ఇక్కడ ప్రేమ సిద్ధాంతానికి మూలం

వాసంతి-తండ్రి స్పర్శను,కమలస్పర్శను,సారథి స్పర్శతో విమర్శించుకుంది. వాసంతి సహజంగా ఆ ముగ్గురిని మానసికంగా ప్రేమిస్తున్నదే. తండ్రిమీది ప్రేమ నిర్లిప్తతో కూడినట్టిది. అందులో స్పర్శానుభూతి ఏమీ ఉండదు. కారణం అణువుల ఉద్రిక్తతో కూడిన మానసిక సంచలనం అంతగా ఉండదు. ఈ ఉద్రిక్తత లేని కారణం 'కామేచ్ఛాభావం' లేకపోవటమే. కనుక ఆ స్పర్శలో మార్పు తోచదు. కమల తనలాంటిదే కనుక అక్కడకూడా ఉద్రిక్తతకు చోటులేదు. కేవలం శారీరకమైన ఆనందమేగాక మానసికమైన శాంతి అందులో ఉంటుంది.

కాని సారథి స్పర్శతో శరీరగత అణుసంచయం కదిలి మనస్సునకు ప్రసరించుటచే శరీరగత 'కామభావం' స్పర్శవల్ల మనోకామంగా మారుతుంది. అందువల్ల ఆ స్పర్శ శారీరకంగా,

మానసికంగా,సుఖంగా,భయంగా, తోచుటలో మానసికమైన ఉద్రిక్తలకు,ప్రేరణలకు,మూలమై నిలిచి ఆ విధమైన అనుభూతి కలిగింప చేస్తుంది.

ఈ మార్పును వాసంతి గ్రహించింది.సారథిని,తండ్రిని,జమీందారును,రంగనాథాన్ని, కమలను కౌలించుకొని "త్వగింద్రియస్పర్శజ్ఞానంచే'ఒక సిద్ధాంతాన్ని రూపొందించుకుంది.అది ఈక్రింది విధంగా ఉంది.

త్వగింద్రియానికి స్పర్శజ్ఞానం ఉంది.ఆ జ్ఞానం జీవకణాల ద్వారా,రక్తంద్వారా,చలనం ద్వారా,మనస్సునకు చేరి అంతరాత్మకు తెలియచెప్పే అతి సూక్ష్మాతిసూక్ష్మమైన వివేచనాత్మకత. (ఈ వివేచనాశక్తిని వాసంతి పాత్రలో ప్రవేశపెట్టాడు విశ్వనాథ) ఆ స్పర్శవలన పొందిన సుఖదుః ఖానుభూతిచే అంతరాత్మ వివేచనతో 'జీవుడు' తనకు హితమైనదో,కాదో,తెలుసుకునే తాత్వికమైన జ్ఞానం.ఈ రకమైన అతీతజ్ఞానం కొందరిలోనే ఉంటుందనే విషయం 'త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతంగా' ఈ నవలావిమర్శ ప్రారంభంలో వివరింపబడింది.

## 8) త్వగింద్రియ స్పర్శచే తా వలచిన బంధం.

ప్రజాపతి-శతరూప,భావనలు వ్యక్తులలో ఉండే "అర్ధనారీశ్వరతత్వానికి" మూలంగా చేసుకొని త్వగింద్రియస్పర్శ జ్ఞానాన్ని వాసంతి పాత్రలో ప్రవేశపెట్టి విశ్వనాథ ప్రయోగ పూర్వకం గా ఈ నవలను వ్రాయటం అద్భుతమైన సాహిత్యప్రక్రియగా మొదలే చెప్పుకున్నాం.

యూంగ్ "మూలరూపాల' సందర్భంలో ఈ విధంగా వివరిస్తాడు.

<u>**"మూలరూపాల వివరణ:-**</u> సమష్టి అచేతనంలో మూలరూపాలుంటాయి. మూలరూపాలు అంటే అనాది భావనలు.ఇవి ఉద్వేగ లక్షణాలను కూడా కలిగి ఉంటాయి. ఇవి చేతనావస్థకు సంబంధించిన ప్రతిమలను కలిగించగలుగుతాయి.ఉదాహరణకు మాతృ భావన అనే మూలరూపాన్ని తీసుకుందాం.ఈ మూలరూపము వ్యక్తులందరిలోనూ ఒకే విధంగా ఉంటుంది.దీనివల్ల వ్యక్తికి తల్లిపట్ల కొన్ని ప్రత్యాశలు ఏర్పడతాయి.ఈ ప్రత్యాశలను నిజమైన తల్లితో పోల్చుకుంటాడు.అంటే ప్రతి అనుభవం కొంత మూలరూపాలవల్ల (అంటే జాతి చరిత్రవల్ల) ,కొంత నిజమైన సంఘటనవల్ల కలుగుతుంది.ఇట్లా అనేక మూలరూపాలు పమష్టి అచేతనంలో ఉండవచ్చు.శక్తి,దైవము,మొదలైనవి ఇటువంటి మూలరూపాలే.రెండులేదా అంతకంటె మూలరూపాలు కలిసి ఒక మూలరూపంగా ఏర్పడవచ్చు. కొన్ని దుర్దమభావాలకు ఒక మూలరూపము కేంద్రకంగా ఏర్పడవచ్చు.కలలో,పురాణగాథలలో,ఆచారాలలో, సృజనాత్మక మైన కళాసృష్టిలో,కనిపిస్తాయి.జననము,మరణము,భగవంతుడు,దయ్యము,మొదలైనవి ఇటువంటి మూలరూపాలకు ఉదాహరణలు.తరతరాలుగా పునరావృతమవుతున్న జాతి అనుభవాలే మూలరూపాలుగా ఏర్పడతాయి.అనిమా,అనిమస్,ఈ రెండూకూడా మూలరూపాలే. అంటే అచేతనమైనవి అన్నమాట.పురుషునిలో అంతర్గతమైన స్త్రీ లక్షణాలను అనిమా అనీ,స్త్రీలో

అంతర్గతమైన పురుషలక్షణాలకు అనిమస్ అనీ అంటారు. ఈ అంతర్గత మూలరూపాలవల్లనే స్త్రీపురుషులు ఒండొరులను ఆకర్షించుకోవటానికి,పరస్పర ప్రతిస్పందనలు జరుపటానికి అవకాశం కలుగుతున్నది,"(చూడు. అపసామాన్య మనోవిజ్ఞానం. పుట. 100,101)

ప్రకృతి పురుషుల కలయికచే సృష్టి జరుగుతుంది. ప్రకృతి,పురుషుల తత్వం ప్రతి వ్యక్తిలో ఉంటుంది. ప్రకృతి పురుసుని చేరువ కావలని కోరుకుంటుంది. ప్రకృతి స్త్రీఅంశ (అనిమా,లేక శతరూప),పురుష అంశ (అనిమస్ లేక ప్రజాపతి) లో లీనం కావాలని అభిలషిస్తుంది. తద్వారా లోకంలోని వ్యక్తులు ఈ అంశల ప్రభావాలవల్లనే ఏకమౌతుంటారు. ఈ విషయాలనుకూడా మనం లోగడ చెప్పుకున్నవే.

వ్యక్తులు చనిపోయినా అత్మలకు చావులేదనీ,వాటికి పునర్జన్మలున్నవనీ,అవి జన్మలెత్తి కర్మఫలాలను అనుభవించుననీ, మన భారతీయ తత్వశాస్త్రం చెబుతుంది. కర్మసిద్ధాంతం,జన్మసిద్ధాం తాలపైన నమ్మకం కలిగిన వారికి విశ్వనాథవారు ప్రవేశపెట్టిన "ప్రేమసిద్ధాంతం,త్వగింద్రియ స్పర్శసిద్ధాంతం అర్థం చేసుకోవటం కూడా చాలా సులభమైన విషయమేనని చెప్పవచ్చు.

అదీగాక లోకంలో 'మానవసంకల్పం,దైవసంకల్పం,అనేవి రెండూ కూడా వ్యక్తులపై ప్రభావం చూపుతాయి. చాలావరకు మానవుడు 'మానవసంకల్పంపైనే ఆధారపడి ప్రత్యక్ష ప్రమాణాలనే నమ్ముతాడు. కాని కొన్ని సందర్భాలలో దైవసంకల్పం వల్ల సమకూరే కార్యాలకు ప్రత్యక్ష ప్రమాణం కాకుండా పరోక్ష ప్రమాణంకూడా గ్రహించాల్సి ఉంటుంది.

వాసంతి స్పర్శానుభూతి ఆమెకు ప్రత్యక్ష ప్రమాణమే. అయినా మనకు మాత్రం పరోక్షమే. దాన్ని మనం తాత్వికంగా,వివేచనాత్మకంగా,ఆలోచించి నిర్ణయించుకోవాల్సిందే. దీనికి మూలం దర్శనాలలో,ఉపనిషత్తులలో,గ్రహించాల్సిందే. ఇది లౌకికజ్ఞానానికి చెందిన విషయం కాదు. అలౌకికజ్ఞానానికి,ప్రకృతి పురుష తత్వానికి,సంబంధించినది. అందువల్ల వాసంతి పాత్రను సహజస్థితిలో,సామాజికస్థితిలో,సాధారణస్థితిలో చూడటానికి వీలులేదు. విశ్వనాథ మహాకవి, తాత్వికుడు,వేదాంతి,ఆతని అభిప్రాయాలు లౌకికజ్ఞానానికి చుట్టుకునేవికావు. అందువల్ల అతని ప్రతిరచన విశిష్టమైన ప్రయోగంతో తాత్వికమైన గుణంతో విసిల్లుతుంది.

వాసంతి సారథిని కౌగలించుకుంది. ఆ స్పర్శలో ఆమె ఒక మధురానుభూతిని పొందింది. ఆ మధురానుభూతి ఎటువంటిదో తెలుసుకోవటానికి ఆమె ఎన్నో ప్రయోగాలు చేసింది. ఆ ప్రయోగాల్లో ఆమె సజాతీయ,విజాతీయ స్పర్శానుభూతిని పొందింది.

సారథి స్పర్శ సజాతీయమైపదిగా గుర్తించింది. ఈ జ్ఞానం పొందన క్షణంనుండి వాసంతి సారథిని భర్తగా భావించ సాగింది. సారథిని చేరి ఈ విధంగా అంది. "పతివ్రతకు భర్తను కౌగలించు కున్నపుడే ,అతడు కౌగలించుకున్నపుడే, యట్టి సుఖానుభూతి యుండును. పరుడు కౌగలించు కొనినపుడు నొడలంతయు మండి పోవునని చెప్పితివి. ఈ సిద్ధాంతము నిజమైనచో నీవ

భర్తవు. మనకు వివాహము కాలేదు,వివాహమైన భర్తకాడు. భర్త యగుటకు ఇట్టి సిద్ధాంతము నాశ్రయించి యుండునా?"(503).

సారథి స్థబ్దుడయ్యాడు.'వాసంతి, స్త్రీ సృష్టిలో ప్రత్యేకమైన సృష్టి.లోకోత్తరమైన సృష్టి. భవభూతి మహాకవి నిర్మించిన సీతాదేవి వంటిది.ఇటువంటి వాసంతిని తాను ముట్టుకోకూడదు. తాను శ్రీరామచంద్రుడు కాదు. ఈమెను వదలించుకోవాలి"(504).అనుకున్నాడు.

"నేను నీ భర్తనుగాను.నీకు తండ్రివంటివాడను.నేను చెప్పెడు సమాధానము నేమియు లేదు. ఇంక నా తోటకు రాకుము."అని కోపంగా పలికాడు. వాసంతికి ఆశ్చర్యమేసింది. సారథిని వదలలేదు. అతని పాకలోకి వెళ్ళి అక్కడే ఉండసాగింది."నీవు మరల నేదో నాటకము వేయవలయును.నేను వేషము ధరించవలయును.నాటకమాడనిచో నేను బ్రతకలేను."అంది.' "పూర్వము నా స్థితి యట్లే ఉండెడిది"అన్నాడు సారథి."ఆస్థితి పోవుటకు నీవేమి చేసితివో చెప్పగలవా?"అండిగింది వాసంతి."చెప్పగలను, ఈ ప్రపంచమంతయు వ్యర్థమని నాకు తెలిసినది. ఇచటి కామము,క్రోధము,ఈర్ష్య,మాత్సర్యము,సర్వమును వృధావృధా. అందుచేతనే నేను కామదహనమనే నాటకమాడితిని. నాలోనున్న మన్మథభావమును దహించుటకొరకాడితిని "అన్నాడు సారథి. (506).

వాసంతి కోరిక ప్రకారం కామదహన నాటకం పూర్తిగా వేస్తానన్నాడు. కిరీటిచే వ్రాయించాడు. తనలోని స్పర్శ గుణాన్ని పూర్తిగా కిరీటిలో ప్రవేశించునట్లు ఆతనిని కౌగలించు కొని యోగంద్వారా సాధించాడు. కిరీటి సారథి ప్రయత్నాలకు ఆశ్చర్యపోయాడు. తనలో ఏదో గొప్ప మార్పు వచ్చినట్లు తెలుసుకోగలిగాడు. తన శరీరం,మనస్సు,వాసంతిని కోరసాగిందని కిరీటి గ్రహించి ఆమె స్పర్శకోసం ఆరాటపడసాగాడు. అవకాశం లభించగానే కిరీటి ఆమె అనుమతితో ఆమెను గట్టిగా కౌగలించుకున్నాడు. వాసంతి సారథితో పొందిన అనుభూతిని పొందింది. తన ప్రయోగం ఫలించినందులకు సారథి సంతోషించాడు.

## 9) వాసంతి-కిరీటుల లౌకిక బంధం.

సారథి,వాసంతి కిరీటులను కలిపి ఆ ఊరినుండి వెళ్ళిపోయాడు. వివాహం కాకుండానే వాసంతి కిరీటితో తనింట్లోనే కలిసిఉండటం శిరీషునకు తీవ్ర మనస్తాపం కలిగించింది. వారిద్దరూ గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకోవటంతో అతనికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. శిరీషుడు భరించలేక ఆ గది తలుపులు బాదుతూ నానా మాటలతో నిందించసాగాడు. వాసంతి తలుపులు తెరచి తండ్రితో ఇట్లా అంది.

"నాన్నగారూ ! మీరనిన మాటలేవియు బాగుగా లేవు. మీకిష్టము లేనిచో నేనింటిలో నుండి వెడలిపోదును. అతడు నాకు భర్త. మా యిద్దరకును నాలుగు నెలలనుండి సంబంధము. సారథి మా యిద్దరికి వివాహము చేసెను. పరమేశ్వరుడు నాకు నిర్ణయించిన భర్త సారథి. ఆ

సారథి నన్ను పెండ్లి చేసికొనినచో నా కన్యాయము చేసినట్లగునని పైగా తనకు నేను బిడ్డవంటి దాననని నన్నితనికిచ్చినాడు.నాకితడే భర్త."(610).

"నిన్నివ్వటానికి వాడెవడు?నన్నింత మోసం చేస్తాడా?"కోపంగా పలికాడు శిరీషుడు. వాసంతి "నన్ను గిరీటికిచ్చుటకు సారథికే అధికారమున్నది.నేను అందరిలాంటి దాన్ని కాదు. లోకములో స్త్రీపురుషులు వ్యభిచరింతురు.వారికి నిజమైన శరీరసుఖము తెలియదు.నిజమైన శరీరసుఖమెట్లుండునో నాయొక్కతికే తెలియును.భర్తగానివాడు నన్ను స్పృశించినచో నా యొడలు మండిపోవును.కాని సారథి నాభర్త.అతని కౌగలి నాకమృతము లాంటిది.లౌకికంగా సారథి నాభర్త కాలేదు.అందువలన సారథి తనలోని ఆత్మగుణాన్ని కిరీటిలో ప్రవేశపెట్టినాడు. కిరీటిని నన్ను ఏకంచేసినాడు.మే మిద్దరమూ సారథికి భక్తులము.మీ ఇంటిలో నేనుండుటకుమీ కిష్టము లేనిచో మేమిప్పుడే వెడలిపోయెదము."అని పలకింది.ఆ మాటలతో శిరీషుడు మౌనం వహించాడు

వాసంతి కిరీటులు ఆ విధంగా ఉండటం బాగుండదని శిరీషుడు వారికి వివాహం చేసాడు.రెండు సంవత్సరాలు గడిచాయి.సారథిజాడ ఎవ్వరికి తెలియదు.కాని కొంతకాలానికి సారథి విషయంలో విచిత్రమైన వార్తలు వాసంతికి తెలిసాయి.ఆమె అతనికొరకు ఎందుకో ఎదురుచూసాగింది.

పై వివరణలో విశ్వనాథ మనకు రెండు విషయాలను తెలియజేస్తాడు.మొదటిది, లౌకికంగా మానవసంకల్పంతో ఏర్పడే వివాహాలు.ఆ వివాహాలకు దైవసంకల్పం కూడా తోడుంటే అవి సుఖసంతోషాలతో వర్ధిల్లి చిరస్థాయి నిలుస్తాయి.రెండవది,కొన్ని దైవసంకల్పంతో ఏర్పడతాయి.వాటికి మానవ సంకల్పాలెన్ని విఘాతం కలిగించినా అవి ఈ లోకంనుండి శాశ్వతంగా నిష్క్రమించే ప్రయత్నాలు చేస్తాయి.సారథి తన సంకల్పంతో వాసంతి కిరీటులను ఏకం చేసాడు కాని అది ఫలవంతం కాలేదు,దైవసంకల్పం మరోవిధంగా ఉంది.అందుకే చివరలో వాసంతి,సారథులు ఏకమై ఈ లోకాన్ని విడిచి వెళ్లారు.

## 10) సారథి వాసంతుల శాశ్వత బంధం.

సారథి మతిభ్రమించిన వానిలా ఎన్నోఊళ్ళు తిరిగాడు.ఎన్నో మతాలు చేపట్టి మార్చుకున్నాడు.ఎంతోమంది స్త్రీలను కలిసాడు.మానసిక శాంతిని పొందలేక చివరకు అదే గ్రామానికి వచ్చాడు.తిరిగి ఆ ఊళ్ళో 'రుక్మాంగద' నాటకం ఆడటానికి నిశ్చయించు కున్నాడు. వాసంతి వచ్చి తాను మోహిని వేషం వేస్తానంది.కాని సారథి సమ్మతించలేదు.నాటకం ఆడుతున్న సమయంలో వాసంతి ఆ స్థలానికి వచ్చి మోహినీ వేషంవేస్తున్న స్త్రీని బ్రతిమిలాడి తాను మోహిని వేషం ధరించి రంగంమీదకు వెళ్ళింది.రుక్మాంగదుని వేషంలోనున్న సారథి వాసంతిని చూసాడు. ఏమీ అనలేక పోయాడు.వాసంతి నాటక రంగమీదనే సారథిని కౌగలించుకుంది.ఆ కౌగిలి రంగంస్థలం మీద 'అర్ధనారీశ్వర 'రూపంగా నిలిచిపోయింది.ఆ కౌగిలి విడిపోకుండా శాశ్వతమైన

బంధంగా అల్లుకుంది.ఆ రెండు ఆత్మలు ఏకమైనాయి.ప్రకృతి పురుషుల కలయిక సృష్టికి మూలమనే సంకేతంగా ఆ దృశ్యం రూపుకట్టంది....లౌకికమైన తెర వారిమీద వాలింది. వారిద్దరూ ఈ లోకానికి "చెక్" చెప్పారు.

## 6.7 తెరచిరాజు నవల సమౌచిత్యం.

''తెలచిరాజు' అనే పదాన్ని చదరంగంలో ఉపయోగిస్తారు.ఇది తెలుగు పదం. సాధారణంగా ఆటలో రాజును నిర్బంధంలో పెట్టి ఎదుటివాడు "చెక్" అని సూచిస్తూ తెలియజేస్తూ ఉంటాడు.దీన్నే కొందరు "షా"అను కూడా అంటారు. ఈవిధంగా చెక్ లేక షా అని సూచించినపుడు రాజు ప్రమాదంలో నున్నట్లు గ్రహించి తప్పించుకుంటాడు...ఎటూ కదలలేని స్థితిలో రాజును నిర్బంధించినపుడు ఆట అయిపోతుంది.ఈ చెక్ లేదా షా అనే పదాలనే తెలుగులో 'తెలచిరాజు' అంటారు.

ఈ నవల సాంఘిక ఇతివృత్తం చుట్టూ తిరిగినా ఇందులో సాంఘిక ప్రయోజనాన్ని కలగించే విషయమేదీ లేదు.ఈ నవలలోని పాత్రలన్నీ సాంఘిక వాతావరణంలో మసలుతున్నా ఆ పాత్రలు ఏ సాంఘిక ప్రయోజనసిద్ధికి పాటుపడలేదు.సాంఘిక వ్యక్తులుగా ప్రవర్తించే సారథి,వాసంతి పాత్రలుకూడా కేవలం సాంఘిక ప్రభావాలకు లోనై తమ జీవితాలను గడిపినవారు కాదు.ఈ పాత్రలచుట్టూ స్వార్థపూరితమైన సాంఘిక వ్యక్తుల జీవితాలు చిత్రింపబడ్డాయి. కామ,క్రోధ,లోభ,మోహ,మద,మాత్సర్యాదులతో నిండిన అవధాని,రంగనాథం, జమీందారుడు, శిరీషుడు,అర్జునరావు,మొదలగు పాత్రలు తమతమ స్వార్థంతో ఏ విధంగా ప్రవర్తించాయో చూపబడ్డాయి.ఈ పాత్రలన్నీ కలిసి ఒక విధంగా ఆ ఊరు జమీందారును పడద్రోయటానికి పనిచేసాయి.రంగనాథం ఎన్నో ప్రయత్నాలతో జమీందారును,సారథిని, వాసంతిని,నాశనం చేయాలని చూస్తాడు.చివరకు జమీందారుకూడా రంగనాథంవల్ల సర్వం కోల్పోతాడు.అందువల్ల ఈ సంఘంఅనే చదరంగంలో రాజువంటి జమీందారుకు రంగనాథమనే సామాన్యునితో(పావు) చెక్ చెప్పటంవల్ల ఒక విధంగా ఈనవలకు తెలచిరాజు అనే పేరు సార్థకమౌతుంది.అంతేగాక ఈ నవల సాంఘికమైనదే అయినా ఇందులో సాంఘికప్రయోజన మేదీ లేకపోవటంవల్ల ఆ ప్రయోజనానికే 'చెక్ చెప్పటంవల్ల మరోవిధమైన సార్థకత పొందింది.

ఇక ఈనవలలోని విషయం తాత్వికమైనది.సారథి వాసంతీల మధ్య ఉన్న సంబంధం లోకాతీతమైనది.త్వగింద్రియస్పర్శచే వాసంతి తనకంటె పెద్దవాడైన సారథిని భర్తగా భావించింది. తాను ఆ విధంగా భావించి గుర్తించటం,తన అధీనంలో లేని విషయంగా తెలుసుకుంది.అందుకే ఆమె సారథిని పరమేశ్వరుడు తనకు కుదిర్చిన భర్తగా ఎన్నుకుంది.ఈ "భార్యాభర్తల" సంబంధం మానవసంకల్పంతో కూడినట్టిది కాదు.లోకంలో సహజమైన భార్యాభర్తల సంబంధం మానవ సంకల్పాలతో కూడుకునేది.దైవసంకల్పంకూడా లోకంలో నున్నా అందరూ తెలుసుకోలేనిది.కాని

ఈ నవలలో దైవసంకల్పం,మానవసంకల్పాలకు 'చెక్' చెప్పటం జరిగింది. అందువల్ల ఈ నవల 'తెలచిరాజు' నామంతో సార్థక్యం పొందింది.

"మాయావిహతమైన పరమాత్మ జీవాత్మ యగుచున్నది....మాయయొక్క ప్రథమ స్వరూపము స్త్రీ.అందుకనియే పురుషుడు,ప్రకృతియు అన్నారు.ఈ ఇద్దరు కలిసినపుడే జీవుడు. జీవలక్షణం ఉన్నంతవరకు లింగసంబంధ వాంఛ ఉన్నదన్నమాట.లింగసంబంధ వాంఛా సహితమైన చైతన్యమే జీవుడు."(325)

మాయ కలిగినచో జీవాత్మ,మాయలేనిచో పరమాత్మ అని చెప్పుట మనకు దర్శనాలలో కనిపిస్తుంది.జీవాత్మలో ప్రకృతి పురుషుడు కలిసే ఉంటారని,చైతన్యవంతమైన జీవుడు ఈ తత్వంవల్ల కామస్వరూపుడనీ,సృష్టికి మూలం కామం అనీ తెలుసుకోవచ్చు.

ఈనవలలో జీవునిలోని మూలతత్వానికి చెందిన 'ప్రకృతి-పురుషుల'ను పాత్రలుగా మలచటం జరిగింది.మాయామోహితమైన ప్రకృతి పాత్ర వాసంతిది.చైతన్యంతో విలసిల్లే పురుష పాత్ర సారథిది.ప్రకృతి పరవశంతో పురుషుని కలవాలని ప్రమత్నిస్తుంది.పురుషుడు మాయలో పడకుండా ఉండాలని ప్రయత్నిస్తాడు.కాని అసలు మాయ అనగా ప్రకృతితత్వం(స్త్రీఅంశ) పురుషునిలోనే ఉంటుంది.తనలోని మాయను జయించాలనే ప్రయత్నం ఈ నవలలో కనబడుతుంది.చివరకు ఈ మాయ తనలోనిదేనని గ్రహించిన పురుషుడు ప్రకృతిని చేరదీసి ఈ లోకానికి 'చెక్" చెప్తాడు.అనగా మాయకు చెక్ చెప్పటం జీవాత్మ పరమాత్మలో కలవటం, చివరకు జరిగే సంఘటనలు.ఈవిధంగా ఈనవలకు ఈ పేరు సార్థకమౌతుంది.

నవల చివరలో వారిద్దరూ(సారథి,వాసంతీలు) మృతిచెందినట్లు చెప్పబడలేదు.మృతి చెందితే వారికి పునర్జన్మ ఉంటుంది.మృతిచెందినట్లు చూపకుండా విశ్వనాథ వారద్దరూ ఈ లోకానికి,లౌకిక జీవితాలకు,'చెక్' చెప్పినట్లుగా,ఆధ్యాత్మిక భావంగా,నవలను ముగించాడు. కాని వారిద్దరూ ప్రతివ్యక్తిలో 'అర్థనారీశ్వరతత్వాన్ని"పొంది,పరస్పర అకర్షణకు,సృష్టి కార్యాలకు,మూల మౌతారనే 'సత్యాన్ని'గుర్తింపచేసే దృశ్యాన్ని రంగస్థలంమీద నిలిపారు విశ్వనాథ

## 6.8 ముగింపు-సందేశం.

మానవునికి లౌకిక జీవితం,అలౌకిక జీవితం, రెండూ ఉన్నాయి.అలౌకిక జీవితం మానసికమైనది,ఆధ్యాత్మికమైనది.మానవుడు భౌతికంగా కంటె మానసికంగా,ఆధ్యాత్మికంగా ఎక్కువగా బ్రతుకుతుంటాడు.కారణం భౌతికజీవితంలో పొందలేని శాంతిని,సుఖాన్ని, ఆనందాన్ని, మానసికంగా లేక ఆధ్యాత్మికంగా పొదాలని ప్రయత్నిస్తాడు.భారతీయుని మనస్తత్వం భౌతికమైనది కాదు.తరతరాలనుండి వస్తున్న సంస్కృతిని వారసత్వంగా పొందినట్టిది. భారతీయుని మనస్తత్వంలో వేదపురాణాల సారం,ఉపనిషత్తుల విచారధార,దర్శనాలలోని మూల తత్వం,మొదలగు వాటితో భావాలరూపేణ రూపుగట్టి నిలుస్తుంది.భారతీయుడెప్పుడూ,కర్మ విచారణ,పునర్జన్మ సిద్ధాంతం,ఆత్మ

పరమాత్మల సంయోగం,ముక్తి,మోక్షం,మొదలైన వాటి గురించి ఆలోచిస్తూ శాంతిమయ జీవితం గడపాలనీ అభిలషిస్తూ ఉంటాడు.

ప్రకృతి మనకు జ్ఞానగురువు. ఈ ప్రకృతి మనకు మూడువిధాల జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. ఒకటి ప్రత్యక్ష జ్ఞానం,రెండవది పరోక్షజ్ఞానం,మూడవది అతీతమైన జ్ఞానం.ప్రత్యక్ష జ్ఞానం ఇంద్రియాలచే అనుభవించి,చూచి,విని,తెలుసుకునేది.పరోక్షజ్ఞానం ఊహించి, అనుమానించి, తర్కించి,వివేచించి,గ్రహించేది.అతీతమైన జ్ఞానం విశిష్టమైన మానసిక ప్రవృత్తులచే ఎవరికి వారు అనుభవపూర్వకంగా తెలుసుకునేది.

ప్రత్యక్షజ్ఞానం సాధారణంగా సర్వజనులకు సాధ్యమైనదే.పరోక్షజ్ఞానం అందరికీ వర్తించదు.కేవలం ఋషులకు,దార్శనికులకు,తత్త్వవేత్తలకు,మహాప్రతిభావంతులకే సాధ్యమైనది. వీరు ప్రత్యక్షప్రమాణాన్నే గాక,పరోక్షప్రమాణంతో జ్ఞానాన్ని సముపార్జిస్తారు.ఉపనిషత్తులలో, దర్శనాలలో,వివరింపబడే విషయమంతా ఈ పరోక్షజ్ఞానానికి సంబంధించిందే.

ఇక **అతీతజ్ఞానానికి**, ఆయా వ్యక్తులకు మాత్రమే పరిమితమై నిలిచేది.వీరే లోకాతీత **వ్యక్తులు.సాధారణులకంటె,తాత్త్వికులకంటె భిన్నంగా ఉంటారు.**వీరి మానసిక ప్రక్రియలే అతీంద్రియ **జ్ఞానానికి మూలమౌతాయి.**పూర్వజన్మవిషయాలను చెప్పేవారు,భక్తిపారవశ్యంలో భగవంతుని దర్శించేవారు,యోగులు,సిద్ధులు,మొదలైన వారు ఈ కోవలోకి వస్తారు.

విశ్వనాథ ప్రత్యక్షజ్ఞానానికి సంబంధించిన లౌకికజ్ఞానాన్ని పాఠకులకు బోధించే జ్ఞానప్రదాత గాడు.అందువల్ల ఆయన రచనలు వాస్తవికతను చుట్టుకొని సాధారణమైన జ్ఞానాన్ని చూపే మార్గదర్శకులుగావు.ఆయన సృష్టించిన పాత్రలు కూడా సామాజికస్పృహ అంతగా లేనట్టివి.అనగా అవి సాధారణంగా అతీతజ్ఞానానికి చెంది పరోక్షజ్ఞానాన్ని అదించే ప్రతీకలు.

రచయిత తాను చెప్పదలచుకున్న భావాన్ని అన్నిచోట్ల విడమరిచి చెప్పడు.కొన్నిచోట్ల ప్రతీకలతో గుర్తింపచేస్తాడు.కొన్నిచోట్ల పాత్రలద్వారా,సంఘటనలద్వారా,వర్ణనలద్వారా, సూచించి వదిలేస్తాడు.కొన్నిచోట్ల వ్యంగ్యంగా చిత్రిస్తాడు.ప్రతిభావంతులైన రచయితలు తమ భావాలకు సరిపడే అర్థాన్ని వాచ్యంగా గాక ఈవిధంగా అపూర్వమైన కల్పనావిశేషాలతో చిత్రించటం వారి రచనా నైపుణ్యానికి తార్కాణం.ఈ కల్పింపబడిన పాత్రలు,సంఘటనలు, వర్ణనలు,ప్రతీకలు, రచయిత చెప్పదలచుకున్న భావాలకు ప్రాతినిధ్యం వహిస్తాయి.భావవ్యక్తీ కరణకు ఇటువంటి కల్పనలు, ప్రతీకలు అనివార్యంగా రచనలో రచయితకు సాధనాలవుతాయి.

తెరచిరాజు నవలలో సారథి వాసంతి పాత్రలు కూడా ప్రతీకాత్మకతతో సృష్టించబడిన కల్పిత పాత్రలే.వీరిలో ఎంతో వయోభేదముంది.ఈ పాత్రలు వ్యక్తిలో గల "ప్రజాపతి-శతరూప" భావనలకు నిల్చిన ప్రతీకలు.ఇవి రెండూ నవల ప్రారంభంలో విడిగా ఉండి స్పర్శజ్ఞానం ద్వారా గుర్తింపబడి అనేకవిధాల ఏకం కావాలని ప్రయత్నించినా లోకం వారిచుట్టూ గిరిగీసి ఉన్నందు

వల్ల, అవి ఈ లోకానికి "చెక్"చెప్తూ చివరలో ఏకం కావటంతో నవల ముగుస్తుంది.

సృష్టికి మూలం కామం కనుక ఆ కామానికి ముఖ్యమైన జీవస్వరూపాన్ని,ఆ జీవప్వరూపంలో చైతన్యానికి మూలమైన ప్రకృతి-పురుషతత్వాన్ని నవలకు వస్తువుగా విశ్వనాథ ప్వీకరించాడు.వాటినే పాత్రలుగా మలచాడు.ప్రేమతత్వాన్ని,త్వగింద్రియస్పర్శ సిద్ధాంతాన్ని ఆ పాత్రలలో ప్రవేశపెట్టాడు.ఆధునిక కాలంలోని సమాజాన్ని ఇతివృత్తానికి నేపథ్యంగా గ్రహించాడు. సాంఘిక వాతావరణంలో ఈ పాత్రలు మెలగినందువల్ల ఈనాటి వ్యక్తుల కుయుక్తులు,వారి పన్నాగాలు,సాంఘిక కట్టుబాట్లు మొదలైనవాటి ప్రభావాలు పాత్రలపై ఏవిధంగా ప్రభావం చూపాయో చిత్రించాడు.ఆ పాత్రల ప్రవర్తనను,పాఠకులు అనుమానించి, తర్కించి, వివేచించి, పరోక్షమైన తత్వజ్ఞానంతో తెలుసుకోవాల్సిన విషయాన్ని అందించాడు.మన ప్రాచీన సాహిత్య సంపద మానసికంగా నిల్పుకున్న వారందరికీ ఈనవల ఒక జ్ఞాననిధి.



# 7. ఉపసంహారం.

## 7. ఉపసంహారం.

మానవుని మనసును,మానసిక శక్తిని గూర్చి,సంపూర్ణంగా తెలుసుకోవటం ఎవరికైనా కష్టసాధ్యమైన పనే. అయినా మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులెందరో అనేక ప్రయోగాల మూలంగా,మానసిక రోగుల చికిత్సా విధానాల్లో తెలుసుకొనిన విషయాలవల్ల,ప్రవర్తనల పరిశీలనలో కనుగొనిన విధానాలవల్ల ఎన్నో క్రొత్త అంశాలను,ఆధునిక కాలంలో వెలుగులోకి తెచ్చారు. భారతీయుల ఆలోచనలు తత్వాన్వేషణలో సాగినందువల్ల 'ఆత్మ' విచారం వచ్చినపుడల్లా మనసుగురించి చర్చించటం మనకు తత్వశాస్త్రాలలో,దర్శనాలలో,కనబడుతుంది.

మనస్తత్వం,ప్రవర్తన ఈ రెండింటికి అవినాభావ సంబంధముంది. మనస్తత్వం వ్యక్తి యొక్క అంతఃకరణానికి సంబంధించినది,కాగా ప్రవర్తన జ్ఞానేంద్రియాల,కర్మేంద్రియాల,కార్య కలాపాలకు వర్తించేది. సగటు మనిషియొక్క మనస్తత్వాన్ని అతడు నలుగురి ఎదుట ప్రవర్తించే విధానాన్ని బట్టి తెలుసుకోగలం. కాని ప్రవర్తనకు ఆధారంకాని మనస్తత్వాన్ని గుర్తించటం కష్టం. అందువల్లనే ఇటు మనోవైజ్ఞానికుల మనోవిశ్లేషణ సిద్ధాంతాలవల్లనూ,అటు ప్రవర్తనవాదుల అభ్యసన సిద్ధాంతాలవల్లనూ,మనోవిజ్ఞాన శాస్త్రం శాఖోప శాఖలుగా విస్తరిల్లింది.

"ప్రేమ" అనే భావన కేవలం మనసుకు సంబంధించినది. ఈ ప్రేమ వ్యక్తులలో ఎట్లా పుడుతుంది? ఎట్లా పెరుగుతుంది? ఎట్లా మానసిక సంఘర్షణకు మూలమవుతుంది? అనే విషయాలను సాధారణంగా ఎవరికి వారు అనుభవించి తెలుసుకో వలసినవే తప్ప వివరించి చెప్పటమనేది కొంత కష్టసాధ్యమైనపనే. కాని ఈప్రేమ సర్వకాల,సర్వావస్థలలోను,సమకాలీనతను, సార్వకాలీనతను,పొంది ఇటు సమాజంలోనూ,అటు సాహిత్యంలోనూ మానసిక సంఘర్షణలకు మూలమై నిల్చిందని చెప్పవచ్చు. ప్రేమకావ్యాలు వ్రాసినా,ప్రేమకథలు చెప్పినా,ఆ ప్రేమకు మూలమేమిటో చెప్పినవారు కనపడరు.

విశ్వనాథ సత్యనారాయణగారి "ఏకవీర" నవల నిజంగా వచనంలో సాగిన ఒక ప్రేమకావ్యం. ప్రేమతత్వాన్ని విశ్వనాథ ఈ నవలలో తార్కింగా వివేచించి ఒక తాత్వికమైన భూమికతో పొందుపర్చాడు. ఆ ప్రేమను ఆయా పాత్రల మానసిక సంఘర్షణకు మూలం చేసాడు. వైయక్తికమైన,ఆత్మనిర్దేశకమైన ఈ ప్రేమ ఎంత జటిలమైనదో,మనిషిని ఎంతగా కృంగదీస్తుందో, ఆయా పాత్రల మనస్తత్వ చిత్రణద్వారా తెలియచేసాడు. ప్రేమవ్యక్తియొక్క మానసిక భావన కాగా ప్రవర్తన లోకానికి సంబంధించింది. సాధారణంగా లోకంలో వ్యక్తియొక్క ప్రవర్తన సర్దుబాటుతనాన్ని

పొంది క్రమబద్ధీకరింపబడుతుంది. వ్యక్తి తనలోని ఉద్రేకాలను, ప్రేరణలను, ఆశలను, ఆశయాలను, కోరికలను, అణచుకొని సమాజంలో అనుగుణ్యతను పొంది జీవిస్తాడు. లౌకికమైన కట్టుబాట్లు, వ్యక్తిని బంధించివేస్తాయి. ఈ కట్టుబాట్లకు బంధీ కాలేక ఆత్మనిర్దేశకమైన ప్రేమను పొందలేక, జీవన్మరణ సమస్యతో మానసిక సంఘర్షణకు లోనైన పాత్రల మనస్తత్వచిత్రణ 'ఏకవీర' నవలలో ప్రధానవస్తువయింది. ఇటువంటి ప్రేమ విషయంలో రచయిత లోకాతీత బంధాన్ని, సంబంధాన్ని చూపించి పాఠకులను ఆలోచింపచేయటం ఇందులో విశేషం.

సాహిత్యలోకంలో మొట్టమొదటి సారిగా తాను నమ్మిన "త్వగింద్రియ స్పర్శసిద్ధాంతాన్ని" ఏకవీర నవలలో ప్రవేశపెట్టి దానిద్వారా సజాతీయ-విజాతీయ స్పర్శలను చూపి ప్రేమతత్వానికి బలం కలగిస్తూ కొత్త ఆలోచనావిధానాన్ని పాఠకులకు కలిగించాడు.

ఆడ్లరు ప్రతిపాదించిన ప్రయోజనతా సిద్ధాంతానికి ప్రతిఫలనంగా రూపుదాల్చింది 'జేబుదొంగలు"అనే నవల. చిన్నతనంలో బంధువుల జేబుల్లో డబ్బులు కాజేసి, వాటిని సద్వినియోగ పరుచుకొని ప్రయోజకునిగా మారి కలెక్టరయిన ఒక యువకుని గాధను ఈ నవలలో రచయిత అపూర్వంగా చిత్రించాడు. ప్రధానపాత్రధారి అయిన అవధాని తన జీవితంలో పొందిన న్యూనతా భావాలను అధిగమిస్తూ, క్రమంగా పట్టుదలతో శ్రమించి కలెక్టరుగా మారిన విధానంలో ఆడ్లరు ప్రయోజనతావాద సిద్ధాంతం చక్కగా ప్రతిఫలించింది. ప్రేమ విషయంలో అవధాని పొందిన మానసిక వ్యథను ఫ్రాయిడ్ ప్రతిపాదించిన 'కామేచ్ఛాసిద్ధాంతానికి'అనుగుణంగా ఉంది. విశ్వనాథ ఇందులో స్పర్శసిద్ధాంతానికి ప్రాతిపదికగా అవధాని మనసును చిత్రిస్తూ అతడు స్పర్శద్వారా తన భాగస్వామిని ఎన్నుకున్న విధానాన్ని అపూర్వంగా చిత్రించాడు.

"బద్దన్నసేనాని"అనే నవలలో విశ్వనాథ ప్రేమసిద్ధాంతానికి మరో అంశాన్ని ముడిపెట్టటం మనం గమనిస్తాం. ఆ నవల చివర ముగింపుగా బాదమ్మ బద్దన్నల బంధం లోకాతీత సంబంధంగా చూపిస్తాడు. నవల చివరలో బాదమ్మ మరణిస్తూ "అతడు జారుడు కాడు, నేను జారిణి కాను మాప్రేమకు మీ సూత్రములు పట్టవు మాది "లింగజ్ఞానాతీత సంబంధం"అని అంటుంది. ఈ చివరి వాక్యాలు మనని ఎంతో ఆలోచింపచేస్తాయి. విశ్వనాథ ప్రతిపాదంచిన ప్రేమతత్వానికి త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతానికి అనుకూలమైన వివరణలతో ఈ రచనసాగుతుంది. అంతేగాక ప్రధానపాత్రదారి అయిన బద్దన్న చిన్నతనంలోనే ఆత్మగతంగా తనకంటె పెద్దదైన బాదమ్మను ప్రేమించటం, ఆ ప్రేమ మానసికమై, క్రమంగా శారీరకమై, కామేచ్ఛాజనితుడై బాదమ్మతో శారీరక సుఖాన్నిపొంది తద్వారా స్పర్శానుభూతిచే బాదమ్మను తన భాగస్వామిగా గుర్తించి ఆమెను వదలకుండా తనవెంట ఉంచుకోవటం, చివరలో లౌకిక కట్టుబాట్లకు బానిసుడై తననుతాను చంపుకోవటం, జరిగిన సంఘటనలు.

భారతీయుని మనస్తత్వం సాధారణంగా కర్మను, జన్మజన్మల బంధాన్ని, ఋణాన్ని, ఆధార

చేసుకొని భావింపచూస్తుంది."ఋణానుబంధ రూపేణ పశుపత్ని సుతాలయః"అనే సూక్తి భారతీయుల విచారధారలో పుట్టిందే.జన్మజన్మలబంధం మానవునికి ఉంది.ఆత్మలు తిరిగి జన్మిస్తాయి.ఈ తత్త్వంమీదనే "భార్యాభర్తల"బంధంకూడా ముడిపడి ఉంటుందనేదే విశ్వనాధ వారి విశ్వాసం.

త్వగింద్రియ స్పర్శ సిద్ధాంతానికి వ్యాఖ్యాన రూపకంగా నిలిచిన నవల తెఱచిరాజు. విశ్వనాథ తాను నమ్మిన,భావించిన,స్పర్శసిద్ధాంతాన్ని,ప్రేమతత్వాన్ని,ఈ నవలలో తార్కికంగా, తాత్వికంగా,ప్రయోగపూర్వకంగా,చిత్రించి నిరూపించాడు.

ఉత్తరరామచరిత్రలోని ఒక ఘట్టంలోని స్పర్శవిధానాన్ని ఆదారం చేసుకొని ఈనవలను రూపొందించాడు.ప్రాచీనభావాలు మూలరూపాలుగా నిలిచిన 'ప్రజాపతి-శతరూప' అంశలకు రూపకల్పనగా సారథి-వాసంతి పాత్రలను సృష్టించాడు.అటు భారతీయుల ఆలోచనలకు,ఇటు యూంగ్ చూపిన అనిమా,అనిమస్,భావాలకు పొందిక కలిగించాడు.ఇందులో సారథి కామేచ్ఛా శక్తి మొదట శారీరకమై,తర్వాత మానసికమై,మనోమంథనం వల్ల ఆత్మగతమై సృష్టిలోని రహస్యాన్ని,జీవునిలోని 'అర్ధనారీశ్వరతత్వాన్ని,తెలుసుకొని వాసంతి స్పర్శవల్ల ఆమె తనలోని 'స్త్రీ అంశగా గుర్తించి,ఆమెవల్ల మతిభ్రమించి.చివరలో వానిద్దరూ ఈ లోకానికి చెక్ చెప్పటం,చిత్రింప బడిన విషయాలు పాఠకులను ఎంతో అలోచింపచేస్తాయి,ఎన్నో తాత్విక విషయాలను బోధిస్తుందీనవల.

ఈవిధంగా ఈ సిద్ధాంత వ్యాసాన్ని రూపొందించినపుడు,విషయవివేచనంవల్ల, ప్రేమ అనే మానసిక భావన ఆయా వ్యక్తులలో రూపొంది,బలపడి,చివరిదాకా నిలిచి,మానసిక సంఘర్షణకు మూలమై స్వార్థానికో,త్యాగానికో,ఆయా వ్యక్తులను నడిపిస్తుందనీ,ఉదాత్తీకరణం పొందిన వ్యక్తులు సమాజానికి ఏదోవిధమైన మేలు చేస్తారనీ,తెలుస్తుంది.అంతేగాక ఆయా వ్యక్తులలో ప్రేమపుట్టటానికి గల కారణం ఆయా వ్యక్తులలో ఉండే యూంగ్ చూపిన అనిమా, అనిమస్,అనే అంశలే ప్రధానమనీ తెలుస్తుంది.ఈ అంశలనే విశ్వనాథ ప్రతివ్యక్తిలో ఉండే ప్రజాపతి,శతరూప, భావనలుగా రూపొందించి చూపటం,ఆధునికమైన మనోవైజ్ఞానిక భావాలకు, ప్రాచీనమైన తాత్వికతో కూడిన భూమికను చూపించటమేనని చెప్పవచ్చును.

మనం భావించే "అర్ధనారీశ్వర తత్వమే" అతి ప్రాచీనమైనది కావటంవల్లనే ఆధునికుడైనా, ప్రాచీనుడైనా,ఎట్లా చెప్పినా అది సత్యనిరూపణమేనని తెలియకమానదు.



## 8. ఉపయుక్త గ్రంథ సూచిక. -1 తెలుగు.


| రచయితలు. | రచనలు, పబ్లిషర్సు, సంవత్సరము. |
|---|---|
| 1. డా॥ ఆనందారామం.సి. | -నవలావిమర్శ, పద్మావతీ ఆర్టుప్రింటర్సు, 1994. |
| 2. డా॥ కుటుంబరావు. బి.వి. | -ఆంధ్రనవలా పరిణామం, (ప్రథమసంపుటం) గాయత్రీ ప్రచరణ. 1971. |
| 3. కృష్ణారావు. జి.వి. | -కావ్యజగత్తు, రాడికల్ పబ్లకేషన్సు, తెనాలి 1942. |
| 4. డా॥ నారాయణరెడ్డి. సి. | -ఆధునికాంధ్రకవిత్వము-సంప్రదాయము-ప్రయోగము ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, శివాజీప్రెస్. 1967 |
| 5. డా॥ నాగభూషణశర్మ. మొదలి. | -తెలుగు నవలావికాసం. హైదరాబాద్ నాట్యకళా ప్రచురణ 1971. |
| 6. డా॥ నరసింహం. అంతటి. | -ప్రబంధాలలో ప్రకృతివర్ణనలు, సమతాసాహితీ, 1979 |
| 7. రాధాకృష్ణమూర్తి. కంఠంనేని. | -సైకాలజీ, డీలక్స్ పబ్లకేషన్సు, విజయవాడ, 1986. |
| 8. రామకోటిశాస్త్రి. కేతవరపు. | -విశ్వనాథ వైఖరి. జిజ్ఞాసప్రచురణ. వరంగల్, 1994 |
| 9. లక్ష్మీనారాయణశాస్త్రి, పంతుల. | -పునర్జన్మ విజ్ఞానము. (పూర్వభాగము) విజయనగర పబ్లికేషన్సు 1968. |
| 10. డా॥ విద్యేశ్వరి. | -తెలుగు నవల మనోవిశ్లేషణ. |
| 11. వేంకటేశ్వరరెడ్డి. అన్నపరెడ్డి. | -స్వప్నసందేశం, పల్లవిపబ్లికేషన్సు, విజయవాడ. 1986 |
| | -మనసు మర్మం. " " " |
| 12. వేంకటకృష్ణయ్య. తాటికొండ, | -బ్రాహ్మీమయమూర్తి. విశ్వభారతి ప్రచురణ, 1976 |
| 13. వేంకటేశ్వర్లు పుల్లాబొట్ల. | -తెలుగు నవలా సాహిత్య వికాసం. వై. యస్. ప్రెస్. ఖమ్మం |
| 14. వేంకటసుబ్బయ్య. వల్లంపాటి. | -నవలా శిల్పం. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ హై. 1989. |
| 15. శ్రీ నిర్వికల్పానందస్వామి. | -భక్తితత్వము. సాధనగ్రంథమమండలి. తెనాలి. 1953. |
| 16. శ్రీనివాసరావు. వేమూరి. | -పూర్వ గాథా లహరి. వెంకట్రాం అండ్‌కో, 1956. |
| 17. శ్రీరామమూర్తి. కోడూరి. | -తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ. కిరణ్ కిశోర్ ప్రచురణ. బొబ్బిలి. 1970. |
| 18. డా॥ సంజీవమ్మ. పి. | -తెలుగు నవలల్లో సామాజిక చైతన్యం. అభ్యుదయ రచయితల సంఘం. కడప. 1985. |

19. సత్యనారాయణ. విశ్వనాథ. అంతరాత్మ. 1992.
ఆత్మకథ. 1979.
ఏకవీర 1957.
జేబుదొంగలు. 1940.
బద్దన్నసేనాని 1947.
తెఱచిరాజు. 1960.
పై గ్రంథములన్నియు,వి.యస్.ఎన్,కో, విజయవాడ ప్రచురణలు.

20.డా॥సుజాతారెడ్డి.యం. –నవలానుశీలనం, శాంతా ఆర్టుప్రింటర్స్.హై.1990

21.సుదర్శనం.ఆర్.ఎస్. –సాహిత్యంలో దృక్పథాలు. నవోదయ పబ్లిషర్సు.1968.
–సమాజము–సాహిత్యము. 1975.
చిత్తూరుజిల్లా రచయితల సహకార సంఘము,చిత్తూరు.
–నూరుసమీక్షలు.,రత్న ప్రింటర్సు.రాజమండ్రి.1987.
–సాహిత్య నేపథ్యం, " " 1986.

22.సువర్చలాదేవి.కాశీనాథుని. –విశ్వనాథ భ్రమరవాసిని ఒక పరిశీలన.
విశాలాంధ్ర పబ్లికేషన్సు.హైద్రాబాద్. 1986.

---

## వివిధ సంస్థలు ప్రచురించిన గ్రంథాలు.

1 ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ. –ఉత్తరరామచరిత నాటకమ్ (భవభూతి)
రసస్వాదినీ వ్యాఖ్య,తెలుగు. 1977.
ఎమాన్ నేలటూరు రామదాసయ్యంగారు.
–తెలుగు నవల–నూరుసంవత్సరాలు.
వ్యాస సంకలనము. 1973.

2,కాకతీయ విశ్వవిద్యాలయము, –విమర్శిని. విశ్వనాథ వాఙ్మయసూచిక,విశేషసంచిక

3.జాతీయ పరిషత్తు. హైద్రాబాద్. –కళాతత్వం.డా॥వీరభద్రయ్య.యం. 1993

4.తెలుగు అకాడమీ. –మనోవిజ్ఞాన పరిచయము.1,2 భాగాలు
అనువాద వాఙ్మయము.
–పాశ్చాత్య తత్వశాస్త్రము (అనువాదము)

–అపసామాన్య మనోవిజ్ఞాన శాస్త్రము. 1,2,భాగాలు.
డి.సి.వేంకటసుబ్బన్న.సం॥ 1973.
–భారతీయతత్వ శాస్త్రము. 1978.
–పర్దుబాటు,అనుగుణ్యత. 1979.
–భారతీయ దర్శనములు. 1980.
–సాంఘిక మనోవిజ్ఞాన శాస్త్రము. 1984.
–ఆధునిక రాజ్యాంగ తత్వానికి అరవిందుని తోడ్పాటు,మద్దసాని రామిరెడ్డి,1985.
–మనోమంథనం.ఆర్.ఏ.జయంత. 1988.
–విశ్వనాథ సాహిత్య వ్యక్తిత్వం,డా॥కోవెల సంపత్కుమారాచార్య. 1989.
–వేయిపడగలు ఒక పరిశీలన. డా॥ముదిగొండ వీరభద్రయ్య. 1990.
–సిగ్మండ్ ఫ్రాయిడ్ (అనువాదవాఙ్మయం).

5.తెలుగు శాఖ. –వివేచన. పరిశోధన పత్రిక. 1989-90.
ఉస్మానియా విశ్వవిద్యాలయము. –దక్షిణ భారత జ్ఞానపీఠ బహుమతి గ్రహీతల విశిష్టసేవ.
సంపాదకుడు.డా॥ఆనందమూర్తి.వేటూరి.

6. యువభారతి ప్రచురణలు. –మహతి. (వ్యాస సంకలనము) 1972.

7.విజ్ఞాన సర్వస్వ కేంద్రం. –దర్శనములు,మతములు. 1992.

8.విశ్వనాథ సాహిత్యపీఠం.విజయవాడ. –విశ్వనాథ శారద.(తృతీయ భాగం), 90వ జయంతి సంచిక.

9.విశ్వనాథ స్మారక సమితి.హైద్రాబాద్. –విశ్వనాథ శారద (ప్రథమ భాగము) 1982.

10.శాతవాహన స్నాతకోత్తర అభ్యుదయ సంస్థ.కరీంనగరము. –విశ్వనాథ శారద (ద్వితీయభాగం)1983.

11.స్నాతకోత్తర విద్యాకేంద్రం.వరంగల్. –విశ్వనాథ వాఙ్మయ సూచిక 1974.
సంపాదకుడు. కేతవరపు రామకోటిశాస్త్రి.

★

## ఉపయుక్తగ్రంథసూచిక-2

### ఆంగ్ల గ్రంథాలు.

1.All port.F.M. -Social Phychology.
Boston.Houton.Miffilin. 1924

2.All port.G.W. -Personality,Winston. 1937.

3.Beech.J.W. -The Twemtieth Century Novel
New York Press. 1932.

4.Bettelhein.B. -Individual and Mass Behaviour-
- in Extreme situations.Scotland,press, 1943.

5Bill.A. A Dynamic Theory of Personality.Randam,-
-House.New York.1935.

The Basic writings of sigmund freud.Randam-
-house NewYork. 1980.

Basic Principles of Psycho Analysis.
Washington Square Press,1972.

6.Edler.L. Psychological Novel.London Press,1963.

7.Ernest. Introduction to Psychology(4th Edition)
NewYork Harward University.1942.

8.Freud.S. New Introductory Lectures on Psycho-
Analyisis.NewYork Press.1933.

An Outline of Psycho Analyisis.NewYork
Press, 1949.

A General Introduction to Psycho Analyisis,
Washington,Square Press,NYork 1967.

Psycho Analyisis. A General Introduction,
NewYork, Press. 1967.

Three Essays on the Theory of Sexuality,
(Standard Edition Vol,7) 1907.

9.Frostor.E.M. Aspect of the Novel. Harmous Warth Press, 1927.

10.Fox.Rolph. The Novel and People,Moscwo Press.1956

11.Hall Hans bocher. The Individual Psycho Analyisis of - Alfred Adler. NewYork Press.1956.

12.Helperin-John(Ed). The Theory of the Novel. New Essays,NewYork Press 1974.

13.Harper.C. The individual Psychology.Harper and Row Publishers NewYork Press,1964.

14.Johns.E.Eds. The life and work of Sigmund Freud. Penguin Book England.1964.

15.Jung.C.G. The Modern Man in search of Soul, Routled London Paper Back 1961.

16.Lesylo.V.S. The Basic writings of C.G.Jung. NewYork press.1932.

17.C.F.Lehner,and Kube. The Dynamics of Personal-Adjustment.England.Clifls,N.J 1962.

18.Maslow.A.H. Motivation and Personality. 1964.

19.Mekeinney,F. Psychology of Personal Adjustment John Willy and Son Inc.1960.

20.Rothlsdge. The practice and Theory of individual Psychology.London 2nd Edition,1971

21.Strange.J.R. Abnormal Psychology.Undarstanding- -Behaviour Disorders. Hill publishing House,Ltd,Bombay.1965

22.Thomas.W.I. Premitive Behaviour. Trem E.S. Bagardus 1961.

★ ★ ★